# జ్యోతిష్య శాస్త్రము



రచయిత: త్రిమత ఏకైక గురువు
ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, శతాధిక గ్రంథకర్త
ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త
శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు


www.thraithashakam.org





# జ్యోతిష్య శాస్త్రము

## (శాస్త్రమా - అశాస్త్రమా?)


<u>రచయిత</u>

**త్రిమత ఏకైక గురువు**

**ఆధ్యాత్మిక సామ్రాజ్య చక్రవర్తి, (88) దశ అష్టాధిక గ్రంథకర్త**

**ఇందూ జ్ఞాన ధర్మప్రదాత, సంచలనాత్మక రచయిత, త్రైత సిద్ధాంత ఆదికర్త**

## శ్రీ శ్రీ శ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు






<u>ప్రచురించిన వారు</u>

**ఇందూ జ్ఞానవేదిక**

(Estd in 1978 - Regd.No.: 168/2004)

త్రైత శకము-39   రెండవ ముద్రణ : మే-2017

ప్రతులు : 1000   **వెల : 245 /-**

02 "ఇందూ జ్ఞానవేదిక" ప్రచురణలు

01) త్రైత సిద్ధాంత భగవద్గీత.
02) ఇందూ సాంప్రదాయములు.
03) ఇందుత్వమును కాపాడుదాం.
04) ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.
05) హిందూమతములో కులవివక్ష.
06) తిట్ల జ్ఞానము-దీవెనల అజ్ఞానము.
07) శ్రీకృష్ణుడు దేవుడా! భగవంతుడా!!
08) యజ్ఞములు (నిజమా-అబద్ధమా?).
09) ఏ మతములో ఎంత మతద్వేషము?
10) హిందూ మతములో సిద్ధాంతకర్తలు.
11) దైవగ్రంథములో సత్యాసత్య విచక్షణ.
12) దేవుని రాకకు ఇది సమయము కాదా!
13) మూడు గ్రంథములు, ఇద్దరు గురువులు.
14) దయ్యాల-భూతాల యదార్థ సంఘటనలు.
15) ప్రతిమ × విగ్రహ-దైవము × దైయ్యము.
16) త్రైతాకార రహస్యము (త్రైతాకార బెర్ముడా).
17) హేతువాద ప్రశ్నలు-సత్యవాద జవాబులు.
18) జ్యోతిష్యశాస్త్రము (శాస్త్రమా-అశాస్త్రమా?).
19) మంత్రము-మహిమ (నిజమా-అబద్ధమా?).
20) అంతిమ దైవగ్రంథములో జ్ఞానవాక్యములు.
21) మన పండుగలు (ఎలా చేయాలో తెలుసా?).
22) కలియుగము (ఎప్పటికీ యుగాంతము కాదు).
23) కృష్ణ మూస (శ్రీకృష్ణ మరణము తర్వాత జీవితము)
24) స్వర్గము ఇంద్రలోకమా! నరకము యమరాజ్యమా!!
25) మూడు దైవ గ్రంథములు-మూడు ప్రథమ వాక్యములు.

26) తీర్పు.
27) గుత్తా.
28) ప్రబోధ.
29) సుబోధ.
30) ఆదిత్య.
31) సమాధి.
32) తల్లి తండ్రి.
33) గీటురాయి.
34) త్రైతారాధన.
35) ధర్మచక్రము.
36) ప్రసిద్ధి బోధ.
37) కర్మ పత్రము.
38) నీకు నా లేఖ.
39) ఒక్కడే ఇద్దరు.
40) దేవుని ముద్ర.
41) భావము-భాష.
42) కథల జ్ఞానము.
43) సత్యాన్వేషి కథ.
44) సిలువ దేవుడా?
45) ఆత్మలింగార్థము.
46) ప్రాథమిక జ్ఞానము.
47) విశ్వ విద్యాలయము.
48) జీహాద్ అంటే యుద్ధమా?
49) జనన మరణ సిద్ధాంతము.
50) మతాతీత దేవుని మార్గము.
51) దేవుని చిహ్నము.
52) మతము-పథము.
53) ద్రావిడ బ్రాహ్మణ.
54) ప్రవక్తలు ఎవరు?
55) ధర్మశాస్త్రము ఏది?
56) దేవుని గుర్తు-963.
57) ఇందువు క్రైస్తవుడా?
58) నాస్తికులు-ఆస్తికులు.
59) ప్రబోధ తరంగాలు.
60) గీతా పరిచయము.
61) త్రైత సిద్ధాంతము.
62) వార్తకుడు-వర్తకుడు.
63) ధర్మము-అధర్మము.
64) తత్త్వముల జ్ఞానము.
65) మరణ రహస్యము.
66) పునర్జన్మ రహస్యము.
67) గురు ప్రార్థనామంజరి.
68) సామెతల జ్ఞానము.
69) పొడుపు కథల జ్ఞానము.
70) ఏది నిజమైన జ్ఞానము?
71) నిగూఢ తత్త్వార్థ బోధిని.
72) దేవాలయ రహస్యములు.
73) ప్రబోధానందం నాటికలు.
74) హేతువాదము-ప్రతివాదము.
75) మత మార్పిడి దైవద్రోహము.

76) నాది లోచన-నీది ఆలోచన.
77) ధ్యానము-ప్రార్థన-నమాజ్.
78) సాయిబాబా దేవుడా! కాదా?
79) లు అంటే ఏమిటి? (తెలుగు).
80) చెట్టుముందా! విత్తుముందా?
81) గీతం-గీత (పాటల జ్ఞానము).
82) మరణము తర్వాత జీవితము.
83) ప్రథమ దైవగ్రంథము భగవద్గీత.
84) దేవుని జ్ఞానము కబ్జా అయ్యింది.
85) అజ్ఞానములో ఉగ్రవాద బీజాలు.
86) ఒక మాట మూడు గ్రంథములు.
87) త్రైత సిద్ధాంత ఆధ్యాత్మిక ఘంటు.
88) ఏసు చనిపోయాడా? చంపబడ్డాడా?
89) మానవత్వము.
90) సుప్రసిద్ధి బోధ.
91) రూపము మారిన గీత.
92) తత్త్వార్థ బొమ్మల జ్ఞానము.
93) యోహాను చెప్పిన జ్ఞానము.
94) రాజకీయము×రాజకీయము.
95) ఉగ్రవాదము స్వర్గము కొరకే.
96) ఒక వ్యక్తిలో రెండు కోణములు.
97) అంతిమ దైవగ్రంథములో వజ్ర వాక్యములు.
98) మధ్యమ దైవగ్రంథములో జ్ఞాన వాక్యములు.

**భాషలో పాండిత్యమును విడిచి,**

**భావములో పాండిత్యమును చూచువాడు నిజమైన జ్ఞాని.**

01. గుర్తింపబడనివాడు గురువు.
02. పుట్టినరోజు ఎవ్వరికీ రాదు.
03. ద్వితీయుడు-అద్వితీయుడు.
04. ఏక్‌నిరంజన్-అలక్‌నిరంజన్.
05. మాయకుడు-అమాయకుడు.
06. తల్లి తండ్రి-గురువు దైవము.
07. గురువులేని విద్య గ్రుడ్డివిద్య.
08. మతములలో పవిత్రయుద్ధము.
09. ప్రపంచ శ్రద్ధ-పరమాత్మ శ్రద్ధ.
10. దేశం మోసం-దేహం మోహం.
11. ఎదమీదముద్ర-తల్లి తండ్రి గుర్తు.
12. మూడు పుట్టుకలు-రెండు జాగాలు.
13. యోగీశ్వరుల జన్మదిన సందేశము.
14. తెలుగులో మూడు-ఆరు-తొమ్మిది.
15. మాయ మర్మము- ఆత్మ ధర్మము.
16. బయటి సమాజం-లోపలి సమాజం.
17. దేవుని జ్ఞానము-మాయ మహత్యము.
18. మూడు నిర్మాణాలు-ఒక పరిశుభ్రత.
19. సహజ మరణం- తాత్కాలిక మరణం.
20. మేఘం ఒకభూతం- రోగం ఒకభూతం.
21. కర్మ లేని కృష్ణుడు-కర్మ ఉన్న కృష్ణుడు.
22. స్వార్థ రాజకీయం (స్వ+అర్థ రాజకీయం).
23. శ్రీకృష్ణుడు చనిపోయాడా? చంపబడ్డాడా?
24. అంతిమ గ్రంథములో ప్రథమ వాక్యములు.
25. ఇచ్ఛాధీన కార్యములు-అనిచ్ఛాధీన కార్యములు.
26. టక్కుటమారా, ఇంద్రజాల మహేంద్రజాల, గజకర్ణ, గోకర్ణ.

27. ఆత్మ.
28. తాత.
29. తల్లి.
30. భయం.
31. ఆత్మపని.
32. బట్టతల.
33. యాదవ్.
34. జ్ఞానశక్తి.
35. సమాధి.
36. 6-3=6.
37. సంతకము.
38. ప్రభు-ప్రజ.
39. త్రైతశకము.
40. తోలేవాడు.
41. తల్లి తండ్రి.
42. నటించే ఆత్మ.
43. సంచిత కర్మ.
44. గురు చిహ్నం.
45. ఆస్తి-దోస్తి.
46. వెలుగుబంటు.
47. ధర్మచక్రము.
48. దైవగ్రంథము.
49. భక్తి-శ్రద్ధలు.
50. పురుషోత్తమ.
51. మతద్వేషము.
52. గ్రాహిత శక్తి
53. ఆడించే ఆత్మ.
54. ఏది శాస్త్రము?
55. భగవంతుడు.
56. ఏది ధర్మము?
57. గురుపౌర్ణమి.
58. శ్రీకృష్ణాష్టమి.
59. గోరు-గురు.
60. దశ-దిశలు.
61. మాట-మందు.
52. సృష్ఠి-సృష్ఠికర్త.
63. కలియుగము.
64. సేవా శాతము.
65. ప్రకృతి-వికృతి.
66. పైత్యం-సైత్యం.
67. నైజం-సహజం.
68. భక్తి-భయము.
69. సాంప్రదాయము.
70. అదురు-బెదురు.
71. నీ వెనుక వాడు.
72. శవము-శివము.
73. శైవము-వైష్ణవము.
74. ధర్మము-అధర్మము.
75. ద్రావిడులు-ఆర్యులు.
76. కాయ-పండు-కాయ.
77. యుగము-యోగము.
78. దేవునికి మతమున్నదా?

79. కర్మ మర్మము.
80. పుట్టుట-గిట్టుట.
81. ఏకత-ఏకాగ్రత.
82. చమత్కార ఆత్మ.
83. నిదర్శ - నిరూప.
84. గురువు ఎవరు?
85. త్రైత సిద్ధాంతము.
86. స్త్రీ / పు - లింగము.
87. జీర్ణ+ఆశయము.
88. శ్రీకృష్ణుడు ఎవరు?
89. ఆట-దోబూచులాట.
90. ప్రజలు-మానవులు.
91. దంతము-అంతము.
92. మతము-పథము.
93. ఏడు ఆకాశములు.
94. అర్థము-అపార్థము.
95. మూడు గ్రంథములు.
96. గ్రంథము - బోధ.
97 ప్రభువు-ప్రభుత్వం.
98. జ్ఞానము-విజ్ఞానము.
99. వార-మాస-వత్సర.
100. భూతం-మహాభూతం.
101. సేకూవలి-కూలిసేవా.
102. ఆత్మకు వెంట్రుక గుర్తు.
103. కోడిపుంజు-పాదరసము.
104. ఇందూ మహాసముద్రము.
105. శ్రీకృష్ణజన్మ మధుర.
106. అధర్మ ఆరాధనలు.
107. పుస్తకము-గ్రంథము.
108. హరికాలు-హరచేయి.
109. పుట్టగోసి-మొలత్రాడు.
110. 1 2 3 గురుపౌర్ణమి.
111. క్షమించరాని పాపము.
112. మరణము-శరీరము.
113. దివ్యఖురాన్-హదీసు.
114. ఇందువు-హిందువు.
115. సుఖము-ఆనందము.
116. కాలజ్ఞాన వాక్యములు.
117. భౌతికము-అభౌతికము.
118. దేవుని ఆజ్ఞ-మరణము.
119. జ్ఞానము దగ్గర జాగ్రత్త!
120. చంద్రాకారము (బట్టతల).
121. జ్ఞానము కబ్జా అయ్యింది!
122. దేవుడు ఇద్దరా! ఒక్కరా!!
123. మత సామరస్యం.
124. మోక్షము-మోసము
125. అక్షర జ్ఞానము
126. ఆధ్యాత్మిక ప్రశ్నలు-జవాబులు.



## ప్రబోధాశ్రమము (శ్రీకృష్ణమందిరము)

చిన్నపొడమల (గ్రా), తాడిపత్రి (మం), అనంతపురం (జిల్లా) A.P.
Cell : 98665 12667, 99516 75081, 94903 63038.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
అనంతపురము టౌన్, A.P.
Cell : 97059 59390, 99855 80099

**కె.లక్ష్మీనారాయణాచారి (ప్రెసిడెంట్)**
ధర్మవరం, అనంతపురం (జిల్లా),
Cell : 94405 56968, 92900 12413, 94406 01136

**టి. సూర్యనారాయణ (సూర్య మీ సేవా)**
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9885250967

**ఇందూ ధరణి జనరల్ స్టోర్స్**
(పి. శివరామ్ ప్రసాద్)
పామిడి, గుత్తిరోడ్, అనంతపురం జిల్లా
Cell : 9030057963, 9063504963

**బి. ఆదిశేషయ్య (టీచర్) (ప్రెసిడెంట్)**
గుత్తి, అనంతపురం జిల్లా
Cell : 9491362448, 7382986963.

**పి. ఆదినారాయణ (ప్ర.సభ్యుడు)**
ముద్దిరెడ్డి పల్లి (గ్రా॥), అనంతపురం (జిల్లా).
Cell : 9440745800, 7259851861.

**ఎ. నాగేంద్ర (ప్రెసిడెంట్)**
క్రొత్త చెరువు (గ్రా,మం)
అనంతపురం జిల్లా. Cell:9493622669
9959316410, 9949995090.

**పి. నాగయ్య (ప్ర.సభ్యుడు)**
వీకర్ సెక్షన్ కాలనీ, కర్నూలు టౌన్
Cell : 9440244598, 9849303902

**ఇందూ జ్ఞానవేదిక (Head Office)**
చైతన్యపురి, దిల్‌సుఖ్‌నగర్,
హైదరాబాద్, తెలంగాణ రాష్ట్రం,
Cell:94910 40963, 90329 63963, 98485 90172.

**డి. గోపికృష్ణ**
హుజురాబాద్, కరీంనగర్ జిల్లా, T.S
Cell : 9989202003, 9542061601

**కె.వెంకటేశ్వర్లు (ప్ర.సభ్యుడు)**
నందికొట్కూరు, కర్నూలు జిల్లా
Cell : 9440047256, 9701956599

**కె.అశోక్‌బాబు (టీచర్) (ప్రెసిడెంట్)**
రామాపురం (గ్రా), వి.కోట (మం).
చిత్తూరు జిల్లా. Cell : 9440305700

**వి. రామక్రిష్ణన్ (వైస్ ప్రెసిడెంట్)**
కుప్పం, చిత్తూరు జిల్లా. Cell : 96527 55110

**డి. బాలాజీ (వైస్ ప్రెసిడెంట్)**
బంగారు పాళ్యం (గ్రా), చిత్తూరు జిల్లా.
Cell : 9985483241, 7396077408.

**బాలం లక్ష్మీనరసింహులు (ప్రెసిడెంట్)**
మదనపల్లి, చిత్తూరు జిల్లా.
Cell : 9440825533, 8519938999.

**టి.వి. రమణ (ప్రెసిడెంట్)**
ముదిగుబ్బ (గ్రా) అనంతపురం జిల్లా
Cell : 9440980036, 07406039453.

**P.M.H నాయుడు**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా).
Cell : 9440490963

**P. రామకృష్ణారెడ్డి**
కొలిమిగుండ్ల , కర్నూలు (జిల్లా)
Cell : 9666202963

**శ్రీ ప్రబోధ క్లీనిక్**
**U. జనార్ధన్** (R.M.P)
ఆటోనగర్, బస్‌స్టాండు రోడ్
కోయిలకుంట్ల (మం), కర్నూలు (జిల్లా)
Cell : 9491851911

**డా॥యం. వెంకటేశ్వర రావు (ప్రెసిడెంట్)**
MD (acu)
శాంతినగర్, నెల్లూరు జిల్లా.
Cell : 9440615064, 9246770277.

**అనమల మహేశ్వర్ (ప్రెసిడెంట్)**
చవటపాల్యం (గ్రా), గూడూరు, నెల్లూరు జిల్లా.
Cell : 9494631664, 9490809181, 8106065300.

**రౌతు శ్రీనివాసరావు (ప్రెసిడెంట్)**
ఏటుకూరు రోడ్, దర్గామాన్యం,
గుంటూరు (జిల్లా).
Cell : 9948014366, 9052870853

**ఘడియం. పెద్దరెడ్డి (ప్రెసిడెంట్)**
నరసరావుపేట, గుంటూరు (జిల్లా).
Cell : 9989204097, 9505904097

**నర్రా శ్రీనివాస్ రెడ్డి**
కంభం (మం), ప్రకాశం (జిల్లా).
Cell :9849883261, 8142853311, 8187084516

**తలారి గంగాధర్**
గుడిపాటి గడ్డ, నంద్యాల టౌన్
Cell: 9491846282, 7671963963

**Y. రవిశేఖర్ రెడ్డి**
పెద్దకొట్టాల (గ్రా), నంద్యాల (మం)
కర్నూలు (జిల్లా).
Cell : 9440420240, 9885385215

**టి. ఉదయకుమార్ (ప్రెసిడెంట్)**
భీమవరం వన్‌టౌన్, పశ్చిమ.గో.జిల్లా
Cell : 99482 75984, 73864 33834.

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
విశాఖపట్టణము, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం.
Cell : 76749 79663, 94400 42763,
89777 13666, 92478 26253.

**ఎన్.బి. నాయక్ (ప్ర.సభ్యుడు)**
పెదమడక, అగనంపూడి,
విశాఖపట్నం (జిల్లా), Cell : 73964 92239,
92483 15309, 73862 12589.

**వి.సి.వర్మ (గురూజీ) ఆనందాశ్రమము**
మజ్జివలస (గ్రా, పోస్టు),
భీమిలి (మం), విశాఖపట్నం (జిల్లా).
Cell : 94415 67394, 9502 172711.

**వి. శంకర రావు (టీచర్) (ప్రెసిడెంట్)**
అశోక్‌నగర్, విజయనగరము (జిల్లా).
Cell : 9703534224, 9491785963.

**తులసీ రావు**
Opp. T.T.D కళ్యాణమండపం,
విజయనగరము (జిల్లా).
Cell : 9441878096, 9030089206.

**యస్. అనిల్‌కుమార్**
కాకినాడ టౌన్, తూర్పు గోదావరి జిల్లా
Cell:9866195252, 9640526520, 7396038888

**బండారు సత్యనారాయణ**
మామిడి కుదురు (మం),
తూ.గోదావరి జిల్లా, Cell:95535 07141,
84669 20419, 94902 95577

**ఎన్.వి. రామకృష్ణ** (ప్ర.సభ్యుడు)
బొద్దాం (గ్రా), రాజాం (మం),
శ్రీకాకుళం (జిల్లా).
Cell : 9494248963, 9959779187.

**చెల్లారపు అప్పల నాయుడు**
చెల్లారపు వలస (గ్రా),
బొబ్బిలి (మం), విజయనగరం జిల్లా.
Cell:9494853773, 8465860706

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
మల్లిగాం (గ్రా), కొత్తపేట్ (పో),
రాయగడ (జి), ఒడిశా (రాష్ట్రం)
09437527499, 09437527470, 09437975781

**షేక్ అమీర్ అలీ** (President, K.I.S.S)
నల్గొండ జిల్లా, తెలంగాణ రాష్ట్రం.
Cell : 9505989898, 9505768181

**షఫీ షేక్** (Vice President, K.I.S.S)
చెన్నై, తమిళనాడు రాష్ట్రం.
Ph:09445554354.

**షేక్ ఇబ్రహీం** (K.I.S.S Member)
కర్నూల్ టౌన్, ఆం.ప్ర. Ph:70950 08369

**యం. అల్లీపీర్** (K.I.S.S Member)
మడకశిరా, అనంతపురం జిల్లా, ఆం.ప్ర.
Cell : 89780 58081

**ఇందూ జ్ఞానవేదిక శాఖ**
కొత్తకోట, మహబూబ్‌నగర్ (జిల్లా).
Cell : 87905 58815, 9440655409, 9701261165

**యం. మురళి** (Cell : 97057 16469)
జడ్చర్ల, మహబూబ్‌నగర్ జిల్లా.

**యం. జైరాంనాయక్**
పద్మావతి కాలనీ, మహబూబ్‌నగర్ టౌన్.
Cell :70321 74830, 90009 16419

**జి. సాయిశంకర్ శ్రేష్ఠి** (టీచర్)
అచ్చంపేట, మహబూబ్ నగర్ (జి)
Cell : 9948947630, 9640717574

**పోటు వెంకటేశ్వర్లు (గురూజీ)** (ప్రెసిడెంట్)
హుజూర్‌నగర్, నల్గొండ జిల్లా.
Cell : 9848574803, 9866423853.

**బి. దేవేందర్**
భువనగిరి టౌన్, నల్గొండ జిల్లా.
Cell:9948060838, 9704885964, 9848741703

**ఇ. శ్రీనాథ్ శ్రేష్ఠి**
గణేష్ స్ట్రీట్, జనగాం, వరంగల్ జిల్లా.
Cell : 9573552963, 8096958359.

**ఎ. రాఘవేంద్ర శ్రేష్ఠి**
శ్రీకృష్ణ మెడికల్స్ & జనరల్స్
పటేల్ నగర్, 3వ క్రాస్ హొస్పేట,
బళ్ళారి జిల్లా, కర్ణాటక రాష్ట్రం.
Cell : 097318 16452, 096111 33635.

**A.V. LAKSHMI NARAYANA**
San Antonio, TEXAS, U.S.A
+1(210) 714 9696, +1(210) 527 3436

**K.SIVA KRISHNA**
Atlanta, GEORGIA, U.S.A
+1(404) 551 3297, +1(470) 658 7635

# విషయ సూచిక

# విషయ సూచిక

# 1 జ్యోతిష్యము అంటే ఏమిటి?

జ్యోతిష్యము అను పదమును విడదీసి చూచితే 'జ్యోతి' మరియు 'ఇష్యము' అను రెండు శబ్దములు కలవు. ఆ రెండు శబ్దములను కలిపితే జ్యోతి+ఇష్యము=జ్యోతిష్యము అను శబ్దము ఏర్పడుచున్నది. జ్యోతిష్యము లోని మొదటి శబ్దమును పరిశీలించి చూచితే 'జ్యోతి' అనగా వెలుగుచున్న దీపము అని అర్థము. వెలుగుచున్న దీపము కాంతి కల్గియుండునని అందరికీ తెలుసు. చీకటి గృహములో దీపము లేకపోతే ఇంటిలోని వస్తువు ఒక్కటి కూడా కనిపించదు. ఇంటిలోని వస్తువులు ఎన్ని ఉన్నవీ? ఏమి వస్తువులు ఉన్నవీ? ఆ వస్తువులు ఖరీదైనవా? కాదా? వస్తువులు నగలైతే ఏ లోహముతో చేసినవి? కట్టెలైతే ఏ జాతి చెట్టు కట్టెలు? పాత్రలైతే మట్టివా? ఇత్తడివా? గుడ్డలైతే నూలువా? పట్టువా? కాయలు అయితే ఏ జాతి చెట్టు కాయలు? మొదలగు విషయములను దీపకాంతితోనే తెలుసుకోగలము. ఆ విధముగా చీకటిలో ఉపయోగపడునది దీపము. వివిధ రకముల వస్తువుల వివరమును తెలుసుకోవడమును **'ఇష్యము'** అంటున్నాము. దీపము వలన వస్తువుల వివరము తెలియబడడమును **'జ్యోతిష్యము'** అంటాము. ఉదాహరణకు ఒకడు చీకటితో నిండిన తన ఇంటిలో ఏమున్నది తెలియకున్నపుడు, తనవద్ద దీపము లేకపోయినా, లేక తాను గ్రుడ్డివాడైనా, మరొకని సహాయమడిగి అతని వలన తెలుసుకోవడము జరుగుచున్నది. ఎదుటివాడు మన ఇంటిలో వస్తువుల వివరము మనకు తెలుపాలంటే, అతను కూడా తన దీపమును ఉపయోగించి చూడవలసిందే అట్లు చెప్పడమును 'జ్యోతిష్యము' అంటున్నాము.

ఇక్కడ కొందరు భాషా పండితులు ఒక ప్రశ్న అడుగవచ్చును. 'జ్యోతి' అనగా దీపము అని అర్థము కలదు. కానీ 'ఇష్యము' అనగా 'తెలుసుకోవడము' అని అర్థము ఎక్కడా లేదే అని అడుగవచ్చును. దానికి

జవాబు ఏమనగా! బయట దేనిని తెలుసుకొనినా దానిని తెలుసుకోవడము, గ్రహించడము అనియే అనుచుందుము. కానీ 'ఇష్యము' అను పదము ఎక్కడా వాడడము లేదనుట నేను కూడా ఒప్పుకొందును. ఒక్క శరీరములోని కర్మను తెలుసుకొనునపుడు మాత్రము 'ఇష్యము' అను పదమును ఉపయోగించెడివారు. 'ఇష్యము' అను పదము లేక శబ్దమును ఒక పాప పుణ్యములను తెలుసుకొనునపుడు మాత్రము ఉపయోగించుట వలన, ఆ పదము ప్రత్యేకమైనది. అలాగే 'జ్యోతి' అను పదమునకు ఇక్కడ దీపము అని అర్థము చేసుకోకూడదు. 'జ్యోతి' అంటే జ్ఞానము అని భావించవలెను. ఇది ఒక్క ఆధ్యాత్మికములోనే 'జ్యోతిని' జ్ఞానము అని అంటున్నాము. ఆత్మ జ్ఞానముగల మనిషి తన జ్ఞానముతో ఎదుటి మనిషి శరీరములోని కర్మను తెలుసుకొని, వానికి తెలుపడమును 'జ్యోతిష్యము' అంటాము. ఇక్కడ **జ్యోతిష్యము అంటే దీపముతో వస్తువును తెలుసుకొనేది కాదు, జ్ఞానముతో కర్మను తెలుసుకోవడమని అర్థము.** ఇపుడు జ్యోతిష్యము అంటే దైవజ్ఞానము కల్గిన వ్యక్తి, ఒక మనిషి కర్మలోని పాపపుణ్యములను తెలుసుకొని పాప ఫలితమునూ, పుణ్యఫలితమునూ వివరించి చెప్పడము అని పూర్తిగా అర్థమగుచున్నది. ఇక్కడ ముఖ్యముగా గమనించవలసిన విషయమేమనగా! శరీరాంతర్గత కర్మ ఫలితమును చెప్పు దానిని 'జ్యోతిష్యము' అనవచ్చును. కానీ బయటి ప్రపంచ వస్తువులను గురించి చెప్పునది జ్యోతిష్యము కాదు. ఉదాహరణకు జరుగబోవు ఎన్నికలలో ఏ పార్టీ గెలుస్తుందనడముగానీ, లేక నేను దాచిపెట్టిన వస్తువేది అని అడగడముగానీ, మూసిన బోనులోని జంతువేది అని అడగడముగానీ, నా ప్యాకెట్‌లోని వస్తువు ఏదో చెప్పు అని అడగడముకానీ, జ్యోతిష్యమునకు సంబంధించిన ప్రశ్నలు కాదు. దానికి సమాధానము చెప్పడము జ్యోతిష్యము కాదు. ఎందుకనగా! ఇటువంటి

ప్రశ్నలన్నీ ఏవైనా కానీ శరీరాంతర్గత కర్మకు సంబంధించినవి కావు. వ్యక్తి కర్మను చూచి చెప్పునవి కావు, కావున అది జ్యోతిష్యము కాదు.

ఏది జ్యోతిష్యమో, ఏది జ్యోతిష్యము కాదో తెలియని పరిస్థితి నేడు కలదు. అదే విధముగా జ్యోతిష్యుడు అను పేరు పెట్టుకొన్న వారిలో చాలామంది ఏది జ్యోతిష్యమునకు సంబంధించిన ప్రశ్నో, ఏది ప్రశ్న కాదో కూడా తెలియని స్థితిలో ఉన్నారు. అటువంటి గందరగోళములోనే కొందరు వాస్తును కూడా జ్యోతిష్యము అంటున్నారు. వాస్తుద్వారా మనిషికి భవిష్యత్తు చెప్పవచ్చు అంటున్నారు. వాస్తవానికి, వాస్తు జ్యోతిష్యము కాదనీ, వాస్తు శాస్త్రమేకాదనీ, జ్యోతిష్యశాస్త్రమునకు సంబంధము లేదనీ చాలామందికి తెలియదు. ఇటువంటి పరిస్థితిలో నెరవేరని వాస్తు ఫలితములను చూచి, అదే విధముగ ప్రశ్నగాని జ్యోతిష్యమును చూచి, వాస్తును నిరూపిస్తే ఐదు కోట్లూ, జ్యోతిష్యము ద్వారా మా ప్రశ్నకు జవాబు చెప్పితే, అది నిజమైతే, పదికోట్లు ఇస్తామని పందెమునకు దిగే నాస్తికులూ, హేతువాదులూ తయారైనారు. ఇదంతయూ చూస్తే ఇటు వాస్తును శాస్త్రమని చెప్పే వారికీ, బయటి దానికి జవాబు చెప్పడమునే జ్యోతిష్యశాస్త్రమనే జ్యోతిష్యులకూ, అటు నాస్తికులకూ, హేతువాదులకూ జ్యోతి తెలియదు, జ్యోతిష్యమూ తెలియదు. జ్యోతిష్యము అంటే ఏమిటో తెలియనపుడు దాని పేరు పెట్టుకొని చెప్పే జ్యోతిష్యశాస్త్రులుగానీ, అదేమిటని ప్రశ్నించే నాస్తికవాదులుగానీ ఇద్దరూ ఒక కోవకు చెందినవారేనని చెప్పవచ్చును. జ్యోతిష్య శాస్త్రులు, నాస్తికవాదులూ ఇద్దరూ అసలైన జ్యోతిష్యమంటే ఏమిటో తెలియాలనికోరుచున్నాము.

# 2 జ్యోతిష్యము శాస్త్రమా?

జ్యోతిష్యము శాస్త్రమా? కాదా? అని చాలామందికి ప్రశ్నగానే ఉన్నది. కొందరు శాస్త్రమంటున్నారు, కొందరు శాస్త్రము కాదంటున్నారు. చెప్పినది నెరవేరినది కదా అందువలన జ్యోతిష్యము శాస్త్రమే అని కొందరు అంటున్నారు. చెప్పినవి చాలా నెరవేరలేదనీ, అందువలన జ్యోతిష్యము శాస్త్రము కాదు అని చాలామంది అంటున్నారు. ఎవరి మాట నిజమని యోచిస్తే, వీరు జ్యోతిష్యము కాని దానిని పట్టుకొని ఒకటి నెరవేరింది కావున శాస్త్రమనీ, పది నెరవేరలేదు కావున శాస్త్రము కాదనీ అంటున్నారు. చీకటిలో పాముకాని తాడును చూచి వంకరగ ఉన్నది కాబట్టి పాము అంటే, కదలలేదుకదా పాము కాదేమో అని మరొకడు అన్నట్లు, అసలు జ్యోతిష్యము కాని దానిని పట్టుకొని నేనన్నది నెరవేరింది కదా! అందువలన ఇది శాస్త్రమే అని ఒకడూ, మేము అడిగింది నెరవేరలేదు కదా! అందువలన ఇది శాస్త్రము కాదని మరికొందరు అన్నట్లున్నది. చీకటిలో పాము అనుకొన్నది అసలు పామో కాదో, అలాగే జ్యోతిష్యము అనుకొన్నది జ్యోతిష్యమో కాదో చూడవలసిన అవసరమున్నది. అలా చూస్తే మనమనుకొన్నది జ్యోతిష్యము కాదు కనుక, దానిని శాస్త్రమా కాదా అని చూడవలసిన పనేలేదు. జ్యోతిష్యమన్నది ఆత్మజ్ఞానమున్నవారూ, కర్మ విధానము తెలిసిన వారూ, పాపపుణ్య ఫలితములను తెలిసినవారూ, చెప్పునదని తెలియుచున్నది. కర్మంటే ఏమిటో తెలియనివారు, ఆత్మంటే ఏమిటో తెలియనివారు చెప్పునది జ్యోతిష్యము కానేకాదు. ఎలాగైతే ఏమి, ఆత్మజ్ఞానులు, కర్మజ్ఞేయులు తెలిసిన జ్యోతిష్యమనునది ఒకటున్నదని తెలియుచున్నది. ఇపుడు జ్ఞానులు చెప్పు జ్యోతిష్యమును శాస్త్రము అనవచ్చునా! అని అడిగితే తెలియు వివరము ఏమనగా!

శాస్త్రములు మొత్తము ఆరు గలవు. వాటినే షట్‌శాస్త్రములని పూర్వమునుండి పెద్దలు చెప్పుచున్నారు. షట్‌శాస్త్రములలో అతి పెద్దది లేక అతిముఖ్యమైనది **'బ్రహ్మవిద్యాశాస్త్రము'.** బ్రహ్మ అంటే ఎవరో దేవుడనుకోవద్దండి. బ్రహ్మ అనునది పేరేకాదు బ్రహ్మ అంటే పెద్ద అని అర్థము. బ్రహ్మవిద్య అనగా పెద్దవిద్య అని అర్థము. బ్రహ్మవిద్యా శాస్త్రమునే 'యోగశాస్త్రము' అనికూడా అంటారు. బ్రహ్మవిద్యాశాస్త్రము తర్వాత రెండవ స్థానములో గల శాస్త్రము జ్యోతిష్యశాస్త్రము. వీటి తర్వాత మిగతా నాలుగు శాస్త్రములు కలవు. ఆరుశాస్త్రములలో రెండవ స్థానములోనున్నది జ్యోతిష్యశాస్త్రము, కావున జ్యోతిష్యమును శాస్త్రమే అంటున్నాము. ఇక్కడ కొందరికి శాస్త్రము అంటే ఏమిటి? అను ప్రశ్నరావచ్చును. దానికి జవాబు ఏమనగా!

శాసనములతో కూడుకొన్నది శాస్త్రము అని చెప్పవచ్చును. శాసనము అనగా తూచ తప్పకుండ నెరవేర్చబడునదని అర్థము. చెప్పినది లేక వ్రాసినది ఏదైనా తప్పక జరుగు సత్యమైనపుడు, దానిని 'శాసనము' అంటాము మరియు శాస్త్రము అని కూడా అంటాము. చెప్పిన దానిని శాసనము అనీ, వ్రాసిన దానిని శాస్త్రము అనీ అనుట జరుగుచున్నది. వ్రాసినది శాస్త్రము కావాలంటే, వ్రాయకముందే తాను పరిశోధన చేసిన పరిశోధకుడై కనుగొనినదై ఉండాలి. అలాగే చెప్పినది శాసనము కావాలంటే, చెప్పకముందే తాను అధికారము కల్గినవాడై నెరవేరునట్లు చెప్పినదై ఉండాలి. కానీ ఇక్కడ గమనించదగిన విషయమొకటున్నది. ఇటు పరిశోధన లేకుండా, అటు అధికారము లేకుండా చెప్పినది జరుగు విధానము ఒకటి కలదు. దానినే 'శాపము' అంటున్నాము. శాస్త్రము, శాసనము రెండూ వేరు వేరుగా ఉండినా, శాసనముతో కూడుకొన్నది శాస్త్రమని చెప్పినట్లే,

శాస్త్రముతో కూడుకొన్నది శాసనమని కూడా చెప్పవచ్చును. పరిశోధనకానీ, అధికారము గానీ లేని శాపము, శాస్త్రము, శాసనముతో సమానమైనదే. అందువలన శాపము, శాసనము, శాస్త్రము మూడు సమానపదములని చెప్పవచ్చును. జ్యోతిష్యము మొదట శాపమునుండి వచ్చినది కావున చివరకు శాస్త్రమైనది.

ఉదాహరణకు ఇటు అధికారముగానీ, అటు పరిశోధనగానీ లేని ఒక ఆత్మజ్ఞాని పాపము గల వానిని అనగా తప్పు చేసిన వానిని శపించాడు. ఆ శాపము తప్పక నెరవేరింది. అలా మొదట ఒక జ్ఞాని చేత ముందే చెప్పబడిన వాక్కు, తర్వాత నెరవేరడమును జ్యోతిష్యము అని కొందరన్నారు. ముందు చెప్పినది జరిగితేనే కదా! దానిని జ్యోతిష్యమనేది. మనకు అర్థమగుటకు మరొక ఉదాహరణను వివరించుకొందాము. ఒకడు ఒక హీనమతిగల స్త్రీని ఊరికి దూరముగానున్న నిర్జన ప్రదేశమునకు తీసుకపోయి బలవంతముగ ఆమె మీద అత్యాచారము చేసి, ఆ విషయము ఎవరికీ తెలియకుండుటకు ఆమెను హత్య చేశాడు. అతడు చేసినది మంచిపని కాదు, చెడుపని. ఆ చెడుపనికి అతనికి పాపము వచ్చియుంటుంది. ఆ పాపమునకు శిక్ష అంటూ ఒకటి ఉంటుంది. ఆ శిక్షను అతడు తప్పక ఎప్పుడో ఒకప్పుడు అనుభవించవలసిందే. కానీ ఆ శిక్ష ఏమిటి? అన్నది మనకు తెలియదు. కానీ అక్కడ జరిగిన విషయమేమంటే ఆ సంఘటన జరిగిన కొద్దిరోజులకే, ఆ తప్పుచేసిన వ్యక్తి మత్తు పానీయమును త్రాగి, మత్తు ఎక్కినవాడై దారిలో పోతున్న ఒక ఆత్మజ్ఞానిని ఎదురుగా తగలడమేకాక, అతనినే కళ్ళు కనిపించడము లేదా? అని దూషించెను. అట్లు వాడు తగలడమేకాక మత్తులో ఉండి దూషించడమూ, కళ్ళు కనిపించలేదా అనడమూ అన్నీ ఆ ఆత్మజ్ఞానికి కోపమును తెప్పించాయి. అప్పుడు ఆత్మజ్ఞాని

"నీవు జీవితాంతము కళ్ళు కనిపించని గ్రుడ్డివాడవై పోవుదువు గాక" అని శపించాడు. ఆ విధముగ శపించిన ఆత్మజ్ఞాని తన దారిన తను పోయాడు. ఆ శాపమును అక్కడున్న కొందరు విన్నారు. "వీడు శాపము పెట్టితే నాకు తగిలేదానికి వీడేమైనా దేవుడా!" అని త్రాగినవాడు అనుకుంటూ వెళ్ళిపోయాడు. ఇదంతయు గమనిస్తే ఒకడు హత్యచేసి తప్పు చేశాడు, తర్వాత కొద్ది రోజులకే దారిలో మరొకరిని తగిలాడు, తగిలింది పెద్దతప్పు కాకపోయినా అనుభవించవలసిన శిక్షను అతను శాపము రూపములో పొందాడు. జరుగబోవు శిక్ష ఏమిటో దానిని మిగతా కొందరు కూడా విన్నారు. ఇక్కడ తప్పు చేసినవానికి జరుగబోవు శిక్ష ముందే చెప్పబడినది. అలా జరుగబోవు దానిని ముందే చెప్పడము జ్యోతిష్యము అయినది, చెప్పినవాడు ఆత్మజ్ఞాని, తప్పు చేసినవాడు ఎంత తప్పుచేశాడని యోచించకనే, వానిని గూర్చిన పరిశోధన చేయకనే, వాని మీద అధికారము లేకుండనే, ఆత్మజ్ఞాని చెప్పిన దానిని శాపము అంటున్నాము. శాపము రూపములో జరుగబోవు దానిని ముందే చెప్పడము వలన దానిని జ్యోతిష్యము అంటున్నాము. అట్లు జ్ఞానినోట వచ్చిన మాట ప్రకారము లేక జ్యోతిష్యము ప్రకారము మరుజన్మలో వాడు పుట్టు గ్రుడ్డివాడైపోయి జీవితాంతము అంధుడుగానే ఉండెను. ఇట్లు తప్పక జరుగునది శాపము, కావున దానిని శాస్త్రము అంటున్నాము. ఈ విధముగ తప్పుచేసిన వానిని గూర్చి చెడు జరుగునని చెప్పిన శాపమను మాటగానీ, మంచిచేసిన వానిని గూర్చి మంచి జరుగునని చెప్పిన 'దీవెన' అను మాటగానీ తప్పక జరుగునవే కావున శాస్త్రమనీ, ముందే చెప్పడము వలన జ్యోతిష్యము అనీ అనడము జరిగినది. అందువలన జ్యోతిష్యము జ్యోతిష్యశాస్త్రమైనది. మొదట ఈ విధముగ మొదలైన జ్యోతిష్య శాస్త్రము కొంత పరిశోధన రూపములో

సాగినది. అలా కొందరి చేత పరిశోధన చేయబడి, వారి చేత కనుగొన్న జ్యోతిష్య సిద్ధాంతములు గ్రంథరూపములో వ్రాయబడినవి. అలా సిద్ధాంత రూపములో ఉన్న గ్రంథమును జ్యోతిష్య గ్రంథము అంటున్నాము. ఆరు శాస్త్రములలో పెద్దదైన బ్రహ్మవిద్యా శాస్త్రమును స్వయముగా దేవుడే చెప్పగా, మిగతా ఐదు శాస్త్రములు మనిషి చేత చెప్పబడినవి. మొత్తము ఆరు శాస్త్రములు పూర్వమునుండి ఉన్నవే, అయినా కాలక్రమమున కొన్ని భావములు మారిపోయిన దానివలన, మనుషులు వాటిని పూర్తి అసలైన భావముతో అర్థము చేసుకోలేక పోతున్నారు. బ్రహ్మవిద్యాశాస్త్రము తర్వాతనున్న జ్యోతిష్యశాస్త్రముపై పూర్తి అవగాహన లేకపోగా, మిగత ఖగోళశాస్త్రము, భౌతికశాస్త్రము, రసాయన శాస్త్రము, గణితశాస్త్రము అను నాలుగు శాస్త్రములు ఎంతో అభివృద్ధి చెంది మనిషికి బాగా అవగాహనలో ఉన్నాయి. పెద్దవైన బ్రహ్మవిద్యాశాస్త్రము, జ్యోతిష్య శాస్త్రము రెండూ మనిషి అవగాహనలో లేకుండా పోవడము వలన వాటిలోని శాస్త్రీయత అనునది తెలియకుండా పోయినది. శాస్త్రీయతను చూడకుండా, మనిషి తనకిష్ట మొచ్చినట్లు చెప్పుకోవడము వలన, జ్యోతిష్యమును శాస్త్రమే కాదని కొందరంటుండగా, బ్రహ్మవిద్యాశాస్త్రమనునది అసలుకే లేదని నాస్తిక వాదులు అంటున్నారు. నేటికాలములో నాస్తికులకుగానీ, ఆస్తికులకుగానీ బాగా కనిపించే శాస్త్రములు 1) గణిత, 2) ఖగోళ, 3) రసాయన, 4) భౌతిక శాస్త్రములే! అందువలన ఆ నాలుగు, బహుళ ప్రచారములో ఉండగా, శాస్త్రీయత లోపించినవిగా జ్యోతిష్యము, బ్రహ్మవిద్య రెండూ కనిపిస్తున్నవి. ఎవరికి ఎట్లు కనిపించినా, ఈ రెండు స్వచ్ఛమైన శాస్త్రములే. బ్రహ్మవిద్యనూ, జ్యోతిష్యమునూ పూర్వమువలె చెప్పుకొంటే అవి రెండూ శాస్త్రములని ఇటు నాస్తికులకు, అటు ఆస్తికులకు, శాస్త్రపరిశోధకులకు తెలియగలదు.

# 3 ఎవడు జ్యోతిష్యుడు?

ఏ మనిషికైనా జరిగిపోయిన కాలము, జరుగుచున్న కాలము, జరుగబోవు కాలము అని మూడు కాలములు కలవు. జరిగిపోయిన కాలమును 'భూతకాలము' అంటున్నాము. జరుగుచున్న కాలమును 'వర్తమానకాలము' అంటున్నాము. జరుగబోవు కాలమును 'భవిష్యత్ కాలము' అంటున్నాము. జరిగి పోయిన భూతకాలమును మనలోని మనస్సు యొక్క జ్ఞాపకము చేత తెలుసుకోవచ్చును. దానినే మనోనేత్రము చేత భూత కాలమును తెలుసుకోవచ్చునని పెద్దలన్నారు. ఒకని భూతకాలమును మరియొకడు తెలుసుకొనుటకు వీలులేదు. ఎవని భూతకాలమును వాడు మాత్రము వాని మనస్సు చేతనే తెలుసుకోవాలి. జరుగుచున్న వర్తమాన కాలము అందరి కళ్ళముందర ప్రత్యక్షముగ జరుగుచున్నది. కావున ఎవరి కన్నుల ద్వారా వారు తెలుసుకోగల్గుచున్నారు. వర్తమానకాలమును అందరూ సులభముగా తెలుసుకొంటున్నారు. జరిగిపోయిన భూతకాలమును మనో బలహీనత కల్గినవారు మరచిపోవచ్చును. భూతకాలమును వాని మనస్సు జ్ఞప్తి తేలేకపోతే, దానిని తెలుసుకొను అవకాశము లేకుండా పోవచ్చును. కానీ వర్తమాన కాలమును ఎంత తెలివి తక్కువ వాడుగానీ, మనో బలహీనత కలవాడుగానీ తెలుసుకొనుటకు అవకాశము గలదు.

జరుగబోవు భవిష్యత్ కాలమును తెలుసుకొనుటకు, అంతరంగము లోని మనోనేత్రముగానీ, బాహ్యారంగములోని ప్రత్యక్ష నేత్రముగానీ పనికి రాదు. భవిష్యత్ కాలమును తెలియుటకు జ్ఞాననేత్రము కావలెను. జ్ఞానజ్యోతి వలన తెలియునది కావున దానిని 'జ్యోతిష్యము' అంటున్నాము. దీనిని బట్టి జ్ఞాననేత్రమను జ్యోతిష్యము ద్వారానే, భవిష్యత్తు కాలమును తెలియవచ్చును. మనిషికిగల భూత,వర్తమాన,భవిష్యత్ అను మూడు కాలములను మూడు నేత్రముల ద్వార చూడవచ్చునని తెలియుచున్నది.

భూతకాలమును తెలుసుకొను మనోనేత్రము యొక్క చూపు (జ్ఞాపకశక్తి) కొందరికుండవచ్చును, కొందరికి ఉండకపోవచ్చును. కానీ వర్తమాన కాలమును తెలుసుకొను బాహ్యనేత్రముల యొక్క చూపు అందరికీ ఉందనియే చెప్పవచ్చును. ఇకపోతే భవిష్యత్ కాలమును తెలుసుకొను జ్ఞాననేత్రము, నూటికి తొంభై మందికి లేదనియే చెప్పవచ్చును. కేవలము పదిశాతము మందికి జ్ఞాన నేత్రముండినా, అది చూపులేని గ్రుడ్డిదై ఉన్నది. అందువలన భవిష్యత్ కాలము ఎవరికీ తెలియకుండా పోయినది. జ్ఞానులమనుకొన్న కొన్ని వేలమందిలోనో, లేక కొన్ని లక్షలమందిలోనో ఒకనికి జ్ఞాననేత్రము చూపు కల్గినదై ఉండును. అటువంటివానికి మాత్రమే జ్యోతిష్యము తెలియును. అట్టివాడు మాత్రమే భవిష్యత్‌ను తెలుసుకోగల్గును. మూడు కాలములకు మూడు నేత్రములు అవసరమని, అందులో జ్ఞాననేత్రము చాలా ముఖ్యమైనదని తెలిసి, చూపున్న జ్ఞాననేత్రమును కల్గినవాడు నిజమైన జ్యోతిష్యుడని తెలియవలెను. జ్ఞాననేత్రము లేకుండా పంచాంగములను తెలిసినవాడు జ్యోతిష్యుడు కాదు.

## 4 జ్యోతిష్యము మనుషులకేనా? జంతువులకు కూడా వర్తిస్తుందా?

జరుగబోవు కాలములో జీవులకు సంభవించు కష్టసుఖములను ముందే తెల్పునది జ్యోతిష్యము. జీవులు భౌతిక శరీరముతో ఉన్నపుడుగానీ, సూక్ష్మశరీరముతో ఉన్నపుడుగానీ అనుభవించు కర్మను ముందే తెల్పునది జ్యోతిష్యము. జీవులు స్త్రీశరీరముతోనున్నపుడుగానీ, పురుషశరీరముతో నున్నపుడుగానీ అనుభవించు వాటిని గురించి సూచనగా ముందే తెల్పునది జ్యోతిష్యము. అలాగే జీవులు మానవ ఆకారములోనున్నపుడుగానీ, జంతువు

ఆకారములో ఉన్నపుడుగానీ, అనుభవించు పాపపుణ్య మిశ్రమ ఫలితములను తెల్పునది జ్యోతిష్యము. అంతేకాక జీవులు అండజ, పిండజ, ఉద్భిజ రూపములో ఎక్కడ జన్మించినా, జన్మించినది మొదలు మరణించు వరకు జరుగు కాలములో, కష్టసుఖ రూపముతో అనుభవించు పాప పుణ్యములను పసికట్టి, ముందే చెప్పునది జ్యోతిష్యము. అందువలన జ్యోతిష్యము సర్వజీవరాశులకు వర్తించునని చెప్పవచ్చును.

## 5 జాతకము అంటే ఏమిటి?

జ్యోతిష్యశాస్త్రములో వ్రాసుకొన్న సిద్ధాంతముల ప్రకారము, ఒక మనిషి యొక్క భవిష్యత్తును జ్యోతిష్యముగా చూడాలంటే, వాని జాతకము తప్పక ఉండాలి. జాతకముతోనే ప్రారంభమౌతుంది జ్యోతిష్యము, కావున జాతకమునకు, జ్యోతిష్యమునకు అవినాభావ సంబంధమున్నది. ఇంతకీ జాతకమంటే ఏమిటో, ఈ కాలపు మనుష్యులకు చాలామందికి తెలియ దనుకుంటాను. ఈ కాలములో కూడా జాతకమును గురించి కొంతమంది తెలిసినవారుండినా, వారికి కూడా జాతకములోని యదార్థము తెలియదు. దీనినిబట్టి జాతకము అను శబ్దము అర్థహీనమైనదని తెలియుచున్నది. జాతకము యొక్క నిజమైన శబ్దము ఆదికాలమందు ఎలాగుండెడిదో, అది నేడు పలుకుచున్న జాతకముగా ఎట్లు మారినదో కొంత వివరించి చూచుకొందాము.

'జా' అనగా పుట్టడమని అర్థము. పుట్టిన జీవుడు ఏ సమయములో పుట్టాడో, ఆ సమయములో ఖగోళమున గ్రహములు భూమికి ఏయే దిశలలో ఉన్నాయో, వాటి స్థానములను గుర్తించుకోవడమును జాతకము

అంటుంటారు. కానీ మేము చెప్పునదేమనగా! ఒక జీవుడు పుట్టకముందే అతను పుట్టిన తర్వాత చనిపోవువరకు ఏవిధముగ నడుచుకోవాలి? ఏయే కష్టసుఖములు అనుభవించాలి? ఏమి తినాలి? ఏమి మాట్లాడాలి? ఎప్పుడు పడుకోవాలి? అను మొదలగు అన్ని పనులను ఒక్కక్షణము కూడా వదలకుండ అన్ని కాలములలో ఒక ఫతకము ప్రకారము నిర్ణయించి పెట్టడమును **'జాఫతకము'** అంటాము. పుట్టినపుడే నిర్ణయించబడియున్న ఫతకము కావున, ఆ ఫతకమును 'జాఫతకము' అంటున్నాము. ఇంగ్లీషుభాషలో 'బర్త్‌ప్లాన్' అంటున్నాము. ఒక జన్మకు కావలసిన పనుల ఫతకమును పూర్వము జాఫతకము అని అనెడివారని తెలిసినది. కాలము గడుస్తూరాగా, కొంతకాలమునకు జాఫతకము అను పదములోనున్న ఐదక్షరములలో 'జా' ప్రక్కనగల 'ఫ' అను రెండవ అక్షరము ఎగిరిపోయినది. మనుషులు 'ఫ' అక్షరమును పలకడములేదు. చివరకు నాలుగు అక్షరముల పదము 'జాతకము' గా మిగిలిపోయినది. ఐదక్షరముల జాఫతకములోని అర్థము జాతకము అను పదములో లేకుండా పోయింది. చివరకు జాతకము అర్థము లేనిదైపోయి ఉన్నది. ఈనాటి జ్యోతిష్యులు ఎందరుండినా పూర్వమున్న 'జాఫతకము'ను తెలియక, అందరూ దానిని జాతకము అని అంటున్నారు.

ఒక జీవుడు శరీరము ధరించి పుట్టిన సమయమును జననము అంటున్నాము. పుట్టడమును 'జ' అని, మరణించడమును 'గతి' అని కూడా అంటున్నాము. పుట్టినప్పటినుండి మరణించువరకు గల కాలమును 'జీవితము' అంటున్నాము. పుట్టడమును, చావడమును కలిపి 'జగతి' అంటున్నాము. 'జ' నుండి 'గతి' వరకు మధ్యకాలములో గల జీవితమును నిర్ణయించి ఆడించు కర్మను ప్రారబ్ధకర్మ అంటున్నాము. ఒక జీవితమునకు ముందుగానే సంచితకర్మ అను కర్మ కూడలినుండి, కొంతకర్మను

కేటాయించడమును 'జాఫతకము' అంటున్నాము. కేటాయించిన కర్మ పేరు ప్రారబ్ధము అయితే, కేటాయించిన పద్ధతిని జాఫతకము అంటున్నాము. ఒకని జీవితమునకు పుట్టుకలోని జాఫతకమును చూస్తే, ఆ జన్మకు సంబంధించిన ప్రారబ్ధము ఫలానా అని తెలియును. ప్రారబ్ధము తెలిస్తే వాని జీవితములోని కష్టసుఖములు తెలియును. ఈ పద్ధతి ప్రకారము జాతకము ద్వారా ప్రారబ్ధమును తెలియడమునే 'జ్యోతిష్యము' అంటున్నాము.

## 6 కాల, కర్మ చక్రములు

ఒక జీవుడు తన జీవితములో అనుభవించవలసిన ప్రారబ్ధకర్మను, ఒక ఫతకము ప్రకారము పుట్టినపుడే నిర్ణయించి ఉండడమును, జాఫతకము అన్నాము కదా! ఆ జాఫతకము పండ్రెండు విధములుగా విభజింపబడి ఉండును. విభజింపబడిన జాఫతకములోని ప్రారబ్ధము, పండ్రెండు భాగములుగానున్న కర్మచక్రములో ఉండును. ఎవని కర్మచక్రము వాని తలలో ఉండును. తల మధ్యభాగములో ఫాలభాగమున (నుదుటి భాగమున) గల నాలుగు చక్రముల సముదాయములో, క్రిందినుండి రెండవ చక్రము కర్మచక్రమై ఉన్నది. కర్మచక్రములోని ప్రారబ్ధకర్మను జీవితకాలములో మనిషి చేత అనుభవింప చేయునవి గ్రహములు. గ్రహములు కూడా కర్మ చక్రమును ఆనుకొని, పైనగల కాలచక్రములో గలవు. పుట్టిన సమయములో గల జాఫతకము ద్వారా మనిషి జీవిత ప్రారబ్ధమును తెలుసుకోవచ్చని చెప్పుకొన్నాము కదా! జాఫతకములో కర్మ ప్రత్యక్షముగా కనిపించదు. జాఫతకములో ప్రత్యక్షముగ గ్రహములు కనిపించును. కాలచక్రములోని గ్రహములను చూచి, వాటి ద్వారా అవి పాలించు ప్రారబ్ధమును తెలుసు

కోవచ్చును. అందువలన జ్యోతిష్యములో ఇటు గ్రహములు, అటు కర్మ ఆచరణ (ఆచారము) అను రెండు భాగములు ఉన్నవి. రెండిటిని కలిపి గ్రహచారము (గ్రహచారణ) అంటున్నాము. ఎవని గ్రహచారము ఎట్లుందో, వాని కాల, కర్మచక్రములను బట్టి తెలియును. కాలచక్రము పంద్రెండు భాగములు విభజింపబడి పంద్రెండు పేర్లుండును. వాటిని క్రింద 1వ చిత్రపటరూపములో చూస్తాము.




కాలచక్రము -1వ పటము

1) మేషము 2) వృషభము 3) మిథునము 4) కర్కాటకము 5) సింహము 6) కన్య 7) తుల 8) వృశ్చికము 9) ధనస్సు 10) మకరము 11) కుంభము 12) మీనము.

ఈ పంద్రెండు కాలచక్రభాగములలోనున్న గ్రహములు నిర్ణీతమైన వేగముతో గతి తప్పక ప్రయాణించుచూ తమ కిరణములను కర్మచక్రము మీద ప్రసరింపజేయుచుండును. ఇపుడు చక్రముల వివరము పూర్తిగా తెలుసుకొందాము. ప్రతి మనిషి తలలో బ్రహ్మ,కాల, కర్మ,గుణచక్రములను నాలుగుచక్రముల సముదాయము గలదు. ఈ నాలుగు చక్రముల

సముదాయము విశ్వములోని జీవులందరికీ ఆధారమైయున్నది. ఈ నాల్గుచక్రముల సముదాయము తెలియకపోతే మనిషికి దైవజ్ఞానము ఏమాత్రము తెలియదని చెప్పవచ్చును. నాల్గుచక్రములు అటు బ్రహ్మవిద్య లోనూ (ఆధ్యాత్మిక విద్యలోనూ), ఇటు జ్యోతిష్యశాస్త్రములోనూ ప్రాధాన్యత కల్గియున్నవి. ఈ నాల్గుచక్రముల వివరము కూలంకషముగా తెలియాలంటే త్రైతసిద్ధాంత భగవద్గీతలోని, అక్షర పరబ్రహ్మయోగమను అధ్యాయమును చదవండి. అక్కడే మన శరీరములోని నాల్గుచక్రముల వివరము తెలియగలదు. ఈ నాల్గుచక్రముల వివరము తెలియకపోయిన దానివలన, ఇటు బ్రహ్మవిద్యాశాస్త్రమైన ఆధ్యాత్మికములోనూ, అటు కర్మ విధానమైన జ్యోతిష్యరంగములోనూ మనుషులు వెనుకబడిపోయి యున్నారు. నాల్గు చక్రములంటే ఏమిటి? అవి ఎక్కడున్నవి? అని తెలియనంత వరకు సంపూర్ణమైన దైవ జ్ఞానమునుగానీ, సంపూర్ణమైన జ్యోతిష్యమునుగానీ తెలియలేము. కళ్ళు లేనివానికి దృష్టి ఏమాత్రములేనట్లు, బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రముల వివరము తెలియని వానికి జ్ఞానదృష్టి ఏమాత్రముండదు. ప్రతి శరీరములో నుదుటి భాగమున లోపల గల నాల్గుచక్రముల సముదాయమును తర్వాత పేజీలోని 2వ చిత్రపటమునందు చూడవచ్చును.

పై నుండి రెండవ చక్రమే కాలచక్రము. కాలచక్రము గుండ్రముగా వుండి పండ్రెండు భాగములు కల్గియుండగా, కొందరు జ్యోతిష్యులు దానికి 'జాతకచక్రమనీ' లేక 'జాతకకుండలియనీ' పేరుపెట్టి చతురస్రముగ చిత్రించు కొన్నారు. దానికి 'లగ్నకుండలియని' పేరుకూడా పెట్టారు. లగ్నకుండలి, జాతకకుండలి, జాతకచక్రము అనబడు కాలచక్రము యొక్క చతురస్రముగా నున్న చిత్రమును తర్వాత పేజీలోని 3వ చిత్రపటమునందు చూడవచ్చును.




**బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రము - 2వ పటము**

కాలచక్రమును జ్యోతిష్యులు పై విధముగా చతురస్రముగా చిత్రించుకొన్నారు. విచిత్రమేమంటే మేష, వృషభ మొదలగు పండ్రెండు

| | | | |
|---|---|---|---|
| మీనము | మేషం | వృషభం | మిథునం |
| కుంభము | **కాలచక్రము** | | కర్కాటక |
| మకరము | | | సింహ |
| ధనస్సు | వృశ్చిక | తుల | కన్య |

కాలచక్రము-3వ పటము.

భాగములుగా గీచుకొన్నది కాలచక్రమని వారికి తెలియదు. దానిని లగ్నకుండలి అంటున్నారు తప్ప, అది తలలోని కాలచక్రమని తెలుసు కోలేకపోయారు. అంతేకాక తలలో కర్మచక్రమొకటున్నదనీ, దానికి ఒక ఆకారమున్నదనీ ఇప్పటి జ్యోతిష్యులకు తెలియదు. కర్మ అయిన పాపపుణ్యములను తెలియకుండ, కేవలము ప్రపంచ కష్ట సుఖములనూ, వస్తు వాహనములనూ, ధన కనకములనూ, స్థిర చరాస్తులను, పుత్ర, కళత్రముల ఫలితముల గురించి చెప్పుచున్నారు. వాటిని కూడా లగ్నకుండలి నుండియే చూస్తున్నారు. కర్మ చక్రమనునది ప్రత్యేకముగా ఉన్నదని వారికి తెలియదు. ఏ పండ్రెండు భాగములలో గ్రహములను చూస్తున్నారో, అదే లగ్నములలోనే ఫలితములను చూస్తున్నారు. దీనిని బట్టి కాల,కర్మచక్రముల గురించి తెలియదని అర్థమగుచున్నది. వాటి వివరము తెలియకనే, పూర్వము ఎవరో చెప్పిన పండ్రెండు లగ్నముల పేర్లను మాత్రము జ్ఞాపకము పెట్టుకొని చెప్పుకొనుచున్నారు. అందువలన నేటి జ్యోతిష్యము గాడి తప్పినదై పోయినది. దానివలన జ్యోతిష్యము శాస్త్రము కాదేమోనని కొందరు అంటున్నారు, కొందరు మూఢనమ్మకమనీ, కొందరు శాస్త్రముకాదనీ అంటున్నారు. జ్ఞానజ్యోతి కల్గినవారై మన శరీరములోనే, శిరస్సుయందు కాల, కర్మ అను రెండు చక్రములున్నవని తెలిసి, కాలచక్రములో గ్రహములు, కర్మచక్రములో పాప పుణ్యములున్నాయని తెలిస్తేనే జ్యోతిష్యము గాడిలో పడుతుంది మరియు ఇది శాస్త్రమని తెలియబడుతుంది. ఇపుడు తలలోని నాల్గుచక్రముల సముదాయములోని కర్మచక్రమును గురించి వివరించు కొందాము. నాల్గు చక్రములలో క్రిందినుండి రెండవచక్రము కర్మచక్రముగా ఉన్నది. కర్మచక్రమును తర్వాత పేజీలోగల 4వ చిత్రపటమునందు చూడవచ్చును.




**కర్మచక్రము - 4వ పటము**

పై చక్రము బాగా అర్థమగుటకు కర్మచక్రమును కూడా చతురస్రాకారములో గీచి చూచుకోవచ్చును. కాలచక్రమునకు పేర్లు గలవు, కానీ కర్మచక్రమునకు పేర్లుండవు. కర్మచక్రములోని భాగములను అంకెలతోనే గుర్తుంచుకోవాలి. ఇందులోని మొదటి భాగమును ప్రథమ స్థానము అంటాము. మిగతా భాగములను వరుసగా రెండవ భాగమును ద్వితీయ స్థానము, మూడవ భాగమును తృతీయస్థానము, నాల్గవ భాగమును

చతుర్థస్థానము, ఐదవ భాగమును పంచమస్థానము, ఆరవభాగమును షష్ఠమస్థానము, ఏడవ భాగమును సప్తమస్థానము, ఎనిమిదవ భాగమును అష్టమస్థానము, తొమ్మిదవ భాగమును నవమస్థానము, పదవభాగమును దశమస్థానము, పదకొండవ భాగమును ఏకాదశస్థానము, పండ్రెండవ భాగమును ద్వాదశస్థానము అని అంటున్నాము. కర్మచక్రమునూ, దాని భాగములనూ చతురస్రాకారములో చూపుతూ, అందులో కర్మ భాగములను కూడా చూపు చిత్రమును క్రిందగల 5వ పటమునందు చూడుము.

| | | | |
|---|---|---|---|
| (12) ద్వాదశ స్థానము | (1) ప్రథమ స్థానము | (2) ద్వితీయ స్థానము | (3) తృతీయ స్థానము |
| (11) ఏకాదశ స్థానము | **కర్మచక్రము** | | (4) చతుర్థ స్థానము |
| (10) దశమ స్థానము | | | (5) పంచమ స్థానము |
| (9) నవమి స్థానము | (8) అష్టమ స్థానము | (7) సప్తమ స్థానము | (6) షష్టమ స్థానము |

**5వ పటము – కర్మచక్రము**

# 7 కర్మంటే ఏమిటి?

'కర్మ' అను మాట చాలామంది నోట పలుకబడుచుండును. సాధారణ ప్రజలు, ఏమాత్రము జ్ఞానము తెలియనివారు కూడా అనేక సందర్భములలో కర్మయనీ, అది వాని కర్మయనీ, ఇది నాకర్మ అనీ తెలియకనే అంటున్నాము. అంతేకాక కర్మయని అంటూ చేయిని తన తలవైపు చూపడమూ, తలవ్రాతయని తలలోని ఫాలభాగమును చూపడమూ జరుగుచున్నది. ఇవన్నీ మనిషికి తెలియకనే మాట్లాడడము, చేయి చూపడము జరుగుచున్నదంటే, కర్మ అనునది ఒకటున్నదనీ, అది తలలో నుదుటి భాగములోనే ఉన్నదనీ అందరికి తెలియునట్లు, శరీరములోని ఆత్మే మనిషిని కదిలించి, మాట్లాడించుచున్నదనీ అర్థమగుచున్నది. కానీ మనిషి, కర్మ అని ఎందుకంటున్నాననిగానీ, తలవైపే చేయినెందుకు చూపుచున్నానని గానీ ఏమాత్రము అనుకోవడము లేదు. శరీరములోని ఆత్మ తెలిపినట్లు, కర్మచక్రము తలమధ్యలో ఉన్నదని తెలుసుకొన్నాము. కర్మచక్రములోని కర్మంటే ఏమిటో యోచించి చూద్దాము.

'మర్మముగా ఉన్నది కర్మము' అని పెద్దలంటుంటారు. ఎవరికీ తెలియకుండా మర్మముగా వచ్చి, మనిషిలో చేరునది కర్మ, కావున కర్మను మర్మము అన్నారు. కర్మను 'చేసుకున్న ఫలితము' అని కూడా అన్నారు. ఫలితమునకు ఉదాహరణ చెప్పుకుంటే, ఒక ఉద్యోగి చేయు పనికి ఫలితము జీతము రూపములో ఉండును. అట్లే ఒక కూలివాడు చేయు పనికి ఫలితము దినకూలి రూపములో ఉండును. ఈ విధముగా మనిషి చేయు ప్రతి పనికీ ఫలితముండును. మనిషి ఒక పని చేస్తే దానిలో వచ్చు ఫలితము రెండు రకములుగా ఉండును. ఒక రకము అందరికీ తెలిసినదే. దానిని డబ్బురూపములో గానీ, వస్తురూపములోగానీ, ధాన్యరూపములోగానీ,

చేసిన పనికి దినకూలి రూపములోగానీ, నెలజీతము రూపములోగానీ తీసుకొంటున్నాము. ఇది కనిపించెడి ఫలితము. మనిషి చేయు ప్రతి పనికీ కనిపించని ఫలితము కూడా వచ్చుట గలదు. ఆ కనిపించని ఫలితమునే 'కర్మ' అంటాము. దానినే విడదీసి చెప్పుకొంటే, పాపము మరియు పుణ్యము అంటాము. ప్రతి మనిషీ భూమిమీద నిత్యము ఏదో ఒక పనిని చేస్తున్నాడు. కనిపించెడి ఫలితమునూ, కనిపించని ఫలితమునూ రెండిటినీ పొందుచున్నాడు. ఉదాహరణకు ఒక పోలీస్ ఉద్యోగి, తన ఉద్యోగరీత్యా పోలీస్‌స్టేషన్‌లో ఒక దొంగనో లేక నేరస్థుడినో కొట్టవలసి వచ్చినపుడు కొట్టక తప్పదు. దానిని ఉద్యోగ ధర్మము అంటారు. ఆ ఉద్యోగము చేసినందుకు ఫలితముగా, నెల జీతము తీసుకోవడము జరుగుచున్నది. ఉద్యోగము చేయడము కనిపించే పనియే. దానికి కనిపించే ఫలితమును డబ్బురూపములో జీతముగా తీసుకొంటున్నాడు. అయినా ఆ పోలీస్‌కు కనిపించని ఫలితమైన కర్మ, అతను తీసుకోకనే వెంటవచ్చుచున్నది. కనిపించే జీతము ఉద్యోగి తీసుకొని జేబులో పెట్టుకుంటే, కనిపించని కర్మ దానంతటదే వచ్చి, తలలోని కర్మచక్రమును చేరుచున్నది. కనిపించే జీతమును గ్రహించి తీసుకొని, పై జేబులో పెట్టుకోవాలా, క్రింది జేబులో పెట్టుకోవాలా అని ఆలోచించి మనము పెట్టుకొన్నట్లు, కాలచక్రములోని గ్రహములు కర్మను గ్రహించి, కర్మచక్రములోని ఏ భాగములో పెట్టాలో ఆ భాగములోనే పెట్టును. ఇట్లు మనిషికి తాను చేసిన పని యొక్క ఫలితము ప్రత్యక్షముగా ఉన్నట్లు, కార్యమునకు కర్మ పరోక్షముగా ఉన్నది. పనిలో కనిపించు డబ్బు వచ్చినట్లే, కనిపించని కర్మ కూడా వచ్చుచున్నదని ఎవరూ అనుకోవడము లేదు. ఆ కనిపించని కర్మ విధానము ఎవరికీ తెలియదు.

అందువలన కర్మము మర్మమైనదని పెద్దలన్నారు. కార్యము కనిపించి ప్రత్యక్షమైనదైతే, కర్మ కనిపించక పరోక్షమైనదనీ, దానిని తెలుసుకోవడమే మనిషికి ఆధ్యాత్మికములో ముఖ్యమైనదని తెలియాలి.

## 8 కర్మ ఎన్ని రకములు?

కర్మ విధానమును బాగా ఆధ్యాయనము చేస్తే, మనిషి పుట్టినప్పటి నుండి ఒకటి సంపాదించే కర్మ, రెండు అనుభవించేకర్మ అని రెండు రకములు గలవు. ఇవి రెండూకాక సంపాదించేది ఎక్కువై, అనుభవించేది తక్కువైనపుడు శేషముగా (బ్యాలెన్సుగా) మిగిలే కర్మ కొంతవుంటుంది. అలా మిగిలిన శేషము యొక్క నిల్వను **'సంచితకర్మ'** అని అంటున్నాము. ఒక జన్మలో సంపాదించిన కర్మను **'ఆగామికర్మ'** అని అంటున్నాము. అట్లే ఒక జన్మలో అనుభవించే కర్మను **'ప్రారబ్ధకర్మ'** అని అంటున్నాము. బ్రహ్మవిద్యా శాస్త్రము ఆగామికర్మ యొక్క వివరమును తెలియజేయును. జ్యోతిష్యశాస్త్రము ప్రారబ్ధకర్మ యొక్క వివరమును తెలియజేయును. ఆగామికర్మను సంపాదించుకోకుండా ఉండే వివరమును తెలుపునది 'బ్రహ్మవిద్యాశాస్త్రము'. అలాగే ప్రారబ్ధకర్మలోని అనుభవములను వివరించి తెల్పునది 'జ్యోతిష్య శాస్త్రము'. ఇపుడు మనము జ్యోతిష్యమునకు సంబంధించిన ప్రారబ్ధమును గురించి తెలుసుకొందాము.

ప్రారబ్ధకర్మ ఎలా పుట్టుచున్నదో అని చూస్తే, పొగ పుట్టుటకు నిప్పుకారణమన్నట్లు, ప్రారబ్ధకర్మ పుట్టుటకు మనిషి తలలోని గుణములు కారణము. తల మధ్యలోగల నాల్గుచక్రముల సముదాయములో, క్రిందనున్న చక్రము పేరు గుణచక్రము. గుణచక్రము మూడు భాగములుగా విభజింపబడి

వున్నది. గుణచక్ర చిత్రమును ఈ క్రిందగల 6వ పటమునందు చూడవచ్చును.




**గుణచక్రము-6వ పటము**

గుణచక్రములోని మూడు భాగములకు మూడు పేర్లు గలవు. మూడు పేర్లు బయటనుండి వరుసగా తామస,రాజస,సాత్త్వికము అని గలవు. మధ్యలోనున్న బ్రహ్మనాడి ఇరుసు భాగములో ఆత్మ ఉండును. అందువలన దానిని 'ఆత్మభాగము' అంటాము. మధ్యలోని ఆత్మ భాగము గుణచక్రమునకే కాక అన్ని చక్రములకూ ఉండును. ఇక్కడ మధ్యలోని ఆత్మభాగమును వదలివేస్తే, మిగిలిన గుణభాగములు మూడు మాత్రమే ఉండును. బ్రహ్మవిద్య ప్రకారము గుణచక్రమును ఆత్మ భాగముతో కలిపి నాల్గుభాగములని చెప్పవలెను. కానీ జ్యోతిష్యశాస్త్రము ప్రకారము మనకు అవసరమైనవి మూడు భాగములు మాత్రమే. అందువలన ఇక్కడ గుణచక్రమును, మూడు భాగములుగానే చెప్పుకోవలెను. మూడు భాగములలోనూ గుణములు ఉండును. మనకు అర్థమగుటకు ముందు ఒక గుణభాగమును తీసుకొని చూచెదము. తామస గుణ భాగమును చూస్తే, అందులో రెండు గుంపులుగానున్న గుణములు ఉండును. ఆ రెండు గుంపులలో ఒక గుంపు

గుణములు చెడు గుణములనీ, రెండవ గుంపులోని గుణములు మంచి గుణములనీ పేరుగాంచి ఉన్నవి. చెడు గుణములు మొత్తము ఆరు గలవు. అట్లే మంచిగుణములు మొత్తము ఆరు గలవు. చెడు గుణముల పేర్లు వరుసగా 1) కామము 2) క్రోధము 3) లోభము 4) మోహము 5) మదము 6) మత్సరము అని గలవు. వీటినే కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సరములు అంటాము. మంచి గుణముల పేర్లు వరుసగా 1) దానము 2) దయ 3) ఔదార్యము 4) వైరాగ్యము 5) వినయము 6) ప్రేమ అని గలవు. వీటినే దాన, దయ, ఔదార్య, వైరాగ్య, వినయ, ప్రేమలు అంటాము. మొదటి ఆరు చెడు గుణములు ఒక గుంపుగా, రెండవ ఆరు మంచి గుణములు మరియొక గుంపుగా గలవు. అంతేకాక మొదటి గుంపులోని ఆరు చెడు గుణములకు వ్యతిరేఖగుణములుగా, రెండవ గుంపులోని ఆరు మంచి గుణములు గలవు. శరీరములోని జీవునికి ఆరు చెడు గుణములు శత్రువులనీ, ఆరు మంచి గుణములు మిత్రులని పేరుగాంచి ఉన్నవి.

జీవునికి చెడు ఆరు గుణములు శత్రువులుగా ఉండి, ఆ గుణములలో దేనిద్వారా బయటిపని జరిగినా, దానిద్వారా జీవునకు పాపము వచ్చునట్లు చేయుచున్నవి. ఇక్కడ సూత్రమేమనగా! ఒక గుణ ప్రేరణ వలన జరిగే పనిలో ఒక కర్మ పుట్టుచున్నది. చెడు గుణము వలన జరిగిన పనిలో పాపమూ, మంచి గుణము వలన జరిగిన పనిలో పుణ్యమను పుట్టుక వచ్చుట సహజము. దీనినిబట్టి పాపపుణ్యముల పుట్టుక స్థానము గుణ చక్రమని తెలియుచున్నది. ఒక తామసగుణభాగములో మంచి, చెడు గుణములు మొత్తము పండ్రెండు ఉన్నట్లు, రాజసగుణభాగములోనూ పండ్రెండు గుణములు గలవు. అట్లే సాత్త్విక గుణభాగములోనూ పండ్రెండు గుణములు గలవు. మొదటి తామస గుణభాగములో మిత్ర, శత్రువులు

అను రెండు గుంపుల గుణములున్నట్లే, మిగతా రెండు గుణభాగములలోను గలవు. దీని ప్రకారము మూడు భాగములలో మొత్తము గుణముల సంఖ్య ‘36’ గా తెలియుచున్నది. ఒక భాగములోని 12 గుణములకు మరొక భాగములోని 12 గుణములకు పేర్లు ఒకే విధముగా ఉన్నవి. కానీ ఒక భాగములోని ‘ఆశ’ అను గుణమునకు, మరొక భాగములోని ‘ఆశ’ అను గుణమునకు కొంత తేడా ఉండును. ఇట్లు ఒక భాగములోని గుణమునకు మరొక భాగములోని గుణమునకు కొంత భేదము ఉన్నట్లు, మిగతా అన్ని గుణములకు భేదము ఉండునని తెలియవలెను. అదే విధముగా ఒక భాగములోని క్రోధము వలన వచ్చు పాపమునకు, మరొక గుణభాగములోని క్రోధము వలన వచ్చు పాపమునకు కొంత తేడా ఉండును. ఒకే పేరు కల్గిన గుణములు, మూడు భాగములలో ఉండినప్పటికీ, అవి కొంత భేదము కల్గియున్నట్లు, వాటి వలన వచ్చు పాపపుణ్యములను కర్మ కూడా కొంత భేదము కల్గియుండునని గుర్తుంచుకోవలెను. ఈ విషయము అర్థమగుటకు క్రింది చిత్రము కొంత ఉపయోగపడును. కావున 7వ పటమును చూడుము.




**గుణచక్రము - 7వ పటము**

ఒక భాగములోని గుణములకు, మరొక భాగములోని గుణములకు పేర్లు ఒకే విధముగా ఉండినా, అవి ఒకే విధముగా లేవనీ, వాటి వలన వచ్చు కర్మకూడా ఒకే విధముగా లేదనీ తెలుసుకొన్నాము కదా! ఇపుడు ముఖ్యముగా తెలుసుకోవలసినది ఏమనగా! ఒక భాగములోని ఒకే పేరున్న గుణము, తాను ఒకటే కాక, తన జాతి గుణముల సముదాయముగా ఉన్నది. ఉదాహరణకు తామస గుణభాగములోని క్రోధము ఒక్కటేగాక, అది తొమ్మిది క్రోధముల గుంపుగా ఉన్నది. ఒక భాగములోని తొమ్మిది సంఖ్యలోనున్న ఒకేపేరుగల గుణములు సమానముగా లేకుండా, పరిమాణములో తేడా కల్గియున్నవి. ఎట్లనగా! ఒక పేరున్న క్రోధము లేక కోపము యొక్క గుణముల గుంపులో మొదటిది పెద్దగా ఉండగా, దాని తర్వాత రెండవది మొదటి దానికంటే పరిమాణములో కొంత చిన్నదిగా ఉండును. తర్వాత రెండవ దానికంటే మూడవది పరిమాణములో కొంత తక్కువగా ఉండును. ఆ విధముగా ఒకదానికొకటి చిన్నదిగా ఉంటూ, చివరి తొమ్మిదవది అన్నిటికంటే చిన్నదిగా ఉండును. తామసభాగములో కోపము తొమ్మిది రకములుగా ఉన్నట్లు, మిగతా రెండు భాగములలో కూడా కోపము తొమ్మిది భాగములుగా ఉన్నది. దీనినే చిన్న కోపము, పెద్ద కోపము, కొంత కోపము అంటున్నాము. ఒక భాగములో ఒక గుణము తొమ్మిది గుంపుగా ఉండుట వలన, చెడు గుణములైన కామ, క్రోధ, లోభ, మోహ, మద, మత్సర అను ఆరు గుణముల గుంపు మొత్తము యాభై నాలుగుగా ఉన్నవి. 6×9=54 ఒక చెడు గుణముల గుంపు ఉండగా, మరొక మంచి గుణములు కూడా 6×9=54 గుంపుగా ఉన్నవి. ఈ విధముగా లెక్కించి చూచితే ఒక గుణ భాగములో పెద్ద గుణములు మొత్తము పండ్రెండు కాగా, వాటి గుంపులోని చిన్న గుణములను కూడా లెక్కించి

చూచితే 12×9=108 మొత్తము నూటఎనిమిది గుణములుగా ఉన్నవి. ఒక తామస భాగములోనున్నవి 108 గుణములు కాగా, రాజస భాగములోనూ 108 గుణములు కలవు. అట్లే సాత్త్విక భాగములోనూ గుణముల సంఖ్య 108 గానే కలదు. మూడు భాగములలోనూ మొత్తము గుణముల సంఖ్య 108×3=324 గా ఉన్నది. గుణముల గుంపు చిత్రమును ఈ క్రిందగల 8వ పటములో చూడుము.




**గుణచక్రము - 8వ పటము**

తామస భాగములో గుణముల సంఖ్య 108 కదా! వాటివలన ఉత్పన్నమయ్యే కర్మ కూడా 108 రకములుగా ఉండును. అందులో 54 గుణముల వలన వచ్చునది పాపము కాగా, మిగతా 54 గుణముల వలన వచ్చునది పుణ్యమై ఉన్నది. ఈ విధముగా ఒక తామస భాగములోనే కర్మ 108 రకములుగా తయారుకాగా, మొత్తము మూడు భాగములలో 324 రకముల పాపపుణ్యములు తయారగుచున్నవని చెప్పవచ్చును. ఇపుడు,

కర్మ ఎన్ని రకములు? అని ఎవరైనా ప్రశ్నిస్తే, ఒక గుణ భాగములో అయితే 108 రకములనీ, మూడు గుణ భాగములలో మొత్తము 324 రకములు అని సులభముగా చెప్పవచ్చును. కర్మ విధానమూ, కర్మయొక్క విభాగముల విధానమూ, భూమిమీద ఒక ఇందూమతములోనే కలదు. మిగతా మతములలో కర్మ విధానముగానీ, దాని విభజనగానీ ఎక్కడా కనిపించదు. ఇది బ్రహ్మవిద్యాశాస్త్రము ప్రకారమున్నది. కానీ ఇప్పటి కాలమున జ్యోతిష్య శాస్త్రములో కూడా కర్మ విధానమును ఎవరూ వ్రాసుకోవడము జరుగలేదు.

## 9 కర్మను అనుభవించు వాడు ఎవడు?

ఇంతవరకు కాలచక్రమునూ, కర్మచక్రమునూ, గుణచక్రమునూ గురించి వరుసగా తెలుసుకొన్నాము. ఇపుడు కర్మను అనుభవించు జీవున్ని గురించి తెలుసుకొందాము. కర్మను పరిపాలించుటకు కాలచక్రములోని గ్రహములున్నాయి. కర్మను పుట్టించుటకు గుణచక్రములోని గుణములు ఉన్నాయి. కర్మను అనుభవించుటకు జీవుడు గుణచక్రములోనే ఉన్నాడు. జీవుడు కర్మను అనుభవిస్తూ, కాలమును గడపడమునే 'జీవితము' అంటాము. **"నహి కశ్చిత్ క్షణమపి"** అని భగవద్గీతలో అన్నట్లు, ఒక్క క్షణము కూడా వృథా కాకుండా, జీవుడు జీవితములో కర్మను అనుభవిస్తున్నా డని తెలియుచున్నది. జీవుడు అనుభవించబోవు కర్మను తెలుసుకోవడమే **"జ్యోతిష్యము"** అంటున్నాము. జ్యోతిష్యమును సమగ్రముగా తెలుసుకో వాలంటే, కర్మను అనుభవించే జీవున్ని గురించి పూర్తిగా తెలుసుకోవలసి యుండును. కర్మను అనుభవించు జీవుడు, తలలోని కర్మచక్రము క్రిందనున్న గుణచక్రములోనే ఉండును. గుణచక్రము యొక్క మూడు భాగములలో ఏదో ఒక భాగములో జీవుడుండి, ఆ గుణముల ప్రవర్తనల వలన కలుగు

సుఖదుఃఖములను అనుభవించుచుండును. తామసములో నున్న జీవున్ని ఈక్రిందగల 9వ పటములో చూడవచ్చును.




**గుణచక్రము - 9వ పటము**

తామసములో జీవుడున్నపుడు మిగతా రాజస, సాత్త్వికములలో జీవుడుండడు. ఒక్కోసారి జీవుడు తామసమును వదలి రాజసభాగములోనికి కూడా చేరును. అపుడు మిగతా తామస, సాత్త్వికములలో జీవుడు లేడని తెలియుచున్నది. రాజసగుణముల మధ్యలో జీవుడున్న చిత్రమును క్రిందగల 10వ పటములో చూడుము.




**గుణచక్రము - 10వ పటము**

ఈ విధముగా జీవుడు మూడు గుణముల భాగములను మారుటకు ఒక కారణము కలదు. అదేమనగా! ప్రారబ్ధకర్మను బట్టి జీవుడు అస్వతంత్రుడై గుణముల భాగములను మారవలసియున్నది. ఆ విధముగా మారుచున్న జీవుడు ఒక్క సమయములో, ఒక్క గుణభాగములో, ఒక్క గుణమునందు లగ్నమగుచుండును. ఏ గుణ భాగములోనున్న జీవున్ని ఆ గుణభాగము పేరుతో పిలువడము జరుగుచున్నది. తామస భాగములోనున్నపుడు తామసుడనీ, రాజస భాగములోనున్నపుడు రాజసుడునీ, సాత్త్విక భాగములో నున్నపుడు సాత్త్వికుడనీ పిలుస్తున్నాము. ఇపుడు సాత్త్వికములోనున్న సాత్త్వికుణ్ణి క్రింది 11వ పటములో చూస్తాము.




**గుణచక్రము - 11వ పటము**

జ్ఞానదృష్ఠితో బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రములను నాల్గుచక్రముల చట్రమును చూడవచ్చును. అదే విధముగా క్రింద గుణచక్రములోని ఏదో ఒక భాగములోనున్న జీవున్ని చూడవచ్చును. దీనినిబట్టి గుణములకూ, జీవునికీ కూడా ఆకారము కలదని తెలియుచున్నది. ఇంతవరకు, భూమిమీద ఎక్కడా తెలియని విధానమునూ, గుణముల యొక్కయు మరియు జీవుని యొక్కయు ఆకారములనూ మనము తెలుసుకోగలిగాము.

సమగ్రముగా చూస్తే జీవుని ఆకారము ఈ విధముగా గలదు. జీవుడు మూడు పొరల మధ్యన బంధింపబడిన ఖాళీ స్థలము అని తెలియుచున్నది. జీవుని ఆకారమును క్రింది 12వ పటములో చూడవచ్చును.




**జీవుని ఆకారము - 12వ పటము**

ఇంతవరకు కాలచక్రమును, కర్మచక్రమును, గుణచక్రమును అందులోనున్న జీవున్ని గూర్చి తెలుసుకొన్నాము. ఇక మూడు చక్రములకంటే పైన గల బ్రహ్మచక్రమొకటి గలదు. బ్రహ్మచక్ర వివరము ఇక్కడ జ్యోతిష్యమునకు అవసరము లేదు. అది ఒక బ్రహ్మవిద్యాశాస్త్రమునకు మాత్రమే పరిమితమైనది. కావున రెండు భాగములుగానున్న బ్రహ్మచక్రమును ఇక్కడ వివరించుకోక వదలి వేయుచున్నాము. జ్యోతిష్యమునకు కావలసినది కాల, కర్మ, గుణచక్రముల సమగ్ర సమాచారము మాత్రమేనని తెలుపు చున్నాము. గుణచక్రములోని గుణములను, జీవున్ని గురించి తెలుసు కొన్నాము. కర్మచక్రములోని కర్మను గురించి తెలుసుకొన్నాము. కానీ కాలచక్రములో గ్రహములను గురించి తెలుసుకోవడములో కొంత మిగిలి ఉన్నది.

## 10 గ్రహములంటే ఏమిటి? అవి ఎన్ని గలవు?

ఇపుడు కొదువగా మిగిలియున్న కాలచక్రములోని గ్రహములను గురించి, వాటి పనిని గురించి, వాటి సంఖ్యను గురించి తెలుసుకొందాము. గ్రహము అనగా గ్రహించునదని అర్థము. నీరు ఉప్పును గ్రహించునట్లు, గాలి వాసనను గ్రహించునట్లు గ్రహము కర్మను గ్రహించును. గుణచక్రము లోని గుణము వలన జరిగిన కార్యములో, క్రొత్త కర్మ పుట్టుచున్నదని తెలుసుకొన్నాము. అలా పుట్టిన కర్మను కాలచక్రములోని గ్రహములు గ్రహించుకొని, కర్మచక్రమునందు నిలుచునట్లు చేయును. నిత్య జీవితములో కర్మను ఏ గ్రహము గ్రహించి కర్మచక్రములో నిలువయుంచుచున్నదో, అదే గ్రహము, అదే ప్రారబ్ధకర్మను సమయమొచ్చినపుడు జీవుని మీద ప్రసరింపజేయును. సృష్టికర్త అయిన దేవుని చేత తయారు చేయబడిన గ్రహములు, కాలచక్రములో ప్రతిష్ఠింపబడి అక్కడనుండి గుణచక్రములో తయారగు కర్మను గ్రహించి, కర్మచక్రములో నిలువ చేయుచున్నవి. అలా గుణములనుండి గ్రహములు గ్రహించు క్రొత్తకర్మను 'ఆగామికర్మ' అంటున్నాము. కర్మచక్రములో నుండి గ్రహించి జీవుని మీద వదలబడు కర్మను 'ప్రారబ్ధకర్మ' అంటున్నాము. జ్యోతిష్యమునకు ప్రారబ్ధకర్మ యొక్క విధి విధానము గలదు. గుణచక్రములో తయారగు క్రొత్తకర్మ 108 రకములు కాగా, గుణములు ముఖ్యమైనవి పండ్రెండు గలవు. కాలచక్రములోని 12 గ్రహములు, గుణచక్రములోని 12 గుణముల గుంపు నుండి గ్రహించిన కర్మను, కర్మచక్రములోనున్న 12 భాగములలో నిలువయుంచుచున్నవి. గుణచక్రములోని 12 గుణములు తయారు చేయు కర్మను, కర్మచక్రములో 12 భాగములలో నిలువ చేయు 12 గ్రహములు కాలచక్రములోని 12

భాగములలో గలవు. ఇక్కడ విచిత్రమేమంటే! ఇంతవరకు ఎవరికీ తెలియని గ్రహముల సంఖ్య మనకు తెలిసినది. కాలచక్రములోని 12 గ్రహములు అదే చక్రములోని 12 భాగములను తమ స్వంతస్థానములుగా ఏర్పరచుకొన్నవి.

గుణచక్రములోని రెండు వర్గముల గుణములనుబట్టి, పాపపుణ్య అను రెండు వర్గముల కర్మ తయారగుచున్నది. ఆ కర్మను కర్మచక్రములో రెండు వర్గములుగానే స్థాపించుటకు గ్రహములు కూడా రెండు వర్గములైనాయి. అలా ఏర్పడిన ఒక్కొక్క వర్గములో ఆరు గ్రహములుండగా, రెండు వర్గములలో 12 గ్రహములు గలవు. కష్టానికి వ్యతిరేఖమైనది సుఖము. అలాగే పాపమునకు వ్యతిరేఖమైనది పుణ్యము. వీటిని గ్రహించు గ్రహములు కూడా రెండువర్గములై, ఒకదానికి ఒకటి వ్యతిరేఖముగా ఉన్నవి. కర్మనుబట్టి రెండు వర్గములైన గ్రహములలో, ఒక్కొక్క వర్గమునకు ఒక్కొక్క గ్రహము ఆధిపత్యము (నాయకత్వము) వహించుచున్నవి. అలా ఏర్పడిన రెండు వర్గముల యొక్క అధిపతులు ఒకరు గురువు, మరొకరు శని. వీరిని బట్టి మిగతా గ్రహములను గురువర్గము (గురుపార్టీ) గ్రహములనీ, శనివర్గము (శని పార్టీ) గ్రహములనీ అనుచున్నాము. ఒక వర్గమునకు శని నాయకుడు కాగా, అతని ఆధీనములో మిగతా ఐదు గ్రహములుండును. అలాగే మరొక వర్గమునకు గురువు నాయకుడు కాగా, అతని ఆధీనములో మిగతా ఐదు గ్రహములుండును.



# 11 12 గ్రహములు ఏవి?

గుణములు 12 రకములు గలవు. 12 గుణములలో వచ్చు కర్మలు 12 రకములు గలవు. 12 గుణములలో పుట్టు 12 రకముల కర్మలను గ్రహించు గ్రహములు కూడా 12 గలవు. గ్రహములు నివశించు కాలచక్రము కూడా 12 భాగములుగా ఉన్నది. కర్మచక్రము కూడా 12 రకముల కర్మలు నిలువయుండుటకు 12 భాగములుగానే ఉన్నది. కాలచక్రములోని 12 భాగములలో స్వంత స్థానములను ఏర్పరచుకొన్న 12 గ్రహముల పేర్లు వరుసగా ఈ విధముగా కలవు. 1) రవి 2) చంద్రుడు 3) కుజుడు 4) బుధుడు 5) గురువు 6) శుక్రుడు 7) శని 8) రాహువు 9) కేతువు 10) భూమి 11) మిత్ర 12) చిత్ర. సూర్యకుటుంబములోని గ్రహములలో భూమి కూడా కలదు. కావున దానిని అందరూ ఒప్పుకొనుటకు అవకాశము గలదు. కానీ ఎవరూ ఇంతవరకు విననివి మరియు తెలియనివి అయిన మిత్ర, చిత్ర అను రెండు గ్రహములు కూడా కలవు. ఇంతవరకు ఖగోళశాస్త్ర పరిశోధకులకు కూడా ఈ రెండు గ్రహముల ఉనికి తెలియదు. ఖగోళ శాస్త్రపరిశోధకులు భవిష్యత్తులో ఈ రెండు గ్రహములను గూర్చి చెప్పవచ్చునేమో కానీ, ఇప్పటి వరకు వాటి వివరము ఏమాత్రము వారికి తెలియదు. ఈ రెండు గ్రహములను కనుగొనుట కొంత కష్టముతో కూడుకొన్న పనియేనని చెప్పవచ్చును. ఇక్కడ కొందరు మేథావులు మమ్ములను ఈ విధముగా ప్రశ్నించవచ్చును. ఇంతవరకు ఖగోళ శాస్త్రజ్ఞులకే తెలియని రెండు గ్రహముల వివరము మీకు ఏ పరిశోధన ద్వారా తెలిసినది? పైగా ఈ రెండు గ్రహములను కనుగొనుట కష్టముతో కూడుకొన్న పనియే అన్నారు. ఆ విషయమును మీరెలా చెప్పుచున్నారని అడుగవచ్చును. దానికి మా జవాబు ఈ విధముగా కలదు.

ఉన్న విద్యను శోధించి తెలుసుకొనుచున్నవాడు విద్యార్థి అవుతాడు. పూర్తి విద్యను నేర్చినవాడు విద్యావేత్త అవుతాడు. విద్యార్థిని, విద్యావేత్తయని అనలేము. అలాగే ఉన్న శాస్త్రమును శోధించి తెలుసుకొనువాడు శాస్త్ర పరిశోధకుడవుతాడు, శాస్త్రవేత్తగాడు! మరియు శాస్త్రజ్ఞుడూగాడు. మా దృష్టిలో ఖగోళశాస్త్రపరిశోధకులున్నారు గానీ, ఖగోళశాస్త్రజ్ఞులు లేరు. పూర్తి శాస్త్రమును తెలియనంతవరకు, ఎవరూ శాస్త్రజ్ఞులు కాలేరు. నేడు ఖగోళమును పరిశోధించు శోధకులున్నారు గానీ, పూర్తి తెలిసిన శాస్త్రవేత్తలు లేరు. అందువలన భవిష్యత్తులో ఇంతవరకు చెప్పని రెండు గ్రహముల వివరమును ఎవరైనా చెప్పవచ్చునేమో అన్నాము. మిత్ర, చిత్ర అను రెండు గ్రహములను కనుగొనుట కొంత కష్టముతో కూడుకొన్నపని అని కూడా అన్నాము. అలా అనుటకు కారణము ఏమనగా! మిత్ర గ్రహము చీకటితో కూడుకొన్నది. దాని మీదికి ఏ వెలుగూ ప్రసరించదు. ఏ వెలుగూ దాని మీద ప్రతిబింబించదు. ఏ రేడియేషన్ కిరణములు దానిని తాకలేవు. ఇకపోతే రెండవ గ్రహమైన 'చిత్రగ్రహము' అనేక రంగులు కలదై, 24 గంటలలో కొన్ని నిమిషములు మాత్రమే గోచరించును. మిగతా సమయములో అదృశ్యమై ఉండును. కొన్ని నిమిషములు మాత్రమే అగుపించు అదృశ్యగ్రహమును చిత్రగ్రహము అంటాము. కావున కనిపించని చిత్ర గ్రహమును గానీ, చీకటి గ్రహమైన మిత్ర గ్రహమునుగానీ కనుగొనుట కష్టమన్నాము. మీరు ఏ పరిశోధన ద్వారా చెప్పుచున్నారని నన్నడిగితే, నా జవాబు ఏమనగా! నా పరిశోధన ఏదైనా బయటగానీ, బయటి పరికరముల ద్వారాగానీ ఏమాత్రముండదు. నా శోధనయంతా శరీరాంతరములోనే ఉండును. శరీరములోని బ్రహ్మనాడిలో సమస్త విశ్వము ఇమిడియున్నది. శరీరాంతర బ్రహ్మనాడిలోనే షట్ శాస్త్రములు ఇమిడియున్నవి. సకల

విద్యలూ బ్రహ్మనాడియందే గలవు. ఉదాహరణకు బయట విద్యను నేర్వని చిన్న వయస్సువారు కూడా, ఎంతో విద్యా ప్రావీణ్యులుగా కనిపించు చున్నారు. వారియందే విద్య ఉన్నదానివలన, అది లోపలే ప్రాప్తించిన దానివలన, వారు ఆ విద్యలో ప్రావీణ్యులుగా కనిపించుచున్నారు.

బయట కనిపించు సమస్తము మన బ్రహ్మనాడియందు ఉండడమే కాక, ఈ సమస్తమును సృష్ఠించిన దేవుడు కూడా మనయందే ఉన్నాడు. మనిషి బయట ఎక్కడ వెదకినా దేవుడు కనిపించడు. బయట కనిపించని దేవుణ్ణి కూడా మనిషి తన శరీరము లోపలే తెలియవచ్చును, పొందవచ్చును. చివరికి మోక్షమును పొందవలసినది కూడా శరీరములోనే. ప్రకృతిని సృష్ఠించిన దేవుడే శరీరములో ఉంటే, మిగతా వాటిని గురించి బయట వెదకవలసిన పనిలేదు. పూర్వము మహర్షులు, బయటి పరిశోధన లేకుండగనే సూర్య,చంద్ర,నక్షత్ర గతులనూ, గ్రహణములనూ చెప్పగలిగారని మరువ కూడదు. నేటి శాస్త్రపరిశోధకులు చెప్పని విషయములను ముందే ఏ పరిశోధన లేకుండా చెప్పిన ఘనత ఇందూదేశ జ్ఞానులకు గలదు. గతములో మేము చెప్పిన **"జనన మరణ సిద్ధాంతము"** గానీ, **"ఆధ్యాత్మిక రహస్యములు"** గానీ అంతరంగ పరిశోధనలోనివేనని తెల్పుచున్నాము. ఆ పద్ధతి ప్రకారమే ఇప్పుడు చెప్పిన 12 గ్రహముల వివరమని తెలియవలెను. చీకటి గ్రహమైన మిత్ర గ్రహముగానీ, అదృశ్య రూపముగా నుండి, కొన్ని క్షణములు మాత్రము కనిపించు చిత్రగ్రహము గానీ ఇప్పటికీ క్రొత్తవే. అయినా వీటి పాత్ర జ్యోతిష్యములో చాలా ఉన్నది. వీటి పాత్రను వదలివేసిన నేటి జ్యోతిష్యములో శాస్త్రీయత లోపించినదనియే చెప్పవచ్చును. జ్యోతిష్యము శాస్త్రముగా నిరూపించబడాలంటే గ్రహముల సంఖ్య 12 గానే ఉండాలి.



# 12 కాలచక్రములో 12 గ్రహముల స్వంత స్థానములు ఏవి?

బ్రహ్మ, కాల, కర్మ, గుణచక్రముల సముదాయముల చట్రములో క్రింది నుండి మూడవ చక్రము కాలచక్రమని ముందే చెప్పుకొన్నాము. కాలచక్రము 12 భాగములుగా ఉన్నదని చెప్పుకొన్నాము. ఆ పండ్రెండు భాగముల పేర్లు 1) మేషము 2) వృషభము 3) మిథునము 4) కర్కాటకము 5) సింహము 6) కన్య 7) తుల 8) వృశ్చికము 9) ధనస్సు 10) మకరము 11) కుంభము 12) మీనము అని చెప్పుకొన్నాము. కాలచక్రములోని మేషాది 12 లగ్నములను క్రింది 13వ పటములో గుండ్రముగా మరియు చతురస్రాకారముగా చూడవచ్చును.

| | | | |
|---|---|---|---|
| మీనము | మేషం | వృషభం | మిథునం |
| కుంభము | **కాలచక్రము** | | కర్కాటకం |
| మకరము | | | సింహ |
| ధనస్సు | వృశ్చిక | తుల | కన్య |

కాలచక్రము - (a) 13 వ పటము




కాలచక్రము –(b)13వ పటము

ఇక్కడ కాలచక్రములోని మేషాది ద్వాదశ భాగములలో 12 గ్రహముల స్వంతస్థానములను క్రింది 14వ పటములో చూడవచ్చును.

| | | | |
|---|---|---|---|
| గురు మీనము | కుజ మేషం | మిత్ర వృషభం | చిత్ర మిథునం |
| శని కుంభము | **కాలచక్రము** | | చంద్ర కర్కాట |
| రాహు మకరము | | | రవి సింహ |
| కేతు ధనస్సు | భూమి వృశ్చిక | శుక్ర తుల | బుధ కన్య |

**కాలచక్రము - 14వ పటము.**

ముందు పేజీలోని చిత్రమును బట్టి పండ్రెండు గ్రహముల స్వంత స్థానములు క్రింద ఈ విధముగానున్నవి.

| | | | |
|---|---|---|---|
| 1) | కుజ గ్రహమునకు | - | మేష భాగము స్వంత ఇల్లు |
| 2) | మిత్ర గ్రహమునకు | - | వృషభ భాగము స్వంత ఇల్లు |
| 3) | చిత్ర గ్రహమునకు | - | మిథున భాగము స్వంత ఇల్లు |
| 4) | చంద్ర గ్రహమునకు | - | కర్కాటక భాగము స్వంత ఇల్లు |
| 5) | రవి (సూర్య) గ్రహమునకు | - | సింహ భాగము స్వంత ఇల్లు |
| 6) | బుధ గ్రహమునకు | - | కన్య భాగము స్వంత ఇల్లు |
| 7) | శుక్ర గ్రహమునకు | - | తులా భాగము స్వంత ఇల్లు |
| 8) | భూమి గ్రహమునకు | - | వృశ్చిక భాగము స్వంత ఇల్లు |
| 9) | కేతు గ్రహమునకు | - | ధనస్సు భాగము స్వంత ఇల్లు |
| 10) | రాహు గ్రహమునకు | - | మకర భాగము స్వంత ఇల్లు |
| 11) | శని గ్రహమునకు | - | కుంభ భాగము స్వంత ఇల్లు |
| 12) | గురు గ్రహమునకు | - | మీన భాగము స్వంత ఇల్లు |

మనలో కొందరికి స్వంత ఇల్లు ఉండిన, ఉద్యోగరీత్యా స్వంత ఇల్లు విడచి, వేరు ఊరిలో ఇతరుల ఇళ్ళలో కొంత కాలము కాపురముండునట్లు, గ్రహములు కూడా వాటి కర్తవ్య నిర్వహణలో తమస్వంత స్థానములను విడిచి, ఇతర గ్రహముల స్వంత ఇళ్ళలో కొంత కాలము ఉండవలసిన పనియుండును. అందువలన శాశ్వితముగా గ్రహములు వాటి స్వంత ఇళ్ళలో ఉండవు.

## 13 కాలచక్రములో మిత్రు, శత్రు గ్రహములు ఏవి?

జ్యోతిష్యము ఆధ్యాత్మికముతో ముడిపడియున్నదని ముందే చెప్పు కొన్నాము. ఆధ్యాత్మికము ప్రకారము పరమాత్మ మూడు ఆత్మలుగా విభజింప బడినది. ఆ మూడు ఆత్మలనే భగవద్గీతయందు పురుషోత్తమప్రాప్తి యోగమున క్షరుడు, అక్షరుడు, పురుషోత్తముడని చెప్పారు. క్షరుడు అనగా ప్రకృతిలో కలిసిన ఆత్మ కావున అది నాశనమగునదని అర్థము. అక్షరుడు అనగా నాశనము కానివాడని అర్థము. పురుషోత్తముడనగా క్షరునికంటేను అక్షరునికంటేను ఉత్తమమైనవాడని అర్థము. ఈ మూడు ఆత్మలనే అద్వైతము, ద్వైతముకాని త్రైతము అంటున్నాము. ఈ త్రైతమును రెండు భాగములుగా విభజించవచ్చును. కర్మవున్న ఆత్మలు, కర్మలేని ఆత్మలు అని విభజించి చూస్తే, కర్మవున్న ఆత్మ క్షరుడు అనబడు జీవాత్మ అని తెలియుచున్నది. కర్మలేనివి రెండు ఆత్మలు గలవు. అవి అక్షరుడు అనబడు ఆత్మ, పురుషోత్తముడనబడు పరమాత్మ అని తెలియుచున్నది. ఈ రెండు భాగములలో కర్మలేని అక్షర, పురషోత్తమ ఆత్మలు గొప్పవనీ, కర్మతో కూడుకొన్న క్షరాత్మ తక్కువదనీ తెలియుచున్నది. మూడు ఆత్మలలో గొప్పవి, తగ్గువి అని తెలియునట్లు 2:1 గా చెప్పకోవచ్చును. కర్మ విధానమును అనుసరించి వాటినే సరి, బేసి అంటాము. 2:1 అనినా, సరి బేసి అనినా, కర్మలేని పరమాత్మ ఆత్మలు రెండు అనియూ, కర్మయున్న జీవాత్మ ఒకటి అనియూ అర్థము. ప్రతి జీవరాసి శరీరములోను 2:1 ఉన్నదనీ మరియు సరి బేసి కలదనీ చెప్పవచ్చును. దైవమునకు జీవునకు గుర్తుగా 2:1 అని సరి బేసి అనవచ్చును. ఈ సరి బేసి జ్యోతిష్యములోనూ ఉపయోగ పడుచున్నది. అదెలా ఉపయోగపడుచున్నదనగా!

కాలచక్రములోని 12 భాగములలో 2:1 ప్రకారము, అనగా ఒక సరి సంఖ్య, ఒక బేసిసంఖ్య భాగములను తీసుకొని ఆ రెండు భాగములు ఏ గ్రహములకు స్వంత స్థానములో చూచుకోవలెను. ఈ సరి బేసి సూత్రము ప్రకారము, కాలచక్రములోని పండ్రెండు భాగములను విభజించి చూచితే, సరి బేసి రెండు భాగముల ప్రకారము మొత్తము ఆరు సరి, బేసి భాగములు వచ్చును. మొదట సరి, బేసి భాగములు రెండు ఒక పక్షములో పెట్టి, రెండవ సరి, బేసి భాగములను మరొక పక్షములో పెట్టి, అన్ని భాగములను చూచితే మొత్తము ఆరు గ్రహములు ఒక పక్షముకాగా, మిగతా ఆరు గ్రహములు మరొక పక్షమగుచున్నవి. ఈ రెండు పక్షములను మిత్రు శత్రు పక్షములు అంటున్నాము. 2:1 అను ఆత్మల నిష్పత్తి ప్రకారము కాలచక్రములో పండ్రెండు భాగములను విభజించి చూచితే, గ్రహముల రెండు వర్గములు తెలియును. ఈ విధానమును తర్వాత పేజీలో 15వ పటములో చూడుము.

15వ పటములో ఒక సరి, ఒక బేసి ఇళ్ళను తీసుకొని, విభజించడము జరిగినది. దాని ప్రకారము, కాలచక్రములో ఎక్కడ నుండి మొదలు పెట్టినా సరి బేసి సూత్రము మీదనే విభజించాలి. దాని ప్రకారము మొదటి 12వ మీన భాగమును 1వ మేష భాగమును తీసుకొని అందులోని రెండు గ్రహములను ఒక పక్షములో చేర్చి, తర్వాత 2వ వృషభ భాగమును 3వ మిథున భాగమును తీసుకొని, అందులోని రెండు గ్రహములను రెండవ ప్రతి పక్షములో చేర్చాలి. అలా చేస్తే 12వ మీన, 1వ మేష స్థానముల అధిపతులైన గురు, కుజులు ఒక పక్షముకాగా తర్వాత 2, 3 స్థానాధిపతులైన చిత్ర, మిత్ర గ్రహములు ప్రతి పక్షమైన శత్రుపక్షములో చేరి పోవుచున్నవి. అదే విధముగా 4, 5 స్థానాధిపతులైన చంద్ర, సూర్యులు, గురు కుజులు

| | | | |
|---|---|---|---|
| 12<br>మీనము<br>గురు | 1<br>మేషం<br>కుజ | 2<br>వృషభం<br>మిత్ర | 3<br>మిథునం<br>చిత్ర |
| 11<br>కుంభము<br>శని | **కాలచక్రము** | | 4<br>కర్కట<br>చంద్ర |
| 10<br>మకరము<br>రాహు | | | 5<br>సింహ<br>రవి |
| 9<br>ధనస్సు<br>కేతు | 8<br>వృశ్చిక<br>భూమి | 7<br>తుల<br>శుక్ర | 6<br>కన్య<br>బుధ |

**కాలచక్రము - 15వ పటము.**

గల మొదటి పక్షములోనికి చేరుచున్నారు. 6, 7 స్థానాధిపతులైన బుధ, శుక్రులు రెండవ ప్రతిపక్షములో చేరుచున్నారు. ఇక 8, 9 స్థానములను చూచితే ఆ స్థానాధిపతులైన భూమి, కేతువు, గురు, కుజ, చంద్ర, రవి గ్రహముల పక్షమున చేరిపోవుచున్నారు. 10, 11స్థానముల అధిపతులైన రాహు, శని గ్రహములు; మిత్ర, చిత్ర, బుధ, శుక్రగ్రహముల పక్షములో చేరిపోవుచున్నారు. ఈ విధముగా 2:1 లేక సరి, బేసి అను సూత్రము ప్రకారము '12' గ్రహములలో ఆరు గ్రహములు శాశ్వితముగా ఒక పక్షములో ఉండగా, మిగతా ఆరు గ్రహములు శాశ్వితముగా ప్రతి పక్షములో ఉండును.

| పక్షము | | | ప్రతి పక్షము | | |
|---|---|---|---|---|---|
| **స్థానములు** | **గ్రహములు** | - | **స్థానములు** | | **గ్రహములు** |
| 12,1 | గురు,కుజ | - | 2,3 | - | మిత్ర,చిత్ర |
| 4,5 | చంద్ర, రవి | - | 6,7 | - | బుధ, శుక్ర |
| 8,9 | భూమి కేతు | - | 10,11 | - | రాహు, శని |

ఈ విధముగా రెండు వర్గములుగా 2:1 సూత్రము ప్రకారము విభజింపబడిన గ్రహములలో, ఒక వర్గమునకు గురువు, మరొక వర్గమునకు శని నాయకులుగ నియమింపబడినారు. అందువలన నాయక గ్రహములను బట్టి, ఒక వర్గమును గురువర్గమనీ, మరొక వర్గమును శనివర్గమనీ అంటున్నారు. వీటినే నేడు గురుపార్టీ, శనిపార్టీ గ్రహములని కూడా అంటున్నారు.

| **గురువర్గము** | **శనివర్గము** |
|---|---|
| 1) గురు గ్రహము | 1) శని గ్రహము |
| 2) రవి గ్రహము | 2) మిత్ర గ్రహము |
| 3) చంద్ర గ్రహము | 3) చిత్ర గ్రహము |
| 4) కుజ గ్రహము | 4) బుధ గ్రహము |
| 5) కేతు గ్రహము | 5) శుక్ర గ్రహము |
| 6) భూమి గ్రహము | 6) రాహు గ్రహము |

ఈ గ్రహములు శాశ్వితముగా రెండు వర్గములుగా చేయబడినవి. ఒక వర్గములోని గ్రహములు, మరొక వర్గములోనికి ఎప్పటికీ మారవు.

## 14 మేషలగ్నమునకు మిత్రు, శత్రు గ్రహములు ఏవి?

కాలచక్రములో పండ్రెండు భాగములలో మొదటిది మేషభాగము అంటాము. మొదటిది కావున అది బేసి సంఖ్యలో చేరిపోవుచున్నది. అది బేసిసంఖ్య కావున దానికంటే ముందున్న 12 అను సరిసంఖ్యను తీసుకోవలసి యుండును. ఎందుకనగా 2:1 అను సూత్రము ప్రకారము, ముందు సరి సంఖ్యతోనే గ్రహాల మిత్రు, శత్రువులను విభజించవలసి ఉండును. అందువలన మేషలగ్నమునకు మొదటి సరిసంఖ్యయైన మీనలగ్నమును తీసుకొని చూడవలెను. అపుడు మీన, మేష రెండులగ్నములు ఒక వర్గములో చేరిపోవును. అలా మొదట వచ్చిన రెండు లగ్నముల అధిపతులైన గ్రహములు ఒక పక్షముకాగా, తర్వాత గల వృషభ, మిథునముల అధిపతులైన రెండు గ్రహములు మరొక వ్యతిరేఖ పక్షములో చేరి పోవుచున్నవి. ఆ తర్వాత వచ్చు సరి బేసి సంఖ్య లగ్నముల అధిపతి గ్రహములు చంద్రుడు, సూర్యుడు ఇద్దరూ ఒక పక్షములోని గ్రహములవు చున్నవి. తర్వాతనున్న బుధ, శుక్ర గ్రహములు ప్రతిపక్షమగుచున్నవి. ఈ విధానము ముందు చిత్రించుకొనిన 16వ లగ్న పటములో చూచెదము.

మనిషిగానీ లేక ఏ జీవరాసిగానీ పుట్టినపుడు గుర్తించబడునది లగ్నము. మనిషి శిశువుగా పుట్టిన సమయములో కాలచక్రములోని సూర్యుడు కర్మచక్రము మీద ఎన్నో భాగములో ఎదురుగా నిలిచి ఉన్నాడో ఆ భాగము

| | | | |
|---|---|---|---|
| గురు<br>మీనము<br>√ | కుజ<br>మేషం<br>√ | X<br>వృషభం<br>మిత్ర | X<br>మిథునం<br>చిత్ర |
| X<br>కుంభము<br>శని | **మేష లగ్నము**<br>**మీన లగ్నము**<br>**కాలచక్రము** | | చంద్ర<br>కర్కాట<br>√ |
| X<br>మకరము<br>రాహు | | | సూర్య<br>సింహ<br>√ |
| కేతు<br>ధనస్సు<br>√ | భూమి<br>వృశ్చిక<br>√ | X<br>తుల<br>శుక్ర | X<br>కన్య<br>బుధ |

**కాలచక్రము - 16వ పటము.**

యొక్క ఆ సంఖ్యను లగ్నముగా గుర్తించుకొని, పైన పటములో గల కాలచక్రములోని ద్వాదశ గ్రహములు ఎక్కడెక్కడ గలవో అక్కడనే గుర్తించుకొని చూడడమును పూర్వము 'జాఫతకము' అనెడివారు. దానినే ఈ కాలములో 'జాతకము' లేక 'జన్మలగ్నము' అంటున్నాము. ఆ రకముగా గుర్తించినపుడు జన్మలగ్నము మేష భాగము అయితే దానిని మేషలగ్నము అంటున్నాము. మేష లగ్నమునకు 2:1 ప్రకారము శాశ్వితముగా (12) ద్వాదశ స్థానాధిపతి గురువు, (1) ప్రథమ స్థానాధిపతి యగు కుజుడు మరియు (4) చతుర్థ స్థానాధిపతియు (5) పంచమ స్థానాధిపతియగు చంద్ర, సూర్యులు, అలాగే (8) అష్టమ, (9) నవమ స్థానాధిపతులగు భూమి, కేతువులు మిత్రులగుదురు. శాశ్వితముగా మేషలగ్నమునకు గురు, కుజ, చంద్ర, సూర్య, భూమి, కేతువను ఆరు గ్రహములు మిత్రుగ్రహములని చెప్పవచ్చును.

త్రైతసిద్ధాంతములోని మూడు ఆత్మలను కర్మలేనివి, కర్మవున్నవి అనియూ, కార్యము చేయునవి కార్యము చేయనివి అనియూ రెండుగా విభజించి, దాని ప్రకారము 2:1 అను సూత్రమును అనుసరించి మిత్రు శత్రుగ్రహములను కనుగొన్నాము. మొదటి సరి బేసి గ్రహములు మిత్ర గ్రహములుకాగా, రెండవ సరి బేసి గ్రహములు శత్రుగ్రహములగునని కూడా చెప్పుకొన్నాము. దానిప్రకారము మేషలగ్నమునకు ద్వితీయ, తృతీయ స్థానాధిపతులైన మిత్ర, చిత్ర గ్రహములు, అలాగే షట్, సప్తమ స్థానాధిపతులైన బుధ, శుక్రులు మరియు దశమ, ఏకాదశ స్థానాధిపతులైన రాహువు, శని గ్రహములు ప్రతిపక్షగ్రహములగుచున్నారు. దీనిని బట్టి మేషలగ్నమునకు మిత్ర, చిత్ర, బుధ, శుక్ర, రాహు, శని ఆరుగ్రహములు శాశ్వితముగా శత్రు గ్రహములగుచున్నారు.

| √ | X |
|---|---|
| **మిత్రులు** | **శత్రువులు** |
| గురుగ్రహము | మిత్రగ్రహము |
| కుజగ్రహము | చిత్రగ్రహము |
| చంద్రగ్రహము | బుధగ్రహము |
| సూర్యగ్రహము | శుక్రగ్రహము |
| భూమిగ్రహము | రాహుగ్రహము |
| కేతుగ్రహము | శనిగ్రహము |

మేషలగ్నమునకు ఎవరు మిత్రుగ్రహములగుచున్నారో, వారే మీన లగ్నమునకు కూడా మిత్రులగుదురు. అట్లే ఎవరు మేషమునకు శత్రు గ్రహములుగా పేరుగాంచియున్నారో, వారే మీనలగ్నమునకు కూడా శత్రువులగుచున్నారు. కాలచక్రములో చివరిదైన మీనము, మొదటిదైన మేషమును మొదట ఒక వర్గముగా గుర్తించుకొనవలెనని చెప్పుచున్నాము. ఈ విషయము జ్ఞప్తి యుండుటకు, ఎవడైనా బాగా ఆలోచించువానిని "మీన మేషములను లెక్కించువాడు" అని సామెతగా అంటుంటారు. బాగా యోచించువానిని మీన మేషాలను లెక్కించువాడని అంటున్నారంటే జ్యోతిష్యములో మీన మేషముల నుండి గ్రహములను లెక్కించవలెనని అర్థము. అదే విధముగా వృషభ మిథునములను ఈ క్రింద 17వ పటములో చూచెదము.

| | | | |
|---|---|---|---|
| X<br>మీనము<br>గురు | X<br>మేషం<br>కుజ | మిత్ర<br>వృషభం<br>√ | చిత్ర<br>మిథునం<br>√ |
| శని<br>కుంభము<br>√ | **వృషభ లగ్నము** | **మిథున లగ్నము** | X<br>కర్కాట<br>చంద్ర |
| రాహు<br>మకరము<br>√ | **సూత్రము 2 : 1** | | X<br>సింహ<br>సూర్య |
| X<br>ధనస్సు<br>కేతు | X<br>వృశ్చిక<br>భూమి | శుక్ర<br>తుల<br>√ | బుధ<br>కన్య<br>√ |

**కాలచక్రము - 17వ పటము.**

# 15 వృషభము

వృషభలగ్నమునకు ఆ స్థానాధిపతియైన మిత్ర, మిథున లగ్న స్థానాధిపతియైన చిత్రగ్రహములు రెండు; అలాగే కన్య,తుల స్థానాధిపతులైన బుధ,శుక్రులు; మకర, కుంభ స్థానాధిపతులైన రాహు, శని అను ఆరు గ్రహములు మిత్ర గ్రహములుకాగా, చంద్ర, సూర్య, భూమి, కేతు,గురు, కుజులు అను ఆరు గ్రహములు శత్రుగ్రహములగుచున్నారు. వృషభ లగ్నమునకు ఎవరు మిత్రులగుదురో మిథునలగ్నముకు కూడా వారే మిత్రులగుదురు. అలాగే వృషభ లగ్నమునకు శత్రువులైన వారే మిథున లగ్నమునకు కూడా శత్రువులగుదురు. వీరు ఈ రెండు లగ్నములకు శాశ్వితముగా మిత్రు, శత్రువులుగ ఉందురని తెలియవలెను. వృషభ, మిథున లగ్నములకు శాశ్వితముగ మిత్రు, శత్రు గ్రహములు క్రింది విధముగ గలవు.

| √ **మిత్రులు** | X **శత్రువులు** |
|---|---|
| 1) మిత్ర గ్రహము | 1) చంద్ర గ్రహము |
| 2) చిత్ర గ్రహము | 2) సూర్య గ్రహము |
| 3) బుధ గ్రహము | 3) భూ గ్రహము |
| 4) శుక్ర గ్రహము | 4) కేతు గ్రహము |
| 5) రాహు గ్రహము | 5) గురు గ్రహము |
| 6) శని గ్రహము | 6) కుజ గ్రహము |

# 16 కర్కాటకము

ఇపుడు కర్కాటక, సింహలగ్నములకు మిత్ర, శత్రు గ్రహములను క్రిందగల 18వ పటములో చూచెదము.

కర్కాటక లగ్నమునకు, అదే స్థానాధిపతియైన చంద్రుడూ, సింహ లగ్నాధిపతియైన రవి (సూర్యుడు) మరియు వృశ్చిక లగ్నాధిపతియైన భూమి, ప్రక్కనేయున్న ధనస్సు లగ్నాధిపతియైన కేతువూ, మీనలగ్నాధిపతి యైన గురువూ, మేషలగ్నాధిపతియైన కుజ గ్రహములు మొత్తము ఆరు మిత్రు గ్రహములుకాగా, మిగతా మిత్ర, చిత్ర, బుధ, శుక్ర, రాహు, శని గ్రహములు ఆరు శత్రుగ్రహములగుచున్నవి. కర్కాటకలగ్నమునకు ఎవరు మిత్రులు, ఎవరు శత్రువులగుచున్నారో వారే ప్రక్కనున్న సింహలగ్నమునకు కూడా శాశ్వితముగా మిత్రు, శత్రువులుగా ఉన్నారు.

| | | | |
|---|---|---|---|
| గురు √ | కుజ √ | X మిత్ర | X చిత్ర |
| X శని | **కర్కాటక లగ్నము సింహ లగ్నము సూత్రము 2 : 1** | | చంద్ర √ |
| X రాహు | | | రవి √ |
| కేతు √ | భూమి √ | X శుక్ర | X బుధ |

**కాలచక్రము - 18వ పటము.**

కర్కాటక, సింహలగ్నములకు శాశ్వితముగా శత్రు మిత్రులుగానున్న గ్రహములు క్రింది విధముగాగలవు.

| √ | X |
|---|---|
| **మిత్రులు (శుభులు)** | **శత్రువులు (అశుభులు)** |
| 1) చంద్ర గ్రహము | 1) బుధ గ్రహము |
| 2) సూర్య (రవి) గ్రహము | 2) శుక్ర గ్రహము |
| 3) భూ గ్రహము | 3) రాహు గ్రహము |
| 4) కేతు గ్రహము | 4) శని గ్రహము |
| 5) గురు గ్రహము | 5) మిత్ర గ్రహము |
| 6) కుజ గ్రహము | 6) చిత్ర గ్రహము |

## 17 కన్య

ఇపుడు కన్యాలగ్నమునకు ఎవరు మిత్రుగ్రహములో, ఎవరు శత్రు గ్రహములో తర్వాత పేజీలోనున్న 19వ పటములో చిత్రీకరించుకొన్నాము.

కన్యాలగ్నమునకు అదే లగ్నాధిపతిమైన బుధుడు, ప్రక్కనున్న తులా లగ్నాధిపతియైన శుక్రుడు మరియు మకర లగ్నాధిపతియైన రాహువు, కుంభ లగ్నాధిపతియైన శని, వృషభ లగ్నాధిపతియైన మిత్ర, మిథున లగ్నాధిపతియైన చిత్ర గ్రహములు ఆరు, శాశ్వితముగా మిత్రులుకాగా మిగతా చంద్ర, సూర్య, భూమి, కేతువు, గురు, కుజ గ్రహములు ఆరు

| | | | |
|---|---|---|---|
| X<br>గురు | X<br>కుజ | మిత్ర<br>√ | చిత్ర<br>√ |
| శని<br>√ | కన్యా లగ్నము<br>తులా లగ్నము<br>సూత్రము 2 : 1 | | X<br>చంద్ర |
| రాహు<br>√ | | | X<br>రవి |
| X<br>కేతు | X<br>భూమి | శుక్ర<br>√ | బుధ<br>√ |

**కాలచక్రము - 19వ పటము.**

శాశ్వితముగా శత్రువులైనారు. అదే విధముగా కన్యా లగ్నమునకు ఎవరైతే శత్రు, మిత్రులుగా ఉన్నారో వారే శాశ్విత శత్రు మిత్రులుగా ఉందురు.

కన్య, తులా లగ్నములకు శాశ్విత శత్రు, మిత్రు గ్రహములు క్రింద వరుసగా వ్రాయబడినవి.

| √ | X |
|---|---|
| **మిత్రులు (శుభులు)** | **శత్రులు (అశుభులు)** |
| 1) బుధ గ్రహము | 1) భూ గ్రహము |
| 2) శుక్ర గ్రహము | 2) కేతు గ్రహము |
| 3) రాహు గ్రహము | 3) గురు గ్రహము |

4) శని గ్రహము 4) కుజ గ్రహము

5) మిత్ర గ్రహము 5) చంద్ర గ్రహము

6) చిత్ర గ్రహము 6) సూర్య గ్రహము

రెండు వర్గములుగా విభజించబడిన గ్రహములు, ఒక వర్గమునకు మరొక వర్గము శత్రువులుగా ఉన్నవని చెప్పుకొన్నాము. మిత్రులుగానున్న గ్రహములను శుభులని అంటున్నాము. అంతేకాక మిత్రగ్రహములు పుణ్యమును పాలించునవి కావున, వాటిని పుణ్యులు అని అంటున్నాము. వారు పుణ్యులు కావున శుభులని చెప్పడము జరిగినది. అదే విధముగా శత్రు గ్రహములు మానవుని పాపమును పాలించునవి కావున, ఆ జీవునికి అవి పాపులనీ మరియు అశుభులనీ అనడము జరుగుచున్నది. రెండు వర్గములకు గురువర్గము, శనివర్గము అని నామకరణము చేయడము జరిగినది. రెండు వర్గములవారు ఒకరికొకరు శత్రువులైనా, పుట్టిన జీవునికి ఒక వర్గము మిత్రులు, ఒక వర్గము శత్రువులుగా వ్యవహరించుచున్నవి.

## 18 వృశ్చికము

ఇపుడు వృశ్చికలగ్నమునకు ఎవరు మిత్రులో ఎవరు శత్రువులో తర్వాత పేజీలోనున్న 20వ పటములో చూచెదము.

వృశ్చికలగ్నమునకు అదే లగ్నాధిపతియైన భూమి, ప్రక్కనేయున్న ధనుర్ లగ్నాధిపతియైన కేతువు మరియు మీన లగ్నాధిపతియైన గురువు, మేష లగ్నాధిపతియైన కుజుడు, కర్కాటక లగ్నాధిపతియైన చంద్రుడు, సింహ లగ్నాధిపతియైన సూర్యుడు మొత్తము ఆరు గ్రహములు మిత్ర

| | | | |
|---|---|---|---|
| గురు √ | కుజ √ | X మిత్ర | X చిత్ర |
| X శని | **వృశ్చిక లగ్నము ధనస్సు లగ్నము సూత్రము 2 : 1** | | చంద్ర √ |
| X రాహు | | | రవి √ |
| కేతు √ | భూమి √ | X శుక్ర | X బుధ |

**కాలచక్రము - 20వ పటము.**

గ్రహములగుచున్నవి. సూత్రము ప్రకారము మిగిలిన మకర లగ్నాధిపతియైన రాహువు, కుంభ లగ్నాధిపతియైన శని, వృషభ లగ్నాధిపతియైన మిత్ర, మిథున లగ్నాధిపతియైన చిత్ర మొత్తము ఆరు గ్రహములు శత్రుపక్షమున చేరిపోయినవి. వృశ్చిక లగ్నమునకు శాశ్వితముగా మిత్ర గ్రహములు ఆరు, శత్రు గ్రహములు ఆరు, పాపపుణ్యములను పరిపాలించుచుందురు. వీరు, సూత్రము ప్రకారము పుణ్య పాపములను పరిపాలించుచూ శుభులు, అశుభులని పేరుగాంచియున్నారు. వీరు తమ కర్తవ్యములను వదలి శత్రువులు మిత్రులుగా మారిపోవడముగానీ, మిత్రులు శత్రువులుగా మారడముగానీ జరుగదు. వృశ్చిక లగ్నమునకు ఎవరు శత్రువులో, ఎవరు మిత్రులో వారే ధనుర్ లగ్నమునకు కూడా శత్రు మిత్రులుగా ఉన్నారని తెలియవలెను.

వృశ్చిక, ధనుస్సు లగ్నములకు శాశ్వితముగా మిత్రు శత్రు వర్గములుగానున్న గ్రహములను వరుసగా క్రింద చూడవచ్చును.

| √ | X |
|---|---|
| **మిత్రులు (శుభులు)** | **శత్రులు (అశుభులు)** |
| 1) భూ గ్రహము | 1) రాహు గ్రహము |
| 2) కేతు గ్రహము | 2) శని గ్రహము |
| 3) గురు గ్రహము | 3) మిత్ర గ్రహము |
| 4) కుజ గ్రహము | 4) చిత్ర గ్రహము |
| 5) చంద్ర గ్రహము | 5) బుధ గ్రహము |
| 6) సూర్య గ్రహము | 6) శుక్ర గ్రహము |

పండ్రెండు గ్రహములు ఆరుకు ఆరు మిత్రు, శత్రువులుగా ఉండడమే కాక వీరిలో ప్రత్యేకముగా ఒక గ్రహమునకు ఒక గ్రహము బద్ధశత్రుత్వము కల్గియున్నది. ఆ విషయమును తర్వాత తెలిపెదము.

## 19 మకరము

ఇపుడు మకర లగ్నమునకు ఎవరు మిత్రులో, ఎవరు శత్రువులో తర్వాత పేజీలోని 21వ పటములో చూచెదము.

మకర లగ్నమునకు అదే లగ్నాధిపతియైన రాహువు, ప్రక్కనేగల కుంభ లగ్నాధిపతియైన శని మిత్రులు కాగా, మరియు వృషభ లగ్నాధిపతియైన మిత్రగ్రహము, మిథున లగ్నాధిపతియైన చిత్రగ్రహము, కన్యా లగ్నాధిపతి యైన బుధ గ్రహము, తులా లగ్నాధిపతియైన శుక్రగ్రహము మొత్తము

| | | | |
|---|---|---|---|
| X<br>గురు | X<br>కుజ | మిత్ర<br>√ | చిత్ర<br>√ |
| శని<br>√ | **మకర లగ్నము**<br>**కుంభ లగ్నము**<br>**సూత్రము 2 : 1** | | X<br>చంద్ర |
| రాహు<br>√ | | | X<br>రవి |
| X<br>కేతు | X<br>భూమి | శుక్ర<br>√ | బుధ<br>√ |

**కాలచక్రము – 21వ పటము.**

ఆరు గ్రహములు శాశ్వితముగా మిత్రులుగా ఉన్నారు. ఇక మిగిలిన మీన లగ్నాధిపతియైన గురువు, మేష లగ్నాధిపతియైన కుజుడు, కర్కాటక లగ్నాధిపతియైన చంద్రుడు, సింహ లగ్నాధిపతియైన సూర్యుడు, వృశ్చిక లగ్నాధిపతియైన భూమి, ధనుర్ లగ్నాధిపతియైన కేతువు అను ఆరు గ్రహములు మకరమునకు శాశ్విత శత్రుగ్రహములుగా వ్యవహరించు చున్నవి. అలాగే ప్రక్కనేయున్న కుంభ లగ్నమునకు కూడా మకరమునకు మిత్రు శత్రువులుగా ఉన్నవారే శాశ్వితముగా మిత్రు, శత్రువులుగా ఉన్నారని తెలుపుచున్నాము.

మకర, కుంభ లగ్నములకు శాశ్వితముగా మిత్రు, శత్రువులుగానున్న గ్రహములను క్రింద వరుసగా చూడచ్చును.

| √ | X |
|---|---|
| **మిత్రులు (శుభులు)** | **శత్రువులు (అశుభులు)** |
| 1) రాహు గ్రహము | 1) గురు గ్రహము |
| 2) శని గ్రహము | 2) కుజ గ్రహము |
| 3) మిత్ర గ్రహము | 3) చంద్ర గ్రహము |
| 4) చిత్ర గ్రహము | 4) సూర్య గ్రహము |
| 5) బుధ గ్రహము | 5) భూ గ్రహము |
| 6) శుక్ర గ్రహము | 6) కేతు గ్రహము |

ఇంతవరకు కాలచక్రములోని ఆరు లగ్నములను చిత్రించి, ఎవరు శత్రు గ్రహములో ఎవరు మిత్రు గ్రహములో చూపించాము. దాని ప్రకారమే ప్రక్కనగల అదే వర్గ ఆరు లగ్నములకు చిత్రించకనే వివరించి తెలిపాము. దానివలన మొత్తము పండ్రెండు లగ్నములకు శాశ్వితముగా మిత్ర, శత్రువులుగానున్న గ్రహములను తెలియజేయడమైనది.



# 20 ఒక గ్రహమునకు బద్ధశత్రువుగా మరొక గ్రహమున్నదా?

కాలచక్రములోని గ్రహములు మొత్తము పండ్రెండుగలవని తెలుసుకొన్నాము. అందులో ఆరు ఒక గుంపుకాగా, ఆరు మరొక గుంపుగా ఉన్నవని తెలుసుకొన్నాము. ఇక్కడ మరొక సూత్రము ఏర్పడుచున్నది. ఆరు గ్రహములు మిత్రులైతే తర్వాత ఏడవ గ్రహమునుండే శత్రు గ్రహములు కలవు. అందువలన ఒక గ్రహమునుండి ఏడవ గ్రహము ఏదైతే, అది బద్ధ శత్రువు అని తెలియుచున్నది. ఇంకా వివరముగా చెప్పుకుంటే, ఒకటవ స్థానాధిపతికి ఏడవ స్థానాధిపతి తీక్షణమైన శత్రువని తెలియుచున్నది. దీనినే జ్యోతిష్యశాస్త్రములో ఒక సూత్రముగా తీసుకొని, ఒకటికి బద్ధ శత్రువు ఏడు అని తేల్చుకొన్నాము. ఒకటికి × ఏడుకి అను సూత్రము ప్రకారము ఏ గ్రహమునకు ఏ గ్రహము బద్ధ శత్రువో తెలుసుకొందాము.

| | | | |
|---|---|---|---|
| గురు 6 | 1 కుజుడు 7 | 2 మిత్ర | 3 చిత్ర |
| శని 5 | **సూత్రము 1×7 మేషము** | | 4 చంద్ర |
| రాహువు 4 | | | 5 సూర్యుడు |
| కేతు 3 | భూమి 2 | 7 శుక్రుడు 1 | 6 బుధ |

**చతురస్రాకారములోనున్న కాలచక్రము - 22వ పటము.**

ఇక్కడ మేషలగ్నాధిపతియైన కుజ గ్రహమునకు, ఏడవస్థానమైన తులా లగ్నాధిపతి శుక్రగ్రహము పూర్తి బద్ధశత్రువుగా వ్యవహరిస్తున్నది. అలాగే శుక్రగ్రహమునకు ఏడవస్థానములో కుజగ్రహమే అధిపతిగా ఉండుటవలన, సూత్రము ప్రకారము శుక్రునకు కుజుడు కూడా బద్ధశత్రువే నని తెలియుచున్నది. పైనుంచి క్రిందికి చూచినా, క్రిందినుండి పైకి చూచినా ఎటుచూచినా, సూత్రబద్ధముగా కుజునకు బద్ధశత్రువు శుక్రుడు, శుక్రునకు బద్ధశత్రువు కుజుడుగా తెలియుచున్నది. ఒక వర్గములోని ఆరు గ్రహములు మరొక వర్గములోని ఆరు గ్రహములకు శత్రువులైనప్పటికీ, అందులో ఒక పేరుగల గ్రహమునకు, మరొక పేరుగల గ్రహము ప్రత్యేకించి పెద్ద శత్రువుగా ఉన్నదని తెలియుచున్నది. అందులో విచిత్రమేమంటే 1×7 అను సూత్రము ప్రకారము ఒకవైపునుండి ఒక గ్రహమునకు మరొక గ్రహము బద్ధశత్రువైతే, మరొకవైపునుండి శత్రువైన ఏడవగ్రహమునకు మొదటి గ్రహమే తిరిగి బద్ధశత్రువగుచున్నది. పండ్రెండు గ్రహములలో శత్రు మిత్రులను విడదీయుటకు 2:1 సూత్రము ఉపయోగపడితే, ఎవరు ఎవరికి బద్ధశత్రువు అని తెలియుటకు 1×7 అను సూత్రమును ఉపయోగించి చూడాలి.

ఇపుడు వృషభ లగ్నమునకు అధిపతియైన మిత్ర గ్రహమునకు 1×7 అను సూత్రము ప్రకారము బద్ధ శత్రువుగానున్న గ్రహమేదో తర్వాత పేజీలోగల 23వ పటములో తెలుసుకొందాము.

ఇక్కడ వృషభ లగ్నాధిపతియైన మిత్ర గ్రహమునకు బద్ధశత్రువు భూమి అని తెలియుచున్నది. అలాగే భూమికి బద్ధశత్రువు మిత్రగ్రహమనియే తెలియుచున్నది. 1×7 అను సూత్రము ప్రకారము ఒకమారు బద్ధ శత్రువులుగా మారిన గ్రహములు వారు ధర్మబద్ధముగా ఎల్లపుడు ఒకరికొకరు

| | | | |
|---|---|---|---|
| గురు 5 | కుజు 6 | 1 మిత్ర 7 | 2 చిత్ర |
| శని 4 | **సూత్రము 1×7 వృషభము** | | 3 చంద్ర |
| రాహువు 3 | | | 4 సూర్యుడు |
| కేతువు 2 | 7 భూమి 1 | 6 శుక్ర | 5 బుధ |

**చతురస్రాకారములోనున్న కాలచక్రము - 23వ పటము.**

వ్యతిరేఖముగానే ప్రవర్తించుచుందురు. ఎటువంటి సందర్భములోను అధర్మముగా నడుచుకోరు.

ఇపుడు మిథునలగ్న అధిపతియైన చిత్రగ్రహమునకు 1×7 అను సూత్రము ప్రకారము బద్ద శత్రువుగానున్న గ్రహమేదో తర్వాత పేజీలోగల 24వ పటములో తెలుసుకొందాము.

ఇక్కడ మిథునలగ్నాధిపతియైన చిత్రగ్రహమునకు, బద్ద శత్రువు కేతు గ్రహము అని తెలియుచున్నది. అలాగే కేతు గ్రహమునకు బద్దశత్రువుగా చిత్రగ్రహమే అగుచున్నది. కాలచక్రములోని పండ్రెండు భాగములలో ఒక గ్రహమునకు 7వ స్థానములోని మరొక గ్రహము బద్ద శత్రువైతే, బద్దశత్రువైన ఏడవ గ్రహమునకు మొదటి గ్రహము తిరిగి బద్ద శత్రువగుచున్నది.

| | | | |
|---|---|---|---|
| గురు 4 | కుజు 5 | మిత్ర 6 | 1 చిత్ర 7 |
| శని 3 | **సూత్రము** | **1×7** | 2 చంద్ర |
| రాహువు 2 | **మిథునము** | | 3 సూర్యుడు |
| 7 కేతు 1 | 6 భూమి | 5 శుక్ర | 4 బుధ |

**చతురస్రాకారములోనున్న కాలచక్రము - 24వ పటము.**

ఇపుడు కర్కాటక లగ్న అధిపతియైన చంద్రగ్రహమునకు 1×7 అను సూత్రము ప్రకారము బద్ధశత్రువుగానున్న గ్రహమేదో తర్వాత పేజీలోగల 25వ పటములో తెలుసుకొందాము.

ఇక్కడ కర్కాటక లగ్నాధిపతియైన చంద్రునికి, అక్కడినుండి సప్తమ స్థానాధిపతియైన రాహువు బద్ధ శత్రువుగా ఉన్నాడు. అలాగే రాహువుకు అక్కడినుండి సప్తమస్థానాధిపతియైన చంద్రుడు 1×7 అను సూత్రము ప్రకారము బద్ధ శత్రువుగా ఉన్నాడు. ఈ విధముగా చంద్రునికి రాహువు, రాహువుకు చంద్రుడు తీవ్ర శత్రువులుగా ఉన్నారు.

| | | | |
|---|---|---|---|
| గురు 3 | కుజు 4 | మిత్ర 5 | చిత్ర 6 |
| శని 2 | **సూత్రము 1×7 కర్కాటకము** | | 1 చంద్ర 7 |
| 7 రాహువు 1 | | | 2 సూర్యుడు |
| 6 కేతువు | 5 భూమి | 4 శుక్ర | 3 బుధ |

**చతురస్రాకారములోనున్న కాలచక్రము - 25వ పటము.**

ఇపుడు సింహ లగ్న అధిపతియైన సూర్యునకు బద్దశత్రువుగానున్న గ్రహమును తర్వాత పేజీలో గల 26వ పటములో చూచి తెలుసుకొందాము.

ఇక్కడ సింహలగ్న అధిపతియైన సూర్యునికి, అక్కడినుండి సప్తమ స్థానములోనున్న శని బద్దశత్రువుగా ఉన్నాడు. అలాగే 1×7 అను సూత్రము ప్రకారము, శనికి కూడా సూర్యుడు బద్దశత్రువుగానే ఉన్నాడు. స్వంత స్థానములను బట్టి, వారి శత్రుత్వములను నిర్ణయించడము జరిగినది. స్వంత స్థానములను బట్టి, ఒకమారు శత్రువులుగా మారిన గ్రహములు, ఆ స్థానములను వదలి ఎక్కడ ఉండినా వారి శత్రుత్వమును మాత్రము వదలరు. పంద్రెండు స్థానములలో ఆరు స్థానాధిపతులకు శత్రువులను తెలుసుకుంటే, మిగత ఆరు స్థానములకు, చెప్పకనే శత్రువులు ఎవరైనది తెలిసిపోవుచున్నది.

| | | | |
|---|---|---|---|
| గురు 2 | కుజు 3 | మిత్ర 4 | చిత్ర 5 |
| 7 శని 1 | **సూత్రము** | **1×7** | చంద్ర 6 |
| 6 రాహువు | **సింహలగ్నము** | | 7 సూర్య 1 |
| 5 కేతువు | 4 భూమి | 3 శుక్ర | 2 బుధ |

**చతురస్రాకారములోనున్న కాలచక్రము - 26వ పటము.**

ఇపుడు చివరిగా కన్యాలగ్న అధిపతి బుధగ్రహమునకు 1×7 సూత్రము ప్రకారము బద్ధశత్రువు ఎవరో తర్వాత పేజీలోగల 27వ పటములో చూచి తెలుసుకొందాము.

ఇక్కడ కన్యాలగ్న అధిపతియైన బుధ గ్రహమునకు 1×7 అను సూత్రము ప్రకారము, అక్కడినుండి సప్తమస్థానాధిపతియైన గురు గ్రహము తీవ్ర శత్రుత్వము కల్గియున్నది. అలాగే గురు గ్రహమునకు కూడా సరిగా

| | | | |
|---|---|---|---|
| 7 గురు 1 | కుజ 2 | మిత్ర 3 | చిత్ర 4 |
| 6 శని | **సూత్రము 1×7 కన్యాలగ్నము** | | చంద్ర 5 |
| 5 రాహువు | | | సూర్య 6 |
| 4 కేతువు | 3 భూమి | 2 శుక్ర | 1 బుధ 7 |

**చతురస్రాకారములోనున్న కాలచక్రము - 27వ పటము.**

బుధగ్రహమే బద్ధ శత్రుత్వము వహిస్తున్నది. ఎవరికి ఎవరు బద్ధ శత్రువులు అన్నది క్రింద వరుసలో చూడండి.

| | | | |
|---|---|---|---|
| 1. | గురువుకు | బద్ధశత్రువు | బుధుడు |
| 2. | కుజునకు | బద్ధశత్రువు | శుక్రుడు |
| 3. | మిత్రకు | బద్ధశత్రువు | భూమి |
| 4. | చిత్రకు | బద్ధశత్రువు | కేతువు |
| 5. | చంద్రునకు | బద్ధశత్రువు | రాహువు |
| 6. | సూర్యునకు | బద్ధశత్రువు | శని |
| 7. | బుధునకు | బద్ధశత్రువు | గురువు |
| 8. | శుక్రునకు | బద్ధశత్రువు | కుజుడు |

| | | | |
|---|---|---|---|
| 9. | భూమికి | బద్ధశత్రువు | మిత్ర |
| 10. | కేతువుకు | బద్ధశత్రువు | చిత్ర |
| 11. | రాహువుకు | బద్ధశత్రువు | చంద్రుడు |
| 12. | శనికి | బద్ధశత్రువు | సూర్యుడు |

గురువర్గమునకు శనివర్గము, శనివర్గమునకు గురువర్గము శత్రువు లైనప్పటికీ ఒక గ్రహమునకు అయిదు గ్రహములు సాధారణ శత్రువులుకాగా ఒక గ్రహము మాత్రము బద్ధశత్రుత్వము కలిగియున్నది.

## 21 గుణచక్రములోని గుణముల వివరమేమి?

ఇంతవరకు బ్రహ్మ,కాల,కర్మ,గుణచక్రముల సముదాయములో కాలచక్రమును గురించీ, కర్మచక్రమును గురించీ కూలంకషముగా తెలుసు కొన్నాము. ఇక క్రింది చక్రమైన మరియు కర్మలకు కార్యములకు కారణమైన, 36 గుణములతో కూడి 'మాయచక్రమని' పేరుగాంచిన, గుణచక్రమును గురించి కొంత తెలుసుకొందాము. ఇవన్నియూ కల్పన అని అనుకోవద్దండి. బ్రహ్మవిద్యా శాస్త్రమైన భగవద్గీతను అనుసరించి తెలుపునవని చెప్పు చున్నాము. గీతలో అక్షరపరబ్రహ్మయోగమందు నాల్గుచక్రముల మూలము కనిపించగా, గుణత్రయ విభాగయోగమను అధ్యాయమందు గుణముల గురించిన సమాచారము సవివరముగా కలదు. గుణచక్రము మూడు భాగములుగా ఎట్లున్నది, అందులో జీవుడు ఏ భాగములో ఉన్నపుడు ఏ పేరు కల్గియున్నదీ. ఒక్కొక్క భాగములో గుణములు ఎట్లు చీలియున్నదీ చిత్రపటముల రూపములో చూచెదము.




28వ పటము. గుణచక్రములో జీవుడు




29వ పటము. తామసములో జీవుడు




30వ పటము. రాజసములో జీవుడు




31వ పటము. సాత్త్వికములో జీవుడు




32వ పటము. యోగములో జీవుడు




33వ పటము. చిన్న పెద్ద గుణములు

ఈ విధముగా గుణచక్రము, మూడు భాగములుగా ఉంటూ అందులో పక్ష, ప్రతిపక్ష గుణములు 12 రకములుగా ఉన్నవి. వాటిలో ఒక్కో గుణము 9 రకముల పరిమాణముగా చీలి ఉన్నవి. ఈ 108 గుణములనే భగవద్గీతలో **"మాయ"** అని చెప్పారు. గుణముల మాయనుండి ఉత్పన్నమైన కర్మ అనునది కర్మచక్రమును చేరి, పైనున్న కాలచక్రములోని పండ్రెండు గ్రహముల చేత, తిరిగి మానవుని మీద కష్టసుఖముల రూపముతో ప్రసరింపబడుచున్నది. దానిని ముందుగా తెలుసుకోవడమునే జ్యోతిష్యము అంటున్నాము. ఇది జ్యోతిష్యశాస్త్రము కావున గుణములను, కర్మలను, గ్రహములను చెప్పుకోవలసివచ్చినది.

## 22 గుణములను ప్రేరేపించునది కర్మనా? లేక కాలమా?

గుణచక్రములోని గుణములను ప్రేరేపించునది కర్మయేనని చెప్పవచ్చును. కర్మను కదలించునది కాలమని చెప్పవచ్చును. నాలుగు చక్రముల అమరికలో బ్రహ్మచక్రము అన్నిటికీ గొప్పది, అన్నిటికీ అతీతమైనది. దానిని పేరుకు మాత్రము గుర్తుగా పెట్టుకొన్నాము. అందువలన ఏ మనిషికైనా క్రింది మూడు చక్రములే ముఖ్యములని చెప్పవచ్చును. ఆ మూడు చక్రములలో మధ్యలో గలది కర్మచక్రము. కర్మచక్రము పైన కాలచక్రమూ, క్రింద గుణచక్రమూ గలదు. మధ్యలోగల కర్మను అనుసరించియే క్రింద గుణచక్రమూ, పైన కాలచక్రము యొక్క నిర్మాణమున్నది. కావున ఈ మూడు చక్రములను కలిపి కాల, కర్మ, గుణ చక్రములని చెప్పినప్పటికీ, ఆధ్యాత్మిక విద్యలో మూడు చక్రములను కలిపి కర్మచక్రము అనియూ, కర్మ లిఖితము అనియూ, కర్మపత్రము అనియూ,

కర్మ ఫలకము అనియూ చెప్పుచుందురు. మనిషికి (జీవునికి) అనుభవము నకు వచ్చేది కర్మయే. జీవుడు గుణముల మధ్యలోయున్నా, గుణములను ఉపయోగించుకొని కర్మను అనుభవించుచున్నాడు. పైన కాలచక్రములో ద్వాదశగ్రహములున్నా జీవునికి కర్మను అనుభవింపజేయుటకేయున్నవి. అందువలన ప్రతి మనిషికీ, ప్రతి జీవరాశికీ కర్మచక్రమే ముఖ్యమని తెలియు చున్నది. కాల, కర్మ, గుణచక్రములలో కర్మచక్రమునకు ప్రాధాన్యత ఇస్తూ కర్మపత్రమనీ, కర్మలిఖితమనీ, కర్మఫలకమనీ చెప్పడము జరిగినది.

కాల, కర్మ, గుణచక్రముల నిర్మాణము మనిషి తలలోయున్నా దాని నాడి వీపులో క్రిందివరకు వ్యాపించియున్నది. అందువలన మూల గ్రంథములలో దేవుడు కర్మను వీపున వ్రేలాడదీసి పంపాడనీ, మెడలో కట్టి పంపాడనీ, ముఖాన వ్రాసిపంపాడనీ చెప్పడము జరిగినది. అందువలన బ్రహ్మ, కాల, కర్మ, గుణ అనబడు నాల్గుచక్రములను కలిపి కర్మ విధానమని, కర్మపత్రమని చెప్పడమైనది. ప్రతి మనిషియొక్క కర్మలిఖితములో (కర్మవ్రాతలో) తేడాలున్నాయి. ఏ విధముగా మనిషి యొక్క హస్తములోని వేలిగుర్తులు ప్రతి ఒక్కరికీ వేరువేరుగా ఉండునో, అలాగే ప్రతి మనిషియొక్క కర్మ లిఖితము వేరువేరుగా కొంతయినా తేడా కల్గియుండును. ప్రతి మనిషిలోనూ గుణ చక్రములోని గుణములుగానీ, కాలచక్రములోని గ్రహములుగానీ ఏమీ తేడా లేకుండాయున్నవి. గుణచక్రములోని మూడు భాగములలోగానీ, పన్నెండు గుణముల చీలికలైన 108 గుణముల భాగములలో గానీ తేడా లేకుండా అందరిలో సమానముగా ఉన్నవి. అలాగే కాలచక్రము లోని పన్నెండు గ్రహములలోగానీ ఏమాత్రము తేడా లేకుండా అందరిలో ఒకే విధముగా ఉన్నవి. నాల్గుచక్రముల సముదాయములో ఒక్క కర్మచక్రము తప్ప అన్నీ ఒకే విధముగా అందరిలో ఉండగా, కర్మచక్రము

లోని కర్మ మాత్రము మనిషి మనిషికీ తేడా కల్గియున్నది. ప్రతి మనిషిలోని కర్మభేదము వాని అనుభవములో కనిపించుచున్నది. దేవునికి సంబంధించిన బ్రహ్మాచక్రమును ప్రక్కనయుంచి మనిషికి సంబంధించిన గుణ,కర్మ,కాల చక్రములను చూచితే మూడు చక్రములలో మధ్యన ఉండునది కర్మచక్రము. మధ్యనగల కర్మచక్రమే మూడు చక్రములలో ముఖ్యమైనదని చెప్పుకొన్నాము. కాలము గుణము అందరికీ సమానమే అయినా, కర్మ మాత్రము ఏ ఒక్కరిలో సమానముగా లేదు. ప్రతి మనిషిలోను వేరు వేరుగాయున్న కర్మ మనిషి యొక్క గుణములను ప్రేరేపించుచున్నది.




34వ పటము. కర్మపత్రము

పైన కాలచక్రములోగల గ్రహముల కిరణములు కర్మచక్రములోని కర్మమీద పడగా, కర్మయొక్క నీడ క్రింద గుణముల మీద పడుచున్నది. పడిన కర్మనీడనుబట్టి అప్పటికి ఏ గుణము అవసరమో ఆ గుణము ప్రేరేపింపబడుచున్నది. ఆ సమయమునకు ప్రేరేపింపబడిన గుణము చేత కార్యము చేయబడును. కర్మ కారణముచేత గుణము వలన జరుగు పని కొంత కాలము జరుగుచున్నది. ఎంత కాలము జరిగినదనుటకు కర్మను బట్టి కాలముండును. కర్మ కొద్దిగాయుంటే తక్కువ కాలములో అనుభవ ముండును. కర్మ చాలాయుంటే ఎక్కువకాలము అనుభవముండును. ఈ విధముగా కర్మనుబట్టి ఇటు గుణములూ, అటు కాలముండును. కావున కర్మనుబట్టి కాలమూ, కర్మనుబట్టి గుణములుండునని చెప్పవచ్చును.

## 23 గుణచక్రములోని భాగములలో ఏది మంచిది?

గుణచక్రములో మూడు గుణములుగల భాగములు, ఒకటి గుణము లేని భాగము మొత్తము నాలుగు భాగములుండును. గుణములు ఏ భాగములోయున్నా వాటిని **"మాయ"** అనవచ్చును. మూడు గుణ భాగము లకు మధ్యలోనున్న గుణములేని భాగమును ఆత్మ భాగమనియూ, మాయా తీత భాగమనియూ, గుణరహిత భాగమనియూ, యోగ స్థానమనియూ అనవచ్చును. గుణచక్రము బయటి వరుసలో మొదటి భాగము తామస గుణభాగము, రెండవది రాజస గుణ భాగము, మూడవది సాత్త్విక గుణ భాగము అను పేర్లతో చెప్పుచున్నాము. మూడు భాగములలోని గుణములు వేరువేరు ఆలోచనలను రేకెత్తించి, ఆలోచనకు తగినట్లు ప్రవర్తింప జేయును. గుణ ఆచరణలో పాపపుణ్య కర్మలు తయారగుచున్నవి. జ్ఞాని అయినవాడు గుణాచరణ వలన వచ్చిన కర్మనుండి తప్పించుకోగలడు. జ్ఞానము లేనివాడు

కర్మ నుండి తప్పించుకోలేక దానిని తగిలించుకుంటున్నాడు. గుణరహిత భాగమైన నాల్గవభాగములో గుణములు లేవు. కావున దానిని బ్రహ్మయోగ మని చెప్పవచ్చును. బ్రహ్మయోగమున జీవుడున్నప్పుడు కర్మ ఆచరణ లేదు. అలాగే గుణ ఆలోచన లేదు. మొత్తానికి కర్మేలేదు. కావున కర్మలేని భాగమైన నాల్గవ భాగమే గుణచక్రములో మంచిదని చెప్పవచ్చును.

## 24 కర్మచక్రములో ఏ కర్మ ఎక్కడ చేరుతుంది?

నాలుగు చక్రముల సముదాయము ప్రతి మానవుని శిరస్సులో కలదు. నాలుగు చక్రములకు ఆధారమైన ఆత్మ తలనుండి వీపు క్రింది భాగము వరకు వ్యాపించియున్న బ్రహ్మనాడిలో (పెద్ద నరములో) కలదు. పై చక్రము దేవునికి సంబంధించినది, కావున ప్రతిమారు దానిని చెప్ప నవసరము లేదు. అందువలన పై చక్రమును వదలి మనిషికి సంబంధించిన మూడు చక్రములనే చెప్పుకొందాము. కాల, కర్మ, గుణ చక్రములు మూడుయున్నా వాటిలో ఎక్కువ ప్రాధాన్యత గలది కర్మచక్రమని చెప్పుకొన్నాము. అటు కాలచక్రము ఇటు గుణచక్రముల మధ్యన కర్మచక్రము యుండి ప్రాధాన్యత కల్గియున్న దానివలన, ఇతర మతగ్రంథము లని పేరుగాంచిన మూల గ్రంథములలో కూడా కర్మచక్ర ప్రస్థావన వచ్చినది. ఇక్కడ కర్మచక్రమని దేనినంటున్నామో దానినే కర్మపత్రమని మూల గ్రంథములలో చెప్పారు. మంచి చెడులున్న కర్మపత్రాన్ని మనిషి మెడలో వ్రేలాడదీశామని 17వ సురా, 13వ ఆయత్‌లో ఖుర్‌ఆన్ గ్రంథములో చెప్పబడినది. అక్కడ పాప పుణ్యములను చెడు మంచిలని చెప్పారు. అంతేగాక తలలో నాల్గుచక్రములు క్రిందికి బ్రహ్మనాడిగా వ్రేలాడబడి

యుండడమును కర్మపత్రాన్ని మెడలో వ్రేలాడదీశామని చెప్పారు. ఈ విధముగా కర్మచక్రము ఆధ్యాత్మిక రంగములో అన్ని మత గ్రంథములందు ప్రస్తావనకు వచ్చినది.

ప్రతి మనిషికీ కాల, కర్మ, గుణచక్రములు మూడు ముఖ్యమైనవని చెప్పుకొన్నాము. ఆ మూడు చక్రములలో కర్మచక్రము చాలా ముఖ్యమైనదని చెప్పాము. కర్మనుబట్టియే కాలమూ, కర్మనుబట్టియే గుణములని కూడా చెప్పుకొన్నాము. ఇప్పుడు మరికొంత ప్రత్యేకముగా చెప్పునదేమనగా! సృష్ట్యాది నుండియున్న కాలచక్రములోని గ్రహములుగానీ, గుణచక్రములోని గుణములు గానీ, మారకుండా ఎన్నియున్నవో, ఎలాయున్నవో, అన్నియూ అలాగేయున్నవి. కాలచక్రములోని పన్నెండు (12) గ్రహములు మారలేదు. గుణచక్రములోని గుణములు మారలేదు. నిమ్మకాయలోని పులుపు, మిరపకాయలోని కారము కొంత మారవచ్చునేమోగానీ, కాలచక్రము లోని గ్రహములుగానీ, గుణచక్రములోని గుణములుగానీ ఏమాత్రము కొంతయినా మార్పుచెందకుండా అలాగేయున్నవి. కాలచక్రములోని గ్రహములు, గుణచక్రములోని గుణములు మారకున్నా, కర్మచక్రములోని కర్మ మాత్రము నిత్యము జమ, ఖర్చు అగుచూ ఎల్లప్పుడూ మారుచునే ఉన్నది. ఎవరి కర్మచక్రములోని కర్మ స్థిరస్థాయిగా ఉండదు. అందువలన ఎప్పటికీ ఒకేలాగున ఆగామి పాపపుణ్యములుగానీ, ప్రారబ్ధ పాపపుణ్యములు గానీ ఉండక మారుచుండును. నిత్యమూ మారుచున్న కర్మచక్రము మూడు చక్రములలో ముఖ్యమైనదై ఉన్నది. ఎవడు ఎటువంటివాడో చూడవలసివచ్చి నప్పుడు వాని గుణములను ప్రేరేపించు కర్మనే చూడవలసివచ్చుచున్నది. కర్మ ప్రేరణవలననే గుణములు ఉండుట వలన గుణములకు కారణమైన కర్మనే చూడవలసివచ్చినది. అందువలన మనిషికి సంబంధించిన జీవన విధానమేదైనా ఎట్లున్నదనుటకు కర్మయే అద్దముగా, ప్రతిరూపముగా

ఉన్నది. ఏ జ్యోతిష్యుడైనా మనిషిలోని కర్మనే లెక్కించి చూచి వాని భవిష్యత్తు కొంతవరకు తెలియవచ్చును. జ్యోతిష్యము అంతయు జ్యోతితో ముడిపడి యున్నది. కావున జ్ఞానము (జ్యోతి) తెలియనివాడు సరియైన జ్యోతిష్యుడు కాడు. జ్ఞానమును తెలియుట వలననే కర్మలూ, వాటి బాధలూ తెలియును. దానినిబట్టి జ్యోతిష్యమును తెలియవచ్చును.

## 25 అంగీ, అర్ధాంగి

జ్ఞానమునుబట్టి ఏ కర్మ ఎక్కడ చేరుచున్నదో తెలియకున్నా, అది అంతయూ జ్యోతిష్యశాస్త్రమునుబట్టి తెలియును. బ్రహ్మవిద్యా శాస్త్రమును బట్టి ఏ కర్మ ఎంత తీవ్రమైనదో, దానివలన బాధ ఎంత తీక్షణముగా ఉండునో, దానిని అనుభవించకుండా తప్పించుకొనుటకు దారి ఏదో తెలియును. బ్రహ్మవిద్యా శాస్త్రముతో అనుసంధానమైనది జ్యోతిష్య శాస్త్రము. అందువలన బ్రహ్మవిద్యా శాస్త్ర సంబంధముతోనే మనిషి కర్మచక్రములో (కర్మపత్రములో) ఏ కర్మ ఎక్కడ లిఖితమైనదో తెలుసుకొందాము. మనిషి జననముతో అతని జీవితము ప్రారంభమగుచున్నది. తర్వాత ఎంతో కొంత కాలమునకు మనిషికి సంభవించు మరణముతోనే అతని జీవితము అంత్యమగుచున్నది. జీవితములో ఇటు మొదలు అటు అంత్యమునకు పుట్టుక చావులు రెండూ అందరికీ తెలిసిన సంఘటనలే. వాటి వివరము కర్మ రూపములో ఉండకపోయినా ఎక్కడినుండి కార్యములు మొదలగునో, ఎక్కడ అంత్యమగునో దానికి సంబంధించిన కర్మలు కర్మచక్రములో లిఖితమైనవి. కర్మచక్రములో పన్నెండు స్థానములుండగా, అందులో జీవిత ప్రారంభకర్మ మొదటిదైన ఒకటవ స్థానములోనూ, అలాగే జీవిత అంత్యములోని కర్మ చివరిదైన పన్నెండవ స్థానములోనూ వ్రాయబడియుండును.




35. చిత్రపటము

మనిషి జీవితములో పెళ్ళికాని ముందు జీవితము ఒక విధముగా జరుగగా పెళ్ళి అయిన తర్వాత జీవితము మరొక విధముగా జరుగును. పెళ్ళి కార్యముతో వచ్చునది భార్య. భార్యను జీవిత భాగస్వామియనియూ, అర్ధాంగి అనియూ అనడము జరుగుచున్నది. అర్ధాంగి అను పదమును విడదీసి చూచితే అర్థ+అంగీ=అర్ధాంగీ అని తెలియుచున్నది. అంగ అనగా శరీరము అనియూ, అంగీ అనగా శరీరమును ధరించినదనియూ అర్థము. 'అంగ' అను పదమునుండి 'అంగీ' అను పదము పుట్టినది. అర్ధాంగి అను పేరు భార్యకుండుట వలన కర్మచక్రములోని 12 భాగములలో అర్థ భాగమును వదలి, మిగత అర్థభాగము ప్రారంభమగు ఏడవ స్థానములో భార్య యొక్క కర్మ వ్రాయబడియున్నదని తెలియవలెను. భార్య భర్తలో సగము శరీరముకలదని అర్ధనారీశ్వర చిత్రము తెలియజేయుచున్నది. అందువలన కర్మ పత్రములోని పన్నెండు భాగములలో సగము తర్వాత వచ్చు ఏడవ స్థానములో భార్యకు సంబంధించిన కర్మను లిఖించడమైనది.




36వ చిత్రపటమును చూడుము.

అలాగే పైనగల 36వ చిత్రములో 12 భాగములను రెండు భాగములుగా విభజించి, అందులో మొదటి భాగమున ఒకటవ స్థానము తన శరీరమునకు సంబంధించినదనియూ, రెండవ భాగమున ఏడవ స్థానము తన భార్యకు సంబంధించినదనియూ గుర్తించాము. మొదటి భాగమున ఆరు స్థానములు దాటిన తర్వాత రెండవ అర్థ భాగము ఏడవ స్థానమునుండి ప్రారంభమగుట వలన, భార్యను అర్థాంగి అని చెప్పుచూ, కర్మచక్రములో (కర్మపత్రములో) ఏడవ స్థానములోనే భార్యకు సంబంధించిన కర్మను లిఖించడము జరిగినది. ఇంతవరకు 1, 12 స్థానములు జనన మరియు మరణములనూ, 1, 7 స్థానములలో 1వది తన శరీరమునకు సంబంధించిన కర్మను సూచించగా, 7వది తన భార్యకు సంబంధించిన కర్మను సూచించుచున్నది. ఇప్పటికి 1, 7, 12 స్థానములలో కర్మ ఏమి ఉండునో తెలిసిపోయినది. ఇక మిగతా స్థానములలో ఎటువంటి కర్మలుండునో చూద్దాము.



# 26 కర్మచక్రములో కేంద్రములు

కర్మచక్రములోని 12 భాగములను అంగీ, అర్ధాంగీ అని రెండు భాగములుగా విభజించుకొన్నాము. అంగీ అను మొదటి భాగములో 1వ స్థానమూ, అర్ధాంగి అను రెండవ భాగములో 7వ స్థానము ప్రారంభమైనవి అగుటయేకాక, 1వ స్థానములో తన శరీరమునకు సంబంధించిన కర్మయూ, 7వ స్థానమున తన భార్యకు సంబంధించిన కర్మయూ నమోదు చేయబడిన దనీ మరియు నమోదు చేయబడుచున్నదనీ చెప్పాము. ఇప్పుడు అంగీ అర్ధాంగి అను రెండు భాగములలో ముఖ్యకేంద్రములుగా గుర్తింపబడిన స్థానములు రెండు గలవు. మొదటి భాగమున ఆరు స్థానములలో ముఖ్యమైనదిగా ఒక స్థానమూ, రెండవ భాగమున ఆరు స్థానములలో ముఖ్యమైనదిగా మరియొక స్థానమును గుర్తించడమైనది. ఈ రెండు ముఖ్య స్థానములు అంగీ, అర్ధాంగీ అను రెండు భాగములలో ఆయా భాగములకు కేంద్రములుగా గలవు. కేంద్రము అనగా ఆధారస్థానమనీ, ముఖ్యముగా గుర్తింపు పొందిన స్థానమనీ చెప్పవచ్చును. కర్మచక్రము యొక్క పన్నెండు స్థానములలోనే మనిషి (జీవుని) జీవితమంతా ఇమిడియున్నది. మనిషి జీవితమునకు సంబంధించి కర్మచక్రములో కేంద్రములుగాయున్న స్థానము లేవియని గమనించిన ఇలా తెలియుచున్నది. కర్మపత్రములో శరీరమూ, పుట్టుక ప్రారంభమునకు సంబంధించి ఒకటవ స్థానముండగా, అక్కడినుండి మొత్తము ఆరు స్థానములను అంగీ భాగము అనియూ, తర్వాత ఆరు స్థానములను అర్ధాంగి భాగమనియూ చెప్పుకొన్నాము కదా! ఇప్పుడు అంగీ భాగములోని ఆరు స్థానములలో ఒకటవ స్థానమును వదలి మిగతా ఐదు స్థానములను తీసుకొని వాటిలో మధ్యలో గల దానిని గమనించితే వరుసలో నాల్గవ స్థానము మధ్యదగును. ఒకటవ స్థానము తర్వాత రెండు, మూడు స్థానములకూ, ఐదు, ఆరు స్థానములకూ మధ్యలో నాల్గవ స్థానము కలదు.

ఐదు స్థానములలో మధ్యనగల నాల్గవ స్థానమును అంగీ భాగమునకు ముఖ్యమైనదిగా మరియు ఆ భాగమునకు కేంద్రముగా లెక్కించి చెప్పుచున్నాము. అంగీ భాగములో కేంద్రముగాయున్న నాల్గవస్థానమును క్రిందగల 37వ చిత్రములో చూడవచ్చును.




37వ పటము. నాల్గవ స్థానము కేంద్రము

అంగీ, అర్ధాంగీ అను రెండు భాగములలో మొదటి అంగీ భాగములో నాల్గవ స్థానము కేంద్రముగాయున్నట్లు తెలిసినది. మొదటి భాగములో నాల్గవ స్థానము కేంద్రమైనట్లే, రెండవ భాగమైన అర్ధాంగి భాగములో మొదటిదైన 7వ స్థానమును వదలి చూచితే తర్వాతగల 8,9,10,11,12 స్థానములలో మధ్యనగల పదవస్థానము ఆ భాగమున కంతటికీ కేంద్రముగాయున్నది. అంగీ భాగములో 4వ స్థానమూ, అర్ధాంగి భాగములో 10వ స్థానమూ కేంద్రములుగా ఉన్నట్లు తెలియుచున్నది. కేంద్రము అనగా ముఖ్యమైన ఆధార స్థానముగా చెప్పవచ్చును. మానవ జీవితములో ముఖ్యముగా అందరూ గమనించేవి రెండు గలవు. అందులో ఒకటి

మనిషికున్న ఆస్తి, రెండవది మనిషికున్న పేరు ప్రతిష్ఠలు. మనిషికున్న ఆస్తినిబట్టి మనిషికి గౌరవముగానీ, అగౌరవముగానీ ఉండును. అలాగే మనిషికున్న పేరుప్రతిష్టలను బట్టి కూడా గౌరవ అగౌరవములుండును. అందువలన ఇటు ఆస్తి, అటు కీర్తి మనిషి జీవితములో ముఖ్యమైనవనీ, అవియే మనిషి జీవితములో కర్మ కేంద్రములని చెప్పవచ్చును. మనిషికి గల ఆస్తి యొక్క కర్మనుబట్టి, అలాగే కీర్తినిబట్టి మిగతా కర్మలన్నియూ మిగతా ఎనిమిది స్థానములలో చేర్చబడియుండును. అందువలన మిగతా ఎనిమిది స్థానముల కర్మలకు 4, 10 స్థానములే కేంద్రములుగా యున్నవని చెప్పవచ్చును. క్రిందగల 38వ చిత్రపటములో అర్ధాంగి భాగములో 10వ స్థానమును కేంద్రముగా చూడవచ్చును.




38వ పటము. పదవ స్థానము కేంద్రము

పై రెండు చిత్రపటములలో 4,10 స్థానములు కేంద్రములుగా కనిపించుచున్నవి. ఇదంతయూ మన తలలోని కర్మచక్రములోనున్న

విధానమని జ్ఞప్తికుంచుకోవలెను. ఇక్కడ జ్యోతిష్యులైన కొందరికి ఒక ప్రశ్న రావచ్చును. అది ఏమనగా! "మేము చదివిన జ్యోతిష్యశాస్త్రములో కేంద్రములు నాలుగు కలవనీ, అవియే 1,4,7,10 స్థానములనీ విన్నాము. మీరేమో కేంద్రములని పేరుపెట్టి 4,10 స్థానములను మాత్రము చెప్పు చున్నారు. ఒకటవ స్థానమును, ఏడవ స్థానమును మీరు వదలివేశారు. మిగతా గ్రంథములలో కేంద్రములు నాలుగు అని ఎందుకు చెప్పారు? మీరు రెండు మాత్రమే కలవని ఎందుకు చెప్పుచున్నారు?" అని అడుగ వచ్చును. దానికి మా జవాబు ఏమనగా! ఎవరు ఏ విధముగానైనా చెప్పవచ్చును. అయితే చెప్పబడిన విషయము సూత్రబద్ధముగా, శాస్త్రబదముగా ఉండవలయును. మేము చెప్పినదానికి శాస్త్రము ఆధారముగాయున్నది. అలాగే జ్యోతిష్యశాస్త్రములో ఒక సూత్రమును చెప్పుచూ రెండు కేంద్రములను చెప్పాము. నాలుగు కేంద్రములు ఎట్లున్నవో? ఎలా ఉన్నవో? నాకు తెలియవు. నాలుగు కేంద్రములు అశాస్త్రీయమగును.

కొందరు వ్రాసిన జ్యోతిష్య గ్రంథములలో కోణములు మూడు యనీ, కేంద్రములు కూడా మూడుయనీ వ్రాసియుండుట మేము కూడా చూచాము. వారు ఒక సంస్కృత శ్లోకమును ఆధారముగా చెప్పుచూ ఫలానా శ్లోకములో ఇలాగ ఉన్నది. అందువలన కోణములు మూడు, కేంద్రములు మూడుయని చెప్పారు. అయితే వారు చూపిన శ్లోకము శాస్త్రబద్ధమైనదా కాదాయని వారు చూడలేదు. ఎవరో చెప్పిన దానిని గ్రుడ్డిగానమ్మి చెప్పడము జరిగినది. అలా నమ్మి చెప్పడమును మూఢనమ్మకము అని అనవచ్చును. ఇక్కడ మన బుద్ధిని ఉపయోగించి చూచినా మూడు స్థానములున్న దానిని కోణము అని అనవచ్చును. ఎప్పటికైనా మూడు స్థానములు కోణముగానే

ఏర్పడును. కేంద్రము ఒక భాగములో ఎప్పటికైనా ఒకే స్థానములో ఉండును. మూడుగాయుంటే అది ఎప్పటికైనా ఒకదానికొకటి కోణమే అగునుగానీ, ఎప్పటికీ కేంద్రము కాదు. ఉదాహరణకు కర్మచక్రములో కోణములు ఎలాగున్నవో 39వ చిత్రపటములో చూస్తాము.




39వ చిత్రపటము

మూడు స్థానములు ఎప్పటికైనా కోణాకారమగునని స్పష్టముగా తెలియుచున్నది. నాలుగు స్థానములు చతురస్రాకారమగును, ఒక్క స్థానమును కేంద్రము అనవచ్చును. కర్మచక్రములోని అంగీ, అర్ధాంగి అను రెండు భాగములలో ఒక్కొక్క దానికి ఒక్కొక్కటి కేంద్రముగాయుండుట వలన, రెండు భాగములలో 4వ స్థానము ఒక ప్రక్క, 10వ స్థానము ఒక ప్రక్క కేంద్రములుగా ఉన్నవి. ఈ విధముగా కర్మచక్రము పన్నెండు భాగములు రెండు భాగములుగా విభజింపబడియుండగా, రెండు భాగములకు రెండు కేంద్రములువుండును. కొందరు కేంద్రములు మూడు అని, కొందరు నాలుగుయని చెప్పడము శాస్త్రమునకు విరుద్ధమగును.

# 27 కర్మచక్రములోని కోణములు

కర్మచక్రములో శాస్త్రబద్ధముగా కేంద్రములు రెండుగలవని తెలుసు కొన్నాము. అంగీ, అర్ధాంగి అను భాగములలో మూడు స్థానములను ముఖ్యమైనవని చెప్పుట చేత, ఆ మూడు స్థానములు ఒకదానికొకటి సమ దూరములో ఉండుట వలన, ఆ మూడు స్థానములు త్రికోణాకృతిగా ఉండుట వలన వాటిని కోణస్థానములన్నారు. కర్మచక్రములో కేంద్రములు రెండు భాగములలో రెండు ఉన్నట్లు, మిత్ర స్థానముల కోణములు, శత్రు స్థానకోణములని రెండు కోణములు కలవు. వాటిని పుణ్యస్థాన కోణములనీ, పాపస్థాన కోణములనీ కూడా చెప్పవచ్చును. మిత్రస్థాన కోణములు మూడు ఒకదానికొకటి మూడు స్థానములు దూరముతో సమముగా ఉండగా, అలాగే శత్రుస్థాన కోణములు కూడా మూడు ఒకదానికొకటి మూడు స్థానములు సమదూరముతోనున్నవి. దీనినిబట్టి కర్మచక్రములో (కర్మపత్రములో) రెండు కేంద్రములూ, రెండు త్రికోణములూ కలవని తెలియుచున్నది. మిత్ర, శత్రు రెండు కోణములను క్రింద 40వ చిత్రపటములో చూచెదము.




మిత్రస్థాన కోణములు.




శత్రుస్థాన కోణములు.

(40వ చిత్రపటము)

పైన కనబరచిన పుణ్య, పాప స్థానముల కోణములను గమనించితే 1×7 పూర్తి స్థాయి శత్రువు అను సూత్రమును అనుసరించి పుణ్యకోణములకు పూర్తి ఏడవ స్థానములే పాప కోణములుగాయున్నవి. ఒకటికి ఏడు (1×7), ఐదుకు పదకొండు (5×11), తొమ్మిదికి మూడు (9×3) పూర్తి వ్యతిరేఖ కోణములుగా ఉన్నవి. వీటినిబట్టి కర్మపత్రములో ఆయా స్థానముల యందు మనిషియొక్క పాపపుణ్యములు చేరుచున్నవి. దీనినిబట్టి ఏ విధముగా చూచినా కోణములు 1,5,9 ఒక రకము అనియూ, 3,7,11 మరొకరకము అనియూ చెప్పవచ్చును. అట్లే కేంద్రము 4వ స్థానము ఒకటికాగా, రెండవది 10 స్థానముగా ఉన్నది. కర్మపత్రములోనున్న పన్నెండు స్థానములయందు మూడు స్థానములలో పుణ్యము లిఖించబడగా, మూడు స్థానములలో పాపము లిఖించబడినది. మిగతా ఆరుస్థానములలో పాపము మరియు పుణ్యము రెండూ లిఖించబడ్డాయి. మూడు స్థానములు పుణ్యము, మూడు స్థానములు పాపము, ఆరు స్థానములు పాపపుణ్యములు మొత్తము పన్నెండు స్థానములలో ప్రారబ్ధకర్మ వ్రాయబడియుండును. వెనుకటి జన్మలలో సంపాదించుకొన్న ఆగామికర్మ ప్రస్తుత జన్మలో ప్రారబ్ధముగా మారి, ఆ ప్రారబ్ధము ప్రస్తుత జన్మలో అనుభవమునకు వచ్చుచున్నది. 69 సంవత్సరముల 5 నెలల 10 దినములు సంపాదించబడిన ఆగామికర్మ ఒకమారు సంచితముగా మారిపోవును. ఆ సంచిత కర్మనుండి ప్రారబ్ధ కర్మ మరణములో ఏర్పడి జరుగబోవు జన్మకు కారణమగుచున్నది.

మరణము పొందిన మరుక్షణమే కర్మపత్రములో రహస్యముగా యున్న సంచితకర్మనుండి ప్రారబ్ధకర్మ తయారై కర్మచక్రములో 1,5,9 స్థానములయందు పుణ్యము చేరిపోగా, పాపము 3,7,11 స్థానములలో చేరిపోవుచున్నది. మిగతా సరిసంఖ్య అయిన ఆరు స్థానములలో పాప

పుణ్యములు రెండూ చేరుచున్నవి. కర్మచక్రము లేక కర్మపత్రమునందు పాపమూ, పుణ్యమూ మరియు పాపపుణ్యములు రెండూవున్న స్థానములను క్రింద 41వ చిత్రపటములో చూడవచ్చును.

| | 12 | 1 | 2 | 3 | |
|---|---|---|---|---|---|
| | పుణ్యము పాపము | పుణ్యము | పుణ్యము పాపము | పాపము | |
| 11 | పాపము | కర్మపత్రము | | పుణ్యము పాపము | 4 |
| 10 | పుణ్యము పాపము | | | పుణ్యము | 5 |
| | పుణ్యము | పుణ్యము పాపము | పాపము | పుణ్యము పాపము | 6 |
| | 9 | 8 | 7 | | |




41వ చిత్రపటము.

కర్మచక్రములో ఇంతవరకు కోణములు కేంద్రములను గుర్తించడమే కాకుండా వాటియందునూ, మిగతా స్థానములందునూ పాపపుణ్య స్థానములను కూడా గుర్తించుకొన్నాము. ఇప్పుడు కర్మపత్రములో ఎక్కడ ఏ కర్మ వ్రాయబడుతుందో, మనిషి తన ప్రారబ్ధమును ఏయే స్థానమునుండి అనుభవించుచున్నాడో తెలుసుకొనుటకు ప్రయత్నిద్దాము. కర్మచక్రము లేక కర్మపత్రము యొక్క స్థానమునూ, దాని కదలికనూ, దాని అమరికనూ తెలుసుకొన్నాము. తెలిసిన దానినిబట్టి పైనగల కాలచక్రములోనున్న ద్వాదశ గ్రహముల కిరణములు క్రిందగల కర్మచక్రములోని పాపపుణ్య కర్మలమీద ప్రసరించగా, ఆ కిరణములు కర్మచక్రములోని కర్మను తీసుకొని క్రింద గుణచక్రములోనున్న జీవుని మీదపడును. అక్కడ జీవునిమీద గ్రహ

కిరణములు ఏ కర్మను ప్రసరింప చేయునో ఆ కర్మకు సంబంధించిన గుణము జీవున్ని తగులుకొనును. అప్పుడు జీవునికి తగులుకొన్న గుణమును జీవుని ప్రక్కనే జీవున్ని అంటిపెట్టుకొనియున్న బుద్ధి ఆలోచిస్తూ జీవునికి చూపించును. ముందే నిర్ణయము చేయబడినట్లు చిత్తము మనస్సు ప్రవర్తించగా, కర్మ చివరకు కార్యరూపమై శరీరముద్వారా అమలు జరుగును. అలా అమలు జరిగిన కార్యములోని కష్ట, సుఖములనూ, ఆనంద దుఃఖము లనూ జీవుడు బుద్ధి ద్వారానే అనుభవించడము జరుగుచున్నది. ఈ విధముగా ఒక మనిషిగానున్న జీవుడు చివరకు సుఖదుఃఖమును అనుభ వించుటకు ఏర్పరచబడిన విధానమే కాల, కర్మ, గుణచక్రముల అమరిక అని తెలియవలెను. జీవుడు జీవితములో అనుభవించు కర్మను ముందే సూచాయగా తెలుసుకోవడమును 'జ్యోతిష్యము' అంటాము.

జ్యోతిష్యము శాస్త్రబద్ధముగా ఉన్నప్పుడే దానిని సరిగా తెలుసు కోగలము. ఆ విధానములో ఇప్పుడు కర్మచక్రమందు ఎక్కడ ఏ కర్మ ఉంటుందో తెలుసుకొందాము. ఇంతవరకు తెలిసిన దానిప్రకారము 1వ స్థానములో శరీరమునకు సంబంధించిన కర్మయుండుననీ, అదియే జీవిత ప్రారంభస్థానమనీ తెలుసుకొన్నాము. శరీరము లభించిన జన్మ మొదలు కొని శరీర సంబంధ కర్మలన్నీ అందులో ఇమిడియుండును. దానినుండి 7వ స్థానము భార్యకు సంబంధించిన స్థానమని తెలుసుకొన్నాము. భార్య, భార్యనుండి ఎదురయ్యే సమస్యల కర్మలన్నీ అందులో లిఖించబడును. 1 మరియు 7వ స్థానములకు మధ్యలోగల అంగీ, అర్ధాంగి రెండు భాగములలో ఒకవైపు 4వ స్థానము మరియొక వైపు 10వ స్థానము కేంద్రములుగా యున్నవని తెలుసుకొన్నాము కదా! మొదటి భాగమైన అంగీ భాగములో కేంద్రమైన నాల్గవ స్థానమందు స్థూలమైన స్థిరాస్తులకు సంబంధించిన కర్మలు

చేర్చబడియుండును. అట్లే రెండవ భాగమైన అర్ధాంగి వైపు కేంద్రమైన పదవ స్థానమందు కంటికి కనిపించని ఆస్తి అయిన కీర్తికి సంబంధించిన కర్మయూ, పేరు ప్రఖ్యాతులు లభించుటకు కారణమైనవి అయిన వృత్తి, ఉద్యోగముల కర్మలు మొదలగునవి లిఖించబడియుండును. దీనిని తర్వాత పేజీలోగల 42వ చిత్రములో చూడవచ్చును.

ఇంతవరకు కర్మచక్రములో గల ఒకటవ స్థానము, నాల్గవ స్థానము, ఏడవ స్థానము, పదవస్థానము, పన్నెండవ స్థానములలో ఏయే కర్మలు చేరుచున్నవో తెలిసినది. మొత్తము 12 స్థానములలో 5 స్థానముల కర్మలు తెలిసిపోయినవి. ఇక మిగిలిన మొత్తము ఏడు స్థానములలో ఏ కర్మలు చేరుచున్నవో కొద్దిగ గమనిద్దాము. కర్మపత్రములో చివరి స్థానమున శరీరము యొక్క అంత్యకర్మ ఉండునని తెలుసుకొన్నాము కదా! శరీరము అంత్యమునకు చేరుటను మరణము అంటున్నాము. మరణము కర్మచక్రములోని 12వ స్థానమునుండే లభించును. అయితే 12వ స్థానమునకు ఎదురుగా వ్యతిరేఖ స్థానముగానున్న ఆరవ స్థానములో చావుకు వ్యతిరేఖమైన కర్మ చేరును. చావుకు భిన్నముగాయుండి చావుకంటే ఎక్కువ బాధించు కర్మ ఆరవస్థానములో ఉండును. చావు కాకుండా మనిషి బ్రతికియున్నా చావుకంటే ఎన్నో రెట్లు వ్యతిరేఖముగా బాధించునవి రోగములు, ఋణములు. చావులో ఏ బాధాయుండదు. కానీ ఆరవస్థానములోగల కర్మలో రోగ, ఋణముల కర్మలుండి మనిషిని చావుకు వ్యతిరేఖమైన బాధలను అనుభవింపజేయును. జీవిత అంత్యము మరణముతో జరుగును. అయితే మరణము ఏ బాధా లేనిది. బాధలు మొదలగునది జననముతో కాగా, బాధలు అంత్యమగునది మరణముతో, అయితే మరణము బాధారహితమైనది. దానికి వ్యతిరేఖముగా 12వ స్థానమునకు పూర్తి 7వ స్థానములో శత్రుస్థానమై




| | | | | | |
|---|---|---|---|---|---|
| | 11 | 12 | 1 | 2 | |
| | | శరీర అంత్య | శరీర ప్రారంభ | | |
| 10 | సూక్ష్మ ఆస్తి | కర్మపత్రము | | | 3 |
| 9 | | | | స్థూల స్థిరాస్తులు | 4 |
| | | భార్య కర్మ | | | |
| | 8 | 7 | 6 | 5 | |

కేంద్రములలోని కర్మ (42వ చిత్రపటము)

ఆరవ స్థానము కలదు. కావున ఆ స్థానములో బాధారహితమైన మరణము నకు వ్యతిరేఖముగా బాధను కల్గించు శత్రు, ఋణ, రోగ సమస్యల కర్మలు

లిఖించబడును. క్రింద 43వ పటము చూడుము.




| | 12 | 1 | 2 | 3 | |
|---|---|---|---|---|---|
| | శరీర అంత్య | శరీర ప్రారంభ | | | |
| 11 | | కర్మపత్రము | | స్థూల స్థిరాస్తులు | 4 |
| 10 | సూక్ష్మ స్థిరాస్తులు | | | | 5 |
| | | | భార్య కర్మ | శత్రుఋణ రోగ కర్మలు | |
| | 9 | 8 | 7 | 6 | |

43వ చిత్రపటము. 6వ స్థానములోని కర్మ.

ఇప్పటికి మొత్తము ఆరు స్థానములలో కర్మ వ్రాతను తెలుసుకోగలిగాము. ఇక మిగిలిన స్థానములు ఆరు కలవు. ఎదురెదురుగాయున్న 5, 11 స్థానములను గురించి తెలుసుకొందాము. స్థూల స్థిరాస్థులైన గృహము, భూములు మొదలగునవి ఏ మనిషికి ఏమి ఉన్నవో కర్మచక్రము లోని నాల్గవ స్థానమును చూచి తెలియవచ్చును. నాల్గవ స్థానమునకు క్రింద పైన ఇరువైపుల 3వ స్థానమూ, 5వ స్థానమూ కలవు. నాల్గవస్థానము కేంద్రస్థానమైన దానివలన దానికిరువైపులనున్నవి నాల్గవస్థానమును అనుసరించియుండును. అంగీ భాగమునకు కేంద్రమైన నాల్గవ స్థానములో స్థూల ఆస్తుల కర్మలుండగా దాని తర్వాతగల ఐదవ స్థానములో స్థూల ఆస్తులు సంపాదించుటకు తగిన బుద్ధిని సూచించు కర్మలుండును. ఒక మనిషి ప్రపంచములో స్థూల ఆస్తులు సంపాదించుటకు కావలసిన ప్రపంచ బుద్ధి, ప్రపంచ జ్ఞానము (ప్రపంచ విద్య) ఐదవ స్థానములో లిఖించబడియుండును. నాల్గవ కేంద్రస్థానములో స్థూల ఆస్తుల కర్మలుండగా దానిని ఆధారము చేసుకొని ఐదవ స్థానములో ప్రపంచ జ్ఞానముండగా, మూడవ స్థానములో ప్రపంచ ధనమునకు సంబంధించిన కర్మ ఉండును. ప్రపంచ ధనము అనగా డబ్బు నిలువ, డబ్బు చలామణి అని అర్థము. దీనినంతటినీ గ్రహించితే అంగీ భాగమందు వరుసగాగల 3, 4, 5 స్థానములలో ప్రపంచ ధనము, ప్రపంచ ఆస్తి, ప్రపంచ జ్ఞానము వరుసగా అన్నీ ప్రపంచ సంబంధ విషయ కర్మలేగలవు. అంగీలో కేంద్రమైన నాల్గవ స్థానమును ఆధారము చేసుకొని మూడులో ప్రపంచ ధనమునకు సంబంధించిన కర్మ, ఐదులో ప్రపంచ సంబంధ జ్ఞానము లేక చదువుల కర్మలున్నాయని తెలుసుకొన్నాము కదా! వాటినే క్రింద 44వ చిత్రపటములో చూడవచ్చును. కర్మ చిత్రపటములోనున్న పన్నెండు భాగములలో ఒక్కొక్క భాగము ఒక్కొక్క రకమైన కర్మతో నిండిపోతుండడము చిత్రపటములో చూడవచ్చును.




| | 12 | 1 | 2 | 3 | |
|---|---|---|---|---|---|
| | శరీర అంత్య | శరీర ప్రారంభ | | ప్రపంచ ధనము | |
| 11 | | కర్మపత్రము | | స్థూల స్థిరాస్తులు | 4 |
| 10 | సూక్ష్మ స్థిరాస్తులు | | | ప్రపంచ జ్ఞానము చదువు | 5 |
| | | | భార్య కర్మ | శత్రుఋణ రోగ కర్మలు | |
| | 9 | 8 | 7 | 6 | |

44వ చిత్రపటము.

ఇంతవరకు కర్మచక్రములో మొత్తము ఏడు స్థానములలోని కర్మ తెలిసిపోయినది. అంగీ భాగములోని నాల్గవ కేంద్రస్థానమును ఆధారము చేసుకొని మూడు, ఐదు స్థానములలోని కర్మలను తెలుసుకొన్నాము. ఇప్పుడు అర్ధాంగి భాగములో కేంద్రమైన పదవస్థానమును ఆధారము చేసుకొని దానికిరువైపులనున్న 9, 11 స్థానములలోని కర్మలను తెలుసుకొందాము. 9, 11 స్థానములలోని కర్మలను కష్టము లేకుండా సులభముగా తెలియ వచ్చును. అదెలా అనగా అంగీ భాగమునకు కేంద్రమైన 4వ స్థానములో స్థూల ఆస్తులుండగా, అర్ధాంగి భాగమునకు కేంద్రమైన 10వ స్థానములో నాల్గవ స్థానమునకు వ్యతిరేఖమైన సూక్ష్మఆస్తులైన కీర్తిప్రతిష్ఠ, వృత్తి ఉద్యోగ కర్మలను గ్రహించవచ్చును. స్థూల ఆస్తులు ప్రపంచ సంబంధమైనవి కాగా, జ్ఞానధనము, జ్ఞానమార్గము సూక్ష్మ ఆస్తులు పరమాత్మ సంబంధమైనవి. ఈ విధముగా అంగీ భాగములోనున్న కర్మకు పూర్తి భిన్నముగా అర్ధాంగి భాగములోగల కర్మలుండును. మొదటి భాగములో కేంద్రమైన నాల్గవ స్థానమునకు రెండవ భాగములో కేంద్రమైన పదవస్థానము వ్యతిరేఖమైనట్లే, అంగీ భాగములోని మూడవ స్థానములోని కర్మకు వ్యతిరేఖమైన కర్మ అర్ధాంగి భాగములోని తొమ్మిదవ స్థానములో ఉండును. అలాగే అంగీ భాగములోని ఐదవ స్థానములోని కర్మకు వ్యతిరేఖమైన కర్మ అర్ధాంగి భాగములోని పదకొండో స్థానములో ఉండును. మూడవ స్థానములో ప్రపంచ ధనమునకు సంబంధించిన పాపముండగా దానికి పూర్తి వ్యతిరేఖ స్థానమైన తొమ్మిదవ స్థానమున పరమాత్మ ధనము (జ్ఞానశక్తి) నకు సంబంధించినది లభించును. అదే విధముగా ఐదవ స్థానములో ప్రపంచ సంబంధ జ్ఞానముండగా దానికి వ్యతిరేఖ స్థానమైన పదకొండో స్థానములో పరమాత్మ జ్ఞానము (దైవజ్ఞానము) నకు సంబంధించిన గ్రాహిత శక్తియుండును. అర్ధాంగి భాగములో 9,10,11

స్థానములు దైవ భావమునకు సంబంధించినవని చెప్పవచ్చును. అయితే పదిలోనున్న జ్ఞానశక్తి, తొమ్మిదిలోనున్న జ్ఞానధనము పదకొండులోనున్న జ్ఞాని గ్రాహితశక్తి కర్మకు లోబడియుండవు. అందువలన కర్మ ఆధారముతో జ్ఞాన ధనమును గానీ, జ్ఞానశక్తినిగానీ, జ్ఞాన విచక్షణనుగానీ (జ్ఞానమును గ్రహించుకొను శక్తినిగానీ) గుర్తించి చెప్పలేము. 9, 10, 11 స్థానములలో నున్న వాటిలో కొన్ని కర్మలకు సంబంధించియుండగా, అక్కడేగల జ్ఞాన చిహ్నములన్నీ కర్మాధీనములుగావు. అందువలన కర్మాతీతమైన వాటిని గురించి ఖచ్చితముగా చెప్పుటకు వీలుపడదు. ఈ మూడు స్థానముల వలన భూమిమీద జ్ఞానిని గుర్తించవచ్చును. అయితే అతనిలో ఎంత జ్ఞానముండేది తేల్చి చెప్పలేము. క్రింద 45వ చిత్రపటములో కర్మచక్రము లోని 9, 10, 11 స్థానముల కర్మలను చూడవచ్చును.




45వ చిత్రపటము.

| | 12 | 1 | 2 | 3 | |
|---|---|---|---|---|---|
| | శరీర అంత్య | శరీర ప్రారంభ | | ప్రపంచ ధనము | |
| 11 | పరమాత్మ ప్రపంచ జ్ఞానము | కర్మపత్రము | | స్థూల స్థిరాస్తులు | 4 |
| 10 | దైవ సూక్ష్మ ఆస్తి కీర్తి వృత్తి | | | ప్రపంచ జ్ఞానము | 5 |
| | పరమాత్మ ప్రపంచ ధనము | | భార్య సుఖము | శత్రుఋణ రోగ కర్మలు | |
| | 9 | 8 | 7 | 6 | |

45వ చిత్రపటము.

ఇంతవరకు తెలిసిన దానిలో కర్మచక్రములోని రెండు స్థానములు తప్ప మిగతా అన్ని స్థానములలో ఏ కర్మ చేరిపోయినది తెలుసుకొన్నాము. ఇప్పుడు మిగిలినది అంగీ భాగములో రెండవ స్థానమూ, అర్థాంగి భాగములో ఎనిమిదవ స్థానము మాత్రము మిగిలియున్నవి. అంగీ భాగములో మొదటి స్థానము తర్వాతయున్న రెండవ స్థానము, మొదటి స్థానమునకు అనుబంధముగాయున్నది. అలాగే అర్థాంగి భాగములో మొదటిదైన ఏడవ స్థానమునకు ప్రక్కనేయున్న ఎనిమిదవ స్థానము అనుబంధముగాయున్నది. కావున కర్మచక్రములో ఒకటవ స్థానమును అనుసరించి రెండవ స్థానమూ, ఏడవ స్థానమును అనుసరించి ఎనిమిదవ స్థానమూ కర్మతో నింపబడినవి. కర్మచక్రములో ఒకటవ భాగమైన అంగీ భాగములో ఇంతవరకు నమోదైన కర్మలన్నీ ప్రపంచ సంబంధ కర్మలనియే చెప్పవచ్చును. 1వ స్థానమున శరీరమునకు సంబంధించిన కర్మయుండగా 3, 4, 5, 6 స్థానములన్నిటిలో

ప్రపంచ విషయములతో కూడుకొన్న కర్మలేగలవు. అట్లే రెండవ భాగమైన అర్ధాంగి భాగములో 7వ స్థానము పెళ్ళితో సంబంధమేర్పడు భార్య విషయముండును. పెళ్ళి కార్యమంతయూ దైవజ్ఞానముతో కూడుకొని యున్నది. తర్వాత 9, 10, 11, 12 స్థానములన్నీ దైవజ్ఞానము సంబంధ విషయములకు సంబంధిత ఫలితములున్నవి. అందువలన అంగీ భాగము అజ్ఞానముతో కూడుకొనియున్నదనీ, అర్ధాంగి భాగము జ్ఞానముతో కూడుకొనియున్నదనీ చెప్పవచ్చును.

ఇప్పుడు మనము చెప్పుకోవలసిన 2వ స్థానము అంగీ భాగము లోనూ, 8వ స్థానము అర్ధాంగి భాగములోనూ కలదు. అందువలన 2వ స్థానము ప్రపంచ సంబంధముగా ఉండుననీ, 8వ స్థానము దైవ సంబంధముగా ఉండుననీ తెలియుచున్నది. కర్మచక్రములో ఇంతవరకు మిగిలిన 2 మరియు 8 స్థానములలో ఏ కర్మయున్నదో గమనిద్దాము. అంగీ భాగములోని 2వ స్థానమును చూస్తే 1వ స్థానము శరీర ప్రారంభ మునకు సంబంధించిన కర్మ అందులో ఉన్నది కదా! శరీరములో జీవితము ప్రారంభమైన దినమునుండి మనిషికి అజ్ఞాన జీవితమే గడచుచుండును. దైవజ్ఞానము మీద ధ్యాస పెళ్ళి తర్వాత రావచ్చునేమోగానీ, అంతవరకు ఎవరికైనా జ్ఞానజీవితము మీద ధ్యాసరాదు. పెళ్ళి తర్వాత దైవము మీద ధ్యాస మనిషికి కలుగవచ్చును. పుట్టుక అజ్ఞానములో జరిగినా పెళ్ళి జ్ఞాన సంబంధముగా ఉండవలెనని పూర్వము మనిషికి చేయు పెళ్ళిలో అంతా జ్ఞానమునకు సంబంధించిన కార్యములనే ఉంచారు. అందువలన 1వ స్థానము తర్వాత రెండవ స్థానమున మనిషి తన జీవితములో అజ్ఞాన జీవితము ఎంతకాలము గడుపుననీ, చివరికి అతను ఎంత అజ్ఞానిగా చనిపోవును, అజ్ఞాన జీవితము ఎంతకాలముండును అనుటకు

సంబంధించిన కర్మలు రెండవ స్థానమున ఉండును. ఉదాహరణకు ఒక మనిషి 60 సంవత్సరములు బ్రతికి చనిపోతే ఆ అరవై సంవత్సరముల ఆయుష్షులో ఎంతకాలము అజ్ఞానిగా బ్రతుకును అనుటకు సమాధానముగా అతని రెండవ స్థానమున ఉన్న ప్రపంచ కర్మనుబట్టి 50 సంవత్సరముల కాలము అజ్ఞానములో బ్రతికాడనీ, మిగతా పది సంవత్సరముల కాలము జ్ఞాన జీవితములో గడచిపోయినదని చెప్పవచ్చును. ఒక మనిషి ఎంత కాలము అజ్ఞానములో గడుపునని రెండవ స్థానమునుబట్టి చెప్పినట్లే, అదే మనిషి ఎంతకాలము జ్ఞానజీవితము గడుపునో అతని కర్మచక్రములోని ఎనిమిదవ స్థానమును చూచి చెప్పవచ్చును. ఇక్కడ ముఖ్యముగా అందరూ గమనించ వలసినదేమంటే! ఒకని జీవితములో ఎంత భాగము అజ్ఞాన జీవితము, ఎంత భాగము జ్ఞానజీవితము ఉండునో చెప్పవచ్చునుగానీ, మనిషియొక్క ఆయుష్షును గురించి ఎవరూ చెప్పలేరు. మనిషి జీవితములో చావు పుట్టుకలు కర్మాధీనములు కావు. అవి కర్మకు అతీతమైనవిగా ఉన్నవి. అందువలన మనిషి తన జీవితములో ఇంత భాగము అజ్ఞాన జీవితము గడుపునని చెప్పవచ్చును. అలాగే ఎంతకాలము జ్ఞానజీవితమును గడుపునో చెప్పవచ్చును. ఈ రెండు స్థానములను చూచి ఇతనికి ఇంత ఆయుష్షుంటుంది అని కొందరు చెప్పవచ్చునుగానీ అది సత్యమైన మాటయని చెప్పలేము. 2, 8 స్థానములనుబట్టి వాడు అజ్ఞానమార్గములో పయనించునా లేక జ్ఞానమార్గములో పయనించునా అని చెప్పవచ్చును. మనిషికి వంద సంవత్సరములు ఆయుష్షు అని 2, 8 స్థానముల కర్మనుబట్టి అంచనాగా వంద సంవత్సరములలో ఇంతకాలము బ్రతకగలడనీ, వీని ఆయుష్షు ఇంత అని చెప్పుచుందురు.

మరణములు మూడు రకములున్నాయి. కాబట్టి ఆయుష్షు విషయములో జ్యోతిష్యుడు చెప్పిన మాటలు సత్యము కాగలదను నమ్మకము లేదు. ఆయుష్షు విషయములో ఒక్క యోగులు తప్ప మిగతావారు ఖచ్ఛితముగా చెప్పలేరని తెలియుచున్నది. ఇంతవరకు మనము జ్యోతిష్య శాస్త్రము ప్రకారము కర్మచక్రములోని మొత్తము పన్నెండు స్థానములలో ఏ కర్మ నిలువ ఉన్నదో తెలుసుకొన్నాము. ఇప్పుడు 46వ చిత్రపటములో 2,8 స్థానముల కర్మలను గుర్తించుకొని చూస్తాము.




46వ చిత్రపటము. పూర్తి కర్మచక్రము.

ఇప్పటికి కర్మచక్రములోని పన్నెండు భాగములలోని కర్మను కొంత వరకు గుర్తించుకొన్నాము. జీవితములో ముఖ్యమైన విషయముల కర్మలను మాత్రము గుర్తించి చూచుకొన్నాము. మనము చెప్పుకోని ఎన్నో

| 12 | 1 | 2 | 3 |
|---|---|---|---|
| శరీర అంత్య కర్మ | శరీర ప్రారంభ | అజ్ఞాన జీవితము ఎంత | ప్రపంచ ధనము |
| 11 పరమాత్మ ప్రపంచ జ్ఞానము | కర్మపత్రము | | స్థూల స్థిరాస్తులు 4 |
| 10 కని పించని ఆస్తి కీర్తి | | | ప్రపంచ జ్ఞానము 5 |
| పరమాత్మ ప్రపంచ ధనము | జ్ఞాన ప్రపంచ జీవితము ఎంత | భార్య సంబంధ | శత్రుఋణ రోగ కర్మలు |
| 9 | 8 | 7 | 6 |

46వ చిత్రపటము. పూర్తి కర్మచక్రము.

విషయములు మనిషి జీవితములో ఉన్నవి. ఉదాహరణకు సంతానమును గురించిన కర్మ ఏ స్థానములో ఉండునో మనము చెప్పుకోలేదు. సంతానము మనిషి జీవితములో ముఖ్యమైనది. ఎంతో ముఖ్యమైన సంతాన విషయము కర్మరూపములో ఎక్కడుండునో గమనించితే ఈ విధముగా తెలియుచున్నది. తల్లి తండ్రుల గుణములు పిల్లలకు వస్తాయి అంటుంటారు. అట్లే తల్లి తండ్రులు తెలివైనవారైతే పుట్టే పిల్లలు కూడా తెలివైనవారు పుట్టుదురని కూడా చెప్పుచుందురు. తల్లితండ్రుల లక్షణములే వారి పిల్లలకు వస్తాయి అని చాలామంది చెప్పుట విన్నాము. చాలావరకు వారు చెప్పినట్లే బయట కనిపించడము జరుగుచున్నది. ప్రపంచ జ్ఞానము ప్రపంచ బుద్ధులు తల్లి తండ్రుల వలన వచ్చినవారు అక్కడక్కడ కనిపించడము వలన తల్లితండ్రుల బుద్ధులు పిల్లలకు వస్తాయని చెప్పడము జరుగుచున్నది. తల్లితండ్రులు అజ్ఞానులైతే పిల్లలకు కూడా వారి అజ్ఞానము రావడమూ, అలాగే తల్లి

తండ్రులు దైవభక్తికలవారైతే వారి పిల్లలు కూడా కొంత దైవభక్తి కల్గియుండడము జరుగుచున్నది. కర్మచక్రములో ఐదవస్థానము ప్రపంచ జ్ఞానమునకు సంబంధించినదిగా ఉండుట వలన, దానికి ఎదురుగాయున్న పదకొండవ స్థానము భక్తి, జ్ఞాన, ధర్మములకు సంబంధించినదియుండగా, ఈ రెండు స్థానములలోని బుద్ధి భావములు, జ్ఞాన, భక్తి భావములు సంతతికి వచ్చుచుండుట వలన ఎవరికైనా సంతానమును గురించిన కర్మ సమాచారము 5, 11 స్థానములలోనే ఉండునని తెలియుచున్నది. ఈ విధముగా కొన్ని కర్మలను ఏ స్థానములలో ఉన్నది గ్రహించవచ్చును.

శాస్త్రము అనగా సత్యము, సత్యము అనగా శాస్త్రమని చెప్పవచ్చును. కొన్ని కర్మలు జరిగెడు యదార్థసంఘటనలనుబట్టి తెలియవచ్చును. ఇప్పుడు సంతతి ఎటువంటిదో తెలియుటకు 5, 11 స్థానములను చూడవచ్చుననుట శాస్త్రబద్ధమా? అని ఎవరైనా అడిగితే దానికి సమాధానముగా ఇట్లు చెప్పవచ్చును. కొన్ని శాస్త్రబద్దముగా వ్రాసిపెట్టబడియుండును. కాబట్టి వాటిని అనుసరించవచ్చును. కొన్ని విషయములు వ్రాయనివి కూడా ఉండవచ్చును. అప్పుడు జరిగిన సత్యమునుబట్టి ఇది శాస్త్రమని తెలియవచ్చును. ముందే ఇతరుల చేత వ్రాయబడిన శాస్త్రమునుబట్టి కొన్ని విషయములను చెప్పవచ్చును. కొన్ని జరిగిన సత్యములనుబట్టి కొన్ని శాస్త్ర విషయములను కనిపెట్టి చెప్పవచ్చును. సంతాన విషయములో మేము జరుగుచున్న సత్యమునుబట్టి 5, 11 స్థానములు శాస్త్రబద్దముగా సంతాన స్థానములని చెప్పుచున్నాము. ఇదే పద్ధతిలో కొన్ని విషయములను అప్పటికప్పుడు గ్రహించవచ్చును.

# (28) కాలచక్రములో ఏ లగ్నము మంచిది?

కాలచక్రములోని పన్నెండు భాగములను పన్నెండు లగ్నములని అందురు. కాలచక్రములోని పన్నెండు లగ్నములకు పన్నెండు పేర్లు కలవని చెప్పుకొన్నాము. వివరముగా చెప్పుకొంటే పన్నెండు లగ్నములను పన్నెండు దేశములుగా పోల్చుకొని చెప్పవచ్చును. ప్రతి లగ్నము కొంత విస్తీర్ణముగల దేశములాంటిది. ఒక్కొక్క దేశమునకు ఒక్కొక్క రాజు అధిపతిగాయున్నట్లు, పన్నెండు లగ్నములకు పన్నెండు గ్రహములు రాజులుగా అధిపతులుగా యున్నారు. ఆ పన్నెండు మంది ఎవరికి వారు మంచివారే, అయినా వారు రెండు గుంపులుగాయున్నారు. ఒకవర్గము వారికి మరొక వర్గము వారు వ్యతిరేఖులుగాయుందురు. మనిషి జన్మించిన కాలమునుబట్టి, ఆ మనిషి ఒక వర్గము వారికి చెందినవాడుగా నిర్ణయించబడును. అప్పుడు ఒక వర్గమువారైన ఆరుమంది రాజులు లేక లగ్నాధిపతులు మనిషికి మిత్రులుగా ఉండగా, వారివైపుకు పోయినందుకు ఆ మనిషికి మిగతా ఆరు గ్రహములు శత్రువులుగా తయారగుదురు. ఏ మనిషికైనా దేశములుగానీ, ప్రదేశములు గానీ ఏ భావములేనివిగా, నిర్జీవమైనవిగా, అందరికీ సమానముగా ఉండును. సమానముగా లేనివారు ఆయా లగ్నములకు సంబంధించిన అధిపతులేనని తెలియవలెను. కొందరు మిత్రులైతే, కొందరు శత్రువులుగా ఉందురు. మనిషి కర్మనుబట్టి వాని జన్మనుబట్టి, జన్మించిన లగ్నమునుబట్టి మనిషికి లగ్నాధిపతులు ఆరుమంది శత్రువులుగానూ, ఆరుమంది మిత్రులుగాను ఏర్పడుచుందురు. కాలచక్రములోని లగ్నాధిపతు లైనవారు మనిషి ఎడల మంచిగా కొందరు, చెడుగా కొందరు ఉండుట వలన, కాలచక్రములోని లగ్నాధిపతులలో మంచివారుండవచ్చును గానీ, లగ్నములు మంచి, చెడు అనునవి ఉండవు. లగ్నములు అని పేరు పెట్టబడిన పన్నెండు భాగములు పన్నెండు ప్రదేశములేగానీ అందులో మంచి చెడు అనునవి ఉండవు.

లగ్నము అనబడునది నిర్ణీత పొడవు వెడల్పుగల ప్రదేశము అని అర్థము. కాలచక్రములోని పన్నెండు భాగములను పన్నెండు లగ్నములుగా చెప్పుచున్నాము. అలాగే కర్మచక్రములోని పన్నెండు భాగములను లగ్న ములనియే చెప్పుచున్నాము. అలా కర్మచక్రములోని భాగములను లగ్నము లనుట తప్పు. అయితే ముఖ్యముగా గమనించవలసిన విషయమేమనగా! కాలచక్రములోని భాగములకు మేషము, వృషభము అను పన్నెండు పేర్లు గలవు. కర్మచక్రములోని భాగములకు ప్రత్యేకించి పేర్లు ఉండవు. కర్మచక్రములోని భాగములకు వరుసగా సంఖ్య పేర్లుండును. ఆ విధానములో ఒకటవ స్థానము, రెండవ స్థానము అని మొదలిడి చివరకు పన్నెండవ స్థానము వరకు చెప్పుచుందురు. దీనినిబట్టి పేర్లనుబట్టి కాల చక్రమునూ, వరుస సంఖ్యనుబట్టి కర్మచక్రమునూ గుర్తించవచ్చును.

## 29 గ్రహములకు కాలచక్రములో స్వంత స్థానములున్నట్లు, బలమైన స్థానములు ఉన్నాయా?

కాలచక్రములో ఒక్కొక్క గ్రహమునకు ఒక్కొక్క లగ్నము స్వంత స్థానముగాయున్నదని ముందే తెలుసుకొన్నాము. ఎవరికైనా స్వంత స్థలమే బలముగా ఉండును. కనుక ఏ లగ్నమునకైనా ఆ లగ్నాధిపతియైన గ్రహమునకు తన స్వంత స్థానమే బలమైనదిగా ఉండును. ఒక గ్రహమునకు తన స్వంత లగ్న స్థానము తప్ప మిగతా స్థానములు బలమైనవిగానీ, బలహీనమైనవిగానీ ఉండవు. కొందరు ప్రతి గ్రహమునకు ఉచ్ఛ నీచ స్థానములున్నాయనీ, ఉచ్ఛ స్థానమందు గ్రహమునకు బలమెక్కువయనీ, నీచ స్థానమందు గ్రహమునకు బలము తక్కువయనీ చెప్పుచుందురు. అదంతయూ శాస్త్రబద్ధత గాని విషయమగును. ఎందుకు బలమైనదో,

ఎందుకు బలహీనమైనదో చెప్పుటకు శాస్త్రాధారములేదు. కావున గ్రహములకు స్వంత స్థానములున్నవిగానీ, ఉచ్ఛ నీచ స్థానములు లేవు. స్థానములనుబట్టి గ్రహములను బలమైనవనీ, బలహీనమైనవనీ చెప్పలేము. అయితే పన్నెండు గ్రహములలో సహజముగానే కొన్ని బలమైనవిగానున్నవనీ, కొన్ని బలహీనముగా ఉన్నవనీ చెప్పవచ్చును.

## 30 గ్రహములు ఎలా బలవంతులుగా, బలహీనులుగా ఉన్నారు?

గ్రహములు అనగా గ్రహించునవని అర్థము. పేరులో సమాన అర్థమున్నా, గ్రహించడములో కొన్ని గ్రహములు ఎక్కువగా, కొన్ని గ్రహములు తక్కువగా గ్రహించుకొనుచుండుట వలన, వాటిని బలవంతులు, బలహీనులని చెప్పడము జరిగినది. ఇప్పుడు మనకు అర్థమగుటకు గ్రహములకు చేతులున్నట్లు చెప్పుకొందాము. వాస్తవముగా గ్రహములకు చేతులు లేవు. గ్రహములు కర్మలను ఎలా గ్రహించునో పూర్తిగా ఎవరికీ తెలియదు. ఇప్పుడు మనకు అర్థమగు నిమిత్తము గ్రహములకు చేతులున్నట్లు చెప్పుచున్నాము గానీ నిజముగా వాటికి చేతులు లేవు. బాహు బలము (చేతుల బలము)ను బట్టి వీడు బలాఢ్యుడు, బలహీనుడు అని మనుషులను చెప్పుచుందురు. అందువలన గ్రహములను బలవంతులుగా చెప్పుటకు చేతులున్నట్లు చెప్పుకొనుచున్నాము. అంతేగానీ గ్రహములకు చేతులుండవు. గ్రహములన్నీ ఒకే ఆకారము కల్గియున్నవని చెప్పలేము. ద్వాదశ గ్రహములు ఉండగా వాటిలో ఇంతవరకు అందరూ తొమ్మిదిని మాత్రమే చెప్పుకొనుచూ నవగ్రహములని అన్నారు. ఖగోళములో లెక్కలేనన్ని గ్రహములు కోట్ల

సంఖ్యలో గలవు. అయినా మన కర్మచక్రములో ఉన్నవి ద్వాదశ గ్రహములు మాత్రమే. పన్నెండు గ్రహములలో తొమ్మిది గ్రహములకు సహజముగా రెండు చేతులు గలవు. (గ్రహములకు గ్రహించుశక్తి సూక్ష్మముగాయుండును. కావున గ్రహములు ఎలా గ్రహించుకొనునో ఎవరికీ తెలియదు. మనకు అర్థమగుటకు మాత్రమే గ్రహములకు చేతులున్నాయని చెప్పడము జరిగినది.) పన్నెండు గ్రహములలో తొమ్మిదింటికి రెండు చేతులుండగా, కేవలము మూడు గ్రహములకు మాత్రము నాల్గుచేతులు కలవు. రెండు చేతులున్న గ్రహములనూ, నాల్గు చేతులున్న గ్రహములనూ క్రింద వరుసలో చూస్తాము.

**సూర్యుడు** రెండు రకముల గ్రాహితశక్తికలవాడు (రెండు చేతులు కలవాడు)
**చంద్రుడు** రెండు రకముల గ్రాహితశక్తికలవాడు (రెండు చేతులు కలవాడు)
**కుజుడు** నాలుగు రకముల గ్రాహితశక్తికలవాడు (నాలుగు చేతులు కలవాడు)
**బుధుడు** రెండు రకముల గ్రాహితశక్తికలవాడు (రెండు చేతులు కలవాడు)
**గురువు** నాలుగు రకముల గ్రాహితశక్తికలవాడు (నాలుగు చేతులు కలవాడు)
**శుక్రుడు** రెండు రకముల గ్రాహితశక్తికలవాడు (రెండు చేతులు కలవాడు)
**శని** నాలుగు రకముల గ్రాహితశక్తికలవాడు (నాలుగు చేతులు కలవాడు)
**భూమి** రెండు రకముల గ్రాహితశక్తికలవాడు (రెండు చేతులు కలవాడు)
**రాహువు** రెండు రకముల గ్రాహితశక్తికలవాడు (రెండు చేతులు కలవాడు)
**కేతువు** రెండు రకముల గ్రాహితశక్తికలవాడు (రెండు చేతులు కలవాడు)
**మిత్ర** రెండు రకముల గ్రాహితశక్తికలవాడు (రెండు చేతులు కలవాడు)
**చిత్ర** రెండు రకముల గ్రాహితశక్తికలవాడు (రెండు చేతులు కలవాడు)

ఒక్కొక్క గ్రహము ఒక్కొక్క పేరుకల్గియున్నట్లు తమ కార్యకలాపము లందుగానీ, తమకున్న బలమునందుగానీ అందరూ సమానముగా ఉన్నా రనుటకు వీలులేదు. పన్నెండు గ్రహములలో తొమ్మిది గ్రహములు రెండు

చేతులుకల్గి పనిని చేయగా, మూడు గ్రహములు మాత్రము ప్రత్యేకించి నాలుగు చేతులుకల్గి పని చేయుచున్నవి. సూర్య, చంద్ర, బుధ, శుక్ర, భూమి, రాహువు, కేతువు, మిత్ర, చిత్ర అను పేర్లు గల నవగ్రహములు కర్మచక్రములో ఉంటూ, కర్మచక్రములోనున్న ప్రారబ్ధకర్మను రెండు చోట్లనుండి, రెండు చేతుల ద్వారా స్వీకరించుచుందురు. అట్లే మిగతా కుజ, గురు, శనిగ్రహములు మూడు ఒక్కొక్కటి నాలుగు చేతులు కల్గియుండి కర్మచక్రములోని ప్రారబ్ధకర్మను నాలుగు చోట్లనుండి తీసుకొని జీవుని మీద (మనిషి మీద) వదలుచుందురు. సూర్యుడు తన రెండు చేతులద్వారా తానున్న ఒకటవ స్థానములోని కర్మనూ, తనకు ఎదురుగానున్న ఏడవ స్థానములోని కర్మనూ స్వీకరించును. చంద్రుడు తన రెండు చేతులలో ఒక చేతి ద్వారా తానున్న ఒకటవ స్థానములోని కర్మనూ, రెండవ చేతి ద్వారా ఏడవ స్థానములోని కర్మనూ తీసుకొనును. సులభముగా అర్థమగుటకు క్రిందగల వాక్యములను చూడుము.

| | | |
|---|---|---|
| సూర్యుడు | 1,7 స్థానముల | కర్మను స్వీకరించును. |
| చంద్రుడు | 1,7 స్థానముల | కర్మను స్వీకరించును. |
| కుజుడు | 1,4,7,8 స్థానముల | కర్మను తీసుకొనును. |
| బుధుడు | 1,7 స్థానముల | కర్మను స్వీకరించును. |
| గురువు | 1,5,7,9 స్థానముల | కర్మను తీసుకొనును. |
| శుక్రుడు | 1,7 స్థానముల | కర్మను స్వీకరించును. |
| శని | 1,3,7,10 స్థానముల | కర్మను తీసుకొనును. |
| రాహువు | 1,7 స్థానముల | కర్మను తీసుకొనును. |
| కేతువు | 1,7 స్థానముల | కర్మను స్వీకరించును. |
| భూమి | 1,7 స్థానముల | కర్మను తీసుకొనును. |

| | | |
|---|---|---|
| మిత్ర | 1,7 స్థానముల | కర్మను స్వీకరించును. |
| చిత్ర | 1,7 స్థానముల | కర్మను స్వీకరించును. |

ఈ విధముగా ద్వాదశ గ్రహములు కర్మచక్రములోని ప్రారబ్ధకర్మను స్వీకరించి మనిషిచేత అనుభవింపజేయుచున్నవి. ఎల్లకాలము మనిషి ఒకే విధమైన కర్మను అనుభవింపక కాలము గడచుకొద్దీ వేరువేరు కర్మలను అనుభవిస్తూ పోవుచుండును. అందుకొరకు గ్రహములు తమస్థానములను వదలి వేరుస్థానములలో ప్రవేశించి, అక్కడి క్రొత్త కర్మను కూడా స్వీకరించ వలసియున్నది. కావున ద్వాదశ గ్రహములు కర్మచక్రము మీద తమ కిరణములను వేరువేరు స్థానముల మీద ప్రసరింపజేయుటకు, కాల చక్రములో కొంత వేగముతో కదిలి తిరుగవలసివచ్చుచున్నది.

## 31 రాశి అంటే ఏమి? లగ్నము అంటే ఏమి?

జ్యోతిష్యులందరూ పన్నెండు స్థానములను రాశులనీ, అలాగే లగ్నములనీ పలుకుచుందురు. ఒకప్పుడు వృషభలగ్నమని పేరును జోడించి చెప్పిన దానినే మరొకప్పుడు వృషభరాశి అని చెప్పుచుందురు. ఒకమారు లగ్నమని మరొకమారు రాశియని ఒకే స్థానమును చెప్పుట వలన, రాశి అనినా లగ్నమనినా ఒకటేనని చాలామంది అనుకోవడము జరుగుచున్నది. వాస్తవానికి రాశి వేరనీ, లగ్నము వేరనీ తెలియవలెను. కాలచక్రములోని పన్నెండు స్థానములను లగ్నములని చెప్పవచ్చును. అలాగే కర్మచక్రములోని పన్నెండు స్థానములను పన్నెండు రాశులని చెప్పవచ్చును. కాలచక్రములోని భాగములను మాత్రమే లగ్నమనాలి. లగ్నము అనుమాటను కాలచక్రములో నున్న ఏ స్థానమునకైనా వాడవచ్చునుగానీ, ఎటువంటి సందర్భములో

అయినా రాశి అను పేరును కాలచక్రములోని భాగములకు వాడకూడదు. ఇకపోతే కర్మచక్రములోని పన్నెండు భాగములను పన్నెండు స్థానములుగా చెప్పుకొనుచున్నాము. కాలచక్రములోని ప్రతి భాగమునకు ఒక పేరు కలదు. కర్మచక్రములోని భాగములకు పేర్లులేవు. వాటికి సంఖ్యమాత్రము ఉండును. అందువలన మూడవ స్థానమనీ, నాల్గవ స్థానమనీ స్థానములకు సంఖ్యను చేర్చి చెప్పుచున్నాము. సంఖ్యల స్థానములుగా చెప్పబడు పేరులేని భాగములైన కర్మచక్రస్థానములను రాశులని పిలువడము జరుగుచున్నది. రాశి అంటే దేనినైనా కుప్పగా పోసినప్పుడు ఆ కుప్పను రాశి అనడము జరుగుచున్నది. కర్మచక్రములోని అన్ని భాగములలోనూ కర్మను రాశులుగా నింపియుండడము వలన, ప్రతి మానవుడు కర్మచక్రములోని రాశులలోనున్న కర్మనే అనుభవించడము జరుగుచున్నది. కర్మచక్రములోని పన్నెండు స్థానములలో కర్మ పేర్చబడియున్నది. కావున ప్రతి స్థానమును రాశి అంటున్నాము. కర్మచక్రములోని ఏ స్థానములో ఏ కర్మ రాశిగా పోయబడు చున్నదో, మనము ఇంతకుముందే తెలుసుకొన్నాము.

లగ్నము అనగా అంటిపెట్టుకొనియున్నదనీ, తగులుకొనియున్నదనీ చెప్పవచ్చును. కాలచక్రములో గల పన్నెండు గ్రహములు ఏదో ఒక స్థానమును అంటిపెట్టుకొని ఉండుట వలన ఆ స్థానములను లగ్నములు అన్నాము. ప్రతి గ్రహము కొంతకాలము ఒక స్థానమును అంటిపెట్టుకొని యుండి తర్వాత మరియొక ప్రక్క స్థానములోనికి చేరుచున్నది. అందువలన కాలచక్రములోని స్థానములను లగ్నములను పేరుతో చెప్పుచున్నాము. ఒక గ్రహము కాలచక్రములోని ఒక స్థానమును ఆశ్రయించుకొని, అక్కడ నుండి తన కిరణములను క్రిందనున్న కర్మచక్రములోని కర్మరాశుల మీద ప్రసరింపజేయుచుండును. ఒక గ్రహము ఒక కాల లగ్నములోవుండి

కర్మరాశి మీద తన కిరణములు పడినప్పుడు, ఆ కర్మరాశిలో ఏ కర్మ ఉండునో ఆ కర్మను స్వీకరించి, క్రింద గుణచక్రములోనున్న జీవుని మీదకు ప్రసరింపజేయును. అప్పుడు జీవుడు ఆ కర్మను అనుభవించడము జరుగుచున్నది. కాలచక్రములోని గ్రహములను కాంతిని ప్రసరించు ఫోకస్‌లైట్లుగా పోల్చుకొని, క్రింద కర్మచక్రములోని కర్మను రంగు పేపరుగా పోల్చుకుంటే, గ్రహము కాంతి, క్రింది చక్రములోని కర్మరంగును, ఇంకా క్రిందగల గుణ చక్రములోని జీవుని మీద ప్రసరించుట వలన, కర్మరంగును జీవుడు పొందుచున్నాడు. ఈ విషయము క్రింద 47వ చిత్రపటములో చూడండి.




47వ చిత్రపటము.

లగ్నములలోని గ్రహములు రాశులలోని కర్మలను గుణములలోని జీవుని మీద వేయుట వలన, జీవుడు ఎటూ తప్పించుకోకుండా కర్మను అనుభవించవలసివస్తున్నది. ఒక మనిషి ఒక బాధను అనుభవిస్తున్నాడంటే వాని తలలోనున్న కాల, కర్మ, గుణచక్రములలో మనకు తెలియకుండానే ఒక క్రియ జరుగుచున్నదని తెలియుచున్నది. కనిపించక అజ్ఞానమను

చీకటిమయములోనున్న ఈ క్రియను జ్ఞానము అను దీపముతో తెలియడమునే జ్యోతిష్యము అంటున్నాము. **సంగీతములో రాగం, తాళం, పల్లవి ఉన్నట్లు జ్యోతిష్యములో లగ్నములలోని గ్రహములు, రాశులలోని కర్మ, గుణములలోని జీవుడు కలడు. రాగం, తాళం, పల్లవి తెలిస్తేనే సంగీతమును తెలిసినట్లు, గ్రహ లగ్నములు, కర్మ రాశులు, అనుభవించే జీవుడు తెలియనిదే జ్యోతిష్యము తెలియదు.**

ఆధ్యాత్మిక విషయములో పరమాత్మను గురించి చెప్పునప్పుడు కొందరు కొన్ని సమయములలో దేవుడనీ, కొన్ని సమయములలో భగవంతుడనీ చెప్పుచుందురు. చాలామందికి దేవునికీ, భగవంతునికీ అర్థము తెలియదు. కావున దేవున్ని, భగవంతున్ని తమకిష్టమొచ్చినట్లు చెప్పుచుందురు. అదే విధముగా జ్యోతిష్య విషయములో లగ్నము అంటే ఏమి, రాశి అంటే ఏమి అని అర్థము, వివరము తెలియనప్పుడు ఏ సందర్భములో లగ్నమును చెప్పాలనీ, ఏ సందర్భములో రాశిని చెప్పాలనీ, తెలియక లగ్నమును చెప్పవలసిన చోట రాశినీ, రాశిని చెప్పవలసిన చోట లగ్నమునూ చెప్పుచున్నారు. భగవంతున్ని చెప్పవలసిన చోట దేవున్ని, దేవున్ని చెప్పవలసిన చోట భగవంతున్ని చెప్పడము ఎంత తప్పో లగ్నము, రాశియొక్క వివరము తెలియకుండా చెప్పడము అంతే తప్పగును.

## 32 గ్రహములకు గమనమున్నదా?

కాలచక్రములోనున్న ద్వాదశ గ్రహములకు గమనమున్నదని చెప్ప వచ్చును. గ్రహములు ప్రయాణము చేయుచుండుట వలన, కాలచక్రము లోని అన్ని లగ్నములను దాటుచున్నవి. క్రిందగల కర్మచక్రములోనున్న

అన్ని రాశుల మీద తమ కిరణములను ప్రసరింపజేయుచున్నవి. ఇక్కడ ముఖ్యముగా గమనించవలసిన విషయమేమనగా! కాలచక్రము కూడా కొంత వేగముతో తిరుగుచున్నది. అయినా అది బయటికి కనిపించునట్లు గానీ, ఇతరులు గుర్తించునట్లుగానీ తిరగడము లేదు. కాలచక్రము యొక్క వేగమును గమనించితే కాలచక్రము ఒకమారు (ఒకచుట్టు) తిరుగుటకు 43,20,000 సంవత్సరముల కాలము పట్టును. అందువలన కాలచక్రము తిరిగినట్లు కనిపించడములేదు. కాలచక్రములోని పన్నెండు గ్రహములు తమ గమనము బయటికి తెలియునట్లు ఒక్కొక్కటి ఒక్కొక్క వేగముతో కదులుచున్నవి. ద్వాదశ గ్రహముల వేగము ఎట్లున్నదో ఇప్పుడు గమనిద్దాము.

| | | | | |
|---|---|---|---|---|
| **సూర్యుడు** | **కాలచక్రములో** | **ఒక లగ్నమును** | **దాటుటకు** | **1 నెలకాలము పట్టును.** |
| **చంద్రుడు** | **కాలచక్రములో** | **ఒక లగ్నమును** | **దాటుటకు** | **2.1/2 దినములుపట్టును** |
| **కుజుడు** | **కాలచక్రములో** | **ఒక లగ్నమును** | **దాటుటకు** | **1.1/2 నెల పట్టును** |
| **బుధుడు** | **కాలచక్రములో** | **ఒక లగ్నమును** | **దాటుటకు** | **1 నెల కాలము పట్టును.** |
| **గురువు** | **కాలచక్రములో** | **ఒక లగ్నమును** | **దాటుటకు** | **1 సంవత్సరము పట్టును** |
| **శుక్రుడు** | **కాలచక్రములో** | **ఒక లగ్నమును** | **దాటుటకు** | **1 నెల కాలము పట్టును.** |
| **శని** | **కాలచక్రములో** | **ఒకలగ్నమును** | **దాటుటకు** | **2.1/2 సంవత్సరాలు పట్టును.** |
| **రాహువు** | **కాలచక్రములో** | **ఒక లగ్నమును** | **దాటుటకు** | **1.1/2 సంవత్సరం పట్టును.** |
| **కేతువు** | **కాలచక్రములో** | **ఒక లగ్నమును** | **దాటుటకు** | **1.1/2 సంవత్సరం పట్టును.** |
| **మిత్ర** | **కాలచక్రములో** | **ఒక లగ్నమును** | **దాటుటకు** | **1.1/2 సంవత్సరం పట్టును.** |
| **చిత్ర** | **కాలచక్రములో** | **ఒక లగ్నమును** | **దాటుటకు** | **1.1/2 సంవత్సరం పట్టును.** |
| **భూమి** | **కాలచక్రములో** | **ఒక లగ్నమును** | **దాటుటకు** | **1 నెల కాలము పట్టును.** |

ఈ విధముగా కాలచక్రములోని పన్నెండు గ్రహములకు వేరువేరు గమనములున్నవని తెలియుచున్నది. వాటిలో సూర్య, బుధ, శుక్ర, భూమి నాలుగు ఒక వేగమునూ, రాహువు, కేతువు, మిత్ర, చిత్ర అను నాలుగు ఒక వేగమునూ కల్గియున్నవి. మిగతా నాల్గు గ్రహములైన చంద్రుడు, 2. 1/2 దినము, కుజుడు 1. 1/2 నెల, శని 2. 1/2 సంవత్సరములు, గురువు 1 సంవత్సరము వేరువేరు వేగములు కల్గియున్నారు. కాలచక్రములో ఒక లగ్నమును దాటుటలో గ్రహముల వేగమును చెప్పుకొన్నాము.

కాలచక్రములోనున్న ఒక లగ్నమును దాటుటకు ఏ గ్రహమునకు ఎంతకాలము పట్టునో తెలుసుకొన్నాము. ఒక గ్రహము ఒక లగ్నమును దాటుటకు కొంతకాలము పట్టినపుడు కాలచక్రములోని పన్నెండు లగ్నములను దాటుటకు ఎంతకాలము పట్టునో సులభముగా తెలియుచున్నది. వాటి వివరమును ఇప్పుడు చూస్తాము.

**సూర్యుడు** కాలచక్రములో తనకున్న వేగముతో ఒక లగ్నమును దాటుటకు 1 నెలరోజులు పట్టగా, 12 లగ్నములను దాటుటకు 1 సం॥ పట్టును.

**చంద్రుడు** కాలచక్రములో తనకున్న వేగముతో ఒక లగ్నమును దాటుటకు 2. 1/2 దినము పట్టగా, 12 లగ్నములను దాటుటకు 1 నెల పట్టును.

**కుజుడు** కాలచక్రములో తనకున్న వేగముతో ఒక లగ్నమును దాటుటకు 1. 1/2 నెల పట్టగా, 12 లగ్నములను దాటుటకు 1. 1/2 సం॥ పట్టును.

**బుధుడు** కాలచక్రములో తనకున్న వేగముతో ఒక లగ్నమును దాటుటకు 1 నెల పట్టగా, 12 లగ్నములను దాటుటకు 1 సం॥ పట్టును.

**గురువు** కాలచక్రములో తనకున్న వేగముతో ఒక లగ్నమును దాటుటకు 1 సం॥ పట్టగా, 12 లగ్నములను దాటుటకు 12 సం॥ పట్టును.

**శుక్రుడు** కాలచక్రములో తనకున్న వేగముతో ఒక లగ్నమును దాటుటకు 1 నెల పట్టగా, 12 లగ్నములను దాటుటకు 1 సం॥ పట్టును.

**శని** కాలచక్రములో తనకున్న వేగముతో ఒక లగ్నమును దాటుటకు 2. $\frac{1}{2}$సం॥ పట్టగా, 12 లగ్నములను దాటుటకు 30 సం॥ పట్టును.

**రాహువు** కాలచక్రములో తనకున్న వేగముతో ఒక లగ్నమును దాటుటకు $1\frac{1}{2}$ సం॥ పట్టగా, 12 లగ్నములను దాటుటకు 18 సం॥ పట్టును.

**కేతువు** కాలచక్రములో తనకున్న వేగముతో ఒక లగ్నమును దాటుటకు $1\frac{1}{2}$ సం॥ పట్టగా, 12 లగ్నములను దాటుటకు 18 సం॥ పట్టును.

**మిత్ర** కాలచక్రములో తనకున్న వేగముతో ఒక లగ్నమును దాటుటకు $1\frac{1}{2}$సం॥ పట్టగా, 12 లగ్నములను దాటుటకు 18 సం॥ పట్టును.

**చిత్ర** కాలచక్రములో తనకున్న వేగముతో ఒక లగ్నమును దాటుటకు $1\frac{1}{2}$ సం॥ పట్టగా, 12 లగ్నములను దాటుటకు 18 సం॥ పట్టును.

**భూమి** కాలచక్రములో తనకున్న వేగముతో ఒక లగ్నమును దాటుటకు 1 నెల పట్టగా, 12 లగ్నములను దాటుటకు 1 సం॥ పట్టును.

ఈ విధముగా రాహు, కేతు, మిత్ర, చిత్ర అను నాలుగు గ్రహములు ఒకే వేగముతో కాలచక్రమును 18 సం॥ములలో ఒకమారు దాటుచున్నవి. అదే విధముగా సూర్య, బుధ, శుక్ర, భూమి అను నాలుగు గ్రహములు ఒకే వేగముతో కాలచక్రమును 1 సం॥ములో దాటుచున్నవి. ఇకపోతే చంద్రుడు 30 దినములలో కాలచక్ర పన్నెండు లగ్నములను దాటివేయగా, శని గ్రహము 30 సం॥ములలో కాలచక్రములోనున్న పన్నెండు లగ్నములను దాటుచున్నది. కుజ గ్రహము మొత్తము కాలచక్ర లగ్నములను దాటుటకు

$1\frac{1}{2}$ సం॥ము పట్టుచున్నది. గురువు కాలచక్రములోనున్న పన్నెండు లగ్నములను దాటుటకు 12 సం॥ముల కాలము పట్టుచున్నది. నాలుగు గ్రహములు 18 సం॥ గమనమునూ, మరియొక నాలుగు గ్రహములు 1 సంవత్సర గమనమునూ, మిగత నాలుగు గ్రహములు వేరువేరు గమనమునూ కల్గియున్నా, పన్నెండు గ్రహములు పన్నెండు విధముల వేగము కల్గియున్నారని చెప్పవచ్చును. ఎందుకనగా! ఒక సంవత్సర గమనమును కల్గియున్న నాలుగు గ్రహములు ఖచ్చితముగా సం॥ములోనే కాలచక్రమును ఒకమారు దాటునని చెప్పలేము. నాలుగు గ్రహములు ఒకే వేగమును కల్గియున్నా చివరికవి ఒకటి లేక రెండు నిమిషములు మొదలుకొని ఐదు లేక ఆరు నిమిషముల తేడాతో పయనించుచున్నవి. ఒకప్పుడు ఆరు నిమిషములు ముందున్న గ్రహము మరియొకప్పుడు ఐదు లేక ఆరు నిమిషముల ఆలస్యము కూడా కావచ్చును. పన్నెండు గ్రహములు వాటికున్న వేగములో ఒకటినుండి ఆరు నిమిషముల వరకు ముందు వెనుక ప్రయాణించుచున్నవి. ఒక్కొక్కప్పుడు అన్ని గ్రహములు ఎటువంటి ముందు వెనుక లేకుండా, తమకున్న వేగముతో ఖచ్చితముగా ప్రయాణము చేయగల్గు చున్నవి. అనేక (అన్ని) గ్రంథములలో కేవలము తొమ్మిది గ్రహములను గురించే వ్రాయడము జరిగినది. ఈ గ్రంథములో మాత్రము ప్రత్యేకించి పన్నెండు గ్రహములను గురించి వ్రాయడము జరిగినది. అట్లే వేగములో కూడా మూడు విధముల వేగమును చూపడము జరిగినది. ఈ గ్రంథములో కొన్ని విషయములను క్రొత్తగా ఇక్కడినుండే చెప్పడము వలన జాగ్రత్తగా పరిశీలించి అర్థము చేసుకోవాలని కోరుచున్నాము.

ఇంతవరకు జ్యోతిష్యశాస్త్రములో కాలచక్రము, కర్మచక్రము అను మాటలేలేవు, లగ్నము రాశులని పేరున్నా, వేటిని రాశులనాలో, వేటిని

లగ్నములనాలో తెలియదు. దేవునికీ భగవంతునికీ తేడా తెలియక ఇద్దరూ ఒకటే కదా! అన్నట్లు, లగ్నమూ, రాశీ రెండూ ఒకటే కదా! అంటున్నారు. దేవుడు వేరు, భగవంతుడు వేరని మేము వ్రాసిన ఆధ్యాత్మిక గ్రంథములలో మాత్రమే తెలిసినట్లు, ఇప్పుడు ఈ గ్రంథములో మాత్రమే లగ్నము వేరు, రాశివేరని తెలియుచున్నది. ముందు ఇతరుల చేత వ్రాయబడిన విషయములకు, ఇప్పుడు మాచేత వ్రాయబడిన విషయములకు ఎంతో తేడాయుండుట వలన విచక్షణతో జాగ్రత్తగా చదువవలెనని తెలుపుచున్నాము.

## 33 కాలచక్రమునకు జీవునికి సంబంధమేమి?

మనిషి తలలో ఎవరికీ కనిపించకుండా సూక్ష్మముగా నాలుగు చక్రముల నిర్మాణముందని తెలుసుకొన్నాము కదా! వాటిలో అన్నిటికంటే పైనగల బ్రహ్మచక్రముతో మనకు సంబంధము లేదు. మనకున్న సంబంధ మంతా కాల, కర్మ, గుణచక్రములతోనే కలదు. జీవుడు గుణచక్రములో గుణముల మధ్య ఉండగా, కర్మచక్రములోని కర్మను ఆధారము చేసుకొని, కాలచక్రములోని గ్రహములు జీవునిమీద తమ ప్రభావమును చూపుచున్నవి. కాలచక్రములోని ద్వాదశ గ్రహములు క్రిందగల కర్మచక్రము మీదనుండి కర్మను గుణచక్రములోని జీవునిమీద ప్రసరింపజేయుచున్నవి. మనిషికి ముఖ్యముగానున్న మూడు కాల, కర్మ, గుణచక్రములలో పైనగల కాలచక్రమునకు క్రిందగల గుణచక్రమునకు అనుసంధానముగా కర్మచక్రమున్నది. క్రిందగల గుణచక్రములోని జీవుడు కర్మచక్రములోని కర్మతో సంబంధపడి యుండగా, కర్మచక్రములోని కర్మ పైనగల కాలచక్రములోని గ్రహములతో సంబంధపడియున్నది. జీవుడు (మనిషి) జన్మలోగానీ, మరణములోగానీ గుణచక్రమును వదలి బయటికి పోలేదు.

మనిషి సంపాదించుకొన్న ఆగామి కర్మ 69 సం॥, 5 నెలల, 10 రోజులకొకమారు సంచితముగా మారుచున్నది. వచ్చిన ఆగామికర్మ, మారిన సంచితకర్మ కర్మచక్రములో క్రింది భాగమున అణిగియుండగా, ఒక జన్మకు మాత్రము నిర్ణయించబడిన ప్రారబ్ధకర్మ కర్మచక్రములోని పన్నెండు రాశు లందు తేలుతూయుండును. పైకి తేలుచున్న ప్రారబ్ధకర్మ మీదనే కాలచక్రములోని గ్రహముల కిరణముల వెలుగు పడుచుండును. అలా పడిన కిరణములు తమతోపాటు కర్మచక్రములోని ప్రారబ్ధకర్మ యొక్క రంగును (పాపపుణ్యములను) తీసుకొని క్రిందగల గుణ చక్రములోని జీవునిమీద ప్రసరింపజేసి, ఆ కర్మను జీవుడు అనుభవించునట్లు చేయుచున్నవి. అలా ప్రారబ్ధకర్మను అనుభవించడమును జీవితము అంటాము.

జీవితము జననముతో ప్రారంభమై మరణముతో ముగియుచున్నది. జీవితము ప్రారంభమయ్యేది గుణచక్రములోనున్న జీవునికే అయినా అది ఏ కర్మనుండి ప్రారంభమగుచున్నదో, ఏ కర్మతో అంత్యమగుచున్నదో తెలియుటకు కర్మచక్రము మీద ఆధారపడవలసిందే. కర్మచక్రములో ఏ కర్మను ఏ గ్రహము ప్రారంభించునో తెలియుటకు కాలచక్రము మీద ఆధారపడవలసిందే. కర్మచక్రములోని సంచితకర్మ మనిషి మరణములో ప్రారబ్ధకర్మగా కొంత ఏర్పడి, రెండవ జీవితమునకు కారణమగు చున్నది. ఇదంతయూ కొంతవరకు తెలియాలంటే కాలచక్రమునుండియే ప్రారంభించాలి. కాలచక్రమునుబట్టి ఏ కాలములో మనిషి జన్మ జరుగు చున్నదో, ఆ కాలమునుండి జీవిత పథకము నిర్ణయించబడుచున్నది. కావున ఆ కాలమును జాపథకము అంటారు. 'జ' అనగా పుట్టుట అని అర్థము. పుట్టుక సమయములో లేక పుట్టిన కాలములో నిర్ణయించబడిన జీవిత ప్రారబ్ధమును జీవిత ఫతకముగా నిర్ణయించారు. ఫతకము అనగా ముందే

నిర్ణయించబడినదని అర్థము. జననములోనే జరిగిన ఫతకము కావున దానిని జాఫతకము అనెడివారు. పూర్వము జాఫతకముగా పెట్టబడిన పేరు కాలక్రమములో జాతకముగా మారిపోయినది. జాఫతకము అను పేరులోగల రెండవ అక్షరమైన ఫ లేకుండా పోయి చివరకు జాతకముగా మిగిలిపోయినది.

నేడు కూడా ఒక మనిషి జీవితమును గురించి తెలియుటకు వాని పుట్టుకలోనున్న కాలమునుబట్టి జాతకమును (జాఫతకమును) చూచుట సాంప్రదాయముగా కలదు. జ్యోతిష్యులందరూ జాతకమును ఆధారము చేసుకొని చూచినా, చూచేవారిలో చాలామందికి కాలచక్రమేదో, కర్మ చక్రమేదో, రాశి ఏదో, లగ్నము ఏదో తెలియని దానివలన జాతక సమయములో ఏర్పరచబడిన కర్మలను సరిగా తెలియలేకపోవుచున్నారు. జ్యోతిష్యము అనుమాట జాఫతకము (జాతకము) నుండే ప్రారంభమగును. కావున జాతకము అను దానిని గురించీ, దానిని ఎలా తెలియాలోనను విషయమును గురించి ఇప్పుడు తెలుసుకొందాము.

## 34 త్రి రా లేక రాత్రి

కాలచక్రములో సూర్యుడు లగ్నముల మీద ప్రయాణిస్తూ ఒక్కొక్క లగ్నమును దాటుచూ కాలచక్రములోని మేషం, వృషభము మొదలగు లగ్నములను దాటుచూపోయి చివరకు మీన లగ్నమును దాటుటకు ఒక సంవత్సర కాలము పట్టునని చెప్పుకొన్నాము. కాలచక్రములో తిరుగు సూర్యుడు తన కిరణములను కర్మచక్రముమీద ప్రసరించునని చెప్పుకొన్నాము కదా! అలా కర్మచక్రము మీద సూర్యకిరణములు పడడమే

కాకుండా, అక్కడ పడిన కిరణములు కర్మను తీసుకువచ్చి క్రింద చక్రములో నున్న జీవుని మీద వేయునని చెప్పుకొన్నాము. సూర్య కిరణములు గుణ చక్రము మీద పడినప్పుడు, గుణములు పనిచేయడమూ, పడనప్పుడు పని చేయకుండా పోవడము జరుగుచుండును. గుణచక్రములో మూడు గుణభాగములున్నట్లు చెప్పుకొన్నాము. కర్మ కిరణములు గుణముల మీద పడినప్పుడు గుణములు పని చేయడమూ, గుణముల మీద పడనప్పుడు గుణములు పని చేయకుండా పోవడము జరుగుచుండును. గుణములు పనిచేసిన కాలమును పగలు అనియూ, గుణములు పని చేయని కాలమును రాత్రి అనడము జరుగుచున్నది. 'త్రి' అంటే మూడు గుణములనీ, 'రా' అంటే లేకుండడమని అర్థము. వాటినే రాత్రి అనుట వలన మూడు గుణములు పని చేయని సమయమని అర్థము చేసుకోవచ్చును. మూడు గుణములు పని చేయని సమయములో మనస్సుకు పనిలేక అది నిద్రలోనికి జారుకొనును. నిద్ర అంటే ఏ అనుభవమూ లేనిదని చెప్పవచ్చును. ఏ అనుభవమూ లేనిదానిని నిద్ర అనడమేకాక, మూడు గుణములు లేనిది కావున ఆ సమయమును రాత్రి అని అంటున్నాము. రాత్రి సమయములో కూడా కాలచక్రములో గ్రహములు తిరుగుచున్నా కర్మ అనుభవము జీవునికి ఎందుకు లేదని ప్రశ్నరాగలదు. దానికి సమాధానము ఏమనగా! చావుపుట్టుకల విషయమును మనిషి అనుభవ పూర్వకముగా తెలియునట్లు చావుకు గుర్తుగా నిద్రనూ, పుట్టుకకు గుర్తుగా మెలుకువను దేవుడుంచాడు. చావులోనే మూడు గుణములు పని చేయవు కావున, రాత్రి అను పేరును నిద్ర సమయమునకు చెప్పడము జరిగినది. చీకటి వస్తే రాత్రియని, వెలుగువస్తే పగలుయని అనుకోవడము అందరికీ అలవాటైనది. చీకటి వెలుగులు నిజమైన రాత్రి పగళ్ళుకావు.

కర్మ అమలు జరుగునప్పుడు గుణములుండును కావున, అది చీకటి సమయమైనా రాత్రి కాదు. అలాగే కర్మ అమలు జరగనప్పుడు, మూడు గుణములు పనిచేయనప్పుడు, అది వెలుగు సమయమైనా పగలు కాదు. ఇదంతయూ అంతరార్థముతో కూడుకొన్న విషయము. ఒక మనిషిలో మూడు గుణ భాగములలోని ఏ ఒక్క గుణము పని చేయకున్నా వాడు ఆ సమయములో కర్మ అనుభవించనట్లేనని లెక్కించవలయును. కర్మ అనుభవించనప్పుడు క్రింద గుణచక్రములోని జీవునికి అనుభవము లేదు. అట్లే పైన కాలచక్రములోని గ్రహముల కిరణములు ఏ కర్మమీదా ప్రసరించనట్లేనని తెలియవలెను. అన్ని సమయములలో గ్రహములు కాలచక్రము మీద ప్రయాణించునప్పుడు, వాటి కిరణములు క్రిందగల కర్మచక్రము మీద ఎందుకు పడలేదని ఎవరైనా ఇక్కడ ప్రశ్నించవచ్చును. దానికి సమాధానమును క్రింద సమాచారములో చూస్తాము.

## 35 గ్రహముల రాజు - గ్రహముల మంత్రి

ఖగోళములో ఎన్నో గ్రహములు, ఉపగ్రహములు, గ్రహములకంటే పెద్దవైన భూతములూ, మహాభూతములూ ఉన్నాయని గతములో మేము వ్రాసిన గ్రంథములలో కూడా చెప్పాము. మనము నివశించు భూమి కూడా ఒక గ్రహమే. కొన్ని గ్రహముల సముదాయము ఒక గుంపుగా ఏర్పడి తమ బాధ్యతను నిర్వర్తించుచున్నవి. అటువంటి గుంపులలో మనము ఇంతవరకు చెప్పుకొన్న పన్నెండు గ్రహములు కలిసి తమ విధి విధానమును ఆచరించుచున్నవి. సూర్యుడు మొదలుకొని మిత్ర చిత్ర వరకు గల పన్నెండు గ్రహములను ఒక కుటుంబముగా చెప్పుకొంటున్నాము. మన గ్రహ కుటుంబమును సూర్యకుటుంబము అని అంటున్నాము. కుటుంబములో

ఒక పెద్ద ఉన్నట్లు, కుటుంబములోని వారందరు కుటుంబపెద్ద మాటను అనుసరించి నడుచుకొన్నట్లు, సూర్య కుటుంబములో సూర్యుడే కుటుంబ పెద్ద. సూర్యుని మాటను అనుసరించి సూర్యకుటుంబములోని గ్రహములు పనిచేయును. సూర్య కుటుంబములో ముఖ్యమైన నియమము ఒకటి కలదు. అది ఏమనగా! సూర్యుడు తన కిరణములను కర్మచక్రము మీద ప్రసరించినప్పుడే మిగతా పదకొండు గ్రహములు తమ కిరణములను కర్మచక్రముమీద ప్రసరింప చేయాలి. ఎప్పుడు తన కిరణములను సూర్యుడు ప్రసరించకుండ చేయునో, అప్పుడు అన్ని గ్రహములు అట్లే చేయాలి. ఇది కుటుంబ నియమము. ఈ నియమమును పాటిస్తూ లగ్నములకధిపతులుగా, లగ్నములనుబట్టి మిత్ర శత్రువులుగా ఎవరి పని వారు చేయవలసి ఉండును.

సూర్యకుటుంబములో సూర్యుడు కుటుంబ యజమానిగా ఉండుట వలన, మిగతా గ్రహములన్నీ సూర్యున్ని ఆధారము చేసుకొని, వాటి కిరణములను కర్మచక్రము మీద ప్రసరింపజేయుచున్నవి. సూర్య కిరణములు కర్మచక్రము మీద లేని సమయములో మిగతా గ్రహములనుండి వచ్చు కిరణములూ, కర్మ ఆగిపోవుట వలన ఆ సమయములో జీవుడు ఏ కర్మనూ అనుభవించడు. కర్మ అనుభవించని కాలమును నిద్ర అనియూ, రాత్రి అనియూ అంటున్నాము. రాత్రి సమయములో లేక నిద్ర సమయములో సూర్యున్ని గౌరవిస్తూ అన్ని గ్రహములు కాలచక్రములో తిరుగుచున్నప్పటికీ తమ కిరణములను కాంతి హీనముగా చేసుకొనును. సూర్యకుటుంబములో ఏ మనిషి అయినా రెండు గ్రహములను చూడగల్గు చున్నాడు. ఆ రెండు ఒకటి సూర్యుడు, రెండు చంద్రుడు. ప్రత్యక్షముగా బయట ప్రపంచములో అందరికీ కనిపించు గ్రహములు సూర్య, చంద్రులని ఎవరైనా చెప్పుదురు. ఈ రెండు గ్రహములకూ మిగతా పది గ్రహములకు

లేని ప్రత్యేకత కలదు. సూర్యుడు గ్రహముల కుటుంబ పెద్దగా ఉండడమేకాక, కర్మను పాలించడములో రాజు అని పేరుగాంచియున్నాడు. మనిషి (జీవుని) కర్మను అమలు చేయుటకు విధివిధానములన్నిటిని సూర్యుడు ఏర్పరచి పెట్టాడు. అందు వలన కర్మ పాలనలో రాజు సూర్యుడు అని చెప్పవచ్చును. కర్మ పాలనలో గ్రహచారము, దశాచారము అని రెండు విధానములను ఏర్పరచి అందులో గ్రహచారమునకు పెద్దగా సూర్యుడు ఉండగా, దశాచారమునకు పెద్దగా చంద్రుడు కలడు.

కాలచక్రములో ద్వాదశ గ్రహములు నిత్యము ఎడతెరపి లేకుండా సంచరించుచున్నప్పటికీ, వాటి వేగములతో ముందుకు పోవుచున్నప్పటికీ, సూర్యున్ని అనుసరించి రాత్రి (నిద్ర) సమయములో కర్మలను అమలు చేయడము లేదు. సూర్యుడు కాలచక్రములో కుటుంబ యజమాని హోదాను కల్గియుండడమేకాక, కర్మచక్రములోని కర్మపాలనలో రాజు హోదా కల్గి యున్నాడు. కర్మపాలన రెండు విభాగములుగా ఉండుట వలన, ఒక భాగమైన గ్రహచారమునకు తాను రాజుగా ఉంటూ, రెండవ భాగమైన దశాచారమునకు చంద్రున్ని మంత్రి హోదాలో అధిపతిని చేశాడు. ఈ విధముగా కాలచక్రములో యజమాని కుటుంబ పెద్ద అయిన సూర్యుడు, కర్మచక్రములో రాజుగా ఉండడమేకాక, చంద్రున్ని మంత్రిగా ఉంచుకొన్నాడు. దీనినిబట్టి కాలచక్రములో ఒకరు పెద్దకాగా, కర్మచక్రములో ఇద్దరు పెద్దలు కలరని చెప్పవచ్చును.

## 36) గ్రహచారము, దశాచారము అంటే ఏమిటి?

ఈ రెండు పద్ధతులు సులభముగా అర్థమగుటకు ఒక ఉదాహరణను తీసుకొందాము. ఒక వ్యక్తి ఎండాకాలము కాలినడకన ప్రయాణము

చేయునప్పుడు క్రింద కాళ్ళకు చెప్పులు ధరించి నడచినప్పుడు భూమి ఎంత వేడిగాయున్నా ఆ వేడి అతని పాదముల క్రింద తెలియదు. ఒకవేళ కాళ్ళకు చెప్పులు లేకుంటే పాదములకు వేడి తెలిసి ఆ బాధను అనుభవించ వలసివచ్చును. చెప్పులున్న వానికి కాళ్ళు కాలవు, అయినా పైన ఎండవేడి తలకు ముఖమునకు తగులుచుండుట వలన కొంత బాధపడవలసివచ్చును. కాళ్ళకు చెప్పులూ, తలకు గొడుగు ఉన్నవాడు క్రింద బాధ, పై బాధ రెండు తెలియకుండా ప్రయాణమును సాగించును. ఒకవేళ తలకు గొడుగూ, కాళ్ళకు చెప్పులూ రెండూ లేనివాడు పైన క్రింద రెండు బాధలను అనుభ వించవలసి వచ్చును. ఒక ప్రయాణికునికి కాళ్ళకు తలకు ఎండవేడి బాధ రెండు రకములుగా ఉన్నట్లు, ఒక జీవికి కర్మ రెండు రకముల అనుభవము నకు వస్తున్నది. ఎండ బాధ క్రింద కాళ్ళకు, పైన తలకు తగిలినట్లు, కర్మ బాధ ఒక ప్రక్క గ్రహచారము ప్రకారమూ మరొక ప్రక్క దశాచారము ప్రకారమూ కలుగుచున్నది. చెప్పులు గొడుగు రెండూ ఉన్నవాడు సుఖముగా ప్రయాణము సాగించినట్లు, గ్రహచారము దశాచారము రెండూ బాగున్న వాడు సుఖముగా జీవితమును సాగించును. చెప్పులు, గొడుగు రెండూ లేనివాడు కష్టముగా ప్రయాణమును సాగించినట్లు, గ్రహచారము, దశా చారము రెండూ బాగలేనివాడు జీవితమును కష్టముగా సాగించును. చెప్పులుండి గొడుగు లేనివాడుగానీ, గొడుగుండి చెప్పులు లేనివాడుగానీ క్రిందనో పైననో ఒకవైపు బాధను అనుభవించినట్లుండును. గ్రహచారము బాగుండి దశాచారము బాగలేనివాడుగానీ కర్మను పూర్తి అనుభవించును. గ్రహచారము బాగాలేక దశాచారము బాగున్నవాడు కొంత కర్మను అనుభవిస్తూ, కొంతకర్మ అనుభవించక తప్పించుకొని మిగతా కొంత కర్మ అనుభవముతోనే జీవితమును సాగించును.

మనిషి పుట్టిన సమయమునుబట్టి జాతకము నిర్ణయించబడుచున్నది. పుట్టిన సమయములో కర్మచక్రము మీద సూర్యుని కిరణములు ఎచట ఉండునో, దానినిబట్టి గ్రహచారము నిర్ణయించబడును. అలాగే చంద్రుడు కాలచక్రములో ఏ నక్షత్రములో ఉన్నాడో, దానినిబట్టి దశాచారము నిర్ణయించబడును. కాలచక్రములోని రాజు అయిన సూర్యునితోనూ, మంత్రి అయిన చంద్రునితోను నిర్ణయించబడు గ్రహచార, దశాచారముల వలన మనిషి జీవితము ఎలా సాగునో తెలియగలదు. మనిషి జాతకములో గ్రహచారము కాళ్ళకు చెప్పులులాగా ఉండగా, దశాచారము తలకు గొడుగు లాగున్నదని తెలియవలెను. మనిషి జాతకము లేక జాఫతకము అను దానిలో ప్రారబ్ధకర్మనుబట్టియున్న గ్రహచారమూ, దశాచారమును ఎలా తెలియవచ్చునో ఉదాహరణగా ఒక మనిషి పుట్టుకను తీసుకొని చూస్తాము.

రంగయ్య అనునతడు 2009 సంవత్సరములో ఫిబ్రవరి నెలయందు 17వ తేదీన మంగళవారము ఉదయము 9 గంటలకు జన్మించాడు. ఆ దినము పంచాంగము ప్రకారము మంగళవారము, అష్టమి తిథి సా॥ గం॥ 4-13 నిమిషములు గడియలలో 24-16 వరకు గలదు. నక్షత్రము అనూరాధ గం॥ 3-45 నిమిషములు గడియలలో 53-14 వరకు కలదు. లగ్న విషయము కుంభములో భుక్తి గం॥ 0-18 నిమిషములు కలదు. రంగయ్య అష్టమి రోజు అనూరాధ నక్షత్రమున మంగళవారము పగలు ఉదయము 9 గంటలకు జన్మించాడు. అతడు జన్మించిన సమయములోనే సంచితము నుండి జీవితమునకు కావలసిన ప్రారబ్ధము ఏర్పడినది. జన్మించిన సమయములో ఏర్పడిన ప్రారబ్ధమును కొంతవరకు తెలియడమును లేక గుర్తించుకోవడమును జాతకము (జాఫతకము)ను తెలియడము అంటున్నాము. జాతక విషయము తెలియుటకు రంగయ్య

అను వ్యక్తి పుట్టిన సమయములో, సూర్యుడు కాలచక్రము మీదనుండి కర్మచక్రములోని ఏ రాశిమీదికి, తన కిరణములను ప్రసరింపజేయుచున్నాడో మొదట తెలియాలి. సూర్యుడు ఏ రాశిమీద జనన సమయములో తన కిరణములను ప్రసరింపజేయుచున్నాడో, ఆ రాశికి సమానముగాయున్న కాలచక్ర లగ్నమును గుర్తించుకోవాలి. అలా గుర్తించుకొన్న లగ్నమునే మొదటి జన్మ లగ్నముగా లెక్కించుకోవచ్చును. ఇప్పుడు ఫిబ్రవరి 17వ తేదీన మంగళ వారము పుట్టిన రంగయ్య అను వ్యక్తి యొక్క జాతకములో మొదటి లగ్నమును ఎలా గుర్తించాలో క్రింద పూర్తి వివరముగా తెలుసుకొందాము.

2009 సంవత్సరము ఫిబ్రవరి 17వ తేదీన పంచాంగము ప్రకారము సూర్యోదయము 6.31 నిమిషములకు జరిగినది. రంగయ్య పుట్టినది ఉదయము 9 గంటలకు. సూర్యోదయము తర్వాత ఎంత కాలమునకు పుట్టాడని చూడగా

| | | |
|---|---|---|
| గం॥ | 9-00 | జన్మించినది |
| గం॥ | 6-31 | సూర్యోదయము |
| | 2-29 | ఉదయము తర్వాత గడచిన కాలము. |
| గం॥ | 1-39 | నిమిషము కుంభ లగ్న ప్రమాణము. |
| గం॥ | 0-18 | కుంభలగ్న భుక్తి |
| | 1-21 | ఉదయము తర్వాత మిగిలిన కుంభ లగ్న కాలము. |
| గం॥ | 2-29 | గడిచిన తర్వాత జన్మించినది. |
| గం॥ | 1-21 | మిగిలిన కుంభ లగ్నము కాలము |
| | 1-08 | మీన లగ్నములో గడచిన కాలము. |

గం॥ 1-37 మీన లగ్న ప్రమాణం
గం॥ 1-08 మీన లగ్నము గడువగా
0-29 మిగిలిన మీన లగ్నము.

9 గంటల సమయములో మీన లగ్నమున్నది.

2-29 నిమిషములు ఉదయము తర్వాత గడచినది. 17వ తేదీన సూర్యుడు ఉదయించినప్పుడు ధనిష్ట నక్షత్రములో నాల్గవపాదమున ఉన్నాడు. కావున ఆ దినము కుంభ లగ్నముతో ప్రారంభమైనది. ఒక లగ్న ప్రయాణము కర్మచక్రము మీద దాటుటకు దాదాపు రెండు గంటలు పట్టును. అయితే పంచాంగమును బట్టి కుంభలగ్న ప్రమాణము 1.39 నిమిషములు కాగా ఆ దినము కుంభ లగ్న భుక్తి 0-18 నిమిషములు పోగా ఉదయము తర్వాత కుంభలగ్నము 1-21 నిమిషములు మిగిలినది. ఉదయమునుండి గడచిన కాలము 2-29 నిమిషములలో మిగిలిన కుంభ లగ్నముపోగా 1-08 మిగిలినది. కుంభము తర్వాత మీన లగ్న ప్రమాణము 1-37 నిమిషములు. మీనలగ్న ప్రమాణములో 1-08 నిమిషములను తీసివేయగా 0-29 నిమిషములు మీన లగ్నము మిగిలినది. అందువలన అతని జననము మీన లగ్నములో జరిగినదని చెప్పవచ్చును.

రంగయ్య అను వ్యక్తి జన్మించిన కాలమును ఆధారము చేసుకొని, అప్పటి పంచాంగము ద్వారా లెక్కించి, అతని జన్మ లగ్నమును తెలుసుకో గలిగాము. ఇంతవరకు మేము వ్రాస్తూ వచ్చిన జ్యోతిష్య గ్రంథము బాగా అర్థమైనా ఇక్కడ జాతకలగ్నమును లెక్కించి తెలుసుకొన్న చోట కొంత వరకు అర్థము కాకుండా ఉండవచ్చును. ఇంతవరకు పంచాంగ ప్రసక్తి లేకుండా గ్రంథము సాగింది. అందువలన వరుసగా అర్థమైవుంటుంది. అయితే ఇక్కడ పంచాంగ ప్రస్తావన వచ్చిన దానివలన, ఇంతవరకు

పంచాంగము యొక్క పరిచయము లేనివారికి కొంత ఇబ్బందిగా ఉండి, వ్రాసిన సమాచారము కొంత అర్థముకాక పోయివుండవచ్చును. అయితే ఇక్కడ మనము గమనించవలసిన విషయమేమంటే జ్యోతిష్యము వేరు, పంచాంగము వేరని తెలియవలెను. జ్యోతిష్యమును తెలియుటకొరకు పంచాంగమునుండి కొంత చూచుకోవలసియుంటుంది. అంతేగానీ పంచాంగమునంతటినీ తెలియవలసిన అవరసము లేదు. వాస్తవముగా చెప్పితే పంచాంగమును గూర్చి నాకు కూడా పూర్తి తెలియదు. జ్యోతిష్యుడు పంచాంగములోని అవసరమైన కొన్ని అంగములను మాత్రము వాడుకొంటాడు, అంతేగానీ అంతా అవసరముండదు. పంచాంగమునకు అర్థమును చెప్పుకొంటే ఐదు అంగములు కలది పంచాంగము అని అనవచ్చును. అంగము అంటే భాగము అని ఇక్కడ అర్థము చేసుకోవలెను. తిథి, వార, నక్షత్ర, యోగ, కరణములను ఐదు సమాచారములను తెలుపు దానిని పంచాంగము అని అంటున్నాము. ఈ ఐదు విషయ భాగములలో మన జ్యోతిష్యమునకు ముఖ్యముగా ఉపయోగపడునది నక్షత్రము మాత్రమే. తిథి, వారములను, యోగ కరణములను గుర్తింపుకు వాడుకున్నా ముఖ్యముగా అవసరమైనది నక్షత్రము మాత్రమేనని తెలియాలి. అందువలన పంచాంగములో నక్షత్రము అను అంగము ముఖ్యముగా ఉపయోగ పడుచున్నది.

జ్యోతిష్యమునకు ముఖ్యమైన నక్షత్రమును గురించి కొంతవరకు తెలుసుకొంటే ముందు తెలుసుకోబోవు విషయములు సులభముగా అర్థముకాగలవు. నక్షత్రము అనగా నాశనము లేనిదను ఒక అర్థము కలదు. అలాగే కనిపించని ప్రదేశమని కూడా అర్థము కలదు. ఇక్కడ సందర్భమును బట్టి రెండవ అర్థమును తీసుకొందాము. కాలచక్రములోనున్న కనిపించని స్థలమును నక్షత్రములని అంటున్నాము. కాలచక్రము యొక్క పన్నెండు

భాగములలో మొత్తము 27 నక్షత్రములు గలవు. కాలచక్రములోని పన్నెండు భాగములకు మేషము మొదలుకొని మీనము వరకు పన్నెండు పేర్లు గలవు. అలాగే నక్షత్రములకు కూడా పేర్లు గలవు. 27 నక్షత్రములకు వరుసగా నున్న పేర్లను చెప్పుకొందాము.

| | | |
|---|---|---|
| 1) అశ్వని | 2) భరణి | 3) కృత్తిక |
| 4) రోహిణి | 5) మృగశిర | 6) ఆరుద్ర |
| 7) పునర్వసు | 8) పుష్యమి | 9) ఆశ్లేష |
| 10) మఖ | 11) పుబ్బ | 12) ఉత్తర |
| 13) హస్త | 14) చిత్త | 15) స్వాతి |
| 16) విశాఖ | 17) అనూరాధ | 18) జేష్ఠ |
| 19) మూల | 20) పూర్వాషాఢ | 21) ఉత్తరాషాఢ |
| 22) శ్రవణం | 23) ధనిష్ట | 24) శతభిషం |
| 25) పూర్వాభాద్ర | 26) ఉత్తరాభాద్ర | 27) రేవతి |

ఈ విధముగా మొత్తము 27 నక్షత్రముల పేర్లు కలవు. 27 నక్షత్రములు కాలచక్రములోని పన్నెండు భాగములలో ఇమిడిపోవుటకు అనుకూలముగా ఒక్కొక్క నక్షత్రము నాలుగు భాగములుగా విభజింపబడి నది. ఒక నక్షత్రము నాలుగు భాగములుగా ఉంటూ కాలచక్రములోని అన్ని లగ్నములలో సమానముగా ఇమిడిపోయాయి. కాలచక్ర లగ్నములకు పేర్లున్నవి. అలాగే నక్షత్రములకు పేర్లున్నవిగానీ నక్షత్ర భాగములకు విడిగా పేర్లు లేవు. పేర్లకు బదులుగా భాగములను విడి అక్షరములతో గుర్తించారు. నక్షత్రములలో మొదటి నక్షత్రము అశ్వని నాలుగు భాగములుగా ఉన్నది. ఆ నాలుగు భాగములను అశ్వనీ నక్షత్ర పాదములని అంటున్నాము. ఈ విధముగా అన్ని నక్షత్రములకు నాలుగు పాదములు గలవు. మొత్తము 27 నక్షత్రము లకు 108 పాదములు గలవు. 108 నక్షత్రపాదములు

కాలచక్రములోని పన్నెండు లగ్నములలో ఎలా ఇమిడిపోయాయో ఇప్పుడు గమనిద్దాము. ఒక నక్షత్రములోని నాలుగు పాదములలో ఒక్కొక్క పాదమునకు ఒక్కొక్క అక్షరమును గుర్తుగా ఉంచడము జరిగినది. వాటిని ఇప్పుడు చూద్దాము.

| | | |
|---|---|---|
| అశ్వని | నక్షత్ర 4 పాదముల గుర్తులు | చూ, చే, చో, లా |
| భరణి | నక్షత్ర 4 పాదముల గుర్తులు | లీ, లూ, లే, లో |
| కృత్తిక | నక్షత్ర 4 పాదముల గుర్తులు | ఆ, ఈ, ఊ, ఏ |
| రోహిణి | నక్షత్ర 4 పాదముల గుర్తులు | ఓ, వా, వీ, వు |
| మృగశిర | నక్షత్ర 4 పాదముల గుర్తులు | వే, వో, కా, కీ |
| ఆరుద్ర | నక్షత్ర 4 పాదముల గుర్తులు | కూ, ఖం, జా, చ్ఛా |
| పునర్వసు | నక్షత్ర 4 పాదముల గుర్తులు | కే, కో, హా, హి |
| పుష్యమి | నక్షత్ర 4 పాదముల గుర్తులు | హూ, హే, హో, డ |
| ఆశ్లేష | నక్షత్ర 4 పాదముల గుర్తులు | డీ, డూ, డే, డో |
| మఖ | నక్షత్ర 4 పాదముల గుర్తులు | మా, మీ, మూ, మే |
| పుబ్బ | నక్షత్ర 4 పాదముల గుర్తులు | మో, టా, టీ, టూ |
| ఉత్తర | నక్షత్ర 4 పాదముల గుర్తులు | టే, టో, పా, పీ |
| హస్త | నక్షత్ర 4 పాదముల గుర్తులు | పూ, షా, ణా, ఠా |
| చిత్త | నక్షత్ర 4 పాదముల గుర్తులు | పే, పో, రా, రీ |
| స్వాతి | నక్షత్ర 4 పాదముల గుర్తులు | రూ, రే, రో, తా |
| విశాఖ | నక్షత్ర 4 పాదముల గుర్తులు | తీ, తూ, తే, తో |
| అనూరాధ | నక్షత్ర 4 పాదముల గుర్తులు | నా, నీ, నూ, నే |
| జేష్ఠ | నక్షత్ర 4 పాదముల గుర్తులు | నో,యా,యీ,యూ |
| మూల | నక్షత్ర 4 పాదముల గుర్తులు | యే,యో,బా,బీ |

| | | |
|---|---|---|
| పూర్వాషాఢ | నక్షత్ర 4 పాదముల గుర్తులు | బూ,ధా,బా,డా |
| ఉత్తరాషాఢ | నక్షత్ర 4 పాదముల గుర్తులు | బే,బో,జా,జీ |
| శ్రవణం | నక్షత్ర 4 పాదముల గుర్తులు | జూ, జే, జో, ఖా |
| ధనిష్ఠ | నక్షత్ర 4 పాదముల గుర్తులు | గా, గీ, గూ, గే |
| శతభిషం | నక్షత్ర 4 పాదముల గుర్తులు | గో, సా, సీ, సూ |
| పూర్వాభాద్ర | నక్షత్ర 4 పాదముల గుర్తులు | సే, సో, దా, దీ |
| ఉత్తరాభాద్ర | నక్షత్ర 4 పాదముల గుర్తులు | దు, శా, ఝా,థా |
| రేవతి | నక్షత్ర 4 పాదముల గుర్తులు | దే, దో, చా, చీ |

ఈ విధముగా 27 నక్షత్రముల యొక్క 108 పాదములకు (భాగములకు) 108 అక్షరములను గుర్తులుగా పెట్టడము జరిగినది. కొందరు జ్యోతిష్యులు ఒక నక్షత్రములో పుట్టిన వానికి ఆ నక్షత్రములోని అక్షరములను ముందరయుంచి పేరును పెట్టడము జరుగుచున్నది. ఉదాహరణకు చిత్త నక్షత్రము మూడవ పాద సమయములో పుట్టినవానికి ఆ నక్షత్రము యొక్క మూడవ అక్షరమైన "ర" తో మొదలగు పేరైన రంగయ్య, రమేష్, రాము అని పేరు పెట్టుచున్నారు.

27 నక్షత్రములు 108 పాదములుగా విడిపోయి 108 అక్షరముల గుర్తులుగా యున్నవి. పన్నెండు లగ్నములలో 108 పాదములు ఎలా ఇమిడి యున్నవో ఇప్పుడు గమనిద్దాము.

1) మేష లగ్నము

| | | |
|---|---|---|
| 4 | - | అశ్వని |
| 4 | - | భరణి |
| 1 | - | కృత్తిక |
| మొత్తము 9 | | భాగములు (పాదములు) |

| | | | | |
|---|---|---|---|---|
| 2) | వృషభ లగ్నము | 3 | - | కృత్తిక |
| | | 4 | - | రోహిణి |
| | | 2 | - | మృగశిర |
| | మొత్తము | 9 | | భాగములు (పాదములు) |
| 3) | మిథున లగ్నము | 2 | - | మృగశిర |
| | | 4 | - | ఆరుద్ర |
| | | 3 | - | పునర్వసు |
| | మొత్తము | 9 | | భాగములు (పాదములు) |
| 4) | కర్కాటక లగ్నము | 1 | - | పునర్వసు |
| | | 4 | - | పుష్యమి |
| | | 4 | - | ఆశ్లేష |
| | మొత్తము | 9 | | భాగములు (పాదములు) |
| 5) | సింహ లగ్నము | 4 | - | మఖ |
| | | 4 | - | పుబ్బ |
| | | 1 | - | ఉత్తర |
| | మొత్తము | 9 | | భాగములు (పాదములు) |
| 6) | కన్యా లగ్నము | 3 | - | ఉత్తర |
| | | 4 | - | హస్త |
| | | 2 | - | చిత్త |
| | మొత్తము | 9 | | భాగములు (పాదములు) |

| | | | | |
|---|---|---|---|---|
| 7) | తులా లగ్నము | 2 | - | చిత్త |
| | | 4 | - | స్వాతి |
| | | 3 | - | విశాఖ |
| | మొత్తము | 9 | | భాగములు (పాదములు) |

| | | | | |
|---|---|---|---|---|
| 8) | వృశ్చిక లగ్నము | 1 | - | విశాఖ |
| | | 4 | - | అనూరాధ |
| | | 4 | - | జేష్ఠ |
| | మొత్తము | 9 | | భాగములు (పాదములు) |

| | | | | |
|---|---|---|---|---|
| 9) | ధనుర్ లగ్నము | 4 | - | మూల |
| | | 4 | - | పూర్వాషాఢ |
| | | 1 | - | ఉత్తరాషాఢ |
| | మొత్తము | 9 | | భాగములు (పాదములు) |

| | | | | |
|---|---|---|---|---|
| 10) | మకర లగ్నము | 3 | - | ఉత్తరాషాఢ |
| | | 4 | - | శ్రవణం |
| | | 2 | - | ధనిష్ట |
| | మొత్తము | 9 | | భాగములు (పాదములు) |

| | | | | |
|---|---|---|---|---|
| 11) | కుంభ లగ్నము | 2 | - | ధనిష్ట |
| | | 4 | - | శతభిషం |
| | | 3 | - | పూర్వాభాద్ర |
| | మొత్తము | 9 | | భాగములు (పాదములు) |

12) మీన లగ్నము
- 1 - పూర్వాభాద్ర
- 4 - ఉత్తరాభాద్ర
- 4 - రేవతి

మొత్తము 9 భాగములు (పాదములు)

కాలచక్రములో 108 పాదములనబడు 27 నక్షత్రములు కాల చక్రమైన పన్నెండు లగ్నములలో ఎలా ఇమిడియున్నది క్రింద 48వ చిత్ర పటములో చూడవచ్చును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| | **మీనము** | **మేషం** | **వృషభం** | **మిథునమ్** | |
| | పూర్వాభాద్ర - 1<br>ఉత్తరాభాద్ర - 4<br>రేవతి - 4<br>భాగములు - 9 | అశ్వని - 4<br>భరణి - 4<br>కృత్తిక - 1<br>భాగములు - 9 | కృత్తిక - 3<br>రోహిణి - 4<br>మృగశిర - 2<br>భాగములు - 9 | మృగశిర - 2<br>ఆరుద్ర - 4<br>పునర్వసు - 3<br>భాగములు - 9 | |
| **కుంభము** | ధనిష్ఠ - 2<br>శతభిషం - 4<br>పూర్వాభాద్ర - 3<br>భాగములు - 9 | **కాలచక్రములోని 12 లగ్నములలో గల 108 నక్షత్ర పాదములు** | | పునర్వసు - 1<br>పుష్యమి - 4<br>ఆశ్లేష - 4<br>భాగములు - 9 | **కర్కాటకము** |
| **మకరము** | ఉత్తరాషాఢ - 3<br>శ్రవణం - 4<br>ధనిష్ఠ - 2<br>భాగములు - 9 | | | మఖ - 4<br>పుబ్బ - 4<br>ఉత్తర - 1<br>భాగములు - 9 | **సింహము** |
| | మూల - 4<br>పూర్వాషాఢ - 4<br>ఉత్తరాషాఢ - 1<br>భాగములు - 9 | విశాఖ - 1<br>అనూరాధ - 4<br>జేష్ఠ - 4<br>భాగములు - 9 | చిత్త - 2<br>స్వాతి - 4<br>విశాఖ - 3<br>భాగములు - 9 | ఉత్తర - 3<br>హస్త - 4<br>చిత్త - 2<br>భాగములు - 9 | |
| | **ధనస్సు** | **వృశ్చికము** | **తుల** | **కన్య** | |

**48వ చిత్రపటము**

ఒక దినములో ఏ సమయమందు పుట్టినా, ఆ సమయము ఏ లగ్నములోయున్నదో చూచుకొనుటకు, సూర్యుడు ఏ రాశిమీద ఎంతకాలము తన కిరణములను ప్రసరించుచూ ముందుకు పోవునో ఆ కాలములను తెలుసుకొందాము. కాలచక్రములోనున్న సూర్యుడు కర్మచక్రములోని పన్నెండు రాశులమీద తన కిరణములను ప్రసరించినప్పుడు, ఏ రాశిమీద ఎంతకాలముండునో ఆ రాశికి సమానముగాయున్న కాలచక్ర లగ్నమును జన్మించిన మనిషి జనన లగ్నముగా, జాతక లగ్నముగా చెప్పవచ్చును. సూర్యుడు కర్మచక్ర రాశులమీద కిరణములు ప్రసరించు కాలమును, కాలచక్ర లగ్న పరిమాణములుగా చెప్పుచున్నాము చూడండి.

**ఒక గంటకు 60 నిమిషములున్నట్లు ఒక గడియకాలమునకు 60 విగడియలుండును.**

**ఒక గంటకు 2.1/2 గడియ అగును. ఒక నిమిషమునకు 2.1/2 విగడియ అగును.**

| | | | | |
|---|---|---|---|---|
| | | గం. ని. | | గ. విగ |
| 1) | మేష లగ్న కాలము | 1-45 | --- | 4-22 |
| 2) | వృషభ లగ్న కాలము | 2-01 | --- | 5-01 |
| 3) | మిథున లగ్న కాలము | 2-12 | --- | 5-29 |
| 4) | కటక లగ్న కాలము | 2-12 | --- | 5-30 |
| 5) | సింహ లగ్న కాలము | 2-07 | --- | 5-18 |
| 6) | కన్యా లగ్న కాలము | 2-05 | --- | 5-15 |
| 7) | తుల లగ్న కాలము | 2-10 | --- | 5-26 |
| 8) | వృశ్చిక లగ్న కాలము | 2-14 | --- | 5-34 |
| 9) | ధనస్సు లగ్న కాలము | 2-07 | --- | 5-17 |
| 10) | మకర లగ్న కాలము | 1-52 | --- | 4-40 |
| 11) | కుంభ లగ్న కాలము | 1-39 | --- | 4-08 |

| | | | | |
|---|---|---|---|---|
| 12 | మీన లగ్న కాలము | 1-37 | --- | 4-01 |
| | | 24-00 | | 60-00 |

2009 సంవత్సరము ఫిబ్రవరి నెల 17వ తేదీన అష్టమి మంగళ వారము పుట్టిన రంగయ్య అను వ్యక్తి జాతకమును చూచుటకు ముందుగా అతని జన్మ కర్మచక్రములో ఎక్కడినుండి మొదలైనదో, లగ్న పరిమాణ కాలములను చూచి సూర్యోదయము తర్వాత ఏ లగ్నముతో మొదలైనదో తెలుసుకొన్నాము. ఉదయము అతను జన్మించిన 9 గంటల సమయమునకు సరిగా మీనలగ్నము మీద సూర్యుడున్నట్లు తెలుసుకొన్నాము. సూర్య గమనముతోనే మనిషి ప్రారబ్ధము ప్రారంభమగుచున్నదని తెలుసుకొన్నాము. రంగయ్య జనన కాలమైన 9 గంటలకు కాలచక్రములో ఏయే గ్రహములు ఎక్కడెక్కడున్నవో పంచాంగము ద్వారా తెలుసుకోవచ్చును. జనన కాలములో పన్నెండు లగ్నములందున్న గ్రహములే జీవితాంతము ప్రభావము చూపు చుండును. అందువలన పన్నెండు గ్రహముల స్థానములను ద్వాదశ లగ్నములలో గుర్తించుకొని, దానిని ప్రారబ్ధ కర్మపత్రముగా లెక్కించి చూచుకోవచ్చును. జనన కాలములో ఆ విధముగ గుర్తించుకొనిన పన్నెండు లగ్నముల కాలచక్రమునుబట్టి కర్మచక్రములోని రాశులందు కనిపించక యున్న కర్మను కొంతవరకు గుర్తించుకోవచ్చును. పూర్తి ప్రారబ్ధకర్మను గుర్తించుటకు వీలుపడదు. అయినా కొంతవరకైనా గుర్తించవచ్చును. ప్రారబ్ధకర్మను కర్మచక్రములో వ్రాసి చూచుకొను అవకాశము జ్యోతిష్య శాస్త్రములో లేదు. అయితే కాలచక్రములోని గ్రహములను మాత్రము గుర్తించుకొని వారి కదలిక వలన ఏ కర్మలు అమలు జరుగునో కొంత వరకు చెప్పుకోవచ్చును. కాలచక్రములో కనిపించే గ్రహములు కర్మచక్రము లోని కర్మరాశులందు గల కర్మను అందించుటకు కాలచక్రములో ఎలా ఉన్నవో ఇప్పుడు గుర్తించుకొందాము.

వ్యక్తి జన్మించిన కాలమునుబట్టి ఆ దినము కాల, కర్మచక్రముల గమనములనుబట్టి సూర్యుడు ఏ లగ్నములో ఉన్నాడో దానిని గుర్తించు కోవడము జన్మలగ్నమును గుర్తించుకోవడమగును. 2009 సంవత్సరము ఫిబ్రవరి 17వ తేదీ ఉదయము 9 గం॥లకు జన్మించిన రంగయ్య జాతకమును చూచి అందులో అతను మీనలగ్నమునందు జన్మించినట్లు తెలుసుకొన్నాము. మీన లగ్నమును అనుసరించి మిగతా అన్ని లగ్నములలో పన్నెండు గ్రహముల స్థితిగతులను గుర్తించుకోవచ్చును. వర్తమాన కాలములో గ్రహములు వాటి గమనమును అనుసరించి ఎక్కడైనా ఉండవచ్చును. పుట్టిన దినమున, జనన సమయములోనున్న పన్నెండు లగ్నములలోగల గ్రహములే జాఫతకమునకు ఆధారమగును. అప్పటి లగ్నమునుబట్టి జీవితములో నిర్ణయించబడిన ప్రారబ్ధకర్మను కొంతవరకు తెలియవచ్చును. అందువలన ప్రతి ఒక్కరు తమతమ జాఫతకములను వ్రాయించి పెట్టుకోవడము మంచిది. 2009 సంవత్సర పంచాంగమునందు 17 తేదీన పన్నెండు గ్రహములు ఏయే లగ్నములలో ఉన్నది వ్రాసియుందురు. కావున ఆ పంచాంగమును చూచి పన్నెండు లగ్నములలోని గ్రహములను గుర్తించుకొందాము.

| | | | |
|---|---|---|---|
| **1)** | **సూర్యుడు** | **ధనిష్ట 4వ పాదమునందు** | **కుంభ రాశిలో గలడు.** |
| **2)** | **చంద్రుడు** | **అనూరాధ (పాదము తెలియదు)** | **వృశ్చిక రాశిలో గలడు.** |
| **3)** | **కుజుడు** | **శ్రవణం 2వ పాదమునందు** | **మకర రాశిలో గలడు.** |
| **4)** | **బుధుడు** | **ఉత్తరాషాడ 4వ పాదమునందు** | **మకర రాశిలో గలడు.** |
| **5)** | **గురువు** | **శ్రవణం 2వ పాదమునందు** | **మకర రాశిలో గలడు.** |
| **6)** | **శుక్రుడు** | **ఉత్తరాభాద్ర 4వ పాదమునందు** | **మీన రాశిలో గలడు.** |
| **7)** | **శని** | **పుబ్బ 4వ పాదమునందు** | **సింహ రాశిలో గలడు.** |
| **8)** | **రాహువు** | **శ్రవణం 2వ పాదమునందు** | **మకర రాశిలో గలడు.** |

| | | | |
|---|---|---|---|
| **9)** | **కేతువు** | **పుష్యమి 4వ పాదమునందు** | **కర్కాటక రాశిలో గలడు.** |
| **10)** | **భూమి** | **మఖ 2వ పాదమునందు** | **సింహ రాశిలో గలడు.** |
| **11)** | **మిత్ర** | **ఆశ్లేష 1వ పాదమునందు** | **కర్కాటక రాశిలో గలడు.** |
| **12)** | **చిత్ర** | **శ్రవణము 3వ పాదమునందు** | **మకర రాశిలో గలడు.** |

ఆ దిన పంచాంగములో ఉన్న దానినిబట్టి ఏ లగ్నములో, ఎన్నో పాదమందు, ఏ గ్రహము కలదో గుర్తించుకొన్నాము. ముఖ్యముగా గమనించ తగ్గ విషయమేమనగా! ఇక్కడున్న పన్నెండు గ్రహముల సమాచారము పంచాంగములలో ఉండదని తెలుపుచున్నాము. ఇంతవరకు జ్యోతిష్య శాస్త్రములలోగానీ, పంచాంగములలోగానీ నవగ్రహములను గురించియే చెప్పుకొన్నారు. మిగతా భూమి, మిత్ర, చిత్ర గ్రహములను గురించి ఎవరు గానీ, ఎక్కడగానీ చెప్పలేదు. అందువలన పంచాంగములో భూమి, మిత్ర, చిత్ర గ్రహముల సమాచారముండదు. పంచాంగములలో లేకున్నా మూడు గ్రహముల స్థానములను పాదములను మేము ఎలా చెప్పగలిగామో తర్వాత వివరిస్తాము. దాని ప్రకారము మీరు కూడా భూమి, మిత్ర, చిత్రగ్రహములను గుర్తించుకోవచ్చును. ఇకపోతే అందరికీ తెలిసిన చంద్రగ్రహము యొక్క విషయము కూడా పంచాంగములలో ఉండదు. చంద్రుడు మినహా ఎనిమిది గ్రహముల లగ్నములను వాటి పాదములను చెప్పిన పంచాంగములు చంద్రుని విషయమును వదలివేశాయి. చంద్రుడు ఏ లగ్నమందు ఎన్నో పాదమునగలడో జ్యోతిష్యులైనవారు స్వంతముగా తెలుసుకోవలసియున్నది. పంచాంగములో చంద్రుడు ఏ నక్షత్రములో ఉన్నదీ వ్రాయబడియుండును. ప్రతి దినము క్యాలెండర్‌లోగానీ, పంచాంగములోగానీయున్న నక్షత్రము ఏదైతే ఉన్నదో అది చంద్రునిదనియే తెలియవలెను. నక్షత్రము తెలిసినా పాదము కొరకు కొంత గణితమును ఉపయోగించి తెలియవలెను. అదెలాగో క్రింద చూస్తారు.

2009 సం॥ ఫిబ్రవరి 17వ తేదీన ఉదయము 9 గంటలకు జన్మించిన దానివలన ఆ దినమున్న అనూరాధ నక్షత్రములో 9 గంటల సమయమున చంద్రుడు ఏ పాదమందున్నాడో తెలియుటకు అనూరాధకంటే ముందు గడచిపోయిన నక్షత్రమును ఆధారము చేసుకొని చూడవలెను. అట్లు చూచిన అనూరాధకంటే ముందు విశాఖ నక్షత్రము జరిగిపోయినది. విశాఖ జరిగిన తర్వాత 17వ తేదీ మంగళవారము అనూరాధ నక్షత్రము సూర్యోదయమునకు ముందు ఎంత గడచినది తెలిసి ముందు దినము గడచిన అనూరాధ నక్షత్రమునూ, ఆ దినమున్న అనూరాధ నక్షత్రమునూ కలిపి చూచిన నక్షత్ర పరిమాణము తెలిసిపోవును. అప్పుడు నిన్నటి దినము గడచిన అనూరాధను నేడు సూర్యోదయము తర్వాత గడచిన అనూరాధను కలిపిన మొత్తము గడచిన అనూరాధ వచ్చును. నక్షత్ర పరిమాణ కాలమును నాలుగు భాగములుగా విభజించి, ఉదయము 9 గంటల సమయములో నాలుగు భాగములలో ఏ భాగము జరుగుచున్నదో దానినే అప్పటి చంద్రగ్రహ నక్షత్ర పాదముగా లెక్కించవలెను. ఇప్పుడు చెప్పినదంతా అర్థమగుటకు గణితరూపములో చూద్దాము. ముందు దినము 16వ తేదీ విశాఖ 46-25 గడియలకు రాత్రి 1-06 నిమిషములకు అయిపోయినది. అప్పటినుండి అనూరాధ గడుస్తున్నట్లు తెలియవలెను. విశాఖ గంటల ప్రకారమైతే రాత్రి 1-06 నిమిషముల వరకు గలదు. గడియలలో అయితే గడియలు 46-25 విగడియల వరకు కలదు. 17వ తేదీ అనూరాధ 53-04 గడియలు రాత్రి 3-45 వరకు గలదు.

| | గ-విగ |
|---|---|
| సంపూర్ణ నక్షత్ర పరిమాణము | 60-00 |
| ముందు దినము గడచిన విశాఖ | 46-25 |

| | | | |
|---|---|---|---|
| ముందు దినము గడచిన అనూరాధ | | 13-35 | |
| నిన్న గడచిన అనూరాధ | | 13-35 | |
| ఈ దినము గడచిన అనూరాధ | | 53-04 | |
| మొత్తము అనూరాధ పరిమాణము | గడి | 66-39 | విగడియ |
| నిన్నటి దిన అనూరాధ | | 13-35 | |
| నేడు గడచిన అనూరాధ | | 06-13 | |
| మొత్తము గడచిన అనూరాధ | | 19-48 | |
| అనూరాధ నక్షత్ర పరిమాణము | | 66-39 | |
| మొత్తము గడచిన అనూరాధ | | 19-48 | |
| మిగిలిన అనూరాధ | | 46-51 | |

అనూరాధ నక్షత్ర ప్రమాణమును నాలుగు భాగములు చేయగా

| | | | |
|---|---|---|---|
| ఒక పాదము కాలము | గడి | 16-40 | విగడియలు |
| మొత్తము గడచినది | గడి | 19-48 | విగడియలు |
| ఒక పాదము పోగా | | 16-40 | |
| రెండవ పాదములో గడచినది | గ | 3-40 | విగడియలు |

దీనినిబట్టి చంద్రుడు అనూరాధ నక్షత్రములో రెండవ పాదమందున్నట్లు తెలియుచున్నది.

జనన సమయమున కాలచక్రములో ఏ లగ్నములో ఏ గ్రహములు ఉన్నవో, అవి ఏ పాదములలో ఉన్నవో వెనుక పేజీలలో చెప్పుకొన్నాము. అయితే అక్కడ మొత్తము పదకొండు గ్రహములను లగ్నములలో ఏ పాదములో ఉన్నది గుర్తించుకొన్నాము. చంద్రున్ని మాత్రము వృశ్చిక లగ్నములో అనూరాధ నక్షత్రమున ఉన్నట్లు చెప్పుకొన్నాము గానీ, చంద్రుడు

అనూరాధ నక్షత్రములో ఏ భాగములో (పాదములో) ఉన్నాడో చెప్పలేదు. చంద్రుడు ఆ దిన నక్షత్రమైన అనూరాధలో ఏ పాదములో ఉన్నాడో తెలియుటకు కొంత గణితమును ఉపయోగించుకొని చివరకు అనూరాధ పాదమును తెలుసుకోగలిగాము. ఆ దినము చంద్రుడు అనూరాధ నక్షత్ర రెండవ పాదములో ఉన్నట్లు తెలిసినది. ఇప్పుడు 2009 సంవత్సరము ఫిబ్రవరి 17వ తేదీ అష్టమి మంగళవారమున కాలచక్రములోని లగ్నములనూ, అందులోని గ్రహములనూ, గ్రహములున్న పాదములనూ కాలచక్ర లగ్న కుండలిలో అందరికీ తెలియునట్లు వ్రాసి చూచుకొందాము. తర్వాత పేజీలో 49వ చిత్రపటమును చూడుము.

పాఠకులందరికీ సులభముగా జన్మలగ్న కుండలిలో పన్నెండు గ్రహములను లగ్నములలో గుర్తించడమేకాక ఆయా లగ్నములలో ఏ నక్షత్రమందు, ఏ పాదములో ఆ గ్రహములు గలవో సులభముగా అర్థమగుటకు నక్షత్రముల పేర్లను లగ్నములో ఉంచుతూ, వాటితోపాటు నక్షత్రముల నాలుగు పాదములను కూడా చూపి జనన కాలములోని గ్రహములు ఉన్న నక్షత్ర పాదమును కూడా చూపడము జరిగినది. ఈ శ్రమయంతయు పూర్వము జ్యోతిష్యులు పడి జన్మకుండలిని, జన్మ లగ్నమును తెలుసుకొనెడివారు. నేడు ఇటువంటి శ్రమ ఏమాత్రము లేకుండా పుట్టిన తేదీ, పుట్టిన సమయమును చెప్పితే ఆ దినము జన్మ లగ్నము ఏదైనదీ, మిగతా లగ్నములలో గ్రహములు ఎక్కడున్నదీ, దశలు ఏవైనవీ అన్ని వివరములనూ నేడు కంప్యూటర్ ద్వారా క్షణాలలో తెలిసిపోవుచున్నవి. పూర్వము ఒక వ్యక్తి యొక్క జాతకలగ్నమును చూచుటకు అతడు పుట్టిన సంవత్సర పంచాంగమునే చూడవలసియుండుట వలన, జ్యోతిష్యులు గడచి పోయిన వందసంవత్సరముల పంచాంగములను కూడా తమవద్ద ఉంచు

| మీనము | మేషం | వృషభం | మిథునమ్ |
|---|---|---|---|
| పూర్వాభాద్ర - 1<br>ఉత్తరాభాద్ర 2, 3, 4, 5 - శుక్రుడు<br>రేవతి 6, 7, 8, 9 | అశ్వని 1, 2, 3, 4<br>భరణి 5, 6, 7, 8<br>కృత్తిక -9 | కృత్తిక 1, 2, 3<br>రోహిణి 4, 5, 6, 7<br>మృగశిర 8, 9 | మృగశిర 1, 2<br>ఆరుద్ర 3, 4, 5, 6<br>పునర్వసు 7, 8, 9 |
| **కుంభము**<br>ధనిష్ట 1, 2 - సూర్యుడు<br>శతభిషం 3, 4, 5, 6<br>పూర్వాభాద్ర 7, 8, 9 | | | **కర్కాటకము**<br>పునర్వసు -1<br>పుష్యమి 2, 3, 4, 5-కేతువు<br>ఆశ్లేష 6-మిత్ర, 7, 8, 9 |
| **మకరము**<br>ఉత్తరాషాఢ 1, 2, 3-బుధుడు<br>శ్రవణం 4, 5, 6, 7 - కుజుడు, రాహువు, గురువు, చిత్ర<br>ధనిష్ట 8, 9 | | | **సింహము**<br>మఖ 1, 2 - భూమి, 3, 4<br>పుబ్బ 5, 6, 7, 8 - శని<br>ఉత్తర 9 |
| మూల 1, 2, 3, 4<br>పూర్వాషాఢ 5, 6, 7, 8<br>ఉత్తరాషాఢ - 9 | విశాఖ - 1<br>అనూరాధ 2, 3, 4, 5 - చంద్రుడు<br>జేష్ట 6, 7, 8, 9 | చిత్త 1, 2<br>స్వాతి 3, 4, 5, 6<br>విశాఖ 7, 8, 9 | ఉత్తర 1, 2, 3<br>హస్త 4, 5, 6, 7<br>చిత్త 8, 9 |
| **ధనస్సు** | **వృశ్చికము** | **తుల** | **కన్య** |

**49వ చిత్రపటము**

కొనెడివారు. నేడు అటువంటి అవసరము లేకుండా వందసంవత్సరముల పంచాంగములను కంప్యూటర్‌లో ఎక్కించియుండడము వలన, వంద సంవత్సర పంచాంగమునుగానీ లేక యాభై అరవై సంవత్సర పంచాంగ విషయములను గానీ సులభముగా తెలియవచ్చును. అంతేకాక ఏ గణితము వేయకుండా లగ్నమునూ, నక్షత్రమునూ, దశలనూ నిమిషముల వ్యవధిలో తెలియవచ్చును. ఇప్పుడు అన్ని సౌకర్యములు ఉండినా, ఈ శాస్త్రము ఇలా ఉంది అని తెలియుటకు వరుసగా అన్ని విషయములను మేము వ్రాసి చూపించడము జరిగినది. ఇంతవరకు గ్రహచారమును తెలియుటకు కావలసిన వివరమును అందించాము. ఇప్పుడు దశలు అంటే ఏమిటి? దశాచారము అంటే ఏమిటి? అను విషయమును వివరించుకొందాము.

## 37 దశలు అంటే ఏమిటి?

కొద్దిపాటి చదువును కల్గినవారికీ, కనీసము ఐదవతరగతి చదివిన వారికైనా దశ అంటే గణితము ప్రకారము పదియని తెలియగలదు. పది అను సంఖ్య మన జీవితములో అనేక విషయములయందు ఉపయోగించు కొని మాట్లాడుచుందుము. ఇప్పుడు ఇక్కడ మనము చెప్పుకొనునది స్వయముగా మనిషి జీవితములోని కర్మకు సంబంధించినది. అందువలన ఈ దశలను జాగ్రత్తగా తెలుసుకొందాము. దశ అనగా పదియనీ, దశలు అనగా కొన్ని పదులని తెలియుచున్నది. ఆచరణ అనగా చేయబడు కార్యమనీ, ఆచారము అనగా చేయబడు విధానము అనీ అర్థము. ఆచారి అనగా ఏ కార్యమును ఎలా చేయాలో తెలిసినటువంటివాడని అర్థము. కొన్ని పదుల సంవత్సరములు జరుగు ఆచరణలను తెలుపునది దశాచారము అని

అంటాము. మనిషి జీవితములో అతను జీవించు వరకు కొన్ని పదుల సంవత్సరములుండును. ఆ పదుల సంవత్సరములలో ప్రత్యేకించి కొన్ని సంవత్సరములు మాత్రము ఒక గ్రహము ఆధీనములో ఉండునని, దాని తర్వాత కొన్ని సంవత్సరములు మరియొక గ్రహము యొక్క ఆధీనములో ఉండునని తెలుపు విధానమును దశాచారము అంటున్నాము. ఇంతకు ముందు మనము తెలుసుకొన్న జ్ఞానములో ఆగామి, సంచిత, ప్రారబ్ధ అను మూడు కర్మలు కలవని తెలుసుకొన్నాము. ప్రారబ్ధకర్మ ప్రకారము మనిషి జీవితము జరుగుననీ, ప్రారబ్ధకర్మ ప్రకారము కాలచక్రములోని పన్నెండు గ్రహములు కర్మను ఆచరింపజేయుచూ, అనుభవింపజేయుచున్న వనీ తెలుసుకొన్నాము. ప్రారబ్ధ కర్మప్రకారము గ్రహములు మనిషిచేత ఆచరింపజేయు కార్యములను గ్రహచారము అంటున్నాము. కర్మ గ్రహముల చేతిలో ఒక పద్ధతిగా అయిపోవుచున్నది కదా! దానినే గ్రహచారము అంటున్నాము కదా! అలాంటప్పుడు దశలు దశాచారములు అని చెప్పడ మేమిటనీ, దశాచారములో ఏ కర్మ అమలు జరుపబడుననీ, దశాచారములు ఉండవలసిన అవసరమేమిటనీ ఎవరైనా అడుగవచ్చును. ఈ ప్రశ్న పద్ధతి ప్రకారము ఎవరైనా అడుగవచ్చును. ఇది హేతుబద్ధమైన ప్రశ్నయే అయినందున దీనికి జ్యోతిష్య పండితులే సమాధానము చెప్పాలి. నేను ఆధ్యాత్మిక శాస్త్రజ్ఞుడను. కావున ఈ ప్రశ్నకు నేను సమాధానము ఇవ్వలేను. నాది ఆధ్యాత్మికము కావున ఆ విషయములో సమాధానమును చెప్పగలను గానీ, జ్యోతిష్యశాస్త్రములోని ప్రశ్నలకు సమాధానము చెప్పు స్థోమత నాకు లేదు. ఇప్పుడు ఈ ప్రశ్నకు జవాబు కావాలి. అందువలన అన్ని శాస్త్రము లను తెలిసినవాడైన నాహితుడు, నన్ను నడుపువాడు, నా ప్రక్కనేయున్న నా పొరుగువాడు, అత్యంత దగ్గరున్న వాడు (నియరెస్ట్ నైబర్) అయిన

వానిని అడిగి దీనికి జవాబును చెప్పుతాను. అందువలన నేను, నా వాడు కలిసి మేము చెప్పునదేమనగా!

చాలామంది పెద్దలు ఎవడు చేసిన కర్మను వాడు అనుభవించక తప్పదు అన్నారు. కొందరు ఆత్మజ్ఞానులు "విష్ణు, ఈశ్వర, బ్రహ్మదేవుళ్ళు కూడా కర్మకు అతీతులు కారు. ప్రారబ్ధమును వారు కూడా అనుభవించక తప్పించుకొనుటకు వీలుకాదు" అన్నారు. అంతేకాక ఒకమారు సంచితకర్మగా మారిపోయి తిరిగి ప్రారబ్ధమైన తర్వాత దానినుండి ఎవరూ తప్పించు కొనుటకు ఏమాత్రము వీలులేదు. గ్రహముల ఆధీనములోనున్న కర్మను ఏ మనిషిగానీ, ఎటువంటి క్రియవలనగానీ, కొద్దిపాటిగా తీసివేయనూ లేదు, కొద్దిపాటి కర్మను కలపనూ లేదు. ప్రతి మనిషీ నిత్యమూ, ఒక్క క్షణము కూడా ఊరకయుండక కర్మను అనుభవించు విధానమును దేవుడు నిర్మించాడు. అటువంటి విధానమును ఎవరూ అతిక్రమించలేరు. అయితే ఎంతో గట్టిగా ఏర్పరచిన కర్మ విధానము నుండి ఒక్క క్షణము కూడా ఎవడూ తప్పించుకోలేడని చెప్పిన దేవుడు భగవద్గీతలో జ్ఞానయోగమున 37 శ్లోకమందు ఇలా చెప్పాడు.

*శ్లో॥ 37వ. యథైధాంసి సమిద్ధోగ్ని ర్భస్మసాత్కురుతేర్జున ।*
*జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥*

**భావము :- "ఏ విధముగా అగ్నియందు కట్టెలు కాలి భస్మమై పోతున్నాయో, అదే విధముగా జ్ఞానమను అగ్నియందు సర్వకర్మలు కాలిపోవుచున్నవి."** అని స్వయముగా భగవంతుని రూపమునవున్న దేవుడే చెప్పాడు. దేవుడే కర్మను పాలించుటకు ఖగోళములో ద్వాదశగ్రహములను ఏర్పరచి, వారిని విధి విధానమును తప్పక నడుపునట్లు చేశాడు. ఎవడూ కర్మనుండి తప్పించు

కొనుటకు వీలులేదు అన్నాడు. అయితే తన గీతయందు బ్రహ్మవిద్యా శాస్త్రము ప్రకారము జ్ఞానమును తెలియగలిగితే, అటువంటివాని కర్మ యంతయు జ్ఞానాగ్నిలో కాలిపోవును అన్నాడు. ఇంతవరకు మనము తెలుసుకొన్న జ్యోతిష్యము ప్రకారము కాలచక్రములో గ్రహములు తిరుగు చున్నంతకాలమూ, కర్మచక్రములో కర్మయున్నంతకాలమూ, జీవుడు గుణ చక్రమును వదలి బయటపడడు అని తెలియుచున్నది. అంతేగానీ జ్ఞానము కల్గిన వానికర్మ ఈ విధముగా తొలగిపోతున్నదని ఎక్కడా చెప్పుకోలేదు. కర్మచక్రములోని కర్మను జ్ఞాని అయినవాడు అనుభవించకుండా ఎలా తప్పించుకొనును? అను ప్రశ్న ఇక్కడ మొదలగుచున్నది. ఈ ప్రశ్నకు జవాబుగా మేము (నేను+నాఆత్మ) చెప్పునదేమనగా!

గ్రహచార విధానమైన ద్వాదశ లగ్నములు, ద్వాదశ గ్రహములు, ప్రారబ్ధకర్మయున్న విధానములో కర్మను తీసివేయుటకు ఎటువంటి వీలులేదు. అందువలన ఒక మనిషి జీవితములోని కర్మను అవసరమునుబట్టి జ్ఞానము ప్రకారము తీసివేయుటగానీ, తగిలించుటకుగానీ ఒక విధానమును దేవుడు ప్రత్యేకముగా అమర్చిపెట్టాడు. దానినే "దశాచారము" అంటున్నాము. దశాచారము అని పేరు పెట్టబడిన విధానములో జ్ఞానము వలన ప్రారబ్ధమును కొంత లేకుండా చేసుకోవచ్చును. అలాగే క్రొత్తగా ప్రారబ్ధమును తగిలించనూవచ్చును. అయితే కర్మను తగిలించు విధానమును దేవుడు ఎక్కువగా చెప్పకుండా, కర్మను తీసివేయు విధానమునే ఎక్కువగా చెప్పాడు. దేవుడు చెప్పిన బ్రహ్మవిద్యాశాస్త్రమునుబట్టి ఒక మనిషి కర్మను తీసివేయుటకు గానీ, అలాగే తగిలించుటకుగానీ చేయగలడు. గ్రహచార విధానములో ఎక్కడా కర్మను తగ్గించుటగానీ, తప్పించుటగానీ చెప్పలేదు. అయితే ఆ కర్మపోవు ప్రక్రియ దశాచారము అను విధానమునందు కలదని

తెలియవలెను. ముఖ్యముగా చెప్పునదేమంటే! ఇంతవరకు ఏ జ్యోతిష్య శాస్త్రవేత్తకు ఈ విషయము తెలియదు. జ్యోతిష్యులందరికీ గ్రహచారము తెలుసు. అలాగే దశాచారము తెలుసు. అయితే ప్రారబ్ధకర్మను రద్దుచేయు విధానముగానీ, తగిలించు విధానముగానీ దశాచారములో ఉన్నదని తెలియదు. జ్యోతిష్యములో గ్రహచారము, దశాచారము ఉన్నట్లు జ్యోతిష్యులందరికీ తెలుసు. ఎవరి జాతకమును వ్రాసినా గ్రహచార, దశాచారమను రెండు విధానములను వ్రాసియుందురు. అయితే భగవద్గీతలో దేవుడు చెప్పిన కర్మను కాల్చు విధానము దశాచారములో ఉన్నట్లు బహుశా ఎవరికీ తెలియదు.

ప్రతి మానవునికియున్న గ్రహచార, దశాచారములలో అజ్ఞానికి గ్రహచారము ముఖ్యము. **జ్ఞానికి దశాచారము ముఖ్యము.** జ్ఞానులకు ముఖ్యమైనది దశాచారమని జ్ఞానులందరికీ తెలియదు. అందువలన ఇప్పుడు ఈ గ్రంథము ద్వారా జ్ఞానులైన వారందరూ తమ కర్మను దశాచారములో రద్దు చేసుకోవచ్చునని తెలియవచ్చును. జ్ఞానులకు ఎంతో ముఖ్యమైన దశాచారమును గురించి అంతాకాకున్నా, కొంతవరకైనా తెలుసుకొనుటకు ప్రయత్నిద్దాము. ఒక మనిషికి గ్రహచారము అతని తలలోని కర్మ, కాల, గుణచక్రములనుబట్టి తెలియవచ్చును. గ్రహచారమును తెలియుటకు పంచాంగములోని ఐదు అంగములైన (భాగములైన) తిథి, వార, నక్షత్ర, యోగ, కరణములలో ముఖ్యముగా ఉపయోగపడునది ఒకటి కలదు. అదియే నక్షత్రము. నక్షత్రమనబడునది ఐదు అంగములలో మధ్యనగలదు. పంచాంగములకు మధ్యన ఉండుట వలన నక్షత్రము పంచాంగమునకు కేంద్రములాంటిది. తిథి, వార, నక్షత్ర, యోగ, కరణమను ఐదు పేర్లలో నక్షత్రమను పేరు ప్రత్యేకత కలదిగా తెలియుచున్నది. క్షత్రము అనగా

గొడుగు అని అర్థము. ఇంకా వివరముగా చెప్పుకొంటే క్షేత్రమునకు నీడ నిచ్చునది క్షత్రీయనిగానీ, క్షత్రము అనిగానీ చెప్పవచ్చును. గొడుగులేని దానిని, ఏ నీడనూ ఇవ్వని బయలును నక్షత్రము అంటాము.

ఆకాశములో చంద్రుడు, సూర్యుడు, నక్షత్రములు మూడు మాత్రమే కనిపిస్తుంటాయి. వెలుగును కల్గి సూర్య, చంద్ర, నక్షత్రములు మూడు కనిపించడము వలన కొంత వివరము కలదు. సూర్యుడు, చంద్రుడు ఇరువురు ఒకే గ్రహకుటుంబములోని వారే, కనిపించు నక్షత్రము మాత్రము గ్రహ కుటుంబములోనిది కాదు. ఎవరి ఆధిపత్యము లేనివాడు దేవుడు. అలాగే ఎవరి క్షత్రము క్రింద, ఎవరి క్షత్రము ఆధీనములో లేనిది నక్షత్రము. నక్షత్రము అనుపేరునుబట్టి దానిని దేవునికి ప్రతిగా (ప్రతిరూపముగా) చెప్పు కోవచ్చును. బయట కనిపించు సూర్య చంద్రగ్రహములకు ఆధారము, నిర్మాత దేవుడు అన్నట్లు సూర్య చంద్రులు లేని అమావాస్యరోజు కూడా నక్షత్రములు కనిపిస్తుంటాయి. సూర్య చంద్రులు లేకుండా పోయినప్పుడు కూడా నక్షత్రముండుట వలన నక్షత్రము శాశ్వతమైన దేవునికి ప్రతి రూపముగా చెప్పుకొంటున్నాము. మనిషి తలలో కాలచక్రమందు కనిపించ కుండా ఇమిడియున్న సూర్య చంద్ర మొదలగు గ్రహకుటుంబమునకు అంతటికి నక్షత్రము ఆధారముగాయున్నది. కావున నక్షత్ర ఆధారముతోనే గ్రహచారమును తెలియవచ్చును. నక్షత్ర ఆధారము మీదనే గ్రహములు ప్రయాణించుచున్నవి. పంచాంగములో కూడా మధ్యలో నక్షత్రముండి ఇటు తిథి, వారమునకు అటు యోగ, కరణములకు కేంద్రముగా ఆధారమై ఉన్నది. జ్యోతిష్యములో ఎంతో ప్రాముఖ్యముగలది నక్షత్రము. బయట ప్రపంచములో సూర్య చంద్రులు వెలిగే గ్రహములుగా కనిపించినా అలాగే గ్రహము అను పేరు లేకుండా నక్షత్రము కనిపించినా సూర్య చంద్రులున్నట్లు

నక్షత్రము లేదు. జ్యోతిష్యములో సూర్య చంద్రులు ఎక్కడికి పోయినా అక్కడ నక్షత్రముండును. దేవుడు కనిపించకుండా ప్రపంచమంతా వ్యాపించి యున్నట్లు, లగ్న కుండలియందు అన్ని లగ్నములలో నక్షత్రము కనిపించక యుండి సూర్యచంద్ర మొదలగు పన్నెండు గ్రహములకు ఆధారమైయున్నది. దేవునికి ఆకారములేనట్లు, జ్యోతిష్యములో నక్షత్రమునకు కూడా ఆకారము లేదు. నక్షత్రము ద్వాదశ లగ్నముల స్థలమంతయు ఆక్రమించి అనేక పేర్లతో పిలువబడుచున్నది. ఇట్లు ఎంతో విశిష్టత చెందిన నక్షత్రము దశాచారమునకు మూలముగాయున్నది. దశాచారమును తెలియుటకు నక్షత్రము యొక్క ఆధారముతోనే చూడవలయును.

ఆధ్యాత్మిక విద్య అయిన బ్రహ్మవిద్యాశాస్త్రము ప్రకారము దేవున్ని విడదీసిన మూడు ఆత్మలుగా చెప్పవచ్చును. అనగా దేవుడు మూడు ఆత్మలుగాయున్నాడని తెలియుచున్నది. దేవుడు జీవాత్మ ఆత్మలుగా ఉండడమేకాక తన ఉనికి తెలియునట్లు మూడవ ఆత్మ అయిన పరమాత్మగా కూడా ఉన్నాడు. పేర్లుగా విభజించి 27 భాగములుగాయున్న నక్షత్రమునకు 27 పేర్లు పెట్టి చెప్పడము జరిగినది. మూడు ఆత్మలుగాయున్నప్పటికీ దేవుడునుండి విభజింపబడినవే మూడు ఆత్మలు. అదే విధముగా 27 భాగములుగా 27 పేర్లతోయున్న నక్షత్రములన్నీ ఒకే నక్షత్రమని తెలియవలెను. మొదట ఏకముగాయున్న దేవుడు సృష్ఠిలో మూడు ఆత్మలుగా తయారయ్యాడు. అదే విధముగా మొదట ఏకముగాయున్న నక్షత్రము మూడుగా విభజింపబడినది. అలా విభజింపబడినవే 1) అశ్వని 2) భరణి 3) కృత్తిక అని తెలుపుచున్నాము. అశ్వని జీవాత్మకు గుర్తుకాగా, భరణి ఆత్మకు గుర్తుకాగా, మూడవదైన కృత్తిక పరమాత్మకు గుర్తుగాయున్నది. గణితము ప్రకారము సంఖ్యలలో 3 జీవాత్మకు గుర్తని, 6 ఆత్మకు గుర్తని,

9 పరమాత్మకు గుర్తని ఇంతకు ముందు **"సృష్టికర్త కోడ్"** అను గ్రంథములో వ్రాశాము. జ్యోతిష్యశాస్త్రములో 1,2,3 సంఖ్యలలో 3ను దేవునిగా గుర్తించాము. గణితశాస్త్రములో అన్ని అంకెలలోకెల్ల పెద్దదయిన 9 సంఖ్యను దేవునిగా చెప్పడము జరిగినది. ఇప్పుడు మనము జ్యోతిష్యమును చెప్పు చున్నాము కాబట్టి ఈ శాస్త్రము ప్రకారము 3 సంఖ్యను ముఖ్యముగా తీసుకొంటున్నాము. మూడు సంఖ్యలలో 1) అశ్వని 2) భరణి 3) కృత్తిక గా ఉన్నాయి. ఈ మూడింటిని గణితములో పెద్దదయిన దేవునికి గుర్తుగా యున్న 9 చేత హెచ్చించవలసియున్నది. అప్పుడు 3×9=27 అగును. 27 సంఖ్యలో జీవాత్మకు సంబంధించినవి కొన్ని నక్షత్రములుగా, ఆత్మకు సంబంధించినవి కొన్ని నక్షత్రములుగా, పరమాత్మకు సంబంధించినవి కొన్ని నక్షత్రములుగా ఏర్పరచబడియున్నవి. 27 నక్షత్రములను ఎలా విభజించారో ఇప్పుడు తెలుసుకొందాము.

| (జీవాత్మ) | (ఆత్మ) | (పరమాత్మ) |
|---|---|---|
| 1) అశ్వని | 2) భరణి | 3) కృత్తిక |
| 4) రోహిణి | 5) మృగశిర | 6) ఆరుద్ర |
| 7) పునర్వసు | 8) పుష్యమి | 9) ఆశ్లేష |
| 10) మఖ | 11) పుబ్బ | 12) ఉత్తర |
| 13) హస్త | 14) చిత్త | 15) స్వాతి |
| 16) విశాఖ | 17) అనూరాధ | 18) జేష్ఠ |
| 19) మూల | 20) పూర్వాషాఢ | 21) ఉత్తరాషాఢ |
| 22) శ్రవణం | 23) ధనిష్ట | 24) శతభిషం |
| 25) పూర్వాభాద్ర | 26) ఉత్తరాభాద్ర | 27) రేవతి |

ఈ విధముగా నక్షత్రములు జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అను మూడు భాగములుగా విభజింపబడ్డాయి. ఒక లగ్నమునకు $2\frac{1}{4}$ నక్షత్రమును కేటాయించినట్లు ఇక్కడ అదే విధముగా $2\frac{1}{4}$ లగ్నము అనగా 9 నక్షత్ర పాదములను ఒక్కొక్క గ్రహమునకు కేటాయించి ఆ గ్రహము పేరుతోనే కొన్ని దశా సంవత్సరములను నిర్ణయించడము జరిగినది. దైవ జ్ఞానుల కొరకు జ్యోతిష్యములో దశాసంవత్సరములను ఏర్పరచడము జరిగినది. అజ్ఞానులకొరకు 12 లగ్నములను తయారు చేసి ఒక్కొక్క లగ్నమునకు $2\frac{1}{4}$నక్షత్రమును (9 నక్షత్రపాదములను) నిర్ణయించినట్లు, జ్ఞానులకొరకు 12 దశలను గ్రహముల పేరుతో తయారు చేసి, ఆ గ్రహము పేరుతోనున్న దశలకు మొత్తము 120 సంవత్సరములను నిర్ణయించడము జరిగినది. జ్యోతిష్యగ్రంథమును చూస్తే పన్నెండు లగ్నములు, పన్నెండు గ్రహములు, పన్నెండు దశలు, పన్నెండు పదుల (120) సంవత్సరములు కనిపించు చున్నవి.

## 38 మంచి దశలు-చెడు దశలు

గ్రహచారమును చూచుటకు పన్నెండు లగ్నములను చూచినట్లు దశా చారమును చూచుటకు లగ్నములనూ, వాటిలోని నక్షత్రములనూ చూడవలసి యుండును. పుట్టిన సమయమునుబట్టి జాతక లగ్నమును తెలుసుకొన్నట్లు దశలను తెలియుట కొరకు కూడా పుట్టిన సమయమునుబట్టి తెలియవలసిన అవసరమున్నది. పుట్టిన సమయములో గల నక్షత్రమునుబట్టి చంద్రుడు ఎన్నో లగ్నములోయున్నాడో, ఎన్నో నక్షత్ర పాదములోయున్నాడో తెలిసినట్లు ఒక మనిషి దశలను తెలియుటకు కూడా పుట్టిన సమయమును అనుసరించి ఆ దినము జరుగుచున్న నక్షత్రమునుబట్టి దశలను తెలియవచ్చును. జనన

సమయములోనున్న లగ్నమును ఆ దిన పంచాంగములో తెలియవచ్చును. పంచాంగములోని లగ్నమును తెలిసినంతమాత్రమున ఆ లగ్నము ఎన్నో పాదము (భాగము) లో జన్మించినది కొంత గణితమును ఉపయోగించి తెలియవలెను. అలా తెలియుటకు ముందు దినమున గడచిన నక్షత్రమును తీసుకొని అది ఆ దినము గడచిపోగా, ముందు దినమున గడచిన జన్మదిన నక్షత్రమును తెలిసి, అట్లే పంచాంగము ప్రకారము మనిషి పుట్టిన సమయము వరకు గడచిన నక్షత్రమును తెలిసి ముందు దినము గడచిన మరియు ప్రస్తుత దినము గడచిన నక్షత్రమును కలుపగా మొత్తము గడచిన నక్షత్రము తెలిసిపోవును. అప్పుడు ఆ దినము నక్షత్రము ఎంత వరకున్నదో పంచాంగములో చూచి పంచాంగము ప్రకారము గడచినది తీసివేయగా జరుగవలసినది మిగిలిపోవును. మిగిలిపోయిన దానినిబట్టి గానీ లేక జరిగిన దానినిబట్టిగానీ ఆ దినము జనన సమయమునకు నక్షత్రము ఎన్నో పాదములో ఉన్నదీ తెలిసిపోవును. ఆ దిన నక్షత్రమునుబట్టి పన్నెండు దశలలో ప్రస్తుతము జరుగుచున్న దశ ఏమిటి? అని తెలియవచ్చును. జన్మలో ఉన్న దశను తెలిసిన దాని వెనుకవచ్చు దశలు ఏమిటనీ, అవి ఎన్ని సంవత్సరములు గడియవలసియున్నదనీ తెలియును. ఇప్పుడు ఉదాహరణకు 2009 సంవత్సరము అష్టమి మంగళవారము 17వ తేదీన ఉదయము 9 గంటలకు జన్మించిన రంగయ్య జాతకమునుబట్టి అతను జన్మించిన సమయములోనున్న అనూరాధా నక్షత్ర రెండవ పాదమునుబట్టి అతనికున్న దశలను వాటి సంవత్సరములను తెలుసుకొందాము. కాల చక్రములో మేషము మొదలుకొని మీనము వరకు పన్నెండు భాగములు ఉన్నట్లు, మనిషి దశలలో పన్నెండు గ్రహములు గలవు. మేషలగ్నములో ఎన్ని నక్షత్ర పాదములున్నవో వాటిలో జన్మించిన అదియే సూర్య దశకు

ప్రారంభమగును. అట్లే పన్నెండు లగ్నములకు నక్షత్రములున్నవి కదా! ఆ నక్షత్రములతోనే దశా సంవత్సరములను చూపడము జరుగును క్రింద చూడండి.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అశ్వని | – 4, | భరణి | – 4, | కృత్తిక | – 1 | = సూర్యదశ |
| కృత్తిక | – 3, | రోహిణి | – 4, | మృగశిర | – 2 | = చంద్రదశ |
| మృగశిర | – 2, | ఆరుద్ర | – 4, | పునర్వసు | – 3 | = కుజదశ |
| పునర్వసు | – 1, | పుష్యమి | – 4, | ఆశ్లేష | – 4 | = రాహుదశ |
| మఖ | – 4, | పుబ్బ | – 4, | ఉత్తర | – 1 | = గురుదశ |
| ఉత్తర | – 3, | హస్త | – 4, | చిత్త | – 2 | = భూమిదశ |
| చిత్త | – 2, | స్వాతి | – 4, | విశాఖ | – 3 | = శనిదశ |
| విశాఖ | – 1, | అనూరాధ | – 4, | జేష్ఠ | – 4 | = బుధదశ |
| మూల | – 4, | పూర్వాషాఢ | – 4, | ఉత్తరాషాఢ | – 1 | = కేతుదశ |
| ఉత్తరాషాఢ | – 3, | శ్రవణం | – 4, | ధనిష్ట | – 2 | = శుక్రదశ |
| ధనిష్ట | – 2, | శతభిషం | – 4, | పూర్వాభాద్ర | – 3 | = మిత్రదశ |
| పూర్వాభాద్ర | – 1, | ఉత్తరభాద్ర | – 4, | రేవతి | – 4 | = చిత్రదశ |

ఈ విధముగా నక్షత్రములనుబట్టి దశలను గుర్తించవచ్చును. ఏ నక్షత్రములో జన్మించితే ఏ దశ వచ్చునో తెలియవచ్చును. దీనినిబట్టి రంగయ్య పుట్టిన సమయంలో అనూరాధ నక్షత్రము రెండవ పాదము ఉండుటవలన అతనిది బుధదశయని చెప్పవచ్చును. మనిషి మరణించిన వెంటనే రెండవ జన్మకు పోవునని చెప్పుకొన్నాము. మరణము జరిగిన తర్వాత జన్మకు పోవు లోపల ఎంతకాలము జరుగవచ్చును అని ప్రశ్నవస్తే ఒక్క సెకను కాలము కూడా పూర్తిగా ఉండదనియే చెప్పవచ్చును. మరణము తర్వాత జన్మించవలసిన స్థలము పదివేల కిలోమీటర్ల

దూరములోయున్నా, లేక అంతకంటే ఎక్కువగా ఖండాంతరములలోయున్నా, ఇంకా ఎక్కువగా గ్రహాంతరములలోయున్నా ఒక్క సెకను కాలము కూడా పూర్తిగా పట్టదనీ, మరణించిన వెంటనే ఎక్కడైనా జన్మించుననీ చెప్పుకొన్నాము. ఏమాత్రము ఆలస్యము లేకుండా చనిపోయిన క్షణములోనే జన్మించినప్పటికీ, అంతకంటే ఎక్కువ వేగముతో సంచిత కర్మ ప్రారబ్ధముగా మార్చి వేయబడును. ఎవరి ఊహకూ అందనంత వేగముగా ఒక జీవితమునకు సరిపడు ప్రారబ్ధకర్మను సంచితము నుండి నిర్ణయించబడును. చనిపోయిన జీవుడు గతజన్మలో కాలచక్రమునుబట్టి కర్మచక్రమునుబట్టి గుణచక్రములో ఎక్కడుండునో, ఏ మార్పు లేకుండా అక్కడేవుండి జన్మించును. కాలచక్ర, కర్మచక్ర, గుణచక్రముల చట్రములో ఏ మార్పు లేకుండా జన్మ కల్గుచున్నది. అంతేకాక పోయిన జన్మలో ఏ దశలోవుండి చనిపోయివుండునో, అదే దశలోనే మరుజన్మ కూడా యుండును. ఒక దశాకాలము పది సంవత్సరములుండి అందులో మూడు సంవత్సరముల, నాలుగు నెలల, పది రోజులు గడచియుంటే మరుజన్మలో అదే దశ ప్రారంభమగును. పోయిన జన్మలో అయిపోయిన చోటనుండియే ప్రారంభమై గతములో ఆ దశలో జరుగవలసిన ఆరు సంవత్సరముల, ఏడు నెలల ఇరువది రోజులు గడచిన తర్వాత రెండవ దశ ప్రారంభమగును. జన్మలో కర్మ మారినా కాలచక్ర లగ్నములు గానీ, దశా సంవత్సరములుగానీ, గుణచక్రములోని గుణములుగానీ మారవు. ఇంతకుముందు ఏ నక్షత్రములో పుట్టినవారు ఏ దశలో పుట్టునో తెలుసుకొన్నాము. ఇప్పుడు ఏ దశ ఎన్ని సంవత్సరముల పరిమాణమున్నదో తెలుసుకొందాము.

ఒక మనిషి జీవితము యొక్క పరిమాణము 120 సంవత్సరములుగా నిర్ణయించబడినది. 120 సంవత్సరములలో ఒక మనిషి ఎన్నిమార్లు

చనిపోయినా, ఎన్నిమార్లు క్రొత్త జన్మకు పోయినా వాటిని దేవుని దృష్ఠిలో అన్ని జన్మలుగా లెక్కించబడవు. 120 సంవత్సరములకు ఒక జన్మగా లెక్కించుటకు నిర్ణయము చేయబడినది. 120 సంవత్సరములు గడచితేనే ఒక జీవితము లేక ఒక జన్మగా లెక్కించుటకు శాసనము చేయబడినది. మనిషికైనా వేరు జంతువుకైనా, ఇతర క్రిమికైనా ఒకే నిర్ణయము ప్రకారము 120 సంవత్సరములకొకమారు జన్మగా గుర్తించవచ్చును. 120 సంవత్సరములలో ఒక జంతువు లేక ఒక మృగము ముప్పదిమార్లు చనిపోయి తిరిగి జన్మించినా అవన్నియూ అన్ని జన్మలుగా లెక్కించబడక ఒకే జన్మగా లెక్కించబడును. దానికి సూత్రము కలదు. మానవుని గ్రహచారములో పన్నెండు గ్రహములున్నట్లే, దశాచారములో కూడా పన్నెండు దశలు కలవు. పన్నెండు దశలు ఒకమారు అయిపోవుటకు మొత్తము 120 సంవత్సరముల కాలము పట్టును. అలా పన్నెండు దశలు ఒకమారు తిరిగినప్పుడే ఒక జన్మగా లెక్కించవచ్చును. సూర్యదశతో ప్రారంభమైన దశ తిరిగి వాని జీవితములో వచ్చుటకు 120 సంవత్సరముల కాలము పట్టుచున్నది. అందువలన ఎవనికైనా 120 సంవత్సరములకు ఒకమారు జన్మయని లెక్కించవలెను. మనిషి జీవితములో పన్నెండు దశలున్నవని తెలుసు కొన్నాము కదా! పన్నెండు దశలు కలిసి మొత్తము 120 సంవత్సరములని అనుకొన్నాము కదా! అయితే పన్నెండు దశల కాలము సమానముగా యున్నదా? లేక ఒక్కొక్క దశ ఒక్కొక్క కాలపరిమితికల్గియున్నదా? అను ప్రశ్నకు జవాబును తెలుసుకొందాము. గ్రహచారములోని పన్నెండు గ్రహములలో ఆరు గ్రహములు మిత్రులుగా, ఆరు గ్రహములు శత్రువులుగా యున్నట్లు, దశలలో కూడా ఆరు దశలు మంచివిగా, ఆరు దశలు చెడువిగాయున్నవి. వాటిని క్రింద చూస్తాము.

ఒక మనిషి జనన కాలము ఏ లగ్నములో జరిగినా ఆ లగ్నమును బట్టి పన్నెండు గ్రహములలో ఆరు మిత్రులుగా, ఆరు శత్రువులుగా ఉందురని తెలుసుకొన్నాము. మిత్రులనగా పుణ్యమును ఇచ్చి సుఖ పెట్టువారు. శత్రువులనగా పాపమును అమలు చేసి కష్టపెట్టువారు అని అర్థము. జనన కాల లగ్నమునుబట్టి మిత్రులుగా మరియు శత్రువులుగా యున్న గ్రహములనే దశాచారములో కూడా, మిత్ర శత్రువులుగా లెక్కించు కోవలెను. 2009 సంవత్సరము ఫిబ్రవరి 17వ తేదీ అష్టమి మంగళవారము జన్మించిన రంగయ్య అను వ్యక్తి యొక్క జనన నక్షత్రమునుబట్టి పుట్టుకలోనే అతనిది బుధదశ అని తెలిసిపోయినది. ఇప్పుడు రంగయ్యకు ఏ దశ మంచిదో, ఏ దశ మంచిది కాదో తెలుసుకొందాము. జనన సమయములో నున్న లగ్నము మీనలగ్నమగుట వలన మీన లగ్నమునకు ఎవరు మిత్రులో, ఎవరు శత్రువులో వారే దశలలోను మిత్ర శత్రువులుగా చెప్పబడుదురు. దాని ప్రకారము మీన లగ్నమునకు మిత్రులు శత్రువులు క్రింది విధముగా కలరు.

| **మిత్రులు** | | **శత్రువులు** |
|---|---|---|
| గురువు | 1×7 | బుధుడు |
| కుజుడు | 1×7 | శుక్రుడు |
| చంద్రుడు | 1×7 | రాహువు |
| సూర్యుడు | 1×7 | శని |
| భూమి | 1×7 | మిత్ర |
| కేతువు | 1×7 | చిత్ర |

రంగయ్య అను వ్యక్తికి జాతకరీత్యా గురు, కుజ, చంద్ర, సూర్య, భూమి, కేతువు అను ఆరు గ్రహములు అనుకూలురుగా, మిగతా బుధ,

శుక్ర, రాహు, శని, మిత్ర, చిత్ర అను ఆరు గ్రహములు వ్యతిరేకులుగా యున్నారు. వీరి పేరుతోనే దశలుండుట వలన ఆయా గ్రహముల దశలలో మంచివిగా కొన్ని, చెడువిగా కొన్ని యున్నవని చెప్పవచ్చును. మిత్ర శత్రు గ్రహములనుబట్టి రంగయ్యకు ఆరు అనుకూలమైన దశలూ, ఆరు అను కూలములేని దశలున్నాయని చెప్పవచ్చును. ఇంతవరకు నక్షత్రమును బట్టి దశలూ, వాటిలో అనుకూల అనానుకూల దశలను తెలుసుకొన్నాము. ఇప్పుడు ఏ దశ ఎంతకాలముండునో వివరముగా తెలుసుకొందాము.

## 39 దశల కాలములు

కొందరు మాటల సందర్భములో "వాని దశ బాగుంది, అందువలన వాడు పట్టినదంతా బంగారమౌతూవుంది" అని అంటుంటారు. చాలామందికి వారి గ్రహచారముల మీద నమ్మకములేకున్నా, వారి గ్రహచారమును గురించి వారికి తెలియకున్నా దశలలోనే బాగా జరుగునని అనుకొనుచుందురు. కొందరు జ్యోతిష్యులు కూడా గ్రహచారముకంటే మంచి దశలలోనే బాగా జరుగునని చెప్పుచుందురు. జ్యోతిష్య విషయము తెలియనివారు కూడా దశ బాగుంటే ఏమైనా జరుగుతుందని, ఎంత లాభమైనా వస్తుందని అనుచుందురు. ఎవడైనా నష్టపోయినా, కష్టపడుచుండినా వానిని చూచిన వారు వాని దశ బాగాలేదు అందువలన అలా జరుగుచున్నదని చెప్పు చుందురు. వాస్తవానికి ప్రపంచ కర్మలలో మనిషి మీద దశల ప్రభావము అంతగా ఉండదు. మనిషి పడు కష్టములకైనా, అనుభవించు సుఖములకైనా ముఖ్యముగా గ్రహచారమే కారణమని చెప్పవచ్చును. దశల ప్రభావము ప్రపంచ విషయములలో కనీసము పదిశాతము కూడా ఉండదు. కాల చక్ర లగ్నములలో మంచి చెడు గ్రహములు తిరుగుచూ కర్మచక్రము నుండి

అందించు ఫలితములనుబట్టి మనిషి యొక్క కష్టసుఖములుండును. కేవలము దైవ జ్ఞాన విషయములలోనున్న వారికి మాత్రము దశలనుబట్టి వాని కర్మ రద్దవునదీ లేనిదీ తెలియును. జ్ఞానులైన వారికి మంచిదశలో వారి కర్మలు జ్ఞానాగ్నిచే ఎక్కువ దహించబడును. చెడు దశలో కర్మలు కాలిపోవడములో ఆలస్యమగును. మంచి దశ వచ్చినప్పుడు జ్ఞాన ధనము కల్గినవారు ఇతరుల కర్మలనుగానీ, తమ కర్మలనుగానీ ఎక్కువగా నిర్మూలించుకొనుటకు అవకాశము కలదు. మంచి దశలలో ఎండాకాలము ఎండిన కట్టెలు సులభముగా కాలిపోయినట్లు కర్మలు కూడా తమ జ్ఞానాగ్ని చేత కాలిపోవును. అదే చెడు దశలో వానల కాలము తడిసిన కట్టెలు సరిగా కాలనట్లు కర్మలు దహించడములో కొంత ఆటంకము, ఆలస్యము ఏర్పడును. దశలన్నీ మనిషిలోని జ్ఞానము అజ్ఞానమునుబట్టి పని చేయునని తెలియవలెను. జ్ఞానములేని సాధారణ వ్యక్తులకు కాల, కర్మచక్రములనుండి లభ్యమగు గ్రహచారమునుబట్టి వారికి కష్టసుఖములుండును. ఏ మనిషికైనా అన్నీ అనుకూలములుగా జీవితము సాగుచుంటే అది వాని గ్రహచార కర్మఫలమని తెలియవలెను. అట్లుకాక ఎక్కువ కష్టములు సంభవించుచూ, అన్ని విషయములలో ఆటంకము ఏర్పడుటకు కూడా వాని గ్రహచారమే కారణము.

ఇప్పుడు దశల కాల విషయమునకు వస్తాము. ఇంతవరకు ఎందరో మేధావులు జ్యోతిష్యశాస్త్రమును వ్రాశారు. వారికున్న మేధాశక్తి ముందర నేను అల్పుడనని ఒప్పుకోక తప్పదు. అంతపెద్దవారు వ్రాసిన దానిని కాదనీ వారు వ్రాసిన విషయములు కొన్ని శాస్త్రబద్ధత లేనివని ఖండించి వేరుగా చెప్పడము మా పనిగానీ, నా పని కాదని తెలియవలెను. జ్యోతిష్య శాస్త్రమును వ్రాసే విజ్ఞానముగానీ, జ్ఞానముగానీ నాకు లేదు. పైకి ఈ

గ్రంథకర్తగా నేను కనిపించినా, వాస్తవానికి శరీరములో మర్మముగాయుండి ఎక్కడా, ఎవరికీ తెలియనివాడైన ఆత్మని అందరూ తెలియాలి. ఆయనకు తెలియనిది ఏమీ లేదు. అందువలన ఇక్కడ చదువబోవు విషయములు సత్యమనీ, శాస్త్రీయత గలవనీ తెలిసి చదువవలెను. గతములో జ్యోతిష్య గ్రంథమును చాలామంది వ్రాసినా అందులో గ్రహములను తొమ్మిది మందిని మాత్రమే చూపారు. ఇక్కడ మాత్రము పన్నెండు మంది గ్రహములున్నారని చెప్పడము జరిగినది. దశల విషయములో మొత్తము 120 సంవత్సరములు చెప్పినా 120 సంఖ్యను తొమ్మిది మందికి సరిచేసి చెప్పారు. వారు చెప్పిన గ్రంథములలో ఇలా కలదు.

| | | | |
|---|---|---|---|
| 1) సూర్యుని దశ | - 6 సం॥ | 6) శనిదశ | - 19 సం॥ |
| 2) చంద్ర దశ | - 10 సం॥ | 7) బుధదశ | - 17 సం॥ |
| 3) కుజ దశ | - 7 సం॥ | 8) కేతుదశ | - 7 సం॥ |
| 4) రాహు దశ | - 18 సం॥ | 9) శుక్రదశ | - 20 సం॥ |
| 5) గురు దశ | - 16 సం॥ | | |

తొమ్మిది గ్రహములను క్రూరులు, సౌమ్యులుగా చెప్పి అందులో ఐదింటిని క్రూర గ్రహములుగా, నాలుగు సౌమ్య గ్రహములుగా విభజించారు. సూర్య, కుజ, శని, రాహువు, కేతువు క్రూరులనీ, గురు, చంద్ర, శుక్ర, బుధులు సౌమ్యులనీ చెప్పడము జరిగినది. అయితే ఇప్పుడు మేము వ్రాసిన గ్రంథములో కర్మలేని ఆత్మలు, కర్మవున్న ఆత్మయను పద్ధతితో 2 :1 అను సూత్రముతో గ్రహములను రెండు గుంపులుగా విభజించాము. ఈ రెండు గుంపులలో మనుషుల కర్మలనుబట్టి గ్రహములు క్రూరులుగా, సౌమ్యులుగా లేక శత్రువులుగా, మిత్రులుగా పని చేయుచున్నారని చెప్పాము. ఇదంతయూ ముందు వ్రాసిన వారికి వ్యతిరేఖముగా కనిపించినా,

వాస్తవానికి ఇది సత్యము మరియు శాస్త్రబద్ధము. ఇప్పుడు చెప్పుబోవు దశల సంవత్సరములు కూడా చాలా వ్యత్యాసముగా ఉండును. అయినా సత్యమను ఉద్దేశ్యముతో చదవండి. శాస్త్రబద్ధముగా ఉందో లేదో చూడండి.

| | | | |
|---|---|---|---|
| 1) సూర్య దశ | - 10 సం౹౹ | 7) శనిదశ | - 13 సం౹౹ |
| 2) చంద్రదశ | - 10 సం౹౹ | 8) బుధదశ | - 10 సం౹౹ |
| 3) కుజదశ | - 7 సం౹౹ | 9) కేతుదశ | - 7 సం౹౹ |
| 4) రాహుదశ | - 10 సం౹౹ | 10) శుక్రదశ | - 13 సం౹౹ |
| 5) గురుదశ | - 13 సం౹౹ | 11) మిత్రదశ | - 7 సం౹౹ |
| 6) భూమిదశ | - 13 సం౹౹ | 12) చిత్రదశ | - 7 సం౹౹ |
| మొత్తము సం౹౹ | 63 | మొత్తము సం౹౹ | 57 |

ఇక్కడ పన్నెండు దశల సంవత్సరములను చెప్పుకొన్నాము. ఒక ప్రక్క గురువు నాయకత్వములోని గ్రహములు వరుసగా సూర్య, చంద్ర, కుజ, గురు, భూమి గ్రహములు ఐదు వుండగా, వాటి మధ్యలో శని గుంపులోని రాహువు ఉండడము జరిగినది. వాటి మొత్తము 63 సం౹౹ వచ్చినది. అలాగే రెండవ ప్రక్క శని నాయకత్వములోని గ్రహములు వరుసగా శని, బుధ, శుక్ర, మిత్ర, చిత్ర అను ఐదు గ్రహములుండగా వాటిమధ్యలో గురు పార్టీలోని కేతువు వచ్చి కలిసిపోయినది. వాటి మొత్తము 57 సం౹౹ వచ్చినది. మొదటి వరుసలోని గురుపార్టీ గ్రహములలో కలిసియున్న రాహువును తీసివేసి ఆ స్థానములో కేతువును ఉంచి చూచితే మొత్తము గురుపార్టీలోని ఆరు గ్రహముల దశా సంవత్సరములు ఖచ్చితముగా 60 సంవత్సరములు వచ్చును. అలాగే రెండవ ప్రక్కయున్న శని పార్టీలోని గ్రహములలో కలిసియున్న కేతువును తీసివేసి అందులో రాహువును చేర్చి

చూచితే శనిపార్టీలోని ఆరుగ్రహముల దశా సంవత్సరములు ఖచ్చితముగా 60 సంవత్సరములు వస్తున్నవి.

| | | | |
|---|---|---|---|
| 1) సూర్యుని దశ | - 10 సం॥ | 7) శనిదశ | - 13 సం॥ |
| 2) చంద్ర దశ | - 10 సం॥ | 8) బుధదశ | - 10 సం॥ |
| 3) కుజ దశ | - 7 సం॥ | 9) రాహుదశ | - 10 సం॥ |
| 4) కేతు దశ | - 7 సం॥ | 10) శుక్రదశ | - 13 సం॥ |
| 5) గురు దశ | - 13 సం॥ | 11) మిత్రదశ | - 7 సం॥ |
| 6) భూమి దశ | - 13 సం॥ | 12) చిత్ర దశ | - 7 సం॥ |
| మొత్తము సం॥ | 60 | మొత్తము సం॥ | 60 |

దశా సంవత్సరములు వరుస క్రమముగా వ్రాసుకుంటే ఇలా కలవు.

| | | | |
|---|---|---|---|
| 01) | సూర్య దశ కాలము | - | 10 సంవత్సరములు |
| 02) | చంద్ర దశ కాలము | - | 10 సంవత్సరములు |
| 03) | కుజ దశ కాలము | - | 7 సంవత్సరములు |
| 04) | రాహు దశ కాలము | - | 10 సంవత్సరములు |
| 05) | గురు దశ కాలము | - | 13 సంవత్సరములు |
| 06) | భూమి దశ కాలము | - | 13 సంవత్సరములు |
| 07) | శని దశ కాలము | - | 13 సంవత్సరములు |
| 08) | బుధ దశ కాలము | - | 10 సంవత్సరములు |
| 09) | కేతు దశ కాలము | - | 7 సంవత్సరములు |
| 10) | శుక్ర దశ కాలము | - | 13 సంవత్సరములు |
| 11) | మిత్ర దశ కాలము | - | 7 సంవత్సరములు |
| 12) | చిత్ర దశ కాలము | - | 7 సంవత్సరములు |

ఈ వరుస క్రమములోనే జాతకుని దశల కాలము అమలుకు వచ్చునని తెలుసుకోవాలి. ముందు తొమ్మిది గ్రహముల జ్యోతిష్యమునకు, ఇప్పుడు పన్నెండు గ్రహముల జ్యోతిష్యమునకు కొంత తేడాయుండడమును గమనించవచ్చును. ముందు వ్రాసుకొన్న దశలలో గురుదశ అయిపోతూనే శనిదశ మొదలగుచున్నది. అయితే ఇక్కడ క్రొత్త విధానములో గురుదశ అయిపోతూనే భూమిదశ ప్రారంభమగుచున్నదని తెలుసుకోవాలి. పన్నెండు గ్రహములను అనుసరించి వ్రాయు క్రొత్త జాతకములో ప్రస్తుతము మేము పైన వ్రాసిన దశలను వాటి సంవత్సరములను ఉపయోగించి వ్రాసుకో వలసినదిగా తెల్పుచున్నాము.

సూర్యుడు, చంద్రుడు మొదలగు గురుపక్షములోని గ్రహములలో శనిపక్ష రాహువు కలిసియుండడమే సరియైన పద్ధతిగా దేవుడు పెట్టాడు. అలాగే శని, బుధుడు మొదలగు శనిపక్ష గ్రహములున్న శని పక్షమున కేతువు ఉండడమే సరియైన పద్ధతియని దేవుడే ఆ విధముగా ఉంచాడు. రాహువు శనిపక్షమువాడైయుండి దశలలో మాత్రము గురుపక్షములో ఉండుట మంచిదని ఎందుకు చెప్పుచున్నామనగా! పన్నెండు గ్రహములు రెండు గుంపులుగాయున్నా ఆ గుంపు నాయకులు ఒకవైపు గురువూ మరొక వైపు శని ఉండగా, శని గుంపులోని రాహువు, గురుపక్షములోని కేతువు ఇద్దరూ నాయకత్వ లక్షణములు కల్గియున్నారు. అంతేకాక రెండు గుంపులలో ఎవరు తమ పనిని సక్రమముగా నిర్వర్తించకున్నా, అలసత్వమును గానీ, ఆలస్యమునుగానీ ప్రదర్శించినా రెండు వైపుల వారిని దండించు నాయకత్వము కలవారుగాయున్నారు. అంతేకాక పన్నెండు గ్రహములలో పది గ్రహములు అనగా రాహు మరియు కేతువు మినహా అందరూ కాలచక్రములో మన చూపుకు ఎడమనుండి కుడివైపుకు

ప్రయాణించుచుండగా, రాహువు మరియు కేతువు ఇరువురూ కుడినుండి ఎడమకు ప్రయాణించుచున్నారు. పది గ్రహములు కాలచక్రములో ఎడమ నుండి కుడికి సవ్యముగా ప్రయాణించుచుండగా రాహువు, కేతువు ఇద్దరూ కుడినుండి ఎడమకు అపసవ్యముగా ప్రయాణించుచున్నారు. బస్సు రూట్‌లో ఒకవైపుకు ప్రయాణించు బస్సులను తనిఖీ చేయుటకు చెకింగ్ ఇన్స్‌పెక్టర్లు బస్సులకు ఎదురుగా ప్రయాణించుచూ తమకు ఎదురవుతున్న బస్సులను ఆపి చెక్ చేసినట్లు, పది గ్రహములకు ఎదురుగా ఇన్స్‌పెక్టర్ల మాదిరి రాహువు, కేతువులు ప్రయాణించుచున్నారు. అలా రాహు కేతువులు ప్రయాణించడము వలన గ్రహములన్నీ జాగ్రత్తగా, ఉత్తేజముగా పని చేయుచున్నవి. కాలచక్రములో పది గ్రహములు ఎడమనుండి కుడి వైపుకూ, రాహువు, కేతువు కుడినుండి ఎడమకు ప్రయాణించడము క్రింది 50వ చిత్రపటములో చూడవచ్చును.




50వ చిత్రపటము

పై విధముగా అన్ని గ్రహములకు రాహువు కేతువు ఎదురుగా ప్రయాణించుచూ అన్నిటినీ ఎదురుగా చూస్తూ పోతున్నవి. మిగతా పది గ్రహములు ఒకరి ముఖమును ఒకరు ఎదురుగా చూచుకొనుటకు అవకాశము లేదు. అన్నియూ ఒకే వైపుకు ప్రయాణించుచున్నవి. కావున ఒకదానికి మరొక దాని వీపు కనిపించునుగానీ, ముఖము కనిపించదు. అంతేకాక గురువు వర్గములో రాహువు, శనివర్గములో కేతువు ఉండుట వలన గురువర్గములోని రాహువుతో సహా దశల సంవత్సరములు మొత్తము 63 వస్తున్నవి. అలాగే శనివర్గములోని కేతువుతో సహా ఆ గుంపులోని గ్రహముల దశా సంవత్సరములు మొత్తము 57 వస్తున్నవి. ఒక మనిషి శరీరములోని కుడి ఎడమ భాగములు రెండూ ఎవరికీ సమానముగా లేకుండా, కొద్దిపాటిగా కుడిప్రక్క ఎక్కువగా ఉండడమూ, ఎడమవైపు కొద్దిపాటిగా తక్కువయుండడమూ అందరికీ తెలుసు. కుడిచేయికీ ఎడమ చేయికీ, కుడికాలుకూ ఎడమ కాలుకూ కొద్దిగా అయినా వ్యత్యాసముండును. శరీరములో ఏ విధముగా కుడి ఎడమలు ఎక్కువ తక్కువగా ఉన్నాయో, అదే విధముగా గ్రహముల కుడి, ఎడమ రెండు గుంపులూ తమ తమ దశల సంవత్సరములలో కొంత తేడాగాయుండుటకు గురువర్గములో రాహువునూ, శని వర్గములో కేతువునూ ఉంచడము జరిగినది.

## 40 పన్నెండు లగ్నములలోనున్న పన్నెండు గ్రహముల పని ఏమి?

కాలచక్రములోని పది గ్రహములు ఒకవైపు ప్రయాణము చేయుచుండగా, రాహు, కేతువులు రెండు మరొక వైపు ప్రయాణము చేయుచున్నవని తెలుసుకొన్నాము. రెండు ఒకవైపుకు, పది మరొక వైపుకు ప్రయాణము

చేయుచుండినా, ఎవరు ఎటుపోయినా, అంతకూ వారు చేయుచున్న పని ఏమి? అని ప్రశ్నరాగలదు. ఆ ప్రశ్నకు జవాబుగా మేము చెప్పునది ఏమనగా! కాలచక్రములో ప్రయాణము చేయు ప్రతి గ్రహము ఒక ఉద్దేశ్యమును కలిగి ప్రయాణిస్తూ బాధ్యతగా పని చేయుచున్నవి. మనము చెప్పుకొన్న పన్నెండు గ్రహములలో ప్రతి గ్రహమునకు కొంత ప్రకాశమున్నది. గ్రహము తనకున్న ప్రకాశము దేనిమీదపడునో, అప్పుడు ఆ ప్రకాశము పడిన చోట ఏదైతే ఉన్నదో దానిని గ్రహము గ్రహించును. గ్రహమునకున్న కిరణముల చేత దేనినైనా గ్రహించుచున్నది. కావున కిరణములను గ్రహము యొక్క చేతులుగా పోల్చుకోవచ్చును. ఇంతకు ముందే గ్రహముల కిరణముల ప్రసారమునుబట్టి తొమ్మిది గ్రహములకు రెండు చేతులున్నాయనీ, ప్రత్యేకించి శని, కుజ, గురువులకు నాలుగు చేతులు కలవనీ చెప్పుకొన్నాము. చేతులు ఉన్నాయంటే ఏదో ఒక పని చేయాలి. కావున ప్రతి గ్రహము వెలుగు అను తన చేతుల చేత క్రింద కర్మచక్రములోని ప్రారబ్ధకర్మను తీసుకొని, ఇంకా క్రిందగల గుణచక్రములోని జీవునిమీదికి కర్మను వదులుచున్నవి. అప్పుడు అలా వచ్చిన కర్మను జీవుడు రుచి చూచుచున్నాడు. కర్మ రుచి తియ్యగా ఉంటే హాయిగా సుఖమును అనుభవించుచున్నాడు. ఒకవేళ కర్మ రుచి చేదుగాయుంటే బాధగా కష్టమును అనుభవించుచున్నాడు. జీవుడు ఏమి అనుభవించినా అదంతయూ గ్రహములు చేసిన పనియేనని చెప్పవచ్చును.

గ్రహములు కర్మచక్రము మీద తమ కిరణములను (చేతులను) ప్రసరింపజేసినప్పుడు, అక్కడ ఏముంటే దానినే తీసుకొని క్రిందనున్న జీవుని నెత్తిన వేయుచున్నవి. కాలచక్రములోని గ్రహములు తమ పనిని చేయుచూ వారుండు లగ్నములకు ఎదురుగాయున్న కర్మస్థానములలోని కర్మను జీవునికి

అందించుచున్నవి. గ్రహములు చేయు పనిలో మార్పులేదు. అవి ఎల్లప్పుడు పని చేయవలసిందే. అలాగే అనుభవించే జీవునిలో మార్పులేదు. వాడు ఎల్లప్పుడు అనుభవించవలసిందే. అయితే మధ్యలోనున్న కర్మలో మాత్రము ఎంతో మార్పువున్నది. పన్నెండు గ్రహములు కర్మచక్రములోని కర్మను మాత్రము స్వీకరించుచున్నవిగానీ, కర్మకు అతీతమైన దేనినీ స్వీకరించలేదని చెప్పవచ్చును. ఒక మనిషి జీవితములో గ్రహములు తమ పనిని తాము చేయుచున్నవి. జీవుడు తన పనిని తాను చేయుచున్నాడు. జీవుని పని అనుభవించడము తప్ప వేరు పనిలేదను సూత్రమును మరువకూడదు. కాలచక్రములోగానీ పూర్తి క్రిందయున్న గుణచక్రములోగానీ ప్రతి జన్మకున్నదే ఉండును. అయితే ఒకే ఒక కర్మచక్రములో మాత్రము జన్మ జన్మకు మార్పువుండును. కర్మచక్రములోని కర్మ జన్మజన్మకు మారుచుండును. కాలచక్రములోని గ్రహముల పనిని ఖచ్చితముగా ఇంతేనని చెప్పవచ్చును. అలాగే గుణచక్రములోని జీవుని పనిని కూడా ఇంతేకలదని చెప్పవచ్చును. అయితే కర్మచక్రములోని కర్మ ఇంతే కలదని ఖచ్చితముగా చెప్పుటకు అవకాశము లేదు. కర్మచక్రములో పన్నెండు స్థానములందు ఏ కర్మ ఉండునో, ఆయా స్థానములలో ప్రవేశించిన గ్రహములు అక్కడున్న కర్మనే ఇచ్చుననీ, అలా కర్మను తీసుకొని జీవునికి ఇవ్వడమే గ్రహముల పనియని తెలియుచున్నది.

## 41 గ్రహములవద్ద ఏమీ ఉండవా?

కాలచక్రములోని గ్రహములవద్ద ఏమీ ఉండవు. కానీ ఒక్కొక్క గ్రహము ప్రపంచములో ఉన్న వస్తువులు అయిన వాహనములు, భవనములు, ఆభరణములు, లోహములు, ద్రవములు, కులములు, మతములు ఉన్న

సమస్తము పన్నెండు భాగములుగా విభజింపబడి పన్నెండు సముదాయము లుగా ఏర్పడినవి. అలా ఏర్పడిన వాటిలో ఒక్కొక్క సముదాయము ఒక్కొక్క గ్రహము యొక్క ఆధీనములో చేరిపోయి, అవన్నియూ ఆ గ్రహము యొక్క సొంత ఆస్థులుగాయున్నవి. అందువలన కాలచక్రములోని గ్రహముల వద్ద ఏమీ లేకున్నా, భూమిమీద గల సమస్తము మీద అధికారము కలవిగా యున్నవి. ఏ గ్రహము భూమిమీదగల ఏ వస్తువుల మీద మరియు ఏ పదార్థము మీద అధికారము కలదో కొంతవరకు తెలుసుకొందాము. మొదట సూర్య గ్రహము యొక్క ఆధీనములో ఏమున్నవో తెలుసుకొందాము.

## సూర్యుడు

పిత, ఆత్మ, తనువు, రాజ్యము, ప్రభావము, ధైర్యము, అధికారము, నేత్రము, పిత్తము, శూరత్వము, శక్తి, విదేశ పర్యటన, జ్ఞాన తేజము, పరాక్రమము, ఉష్ణము, అగ్ని, ధర్మ ధ్యాస, కడుపు, కన్ను, పాలనాశక్తి, ప్రభుత్వ భూములు, కోర్టు వ్యవహారములు, బంజరు భూములు, గుండ్రని ఆకారముండు పొలములు, రారాజు యోచన, గ్రామ ఆధీన జాగాలు, ఎర్రచందనము, ముద్రాధికారము, తెల్ల జిల్లేడు, తూర్పు, ఆంగ్ల విద్య, ఆదివారము, చైత్రమాసము, రాజభవనములు, వేడిని పుట్టించు నీలి వెలుగులు, పై అంతస్థులు గల భవనములు ఈ విధముగా సూర్యుని ఆధీనములో ఉన్నవి. ఇట్లుండుట వలన సూర్యుడు కర్మచక్రములోని నాల్గవ రాశిమీద తన కిరణములను ప్రసరించినప్పుడు ఆ జాతకునికి పై అంతస్థు భవనములు కట్టించు ప్రేరణ చేయును. ఒకవేళ వ్యక్తి పేదవాడైవుంటే, భవనము కట్టించు స్థోమతలేనివాడైయుంటే, అతనికి పెద్ద భవనములో కిరాయికైనా ఉండుటకు ప్రేరణ చేయును. కిరాయికి కూడా

ఉండలేని కర్మగలవానికి తాను పని చేయుచున్న యజమానికి గల పెద్ద అంతస్థుల భవనములో వాచ్‌మేన్‌గానైనా లేక పని మనిషిగానైనా ఉండునట్లు చేసి ఆ ఇంటిలో నివాసము కల్గునట్లు చేయును. ఎందరో బీదవారు తమది కాని పెద్ద భవనములో వర్క్‌మ్యాన్‌గానో, వాచ్‌మ్యాన్‌గానో, వాటర్‌మ్యాన్‌గానో ఉంటూ యజమాని తన ఇంటిలో లేకున్నా తానుమాత్రము ఉంటున్నాడు. ఈ విధముగా సూర్యుడు అనుకూలించిన వారికి కలుగును. ఇలా అనుభవించవలెనను కర్మ నాల్గవ ఇంటిలో ఉన్నప్పుడు ఆ స్థానములోనికి సూర్యుడు వచ్చినప్పుడు అలా జరుగునని తెలియవలెను. నాల్గవ ఇంటిలో పాపమున్నప్పుడు సూర్యుడు అనుకూలుడై వచ్చినా అటువంటి సుఖములను సూర్యుడు ఇవ్వడు. ఒకవేళ సూర్యుడు శత్రుగ్రహమై వస్తే గృహమునకు సంబంధించిన సుఖములు అంతవరకున్నా అప్పుడు లేకుండా చేయుటకు ప్రయత్నించును. ఉన్న పెద్ద ఇల్లును కూడా అమ్మి చిన్న ఇల్లును కొందామనుకొనును. ఈ విధముగా మనిషియెడల సూర్యగ్రహము పనిచేయుచున్నది. జాతక లగ్నమునకు నాల్గవ స్థానములో రవి యున్నప్పుడు ఇలాంటి ప్రేరణ చేయును. జాతక లగ్నములో సూర్యుడు ఏ రాశిమీద ఉండునో జీవితాంతము ఆ రాశికి సంబంధించిన కార్యములనే ప్రేరేపిస్తూ మనిషికి కష్టసుఖములను కల్గించుచుండును. ఏ జాతకునికైనా జాతక లగ్నములో ఏయే రాశుల మీద ఏయే గ్రహములుండునో దాని ఫలితమును బట్టి జీవితములో ఉండును. కాలచక్రములో తిరుగు గ్రహములు తిరిగి ఆ రాశిమీదికి వచ్చినప్పుడు మొదటి లగ్నము ప్రకారమే ఫలితముల నిచ్చుచుందురు. ఇప్పుడు చంద్రునికి ప్రపంచములో ఏయే వస్తువుల మీద అధికారము కలదో తెలుసుకొందాము.

# చంద్రుడు

మనుషులలో బుద్ధికి అధిపతి చంద్రుడు, అదేవిధముగా నీటికి అధిపతి చంద్రుడు. అలాగే స్త్రీలకు, మనస్సుకు, సౌందర్యమునకు, జల సౌఖ్యమునకు, బలమునకు, పంటలకు, వెండికి, యాత్రలకు, గుర్రపుస్వారీకి, నిద్రకు, వేగమునకు, సుగంధములకు, మాతృ ప్రీతికి, కోనేర్లు, బావులకు, కీర్తికి, స్త్రీ సుఖమునకు, తెల్లని మెత్తని గుడ్డలకు, సముద్రములకు, పుష్ఠికి, పూలకు, నదులకు, యాత్రలకు, తెలుపురంగుకు, చెరువులకు, శ్వాసకు, కడుపుకు, ముత్యములకు, ముఖ అలంకరణకు, గర్భముకు, మృదుత్వము నకు, సుఖభోజనమునకు, పాలకు, మనోజపమునకు, విమానయానమునకు, విమానములకు, నావలకు, అంతస్తుల భవనములకు చంద్రుడు అధిపతిగా యున్నాడు. అంతేకాక చౌడుభూములకు, లాడ్జీలకు, వర్షమునకు, ముద్ర ణాధికారమునకు, రాజ చిహ్నమునకు, సన్మానమునకు, ధాన్యములో వడ్లకు, వెన్నెలకు, శయన గృహములకు, సంతోషమునకు, వీర్యబలమునకు, అశ్వ వాహనమునకు, జ్ఞాపకశక్తికి, దూరాలోచనకు, శిరో ఆరోగ్యమునకు, మెదడు బలమునకు, గ్రాహితశక్తికి, ఈతలో నైపుణ్యమునకు, నదీస్నానమునకు, నీటి ప్రదేశములకు, చౌడుకు, జలచరములకు, ఇంగ్లీషు భాషకు, విలాస వస్తువులకు, వాయువ్యదిశకు, సోమవారమునకు తెల్లని పూలకు, మల్లె తోటలకు, చంద్రుడు అధిపతిగా యున్నాడు.

ఇప్పటికి ముప్పై ఐదు సంవత్సరముల క్రితమే చంద్రగ్రహములో నీళ్ళు లేవు అని ఖగోళశాస్త్రజ్ఞులు చెప్పినప్పుడు, నీటికి చంద్రుడు అధిపతి అయినందున చంద్రునిలో నీళ్ళు అపారముగా ఉన్నాయి అని మేము చెప్పడము జరిగినది. అప్పుడు నీళ్లు లేవు అని చెప్పిన శాస్త్రవేత్తలు రెండు సంవత్సరముల క్రిందట చంద్రునిలో నీళ్లు ఉన్నట్లు వారి పరిశోధనలో తెలిసినట్లు చెప్పారు. నీటికి చంద్రుడు అధిపతియైనందువలన మేము

ముందుగానే నీళ్ళు ఉన్నాయని చెప్పడము జరిగినది. ఒక మనిషి జాతకములో చంద్రుడు వ్యతిరేఖముగా వున్నట్లయితే, అతనికి జీవితములో నీటివలన అనేక ఇబ్బందులుండునని చెప్పవచ్చును. ఏదో ఒక విధముగా నీటి బాధలు జీవితాంతము ఉండును. అటువంటి వాడు బావులు త్రవ్వితే నీళ్ళు రావు. బోర్లు వేయిస్తే నీళ్ళుపడినా బోరు పూడి పోవడమో లేక నీరు ఎండిపోవడమో జరుగును. అటువంటి వ్యక్తి ఎంతమంచిగా ఇల్లు కట్టు కొనినా వర్షపు నీరు కారడమో, ఇంటిలోనికి రావడమో జరుగును. బాత్‌రూమ్‌లో కొలాయిలు చెడిపోయి నీళ్ళకు ఆటంకము ఏర్పడును. సెప్టిక్‌ట్యాంక్ పైపులు పూడిపోయి నీళ్ళు పోవుటకు ఆటంకములు ఏర్పడుచుండును. ఏదో ఒక విధముగా నీళ్ళ సమస్యలు ఉండును. అదే చంద్రుడు జాతకునికి మిత్రుడైయుంటే అతని జీవితములో నీటివలన ఎటువంటి బాధాయుండదు. మిగతా రాశులలోనికి చంద్రుడు పోయినప్పుడు ఆ రాశులలోని కర్మనుబట్టి ప్రవర్తించుచూ మనిషికి సుఖ దుఃఖము కర్మప్రకారము కలుగజేయుచున్నాడు.

## కుజుడు

పరాక్రమము, కోపము, సేనాధిపత్యము, సాహసము, విస్ఫోటనము, బాంబులు, తుపాకులు, మారణాయుధములు, కోతులు, కుక్కలు, కోరలు గల క్రూరజంతువులు, కొమ్ములుగల ఎద్దులు, శస్త్రవిద్య, తర్కశాస్త్రము, శత్రువృద్ధి, ఉష్ణము, ఎర్రభూమి, రాళ్ళభూమి, కొండలు, బండలు, ఎరుపు రంగు, రక్తము, యవ్వనము, యువకులు, యుక్తవయస్సు స్త్రీల పరిచయము, మెట్టభూమి, పట్టుదల, ప్రభుభక్తి, లక్ష్యమును ఛేదించుట, జయము, దక్షిణ దిక్కు, అరణ్యములు, అరణ్య సంచారము, సంధ్రచెట్టు లేక సంధ్ర కట్టెలు, వేట జరుపుట, యువరాజు, కట్టెలు, ప్రవాహము, మరణశిక్ష,

కోటలు, బురుజులు, సోదరబలము, చెల్లెండ్రు, వెంట్రుకలు, మీసము, క్రూరమైన ముఖవర్చస్సు, దీర్ఘబాహువులు, అంగరక్షకులు, పోలీస్‌లు, మిలటరీ, కందులు, సన్మానములు, సైన్య బలము (మనుషుల అండ) రాతి గుహలు, రచ్చబండలు, మంగమాణ్యములు, కుమ్మర మాణ్యములు, కుమ్మరాములు, వ్రణ వైద్యము, పిందెలు, కాయలు, మంగళవారము, నక్సలైట్లు మొదలగునవన్నియూ కుజగ్రహము యొక్క ఆధీనములో ఉండును.

ఒక వ్యక్తి జాతకములో కుజగ్రహము శత్రు స్థానములోయుంటే అతని యవ్వనములో సుఖము లేకుండా చేయును. నీచ స్త్రీల సాంగత్యమును కల్గించును. జాతకములో ఏడవ స్థానమును కుజుడు చూచినా, కుజుడు ఉన్నా అతనికి యుక్తవయస్సులో పెళ్ళి కాకుండా చేయును. ఎనిమిదవ స్థానమును కుజుడు తాకిన అతను ఆయుధముల చేత చంపబడును. ఆరవస్థానమును తాకినా లేక చేరినా మృగముల చేత గాయపడును. లేకపోతే ఆయుధములచేత దాడిజరిగి గాయపడడము జరుగును. శరీరములో పుండ్లు పుట్టును. టి.బి. రోగము, క్యాన్సర్ రోగము కుజుని వలననే కుజుడు శత్రువై ఆరవ స్థానమును చేరినప్పుడు కల్గును. ఒకవేళ జాతకునికి కుజగ్రహము మిత్రుడైయుంటే ఇప్పుడు చెప్పిన బాధలన్నీ యుండవు. అటువంటివి కలుగకుండా చూచుకొనును. చిన్నవయస్సులోనే పెళ్ళి చేయును. రోడ్డు ప్రమాదము జరిగినా కుజ గ్రహము అనుకూలముగా యుండినప్పుడు అతనికి ఏమాత్రము గాయము కూడా కాదు. అదే కుజుడు శత్రువుగాయుంటే గాయాలపాలు చేయును, రక్తపాతమును పుట్టించును. ఈ విధముగా కుజగ్రహము కర్మచక్రము మీద తన కిరణములను ప్రసరించుచూ ఒక్కొక్క స్థానమువద్ద యున్నప్పుడు ఆ స్థానములోగల కర్మను అనుసరించి కుజుని నుండి ఫలితము దక్కును.

కుజగ్రహము చురుకైనది, కోపముగలది. కావున స్థానములనుబట్టి కర్మ ఫలితములు తీక్షణముగా ఉండును.

## బుధుడు

జ్యోతిష్యము, గణితశాస్త్రము, మంత్రములు, యంత్రములు, వ్యాపారము, తల్లివైపు బంధువులు, మామగారు, యుక్తి, శిల్పవిద్య, మంత్ర తంత్రవిద్యలు, వేద విచారణ, హాస్యము, వైద్యము, జ్ఞానము, లిపి, పైత్యము, దృష్టిబలము, ఆకుపచ్చరంగు, శిల్పకళ, చిత్రలేఖనము, శివభక్తి, దాస దాసీ జన అభివృద్ధి, సంధిచేయుట, చాకచక్యముగా మాట్లాడుట, పొట్టితనము, విచిత్ర రచనలు, యుక్తియుక్త జ్ఞానము, చమత్కారము, సైంటిస్టు, ఉత్తరము దిక్కు, బుధవారము, స్మశానభూములు, గోరీలు, దిబ్బలు, దింపుడు కల్లములు, దయ్యాల ఇండ్లు, బలి ఇచ్చుస్థానములు, దయ్యాలు, పాడుపడిన స్థలములు, వ్యాపార స్థలములు, అంగళ్ళు, శూన్యములు, సూక్ష్మములు, భూతవైద్యము, ఉత్తరేణి చెట్టు, పెసలు ధాన్యము మొదలగునవి బుధ గ్రహముయొక్క ఆధీనములో గలవు.

జాతకునికి బుధగ్రహము శత్రుస్థానములోయుంటే బుధుడు ఆరవ స్థానమును తాకినా లేక అందులోయున్నా వానికి దయ్యముల బాధలు తప్పవని చెప్పవచ్చును. దయ్యములు శరీరములో రోగరూపముగాయుంటూ బాధించునని చెప్పవచ్చును. కర్మ బలీయముగావుంటే దయ్యముల చేతనే చంపబడునని చెప్పవచ్చును. బుధగ్రహము అనుకూలముగా (మిత్రునిగా) యుంటే దయ్యముల బాధవుండదు. బుధుడు మిత్రగ్రహమై ఆరవ స్థానములో తాకినా, ఉండినా అతను వైద్యము వలన జీవించుననీ, అందులో భూతవైద్యమును కూడా తెలిసియుండుననీ చెప్పవచ్చును. ఒకవేళ అతనికి

బుధుడు శత్రుగ్రహమైతే భూతవైద్యమును చేసినా దానివలన దయ్యములు పోవు. అంతేకాక దయ్యములే అతనిని ఇబ్బంది పెట్టును. కొంతమందికి నాల్గవ స్థానమును బుధుడు చూచిన అతనికి మిత్రగ్రహమైతే అతను వ్యాపారవేత్తగా జీవించగలుగును. అతనికున్న కర్మప్రకారము, గ్రహముల మిత్ర శత్రు కారణమునుబట్టి వ్యాపారవృత్తిలో గొప్ప పేరు సంపాదించు కోవడము జరుగుచున్నది. బుధ గ్రహము యొక్క అనుకూలమునుబట్టి ఎవరికైనా జ్యోతిష్యశాస్త్రము పూర్తిగా తెలియగలదు. అటువంటి వాడు జ్యోతిష్యునిగా మారిపోవచ్చును.

## గురువు

పన్నెండు గ్రహములలో గురువు ఒక పక్షమునకు నాయకుడుగా యున్నాడు. అటువంటి గురువు ఆధీనములో క్రింద చెప్పినవన్నీ గలవు. భూమిమీదున్న ప్రపంచ ధనమూ, వేదవిద్య, ప్రపంచ విద్య, పుత్రులు, జ్యోతిష్యము, గురువుగా ఉండుట, సత్కర్మ చేయుట, శబ్దశాస్త్రము, బ్రాహ్మణత్వము, యజ్ఞాది క్రతువులు, బంగారు, గృహము, అశ్వము, గజము, ఆచారము, సుజనత్వము, శాంతము, మంత్రిత్వము, ఐశ్వర్యము, బంధువృద్ధి, సత్యము, పురాణములు, పౌరాణికము, పుత్రపౌత్ర వృద్ధి, మంచి సంతతి. పూజనీయత, అధికార గౌరవములు, గ్రామాధికారము, పసుపు రంగు, మాట చమత్కారము, మేథావి, తీర్థయాత్ర దేవతా దర్శనములు, గ్రంథ పఠనము, అగ్రస్థానము, తియ్యని ఆహారము, సంస్కృతి, పాండిత్యములో ప్రతిభ, బంధుబలము, సంస్కృతభాష, గ్రంథరచన, ముక్తి సాధన, పౌరోహిత్యము, యుజుర్వేదము, సమయస్ఫూర్తి, మతసిద్ధాంతము, దేవాలయ నిర్మాణము, చవుటి భూములు, కళ్యాణ మందిరములు, భజన మందిరములు

నిర్మించుట, బోధనావృత్తి మొదలగు విషయములన్నియూ గురువు ఆధీనములోనున్నవని తెలియవలెను.

గురుగ్రహము కర్మరాశుల మీద తన కిరణములను ప్రసరింప జేసినప్పుడు అక్కడి కర్మప్రకారము తన ఆధీనములోని వాటిని గ్రహించి మనిషిచేత అనుభవింపజేయుచున్నది. ఉదాహరణకు గురుగ్రహము కర్మ చక్రములోని మూడవ రాశిమీదికి తన కిరణములను ప్రసరింపజేసినప్పుడు మూడవ స్థానములో ధనము బంగారు రాశులు కర్మప్రకారముండును. కనుక అక్కడికి తన కిరణములను పంపిన గురువు ఆ జాతకునికి మిత్రుడైతే ఆ రాశిలోని బంగారును తీసి జాతకునికి ఇచ్చును. బయట వ్యవహారము లలో మిళితమైన మనిషికి తనకు బంగారు ఏదో ఒక విధముగా లభ్యమైనట్లు తెలిసినా, వ్యాపారములో లాభమొచ్చి బంగారమును కొనినా, అదంతయూ తమ తెలివివలన, తాము చేసే పనుల వలన లభ్యమైనదని అనుకొనినా, పైకి ఎలా కనిపించినా ఎవరికీ తెలియకుండా గురు గ్రహమువలన వచ్చినదని ఎవరూ అనుకోరు. గురుగ్రహము ప్రపంచములోని బంగారు కంతటికి అధిపతియనీ, గురుగ్రహము యొక్క కిరణముల నీడ పడనిదే ఎవనికీ బంగారు లభ్యము కాదని చాలామందికి తెలియదు. గురుగ్రహము అనుకూలముగా మిత్రునిగా ఉండుట వలన లేని బంగారును ఏదో ఒక విధముగా ఇచ్చును. అదే గురుగ్రహము జాతకునికి వ్యతిరేఖిగా, శత్రువుగా ఉంటే బయట ఏదో ఒక కారణముచేత ఉన్న బంగారును కూడా లేకుండా అమ్మించును. మూడవ స్థానములో రాహువు వెనుక గురువుంటే ఉన్న బంగారును దొంగలు ఎత్తుకొని పోవునట్లు చేయును. ఈ విధముగా తన ఆధీనములోనున్న దేనినైనా మనిషికి లేని దానిని ఇవ్వడముగానీ, ఉన్న దానిని గుంజుకోవడముగానీ గురుగ్రహము కర్మనుబట్టి చేయుచుండును. ఈ విధముగానే అన్ని విషయములలోను లెక్కించి చెప్పుకోవలెను.

# శుక్ర గ్రహము

ద్వాదశ గ్రహములలో మానవునికి సుఖములను అందివ్వడములో దీనిని మించిన గ్రహములేదు. శుక్రుడు శని వర్గములోనివాడు. శనివర్గము లోని వారికి ఎంతో విలువైన సుఖములను అందించును. అటువంటి శుక్రగ్రహము ఆధీనములోనున్న విషయములను ఇప్పుడు చూద్దాము. శుక్రుడు కళత్రకారకుడు. అందువలన భూమిమీద ఏ మనిషికైనా భార్య లభించాలంటే శుక్రుని కిరణములమీదే ఆధారపడియుండును. అంతేకాక ఆయన ఆధీనములోని విషయములు ఇలా కలవు. వివాహము, నాటక సాహిత్యము, స్త్రీసౌఖ్యము, కామము, భోగము, వ్యభిచారము, వాహన సుఖము. ఆభరణములు, ఐశ్వర్యము, ముద్రణాధికారము, హాస్యము, మేహము, వేశ్యా సంభోగము, కన్యత్వ లభ్యము. తెల్లని వస్త్రము, సుగంధములు, సౌందర్యము, జలక్రీడ, చిత్రలేఖనము, కవిత్వము, గ్రంథరచన, సంగీతము, సామవేదము, మద్యపానము, నృత్యము, యువతి, మనోభావములు, అష్ట భోగములు, అష్ట ఐశ్వర్యములు, శృంగార కావ్య రచనలు, దేహసుఖము, సౌందర్యము, సుకుమారము, వీణ లేక వేణు గానము, వాహన సౌఖ్యము, అన్యస్త్రీల ఆలింగనము, బహుస్త్రీ సంగమము, కళానైపుణ్యము, వీర్యబలము, శివభక్తి, శాంభవీవిద్య, మృధురతి, స్త్రీలకు మిక్కిలి ప్రియముగా ఉండుట, వివాహములలో విందులలో పాల్గొనుట. సభా సన్మానములు, వేశ్యలు సన్నిహితముగా ఉండుట. వ్యసనాలలో స్త్రీకి లొంగిపోవడము, తాంబూలము, మాంసభక్షణ, శక్తిపూజలు, పశువుల ఇండ్లు, బండ్లు విడుచు స్థలము, వ్యభిచార గృహములు, పశువుల ఇళ్ళు, వంట కట్టెలు పెట్టుచోటు, శయన గృహములు నవ యవ్వనుల మిత్రత్వము. కామకేళీ విలాసము. ఈ విధముగా శుక్ర గ్రహము యొక్క ఆధీనములోని విషయములు గలవు.

శుక్రగ్రహము మిత్రుడై కాలచక్రములో తిరుగుతూ, కళత్ర స్థానమైన ఏడవ స్థానమును తన కిరణముల చేత తాకితే యుక్తవయస్సులో అందమైన భార్యను ఇచ్చును. అందమైన భార్యయేకాక ఆమె అనుకూలమైన భార్యయై ఉండును. భార్య వలన మంచి పేరు వచ్చుటయేగాక ఆమెవలన మంచి సుఖము లభించును. ఒకవేళ శుక్రుడు వ్యతిరేఖి అయితే భార్య విషయములో ముందు చెప్పిన దానికి భిన్నముగా ఉండును. భార్యవలన మనిషికి కష్టమే ఉండును. ఇట్లు ఆయా స్థానములనుబట్టి గ్రహముల మిత్ర శత్రుత్వములనుబట్టి గ్రహముల ఆధీనములోని విషయములు మంచిగానో, చెడుగానో లభ్యమగుచుండును. గ్రహము జాతకరీత్యా అనుకూలమైతే దాని ఆధీనములోని విషయములన్నీ మంచిగానే లభించును. గ్రహము మంచిది కాకపోతే ఆ గ్రహమునుండి దాని ఆధీనములోనివి ఏమీ లభించవు. అంతేకాక ఉన్నవి కూడా పోవును. జాతక కుండలిలోని అన్ని గ్రహముల విషయములు అట్లే ఉండునని తెలియవలెను.

## శని గ్రహము

శని గ్రహము ఆధీనములోని విషయములను ఇక్కడ చెప్పు కొందాము. ఆయుష్షు, నీచవిద్య, నీచ దేవతోపాసన, మరణము, దుఃఖము, అసత్యము, అధర్మము, బంధనము, కురూపము, శాంతము, దుష్ప్రవర్తన, పాపము, నరకము, నీచ జీవనము, రోగములు, దాసీజన సౌఖ్యము, విధవ సౌఖ్యము, నపుంసకత్వము, పౌరుషహీనము, పాపార్జన, అనాచారము, జీవహింస, మాలిన్యవస్త్రం, శిథిల వస్తువులు, పాపుడు, కౄరత్వము, బూడిద పూసుకొన్నవాడు, సన్న్యాసి లేక సన్న్యాసిని, నల్లటి వస్త్రములు, పాపులతో స్నేహము, శూద్రుడు, వ్యవసాయదారుడు, జైలు, కృశించిన శరీరము గలవాడు, చినిగిన వస్త్రములు కలవాడు, బ్రాహ్మణద్వేషి, దున్నలకు అధిపతి,

భయంకరుడు, జంతువులతో రమించువాడు, నీచదేవతోపాసన, పాతాళ గృహము, కంచర గాడిదలు, చెడు ప్రవర్తన, దారిద్ర్యము, వంటలవాడు, మద్యపానము విక్రయించువాడు, మాంసవిక్రయుడు, మాంసవిక్రయశాల, భోజనవిక్రయము, ఇనుము అంగడి, శిథిల గృహము దాని నివాసము, కాఫీ హోటళ్ళు, దిబ్బలు, మలవిసర్జన స్థలములు, స్మశానము, చీకటిల్లు, ఈశ్వరి మాన్యములు, సమాధులు, జమ్మిచెట్టు, నూగులు, వృద్ధత్వము, మారణాస్త్రములు, శక్తి ఆలయములు, నలుపురంగు, కామదహన స్థలము, పీర్ల గుండము, సారాయి, కల్లు, అంగళ్ళు, ఇనుము, ఇనుప వ్యాపారము.

ఇవన్నియూ శని ఆధీనములో ఉన్న వస్తువుల విషయములు. ఉదాహరణకు ఇనుము శని ఆధీనములోని లోహము కదా! అందువలన శని గ్రహము అనుకూలమైన జాతకులు కొందరు ఇనుము వ్యాపారము చేయుచూ, శనిగ్రహము వలన మంచి లాభములనుపొంది పెద్ద ధనికులుగా మారినవారు కలరు. శనిగ్రహము వ్యతిరేఖముగా ఉంటే నష్టాలలో ముంచి నీచ వృత్తిని చేయించిన విధానము కూడా కలదు. శని అంటే అన్నీ చెడు చేయువాడనీ, కష్టపెట్టువాడనీ అందరూ అనుకోవడము జరుగుచున్నది. అందరూ అనుకొన్నట్లు శని కష్టపెట్టుటకు మాత్రమే ఉన్నాడని అనుకోవడము పొరపాటు. శని కాలచక్రములో తిరుగునప్పుడు ఆయన కిరణములు కర్మచక్రము మీద పడుచూ పోవుచుండును కదా! అప్పుడు ఆ స్థానములలో ఉండు పాపపుణ్యములనుబట్టి మనిషికి కష్టసుఖములు కల్గుచుండును. శని గ్రహము మిత్రుడైతే అన్నీ మంచే జరుగును. శత్రువైతే అన్నీ చెడే జరుగునని తెలియవలెను. అందువలన ఏ గ్రహముగానీ తాను స్వయముగా చెడును కలుగజేయుటకే ఉండుననుకోవడము పొరపాటు. ఇప్పుడు రాహు గ్రహమును గురించి తెలుసుకొందాము.

# రాహువు

కౄరత్వము, పాపము, నీచవిద్య, నీచ జీవనము, చోర జీవనము, విషములు, సర్పములు, తేళ్ళు, మండ్రగబ్బలు, క్రిమికీటకాదులు, పాడు పడిన గృహములు, పుట్టలు, చెదలు, వంపులు, మినుములు ధాన్యము, గరికగడ్డి, మాంస విక్రయము, మాసిన వస్త్రములు ధరించుట, పొగరంగు, మోసము చేయుట, పాములు పట్టుట, చెప్పులు కుట్టుట, దొంగతనము చేయుట, మత్తుపదార్థములను అమ్ముట, మత్తు పదార్థములను సేవించుట, అపసవ్యముగా తిరుగుట. చండాలత్వము, రాక్షసత్వము, హత్యలు చేయడము మొదలగునవన్నియూ రాహుగ్రహము యొక్క ఆధీనములో ఉండును. రాహు గ్రహము జాతకమునుబట్టి కొందరికి అనుకూలముగా, కొందరికి అనానుకూలముగా ఉండును. అనుకూలముయున్న వానికి జాతకములో కర్మచక్రములోని నాల్గవ స్థానములో రాహు గ్రహముండిన ఆ జాతకుణ్ణి పూర్తిగా దొంగతనములు, పెద్ద దోపిడీలు చేయడమే వృత్తిగా చేయును. దొంగ వృత్తికి పెద్ద రాహువు అయినందున మనిషిని దొంగ వృత్తిలో లక్షలు సంపాదించునట్లు చేయును, రాహువు అనుకూలమైనందున ఆ వృత్తిలో ఎక్కడా ఆటంకము ఏర్పడదు. అదే వృత్తిలో ధనికున్ని చేయడమే కాక, అతనికి గౌరవము కూడా సమాజములో ఉండునట్లు చేయును. అతను దోపిడీ చేయువాడని తెలిసి అతనికి భయపడి గౌరవింతురు. అదే రాహు గ్రహము వ్యతిరేఖమైయుంటే, దొంగతనము వృత్తిగా చేసినా, దానిలో ఎన్నో మార్లు దొరికి తన్నులు తినడము. పోలీస్ కేసులు వచ్చి ఉన్న ధనమును కూడా రికవరీ క్రింద వారు లాగుకొనడము జరుగుచుండును. ఆ దొంగ వృత్తిలో జీవితము దుర్భరమగును. జైలు జీవితము గడుపవలసి వచ్చును. ఈ విధముగా రాహువు యొక్క మిత్ర శత్రుత్వమునుబట్టి ఫలితముండును.

# కేతువు

కేతు గ్రహము అందరి దృష్ఠిలో చిన్నదైనా మా దృష్ఠిలో పెద్దదని చెప్పక తప్పదు. పన్నెండు గ్రహములలో పదకొండు మనిషిని పూర్తిగా అజ్ఞానములో ముంచి ప్రపంచ మార్గములో నడుపగా, ఒక్క కేతు గ్రహము మాత్రము మనిషికి దైవభక్తిని కల్గించి దైవమార్గములో నడుచుటకు అవకాశమేర్పరచుచున్నది. మనిషికున్న శ్రద్ధనుబట్టి తన ద్వారా మనిషికి నిరాకార భక్తి లభించునట్లు చేయుచున్నది. అందువలన ద్వాదశ గ్రహము లలో కేతువును ముఖ్యమైన గ్రహముగా మేము చెప్పుచున్నాము. అటువంటి కేతు గ్రహము యొక్క ఆధీనములో ఏమున్నవో ఇప్పుడు గమనిద్దాము. ఆత్మజ్ఞానములాంటి జ్ఞానము, సన్న్యాసత్వము, నిరాకార భక్తి, దైవభక్తి, ఆశ్రమ నివాసము. సన్న్యాసులతో స్నేహము, వేదాంతము, దేవుని ధ్యాస, చిత్రవర్ణము, దర్భమొక్కలు, ఉలవల ధాన్యము, తపస్సు, మౌనము, అపసవ్య లిపిని వ్రాయడము లేక అటువంటి దానిని చదవడము, వైరాగ్యము, శూద్రగోష్టి, మహమ్మదీయులు, హేతువాదము మొదలగునవన్నియూ కేతువు ఆధీనములో ఉండును.

కేతు గ్రహము యొక్క కిరణములు కర్మచక్రములోని ఐదవ స్థానము మీద పడితే ఐదవ స్థానములోనున్న ప్రపంచ జ్ఞానమునుండి దేవుని జ్ఞానము వైపు మళ్ళించుటకు ప్రయత్నించును. అప్పుడు మనిషికి ప్రపంచ జ్ఞానము మీద శ్రద్ధయుంటే దానిప్రకారము ప్రపంచ జ్ఞానమునే కలుగజేస్తూ, ప్రపంచ జ్ఞానములో హేతువాదమును కల్గించి సత్యము కొరకు వెదుకుటకు ప్రయత్నించునట్లు చేయును. అలాంటి సత్యాన్వేషణలో దేవతలను నమ్మకుండా దేవునివైపు చూపు పారునట్లు చేయును. అలాంటప్పుడు మనిషికి కొద్దికొద్దిగా దేవునివైపు చింత కలుగును. ఒకవేళ ముందే దేవుని జ్ఞానము మీద మనిషికి శ్రద్ధయుంటే ప్రపంచ జ్ఞానమునకు వ్యతిరేఖముగా నడుచుకొనునట్లు మనిషిని ప్రేరేపించును. ప్రపంచ మార్గమునకు

వ్యతిరేఖముగా నడిపించినప్పుడు అతడు ఎవరి ప్రమేయమూ లేకుండా ప్రపంచమునకు వ్యతిరేఖ మార్గమైన దేవుని మార్గమువైపు పోవునట్లు చేయును. అయినా దేవునివైపురాక దేవునివైపు అనునట్లు చేయును. ఒకవేళ కేతుగ్రహము వ్యతిరేఖుడై శత్రుపక్షమునవుంటే, మనిషిని ప్రపంచ జ్ఞానములోనే ఉండునట్లు చేయును. అటువంటి వారికి ఏమాత్రము దైవజ్ఞానము మీద ఆసక్తి యుండదు. అతనికి బలవంతముగా దైవజ్ఞానమును చెప్పినా అతను పట్టించుకోడు. ఈ విధముగా కేతు గ్రహము యొక్క ఐదవ రాశిలోని ఫలితముండగా మిగతా రాశుల ఫలితములు వేరుగా ఉండును.

## భూమి

ఇంతవరకు భూమిని గ్రహ కూటమిలోనికి ఎవరూ చేర్చుకున్నా, మేము మాత్రము ఇక్కడినుండి చెప్పవలసివచ్చినది. కర్మను పాలించుటలో భూమికూడా పాత్ర వహించుచున్నది. కావున భూమిని గ్రహకూటమిలో చేర్చి చెప్పడమైనది. భూమి ఆధీనములో కొన్ని విషయములు మాత్రము కలవు. వాటిలో గనులు, ఖనిజములు ముఖ్యమైనవి. ఇళ్ళ స్థలములు, గుహలు, మంచు ప్రదేశములు, హిమపాతము, అరికాళ్ళు, అరి చేతులు నవ్వలురావడము, అరికాళ్ళు అరిచేతులు చీలడము, చర్మరోగములు, సువాసనలు, సుగంధ ద్రవ్యములు, వెులలు వెుదలగునవి భూమి ఆధీనములోగలవు.

## మిత్ర

మిత్రగ్రహము చీకటి గ్రహము. అందువలన మిత్ర ఆధీనములో నిద్ర, నిద్రలోని కదలికలు ఉండును. మిత్ర చీకటి గ్రహమైనందున

చీకటిలోనున్న నిద్రకు అధిపతిగాయున్నది. అంతేకాక నిద్రలోవచ్చు తలనొప్పి, నిద్రలేమి, మానసిక వ్యాధులు మిత్ర గ్రహమువలననే కల్గును. ఆత్మజ్ఞానమునకు మిత్ర దారిచూపును. స్వప్నములు కూడా మిత్ర ఆధీనములో ఉన్నవేనని తెలియవలెను. నిద్రలోని కదలికలు, స్వప్నములోని కదలికలకు మిత్ర గ్రహమే కారణము.

## చిత్ర

మనిషి అకాల మరణము పొందిన తర్వాత, జీవుడు బ్రతికియుండి పరకాయ ప్రవేశము చేయడమును (మరొక శరీరములో చేరుటను) ఆ శరీరములో ఎంతకాలముండవలెనను విషయమును చిత్రగ్రహము సూచించును. సూక్ష్మశరీరముతోయుండి ఎవరిలోనికీ చేరక ఉండు విషయమును సూక్ష్మముగాయున్న కాలములో జ్ఞానము పొందు అవకాశమును చిత్రగ్రహము సూచించును. ఒకవేళ చిత్రగ్రహము శత్రువైతే ఎవరిలోనూ చేరకయుండడము, మిగతా సూక్ష్ములచేత బాధింపబడడము జరుగుచుండును. చిత్రగ్రహము అకాలమృత్యువునూ, తాత్కాలిక మరణమును కూడా సూచించును. సూక్ష్మశరీరముతోనున్న సమయములో మనోబాధలు లేకుండా జ్ఞానచింతలోయుండునట్లు చిత్రగ్రహము చేయగలదు. చిత్రగ్రహము అదృశ్యముగాయుండి దినములో కొన్ని నిమిషములు మాత్రము కనిపించునను సూచనగా సూక్ష్మశరీరము అదృశ్యముగాయుండి కొంత సమయము మాత్రము ఇతరులలో చేరి బయటికి తెలియునట్లు చేయుచున్నది.

పన్నెండు గ్రహముల ఆధీనములోనున్న విషయ, వస్తు సముదాయమును తెలుసుకొన్నాము. గ్రహముల ఆధీనములో ఇంకా

మనకు తెలియని అనేకములు గలవు. మనము కొంతవరకు చెప్పుకొన్నాము. అయితే అనుభవమునుబట్టి ఇంకా కొన్ని విషయములను తెలియవలసి యున్నది. జ్యోతిష్యశాస్త్రములో పరిశోధనలు జరుగడములేదు. అందువలన ఈ శాస్త్రము మిగత నాలుగు శాస్త్రములవలె అభివృద్ధి చెందలేదని చెప్పవచ్చును. అభివృద్ధి చెందనిది ఒక లోపమైతే, ఉన్నది కూడా కాల క్రమములో లేకుండా పోవడమూ, మార్పుచెంది పోవడమూ మరియొక లోపము. అందువలన జ్యోతిష్యము శాస్త్రమువలె కనిపించక కొందరి దృష్ఠిలో మూఢనమ్మకముగా కనిపించుచున్నది. మిగతా శాస్త్రములైన గణిత, ఖగోళ, రసాయన, భౌతికశాస్త్రములలో పరిశోధన జరిగినట్లు జ్యోతిష్య శాస్త్రములో పరిశోధన జరగలేదని అందరికీ తెలుసు. అయితే ఉన్న విషయములు కూడా కాలక్రమములో మార్పుచెంది వేరుగా మారిపోయినవని చాలామందికి తెలియదు. ఇప్పుడు ఆ విషయములు అవసరము లేకున్నా తెలుసుకోవడము మంచిది. అలా తెలుసుకోవడము వలన మిగతా విషయములైనా మారకుండా ఉండవచ్చును.

## 42 యోగము, కరణము అనగానేమి?

పంచాంగమును విభజించితే ఐదు భాగములుగాయున్నదని ముందే చెప్పుకొన్నాము. పంచాంగములో తిథి, వార, నక్షత్ర, యోగ, కరణము అను ఐదు భాగములున్నా ఇవియే పంచాంగములు అని చాలామందికి తెలియదు. ఈ ఐదు భాగములలో నక్షత్రము జ్యోతిష్యమందు ముఖ్యపాత్ర పోషించుచున్నదని కూడా వెనుక పేజీలలో చెప్పుకొన్నాము. వారము అంటే ఏమిటో అందరికీ తెలుసు. ప్రతి దినము ఏదో ఒక వారము పేరు వస్తున్నది. దినము పేరును వారము అంటున్నాము. ప్రతి దినము ఒక

వారమున్నట్లు, ప్రతి వారము (దినము) నకు ఒక నక్షత్రము కలదు, అలాగే ఒక తిథియు కలదు. వారము అందరికీ తెలుసు. అయితే కొందరికి తిథి నక్షత్రములను గురించి తెలియదు. నేడు కాలేజీలలో విద్యనభ్యసించిన వారికి వీటిని గురించి తెలుసుకొను అవకాశము లేదు. కనుక నేటి యువకులకు తిథి నక్షత్రములు తెలియవనియే చెప్పవచ్చును. తిథి, వార, నక్షత్రములను గురించి నేటి యువకులలో కొందరికి తెలియకున్నా పెద్దలందరికీ చాలామందికి తిథి, వార, నక్షత్రములను గురించి తెలుసు. ఇక యోగ, కరణ అనువాటి విషయమునకు వస్తే వాటి విషయము చాలామంది పెద్దలకు కూడా తెలియదనియే చెప్పవచ్చును. ఒకవేళ కొందరికి వీటి విషయము తెలిసియున్నా వాటి అసలైన భావము ఏదో తెలియదు. ఈ విషయములో నాకు కూడా సరిగా తెలియదనియే చెప్పుచున్నాను. ఎందుకనగా! యోగ, కరణ విషయములో రెండు భావములు కలవు. పంచాంగము, జ్యోతిష్యము తెలిసిన వారికి యోగము కరణము అనగా ఒక రకముగా తెలిసియున్నవి. పంచాంగములోనున్న యోగ, కరణ అను రెండు కాలక్రమమున వాటి అర్థములు, సంఖ్యలు, పేర్లు అన్నీ మారిపోయి యున్నవి. మొదట జ్యోతిష్యము కొరకు తయారు చేసిన యోగ, కరణములు వేరు, నేడు కొందరికి మాత్రము తెలిసిన యోగ, కరణములు వేరని చెప్పవచ్చును. నేడు కొందరికి తెలిసిన యోగ కరణముల పేర్లు, సంఖ్యలు ఇలా గలవు.

**యోగములు :-** మొత్తము = 27, వాటి పేర్లు వరుసగా 1.విష్కంభము 2. ప్రీతి 3. ఆయుష్మాన్ 4.సౌభాగ్యము 5. శోభనము 6. అతిగండము 7. సుకర్మము 8. ధృతి 9. శూలము 10. గండము 11. వృద్ధి 12. ధ్రువము 13. వ్యాఘాతము 14. హర్షణము 15. వజ్రము

16. సిద్ధి 17. వ్యతీపాత్ 18. వరియాన్ 19. పరిఘము 20. శివము 21. సిద్ధము 22. సాధ్యము 23. శుభము 24. శుభ్రము 25. బ్రహ్మము 26. ఇంద్రము 27. వైధృతి. ఈ 27 యోగములను కొన్ని గ్రంథములలో వ్రాసియున్నారు. వాటినే మేము సేకరించి ఇక్కడ చూపాము. ఇవి ఏవో, ఎందుకున్నాయో, వీటి ప్రయోజనమేమో నాకు మాత్రము కొంచెము కూడా తెలియదు.

ఈ యోగములు 27యని వాటి పేర్లతో కూడా వ్రాసినవారు ఇదే పద్ధతిలోనే కరణములను కూడా వ్రాశారు. వారికి తెలిసిన విధానములో కరణములు 11 యని చెప్పుచూ వాటి పేర్లను కూడా ఇలా చెప్పారు. కరణములు మొత్తము (11) పదకొండు. వాటి పేర్లు వరుసగా ఇలా గలవు. 1. బవ 2. బాలవ 3. కౌలవ 4. తైతుల 5. గరజి 6. వరాజి 7. భద్ర 8. శకుని 9. చతుష్పాత్ 10. నాగవము 11. కింస్తుఘ్నము.

27 యోగములతోపాటు 11 కరణములను కూడా కొన్ని గ్రంథములలో వ్రాసియున్నారు ఇవి కూడా ఎందుకున్నాయో, వీటి ప్రయోజనము ఏమిటో నాకు ఏమాత్రము తెలియదు. నా మాటను విన్న కొందరికి ఆశ్చర్యము కలిగి పంచాంగములో భాగములైయున్న యోగ, కరణములను తెలియదని చెప్పుచున్న మీరు, జ్యోతిష్యశాస్త్రమును ఎలా వ్రాయుచున్నారు? అని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! యోగము కరణములనగా నా భావములో వేరు అర్థము కలదనీ, అవి ఇవి కావు అని అనుకొనుచున్నాను. ఇతరులకు తెలిసిన యోగ, కరణములు నాకు తెలియవు. నాకు తెలిసిన యోగ కరణములు ఇతరులకు తెలిసియుండక పోవచ్చును. ఇతరులకు తెలిసినా, తెలియకున్నా నా

భావములో యోగము అంటే కలయిక అనీ, కరణము అంటే చేయుచున్న వాడనీ లేక చేయుచున్నదనీ అర్థము. వీటిని గురించి అందరికీ తెలుపగలను.

మాకు తెలిసిన యోగము, కరణము రెండు రకములు కలవు. ఒకటి జ్యోతిష్య భావము ప్రకారము, రెండు ఆధ్యాత్మిక భావము ప్రకారము రెండు విధముల భావములు కలవు. జ్యోతిష్య భావము ప్రకారము చెప్పుకొంటే, రెండు గ్రహముల కలయికను యోగము అని అనుచుందురు. ఒకే లగ్నములో రెండు గ్రహములు కలిసిన, ఆ గ్రహముల పేరుతో దానిని యోగము అంటారు. ఉదాహరణకు బుధుడు, సూర్యుడు ఒక్క లగ్నములో కలిసినప్పుడు జరుగు కాలమును "బుధార్క యోగము" అంటారు. రెండు శుభగ్రహములు ఒక లగ్నములో కలిసిన వారిరువురు కలిసి ఇచ్చు మంచి ఫలితములను అనుభవించు కాలమును యోగము అని అనడము జరుగు చున్నది. బయట దృష్టికి పనులను చేయువానిని కరణము అంటున్నాము. "కరణమైన వాడు యోగము అనుభవించును" అని జ్యోతిష్యములో పూర్వము చెప్పెడివారు. ఇకపోతే బ్రహ్మవిద్యాశాస్త్రము ప్రకారము జీవాత్మ ఆత్మ అను రెండు ఆత్మల కలయికను యోగము అంటారు. పని జరుగుటకు కారణమైన కర్మను కరణము అంటాము. జ్యోతిష్యములో రెండు గ్రహముల కలయిక యోగమైతే, ఆధ్యాత్మికములో రెండు ఆత్మల కలయిక యోగమగును. అలాగే జ్యోతిష్యములో పని జరుగుటకు కారణమైన మనిషిని కరణము అంటాము. ఆధ్యాత్మికములో కార్యము జరుగుటకు కారణమైన కర్మను కరణము అంటాము. అయితే పంచాంగములో రెండు అంగములైన యోగ, కరణములను యోగములుగా గ్రహముల కలయికనూ, కరణముగా పని చేయుచున్న మనిషినీ లెక్కించుకోవచ్చును.

పంచాంగములో తిథి, వార, నక్షత్ర అను మూడు అంగములను ఒకవైపు, యోగ కరణములను ఒకవైపు రెండు భాగములుగా విభజించు కోవచ్చును. ఎందుకనగా తిథి, వార, నక్షత్రములైన మూడు ద్వారా యోగ కరణములను తెలియవచ్చును. అందువలన యోగ కరణములకు తిథి, వార, నక్షత్రములు ముఖ్యమని చెప్పవచ్చును. తిథి, వార, నక్షత్రములను మూడులో ఎవరికీ ఎటువంటి అనుమానములూ లేవు, అవి అందరికీ తెలిసినవే. అయితే రెండు అయిన యోగ, కరణముల విషయములో కొందరు ఎవరికీ పొంతన సరిపోకుండ 27 యోగములు, 11 కరణములని చెప్పడము మాకు పూర్తి అర్థముకాని విషయము. వారు చెప్పిన యోగ, కరణములు పంచాంగములోగానీ, జ్యోతిష్యములోగానీ వాటి ఉపయోగ మేమిటో వాటిని చెప్పినవారే చెప్పవలసియుంటుంది.

ఇంతకుముందు గ్రహములను గురించి చెప్పుకొన్నాము. అందరూ చెప్పుకొనిన నవగ్రహములను చెప్పక, ప్రత్యేక ద్వాదశ గ్రహములను చెప్పుకొన్నాము. మూడు గ్రహముల తేడా ఎందుకు వచ్చిందో తొమ్మిది గ్రహములను చెప్పినవారినే అడుగవలెను. 27 యోగములను, 11 కరణములను ఎలాగైతే కాదన్నామో, అలాగే నవగ్రహములను కాదని ద్వాదశ గ్రహములు సత్యమని చెప్పాము. అంతేకాక మిగతా మూడు గ్రహములకు దశాకాలములు ఎట్లున్నాయో చెప్పుకొన్నాము. దశాకాలపరిమితివద్ద శని వర్గమునకు, గురువర్గమునకు సమానముగా 60 సంవత్సరములున్నాయని చెప్పాము. దశల కాలములను సరిచేసి చెప్పడమే కాకుండా గ్రహముల ఆధీనములో గల వాటిని చెప్పుచూ అందరూ వదలివేసిన మూడు గ్రహములైన భూమి, మిత్ర, చిత్ర గ్రహముల స్వంత ఆధీనములో గలవేవో చెప్పాము. మేము చెప్పిన పన్నెండు గ్రహముల విషయములో చాలామంది

విభేదిస్తారని తెలిసి మీరు ముందు చదివినవన్నీ సత్యము కాదు అని తెలుపుటకు మాకంటే ముందు చెప్పిన వారి యోగములు 27, కరణములు 11 ఎంత సత్యమో చూడండని చెప్పాము. ఎటుచూచినా 27 యోగములు, 11 కరణములు అర్థము కాకుండా పోవుచున్నవి. మేము చెప్పిన యోగములు, కరణములు సులభముగా అర్థము కాగలవు. ఇప్పుడు అందరికీ క్రొత్తగాయున్న పన్నెండు గ్రహములనుమాటనూ, అట్లే మార్పు చెందిన దశల సంవత్సరములనూ సత్యమని ప్రతి ఒక్కరూ తెలియవలెను. పన్నెండు గ్రహములను, పన్నెండు దశలను వదిలి జ్యోతిష్యమును చూచుట వలన ఎక్కువ శాతము జ్యోతిష్యము అశాస్త్రముగా కనిపించుచున్నది. అందువలన కొందరు పనిగట్టుకొని జ్యోతిష్యము మూఢనమ్మకమనీ, జ్యోతిష్యము శాస్త్రముకాదని చెప్పుచూ, దానిని సంఘ సేవగా చెప్పుకొంటున్నారు.

సృష్ట్యాదినుండి ఆరుశాస్త్రములు తయారైనవి. దేవుడే వాటిని మనుషులకు అందించాడని చెప్పవచ్చును. ప్రపంచములో ప్రతి విషయమును తేల్చి చూపునది శాస్త్రము. శాస్త్రసమ్మతమైనప్పుడే అది సత్యమైనదని, శాస్త్రబద్ధముకానిది ఏదైనా అది అసత్యమని చెప్పుటకు దేవుడు శాస్త్రములను సృష్టించాడు. ప్రపంచములో షట్ శాస్త్రములుగాయున్న వాటిలో జ్యోతిష్యము శాస్త్రము కాదంటే ఆరు శాస్త్రములలో ఒకటైన జ్యోతిష్యము లేకుండాపోయి చివరకు ఐదు శాస్త్రములు మిగిలిపోవును. ఒక శాస్త్రము లోపించితే శాస్త్రముల సమతుల్యత తగ్గిపోయి చివరకు ఏ శాస్త్రమూ లేకుండా పోవుటకు అవకాశము ఏర్పడగలదు. అప్పుడు ఏ విషయమునకూ ప్రపంచములో హద్దూ పద్దూ లేకుండాపోవును. దానితో నాస్తికత్వము ఏర్పడి చివరకు దేవుడే లేడను వాదము బయటికి వచ్చి బలపడగలదు. అటువంటి పరిస్థితి

రాకుండుటకు శాస్త్రములు ఆరని గ్రహించి వాటిని తెలుసుకొనుటకు ప్రయత్నిద్దాము.

జ్యోతిష్యమునకు అనుకూలముగా ఉండే కొన్ని అంశములను తీసుకొందాము. అందులో గ్రహములు భూమిమీదగల ఏయే జాతులమీద అధికారము కలిగియున్నాయో తెలుసుకొందాము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1) | సూర్యుడు – క్షత్రియ | | 2) | చంద్రుడు – బ్రాహ్మణ | |
| 3) | కుజుడు | – నాయిబ్రాహ్మణ | 4) | బుధుడు | – వైశ్య |
| 5) | గురువు | – బ్రాహ్మణ | 6) | శుక్రుడు | – నంభీబ్రాహ్మణ |
| 7) | శని | – మాదిగ, మాల | 8) | రాహువు | – వాల్మీకి (బోయ) |
| 9) | కేతువు | – ఇస్లామీయులు | 10) | భూమి | – జైనులు |
| 11) | మిత్ర | – క్రైస్తవులు | 12) | చిత్ర | – సిక్కులు |

పన్నెండు గ్రహములు భూమిమీదున్న అన్ని కులములను తమ ఆధీనములో పెట్టుకొన్నాయి. ఇక్కడ గమనించుకోవలసినది ఏమనగా! సూర్యుడు క్షత్రియ కులమును ఒక్కదానినే తన ఆధీనమందుంచుకొనక, క్షత్రియులకు సమానముగాయున్న కులములన్నిటినీ తన ఆధీనములో ఉంచుకొన్నాడని తలచవలెను. రాజులు (క్షత్రియులు) మరియు బట్రాజులు ఇద్దరూ సూర్యుని ఆధీనములో ఉన్నట్లు లెక్కించుకోవలెను. అలాగే చంద్రుని ఆధీనములో బ్రాహ్మణ జాతులన్నీ వచ్చునని తెలియవలెను. శని ఆధీనములో మాదిగ కులము కాకుండా దానికి సమానమైనవన్నీ లెక్కించవలెను. రాహు ఆధీనములో ఒక్క వాల్మీకి కులము మాత్రము కాకుండా ఎరికల, యానాది మొదలగు గిరిజనులందరూ ఉన్నట్లు తెలియవలెను. ఇలా తెలియడము వలన జ్యోతిష్యము సులభమగును. ఏమి వృత్తి చేయుచున్నాడని

జ్యోతిష్యములో ప్రశ్న వచ్చినప్పుడు  నాల్గవ స్థానములో బుధగ్రహము శుభుడై (మిత్రుడై) యుంటే  అతడు వ్యాపారము చేయుచున్నాడని లేక వ్యాపారములో రాణించగలడని చెప్పవచ్చును.  ఈ విధముగా చిన్న ప్రశ్నలకు జవాబును ఇటువంటి సమాచారము ద్వారా సులభముగా చెప్పవచ్చును. అందువలన ఇప్పుడు పన్నెండు గ్రహములు ఏయే రంగులమీద అధికారము కల్గియున్నాయో  చూచుకొందాము.

| | | | |
|---|---|---|---|
| 1) సూర్యుడు | – గోధుమరంగు | 2) చంద్రుడు | – తెల్లనిరంగు |
| 3) కుజుడు | – ఎరుపురంగు | 4) బుధుడు | – ఆకుపచ్చ రంగు |
| 5) గురువు | – పసుపు రంగు | 6) శుక్రుడు | – తెలుపు రంగు |
| 7) శని | – నలుపు రంగు | 8) రాహువు | – సిమెంటు రంగు |
| 9) కేతువు | – కొన్ని కలిసిన రంగులు | 10) భూమి | – నీలిరంగు |
| 11) మిత్ర | – వక్క (పోక) రంగు | 12) చిత్ర | – లేత పసుపు |

ఈ రంగులు తెలియడము వలన జాతకునికి అనుకూలమైన రంగుల గుడ్డలు మాత్రము అతనికి శుభమును (మంచిని) కలుగజేయుననీ, మిగతా రంగులు జాతకునికి వ్యతిరేఖ గ్రహములవైనందున  ఆ రంగు గుడ్డలు ధరించితే, వాటివలన అశుభము (చెడు) జరుగునని తెలియవచ్చును. అప్పుడు వారికి  అనుకూలమైన గ్రహముల గుడ్డలనే ధరించుటకు అవకాశముండును.  తమకు అనుకూలమైన గ్రహముల యొక్క రంగు వస్త్రముల మీద ఆ రంగుల అధిపతుల (గ్రహముల) కిరణములు ఎక్కువగా ప్రసరించును.  అందువలన జాతకునకు గ్రహబలము గుడ్డల రంగుల వలన లభించవచ్చునని చెప్పవచ్చును.  అందువలన పన్నెండు గ్రహముల ఆధీనములోనున్న రంగులను తెలుసుకోవడము మంచిది.  అంతేకాక కుజగ్రహము అనుకూలమైనదైయుండి జన్మలగ్నములలో ఉండుట వలన

అక్కడినుండి 4,7,8 స్థానములను చూచుట వలన ఆ జాతకునికి ఎరుపు రంగు గుడ్డల మీద ఆసక్తి ఉండునని కూడా చెప్పవచ్చును. ఇప్పుడు గ్రహముల ఆధీనములోనున్న రుచుల విషయమును గురించి తెలుసు కొందాము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1) | సూర్యుడు | – మిరప కారము | 2) | చంద్రుడు | – ఉప్పు (చౌడుప్పు) |
| 3) | కుజుడు | – వేప చేదు | 4) | బుధుడు | – వగరు |
| 5) | గురువు | – పూర్తి తీపి | 6) | శుక్రుడు | – నిమ్మ పులుపు |
| 7) | శని | – కరక్కాయ వగరు | 8) | రాహువు | – మిరియాల కారము |
| 9) | కేతువు | – ఉప్పు | 10) | భూమి | – బీరకాయ చేదు |
| 11) | మిత్ర | – లేత తీపి | 12) | చిత్ర | – చింత పులుపు |

జాతకునికి అనుకూలమైన గ్రహములనుబట్టి ఆ గ్రహముల ఆధీనములోనున్న రుచుల మీద ఇష్టముండును. అందువలన కొందరు కొన్ని రుచులనే ఎక్కువగా ఇష్టపడుచుందురు. అంతేకాక శత్రు గ్రహముల రుచుల ఆహారముల వలన ఎప్పుడైనా అనారోగ్యము కల్గుటకు అవకాశము ఉండును. అట్లే అనుకూలమైన గ్రహముల ఆధీనములోని రుచుల ఆహారమువలన ఆరోగ్యముగా ఉండడము కూడా జరుగుచుండును. కొందరికి వారి శత్రుగ్రహముల రుచుల ఆహారము శరీరమునకు సరిపోదు (అలర్జీ అగును) అప్పుడు సరిపోని ఆహారములను వదలివేయడము మంచిది. అందువలన ఏ జాతకునికి ఏ రుచుల ఆహారము సరిపోవునో తెలుసు కోవడము మంచిది. ఇప్పుడు గ్రహముల లింగభేదమును గురించి తెలుసు కొందాము.

1. సూర్యుడు – పురుషుడు 7. శని – నపుంసక

2. చంద్రుడు – స్త్రీ
3. కుజుడు – పురుషుడు
4. బుధుడు – నపుంసకుడు
5. గురువు – పురుషుడు
6. శుక్రుడు – స్త్రీ
8. రాహువు – స్త్రీ
9. కేతువు – నపుంసక
10. భూమి – పురుష
11. మిత్ర – స్త్రీ
12. చిత్ర– నపుంసక

మొత్తము పన్నెండు గ్రహములలో నలుగురు పురుష గ్రహములూ, నలుగురు స్త్రీ గ్రహములూ, మిగత నలుగురు నపుంసక గ్రహములని తెలియవలెను. ఉదాహరణకు శుక్రుడు – స్త్రీ అని వ్రాసియుండుట వలన శుక్ర గ్రహము స్త్రీ జాతి గ్రహమేమో అనుకోకూడదు. భూమిమీద గల సమస్తమునకు పన్నెండు గ్రహములే అధిపతులని చెప్పుకొన్నాము కదా! దాని ప్రకారము భూమిమీదగల స్త్రీలకు, పురుషులకు, నపుంసకులకు గ్రహములు అధిపతులుగా ఉన్నారుగానీ, గ్రహములు స్త్రీలుగా, పురుషులుగా, నపుంసకులుగా లేరని గుర్తించుకోవలెను. ఇప్పుడు ఏ గ్రహము ఎవరికి కారకులో తెలుసుకొందాము.

1. సూర్యుడు – తండ్రికి
2. చంద్రుడు – తల్లికి
3. కుజుడు – సోదరులకు
4. బుధుడు – మామకు
5. గురువు – పుత్రునికి
6. శుక్రుడు – భార్యకు
7. శని – ఆయువుకు
8. రాహువు – చోరులకు
9. కేతువు – నిరాకార జ్ఞానమునకు
10. భూమి – అజ్ఞానమునకు
11. మిత్ర – మిత్రునికి
12. చిత్ర – శత్రువుకు

ఈ విధముగ పన్నెండు గ్రహములు తల్లితండ్రిని మొదలుకొని జ్ఞానము అజ్ఞానము వరకు ముఖ్యమైన విషయముల మీద అధికారము

కల్గియున్నవని తెలియుచున్నది. ఒక వ్యక్తికున్న పుత్రుడు మంచివాడా, కాదా? తండ్రి మాట వింటాడా, వినడా అను ప్రశ్నలకు పుత్రునికి అధికారి అయిన గురుగ్రహమును చూచి, గురుగ్రహము అనుకూలమైనదైతే పుత్రుడు అనుకూలముగా ఉండుననీ గురుగ్రహము శత్రువుగాయుంటే అతని పుత్రుడు కూడా మాట వినడని చెప్పవచ్చును. గురుగ్రహము ఉన్న స్థానమునుబట్టి వ్యతిరేఖత ఎంత అను దానిని గానీ, అనుకూలత ఎంత అను దానినిగానీ నిర్ణయించవచ్చును. అదే విధముగా జ్ఞాన విషయము లోనికివస్తే జ్ఞానము కర్మకు అతీతమైనది కదా! అటువంటపుడు కేతు గ్రహము జ్ఞానమునకు ఎలా అధిపతిగా ఉన్నదని కొందరికి ప్రశ్న రావచ్చును. దానికి మా జవాబు ఏమనగా! జ్ఞానము కర్మకు అతీతమైనదే, అది మనిషి శ్రద్ధనుబట్టి లభ్యమగును. ఇక్కడ కేతువును చూపడము దేనికంటే మనిషి శ్రద్ధ ఏ జ్ఞానమువైపు ఉన్నదో తెలుయుటకు మాత్రమే. కేతువు అనుకూలమైన గ్రహమైతే ఆ వ్యక్తి అసలైన దేవతారాధన కాని జ్ఞానము వైపు నడచుననీ, అనుకూలమైన గ్రహము కాకపోతే అతని శ్రద్ధ అసలైన నిరాకార దేవుని వైపు కాకుండా, దేవతలవైపు ఉండుననీ తెలియుటకు మాత్రమేనని తెలియ వలెను. జ్ఞానము మనిషి శ్రద్ధనుబట్టియే వచ్చునుగానీ గ్రహ బలమును బట్టి రాదు. అందువలన జ్ఞానము కర్మకు అతీతమైనదనియే చెప్పుచున్నాము. ఇకపోతే మనిషికి ఎటువంటి శ్రద్ధయున్నదో కేతువునుబట్టి తెలిసినా, వాని శ్రద్ధ ప్రకారము ఏకైక దేవుని మీదగానీ, సామూహిక దేవతలపైనగానీ కల్గు జ్ఞానము ఆటంకములు లేకుండా తెలియునా, ఆటంకములతో తెలియునా అను విషయము అజ్ఞానమునకు అధిపతిగా సూచించిన భూమిని బట్టి తెలియును. అంతేగానీ భూగ్రహము అనుకూలముగా లేనియెడల జ్ఞానము తెలియదని చెప్పుటకు వీలులేదు.

జ్ఞానమార్గములో ఆటంకములను తెలియజేయునదే భూగ్రహమని తెలియవలెను. ఇప్పుడు ఏ గ్రహము వలన ఏ రోగము వచ్చునో తెలుసుకొందాము.

**1. సూర్యుడు –** అతిసారము, జ్వరము, వేడి అగుట, శ్వాససంబంధ రోగములు కల్గును.

**2. చంద్రుడు –** పాండురోగము (రక్తలేమి) కామెర్లు, జల రోగములు, నీరసము, నాసికారంధ్రములలో బాధ, స్త్రీ సంబంధ వ్యాధులు, మూత్రము సరిగా రాకుండుట.

**3. కుజుడు –** వరిబీజాలు (బీజము వాపు), కత్తిపోట్లు లేక కత్తి గాయములు, మశూచి, కఫము, వ్రణములు (పుండ్లు), గ్రంథుల రోగము (థైరాయిడ్ మొదలగునవి).

**4. బుధుడు –** ఉదరబాధలు, కుష్టు రోగము, వేడి, నొప్పులు, మర్మావయవముల బాధలు, దయ్యముల వలనగానీ, క్షుద్ర దేవతల వలనగానీ వచ్చు శరీర రోగములు లేక బాధలు.

**5) గురువు –** కన్పించని మర్మస్థాన రోగములు, శుక్ల నష్ట వ్యాధులు, కాళ్ళ మంటలు.

**6) శుక్రుడు –** మధుమేహము, స్త్రీల నుండి సక్రమించు సుఖవ్యాధులు, పర యువతుల కొరకు కామ వికారము, మూత్ర రోగములు, అతి మూత్రము, ఎచ్.ఐ.వి. రోగము, గనేరియా, సిఫిలిస్ రోగములు.

**7) శని –** మూలవ్యాధి, కీళ్ళ వ్యాధులు

**8) రాహువు –** మూర్ఛ, అపస్మారము, మశూచి, ఉష్ణరోగములు

**9) కేతువు -** దురద, రహస్య వ్యాధులు, క్యాన్సర్

**10) భూమి -** అరికాళ్ళ, అరచేతుల మంటలు, కాళ్ళు చేతులు చీలుట.

**11) మిత్ర -** తలనొప్పి, వెన్నెముక నొప్పి, నడుము నొప్పి, మనోరోగములు

**12) చిత్ర -** మోకాళ్ళ నొప్పులు, గుండెనొప్పి.

ఈ విధముగా ఎన్నో రోగములు పన్నెండు గ్రహముల ఆధీనములో ఉన్నవి. మనిషి చేసుకొన్న కర్మనుబట్టి కర్మప్రకారము ఆయా గ్రహముల నుండి ఆయా రోగములు వచ్చును. ఇక్కడ చెప్పిన రోగములే కాకుండా వాటికి అనుబంధమైన రోగములు ఏవైనా రావచ్చును. ఇప్పుడు గ్రహముల ఆధీనములోని రాళ్ళ విషయము తెలుసుకొందాము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1) సూర్యుడు | - | కెంపు | 2) చంద్రుడు | - | ముత్యము |
| 3) కుజుడు | - | పగడము | 4) బుధుడు | - | పచ్చ |
| 5) గురువు | - | పుష్యరాగము | 6) శుక్రుడు | - | వజ్రం |
| 7) శని | - | నీలము | 8) రాహువు | - | గోమేధికము |
| 9) కేతు | - | వైఢూర్యము | 10) భూమి | - | నల్లరాయి |
| 11)మిత్ర | - | ఎర్రరాయి | 12) చిత్ర | - | తెల్లరాయి |

పన్నెండు గ్రహముల ఆధీనములో పైన కనపరచిన రాళ్ళు ఉన్నవి. అయితే కొందరు ఈ రాళ్ళను తమ ఉంగరములో ధరించు చుందురు. అలా ధరించుట వలన పన్నెండు రాళ్ళకు అధిపతులైన పన్నెండు గ్రహములు తమకు అనుకూలముగా ఉందురనీ, వారివలన ఏ ఇబ్బందులు కలుగవని కొందరు జ్యోతిష్యులు చెప్పడము వలన వాళ్ళు రత్నముల ఉంగరములు ధరించుచుందురు. అలా ధరించుట వలన ధరించిన మనిషికి

అనుకూలమైన గ్రహముల వలన ఏ ఇబ్బందీ ఉండదు. అయితే ఆ మనిషికి శత్రువర్గములైన ఆరు గ్రహముల రాళ్ళు ఆ గ్రహముల కిరణములను ఎక్కువ ఆకర్షించుట వలన రాళ్ళు ధరించిన వ్యక్తికి ఇబ్బందులు కలుగును. అందువలన ఏ మనిషి అయినా తనకు మిత్రులుగాయున్న గ్రహములేవో తెలిసి, ఆ గ్రహములకు సంబంధించిన రాళ్ళనే ధరించడము మంచిది. శత్రువర్గ గ్రహముల రాళ్ళు ధరించకూడదు. ఇప్పుడు గ్రహముల ఆధీనములోని దిశలను తెలుసుకొందాము.

1) సూర్యుడు - తూర్పుదిశ
2) చంద్రుడు - వాయువ్యదిశ
3) కుజుడు - దక్షణదిశ
4) బుధుడు - ఉత్తరదిశ
5) గురువు - ఈశాన్యదిశ
6) శుక్రుడు - ఆగ్నేయదిశ
7) శని - పడమరదిశ
8) రాహువు - నైరుతిదిశ
9) కేతువు - పైకి
10) భూమి - క్రిందికి
11) మిత్ర - పైకి
12) చిత్ర - క్రిందికి

ఈ విధముగా పన్నెండు గ్రహములకు పది దిశలు ఆధీనములో గలవు. పై దిశకు కేతువు, మిత్ర రెండు గ్రహములు అధిపతులుగాయున్నవి. అట్లే క్రింది దిశకు భూమి, చిత్ర రెండు గ్రహములు అధిపతులుగాయుండుట వలన పన్నెండు గ్రహములకు పది గ్రహములు వచ్చినవి. ఇప్పుడు ద్వాదశ గ్రహముల ఆధీనములో ఏయే ధాన్యములున్నవో తెలుసుకొందాము.

1) సూర్యుడు - గోధుమలు
2) చంద్రుడు - బియ్యము
3) కుజుడు - కందులు
4) బుధుడు - పెసలు
5) గురువు - సెనగలు
6) శుక్రుడు - బొబ్బర్లు

| | | | |
|---|---|---|---|
| 7) శని | - నువ్వులు | 8) రాహువు | - మినుములు |
| 9) కేతువు | - ఉలవలు | 10) భూమి | - జొన్నలు |
| 11) మిత్ర | - రాగులు | 12) చిత్ర | - అలసందలు |

పన్నెండు గ్రహముల ఆధీనములోనున్న ధాన్యములను చూచాము కదా! గ్రహముల మిత్ర శత్రు వర్గమునుబట్టి ఆరు గ్రహములు మిత్రులుగా యున్నవి. జాతకునికి జ్యోతిష్యము ప్రకారము ఏవి మిత్రగ్రహములో తెలియును కదా! మిత్రగ్రహముల ఆధీనములోని ఆరురకముల ధాన్యముల వలన ఆ వ్యక్తికి (ఆ జాతకునికి) ఆరోగ్యము చేకూరుననీ, మిగతా ఆరు శత్రుగ్రహముల ధాన్యముల వలన పోషక పదార్థములు లభించవనీ, ఆ ధాన్య ఆహారము వలన అనారోగ్యములు కల్గుననీ చెప్పవచ్చును. గ్రహము లను బట్టి సరిపడని ఆహారమును గుర్తించుకోవచ్చును. ఉదాహరణకు సూర్యుడు శత్రువర్గములోని గ్రహమైతే సూర్యుని ధాన్యమైన గోధుమలతో చేసిన రొట్టెలు, చపాతీలు, పూరీలు మొదలగు పదార్థములను తింటే అజీర్ణముగా ఉండడము, గొంతులో మంట రావడము జరుగుచుండును. అటువంటివారు గోధుమల ఆహారము సరిపోదని బియ్యము అన్నమునే తినుచుందురు. కొందరికి ఉలవలు తింటే విపరీతమైన వేడియగును. కొందరి స్త్రీలకు వేడివలన నెలకు ఒకమారు వచ్చు బహిష్టు (ముట్టు) నెలకాకనే ముందుగానే వచ్చును మరియు ఎక్కువగా వచ్చును. కొందరికి జొన్నలు తింటే సరిపడదు, విరేచనములగును. దానికి కారణము భూగ్రహము వారికి సరిపోదనీ, శత్రువుగా ఉన్నదనీ తెలియవలెను. ఈ విధముగా గ్రహములు వాటి ధాన్యమును గురించి తెలియవచ్చును. ఇప్పుడు పన్నెండు గ్రహములకు ఆధీనములోనున్న దినములను, వాటి పేర్లతో సహా చూద్దాము.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1) | సూర్యుడు | - | ఆదివారము | - | సూర్య గ్రహము |
| 2) | చంద్రుడు | - | సోమవారము | - | చంద్ర గ్రహము |
| 3) | కుజుడు | - | మంగళవారము | - | భూ గ్రహము |
| 4) | బుధుడు | - | బుధవారము | - | రాహు గ్రహము |
| 5) | గురువు | - | గురువారము | - | కేతు గ్రహము |
| 6) | శుక్రుడు | - | శుక్రవారము | - | మిత్ర గ్రహము |
| 7) | శని | - | శనివారము | - | చిత్ర గ్రహము |
| 8) | రాహు | - | బుధవారము | - | బుధ గ్రహము |
| 9) | కేతు | - | గురువారము | - | గురు గ్రహము |
| 10) | భూమి | - | మంగళవారము | - | కుజ గ్రహము |
| 11) | మిత్ర | - | శుక్రవారము | - | శుక్ర గ్రహము |
| 12) | చిత్ర | - | శనివారము | - | శని గ్రహము |

ఇక్కడ పన్నెండు గ్రహముల యొక్క వారముల పేర్లు (దినముల పేర్లు) తెలిసిపోయినవి. గ్రహముల మిత్ర శత్రుత్వములనుబట్టి ఎవరికి ఏ దినము అనుకూలమైనదో, ఏ దినము అనుకూలము కానిదో తెలుసు కోవచ్చును.

ఒక వ్యక్తికి శుభ గ్రహములు (మిత్ర గ్రహములు) ఏవో, అశుభ గ్రహములు (శత్రు గ్రహములు) ఏవో తెలియాలంటే అతని జాఫతకము తెలియాలి. అతని జాఫతకము (జాతకము) తెలియుటకు తప్పనిసరిగా అతని పుట్టిన తేదీ, పుట్టిన సమయము ఉండాలి. పుట్టిన తేదీని బట్టి ఆ

దిన తిథి, వారములను తెలియవచ్చును. అలాగే పుట్టిన సమయములను బట్టి ఆ దినము యొక్క నక్షత్రమును తెలియవచ్చును. పుట్టిన తేదీని, సమయమునుబట్టి జ్యోతిష్యులైనవారు ఆ దిన పంచాంగము ప్రకారము జాఫతకమును నిర్ణయింతురు. ఆ దిన పంచాంగమునుబట్టి ఆ వ్యక్తి పుట్టిన సమయములో కాలచక్రమునందు ఏ గ్రహము ఎక్కడున్నది తెలిసి పోవును. అలా తెలిసిన దానినిబట్టి పన్నెండు లగ్నములలో పన్నెండు గ్రహములు ఎక్కడున్నది వ్రాసి చూచుకోవచ్చును. అలా వ్రాసుకొన్న దానిని జన్మలగ్నకుండలి అంటారు. పంచాంగము ప్రకారము జనన సమయములో కాలచక్రములోని సూర్యుడు తన కిరణములను కర్మచక్రముమీద ఎక్కడ ప్రసరించుచున్నాడో దానికి సరిగ్గా కాలచక్రములోనున్న లగ్నమును జన్మ లగ్నముగా లెక్కించబడును. జన్మలగ్నమును తన స్థానముగా (శరీర స్థానముగా) లెక్కించి అక్కడినుండి మిగతా గ్రహములను మిగతా లగ్నము లలో ఉన్నట్లు లెక్కించుకొనవలెను. పంచాంగము ప్రకారము ఏ గ్రహము ఏ లగ్నములో ఉన్నదీ, ఆ లగ్నములో ఏ పాదములో ఉన్నదీ గుర్తించవచ్చును. ఆ విధముగా ఒక మనిషి పుట్టిన సమయమునూ, దినమునూబట్టి ఎప్పుడైనా అతని లగ్నకుండలిని వ్రాసుకోవచ్చును. ఒక్కమారు వ్రాసుకొన్న జాతక లగ్నము అతని జీవితాంతము పనిచేయును. జీవితములో ఏ సమస్యనైనా జాతకములో ఎట్లున్నదో చూచుకోవచ్చును. జన్మ సమయములో ఏ లగ్నము నందు ఏ గ్రహమున్నదో ఆ గ్రహములు కాలగమనములో ఎక్కడ తిరిగినా ఏ లగ్నములో ఉన్నా జీవితాంతము మొదటి నిర్ణయము ప్రకారమున్నట్లే తమ ప్రభావము చూపుచుండును. ఉదాహరణకు ఒక జాతకుని జన్మ సమయముననున్న లగ్నకుండలిని తర్వాత పేజీలోని 51వ చిత్రపటములో చూస్తాము.

| | | | |
|---|---|---|---|
| | గురు<br>భూమి | సూర్య<br>శుక్ర | కేతు<br>మిత్ర |
| చంద్ర | **వృశ్చిక లగ్నము** | | శని |
| బుధుడు | | | |
| రాహు<br>చిత్ర | లగ్న | | కుజ |

51వ పటము.

ఇది ఒక వ్యక్తి 25 సంవత్సరముల క్రిందట పుట్టినప్పుడు ఆ దినమున్న గ్రహములు కాలచక్రములో ఎక్కడున్నది గుర్తించడము జరిగినది. సూర్యకిరణములు కర్మచక్రములోని ఒక స్థానములో పడినప్పుడు దానికి సరిగాయున్న కాలచక్రములోని వృశ్చిక లగ్నమును గుర్తించాము. అదే వృశ్చిక లగ్నమునే జన్మలగ్నముగా చెప్పుచున్నాము. లగ్నములో ఏ గ్రహము లేకున్నా దానికి ఎదురుగా ఏడవ ఇంటిలోనున్న సూర్యుడు, శుక్రుడు ఇద్దరూ లగ్నములోని కర్మను వారి చేతులతో అందుకోగలరు. అందువలన వారు జన్మ లగ్నమైన వృశ్చికములో లేకున్నా ఉన్నట్లే అగుచున్నది. అదే విధముగా కుజ గ్రహము 4, 7, 8 స్థానములలోని కర్మను గ్రహించగలదు. కావున నాల్గవ స్థానమైన ధనుస్సునందునూ, ఏడవ స్థానమైన మీనము నందునూ, ఎనిమిదవ స్థానమైన మేషమందునూ ఉన్నట్లే లెక్కించవలయును. అలాగే గురువు మేష లగ్నములో ఉన్నందున ఆ గ్రహమునకు 5, 7, 9

స్థానములలోని కర్మను గ్రహించునట్లు చేతులు ఉండుట వలన మేషము నుండి ఐదవ లగ్నమైన సింహమునందునూ, ఏడవ స్థానమైన తులా లగ్నము నందునూ, తొమ్మిదవ లగ్నమైన ధనస్సుయందును గురు గ్రహము ఉన్నట్లే లెక్కించుకోవలెను. అట్లే శని గ్రహమునకు కూడా నాలుగు చేతులుకలవని చెప్పుకొన్నాము. ఒక చేతి చేత ప్రస్తుతమున్న కర్కాటక లగ్నములోని కర్మను గ్రహించగా, 3, 7, 10 స్థానములలోని కర్మను గ్రహించునట్లు మిగత మూడు చేతులు ఉండుట వలన శనివున్న లగ్నమునుండి మూడవ లగ్నమైన కన్యాలగ్నమందునూ, ఏడవ లగ్నమైన మకరమందునూ, పదవ లగ్నమైన మేషమందు గల కర్మను గ్రహించగలుగును. అందువలన కన్యా, మకరము, మేషములలో కూడా అన్ని గ్రహములున్నట్లే లెక్కించుకోవలెను. అలా గుర్తించుకుంటే జాతకలగ్నము ఎలాగుండునో ఒకమారు క్రిందగల 52వ చిత్రపటములో చూస్తాము.

| | | | |
|---|---|---|---|
| కుజ– | గురు<br>భూమి<br>శని–<br>కుజ– | సూర్య<br>శుక్ర | కేతు<br>మిత్ర |
| చంద్ర | **జాతక లగ్నము** | | శని |
| బుధ<br>శని– | | | గురు– |
| రాహు<br>చిత్ర<br>కుజ–<br>గురు– | సూర్య–<br>శుక్ర– | గురు– | శని–<br>కుజ |

52వ పటము.

జన్మలగ్నములో (జన్మ సమయములో) శని కర్కాటకమందు గలదు అయినా అతని చేతుల వలన కన్య, మకరము, మేషములో కూడా ఉన్నట్లు గుర్తించుకొన్నాము. అప్పుడు శని నాలుగు చోట్ల కనిపించుచున్నాడు. అయితే ఆయన వాస్తవముగా ఎక్కడున్నాడు, అతను చేతులుంచిన స్థానము లేవి అని తెలియుటకు, చేతులు గల స్థానములలో గుర్తించిన శని ప్రక్కన ఒక అడ్డగీతను గుర్తుగాయుంచాము. అడ్డగీతలున్న చోట ఆ గ్రహము చేతులున్నట్లు తెలియవలెను. ఈ విధముగా గుర్తించినప్పటికీ అది సంపూర్ణముగా ఎవరికైనా అర్థమగుటకు బయటికి కనిపించునట్లు జన్మ సమయములో లగ్నమైన వృశ్చిక లగ్నమును ఒకటవ నంబరుగా గుర్తించి, అక్కడి నుండి ప్రారంభించి తులా లగ్నము వరకు వరుసగా 12 స్థానములకు అంకెలను గుర్తించుకొనవలెను. అప్పుడు జన్మలగ్నమునుండి ఏ లగ్నము ఎన్నో నంబరుదగుచున్నదో సులభముగా తెలియుచున్నది. తర్వాత పేజీలోని 53వ చిత్ర పటములో అంకెలతో కూడుకొన్న జన్మ లగ్నమును చూస్తాము.

చివరికి ఈ విధముగా జాతకుడు పుట్టిన సమయమున గ్రహములు ఉన్నట్లు గుర్తించుకొన్నాము. మనిషి జన్మ జననముతోనే మొదలగుచున్నది. కావున జన్మ లగ్నమును ఒకటవ నంబరుగా గుర్తించుకోవలెను. ఆ దినము పన్నెండు గ్రహములు ఎక్కుడుండునో ఆ స్థానములనుబట్టి ఆ జాతకునికి జీవితాంతము ఫలితములను లెక్కించవలసియున్నది. జన్మించిన దినమున జనన సమయములో సూర్యుని స్థితినిబట్టి ఆ సమయములోని లగ్నమును జన్మలగ్నముగా గుర్తించుకొనుచున్నాము. ఆ సమయములో పుట్టిన వానిని వృశ్చిక లగ్న జాతకునిగా చెప్పుచున్నాము. కాలచక్రములో ఉన్నది మొత్తము పన్నెండు గ్రహములే అయినప్పుడు, ఇక్కడ జన్మ లగ్న కుండలిలో కనిపించుచున్నది మొత్తము ముప్పైగా ఉన్నవి. గ్రహములకున్న చేతులను

| | | | |
|---|---|---|---|
| 5 కుజ– | 6 గురు భూమి శని– కుజ– | 7 సూర్య శుక్ర | 8 కేతు మిత్ర రాహు– చిత్ర– |
| 4 చంద్ర | **జాతక లగ్నము** | | 9 శని బుధ– |
| 3 బుధుడు శని– | **వృశ్చిక లగ్నము** | | 10 గురు– చంద్ర– |
| 2 రాహువు చిత్ర కుజ–,గురు– కేతు మిత్ర– | 1 సూర్య– శుక్ర– లగ్న | 12 గురు– భూమి– | 11 శని– కుజ |

53వ పటము.

కూడా కలిపి గ్రహములుగా లెక్కించితే ముప్ఫై సంఖ్య వచ్చుచున్నది. మొత్తము గ్రహములున్నది = 12, ప్రతి గ్రహము ఎదురుగాయున్న ఏడింటిలోని దానిని గ్రహించగల్గుచున్నది. కావున అక్కడ కూడా ఆ గ్రహమున్నట్లు లెక్కించితే 12+12 = 24 అగును. పన్నెండు గ్రహములలో గురు, కుజ, శని ప్రత్యేకించి రెండు స్థానములలోని వాటిని స్వీకరించును. కావున అక్కడ కూడా ఆ మూడు గ్రహములను ఉన్నట్లు లెక్కించుకొంటే 3×2=6 అగును. 24+6ను కలిపితే మొత్తము 30 సంఖ్యగా కనిపించు చున్నది. అదే విధముగా మనము గుర్తించుకొన్న జన్మకుండలిలో 30 గ్రహములు 12 లగ్నములలో కనిపించుచున్నవి. జన్మ లగ్నమున గ్రహములు ఏ స్థానములో ఉన్నవో జీవితాంతము అదే స్థానమునుబట్టి ఫలితమును ఇచ్చుచుండును.

ఈ జాతకుని విషయములో ఒక ప్రశ్న వచ్చినది. అదేమనగా! ఈ జాతకుడు భవిష్యత్తులో ఏమి వ్యాపారము చేయును? అని అడిగినప్పుడు ఆ ప్రశ్నకు జవాబును జ్యోతిష్యము ప్రకారము వెదుకవలసినప్పుడు, మొట్టమొదట పన్నెండు గ్రహములలో ఏయే గ్రహములు ఇతని విషయములో మంచిగా (మిత్రులుగా) పని చేయుచున్నవో, ఏయే గ్రహములు చెడుగా (శత్రువులుగా) పని చేయుచున్నవో తెలియవలసియున్నది. జన్మ లగ్నము వృశ్చికలగ్నము కనుక సరి బేసి (2:1) అను సూత్రము ప్రకారము పన్నెండు గ్రహములను మిత్రులుగా, శత్రువులుగా విభజించి చూడవచ్చును. మేష లగ్నమునకు 8, 9 లగ్నములుగా వృశ్చికము, ధనస్సుయున్నవి కావున బేసి సరి సూత్రము ప్రకారము వృశ్చిక, ధనస్సు రెండు లగ్నముల అధిపతులు ఆ జాతకునికి మిత్రులుగాయున్నారు. ఆ రెండు లగ్నముల తర్వాత రెండు లగ్నాధిపతులను శత్రువులుగా గుర్తించితే రాహువు, శని శత్రువులుగా యున్నారని తెలియుచున్నది. ఆ విధముగా వృశ్చిక లగ్న జాతకునకు మిత్ర శత్రువులు ఈ విధముగా గలరు.

| | √ మిత్రులు | | X శత్రువులు |
|---|---|---|---|
| 8) | భూగ్రహము | 10) | రాహుగ్రహము |
| 9) | కేతు గ్రహము | 11) | శని గ్రహము |
| 12) | గురు గ్రహము | 2) | మిత్ర గ్రహము |
| 1) | కుజ గ్రహము | 3) | చిత్ర గ్రహము |
| 4) | చంద్ర గ్రహము | 6) | బుధ గ్రహము |
| 5) | సూర్య గ్రహము | 7) | శుక్ర గ్రహము |

ఇప్పుడు వృశ్చికలగ్న జాతకునకు శాశ్వతముగా భూమి, కేతు, గురు, కుజ, చంద్ర, సూర్యగ్రహములు మిత్రులుగా ఉన్నారనీ, అలాగే రాహు, శని, మిత్ర, చిత్ర, బుధ, శుక్ర గ్రహములు శాశ్వతముగా శత్రువులై ఉన్నారనీ తెలిసిపోయినది. ఇప్పుడు అడిగిన ప్రశ్న వ్యాపారమును గురించినది. అందువలన వ్యాపారము ఎవరి (ఏ గ్రహము) ఆధీనములో ఉన్నదని చూచిన వ్యాపారము బుధగ్రహము యొక్క ఆధీనములోనిదని తెలిసిపోయినది. వ్యాపారమునకు అధిపతియైన బుధుడు శత్రువర్గములో నున్న గ్రహమైనందువలనా మరియు బుధగ్రహము పాప స్థానమున ఉండుట వలనా, ఆ జాతకునికి వ్యాపారము సరిపోదనీ, ఒకవేళ వ్యాపారము చేసినా అందులో అతనికి నష్టమే వచ్చునని తెలియుచున్నది. అందువలన అతనికి ఏ వ్యాపారమూ సరిపోదని చెప్పవచ్చును. అయితే అతని జీవితము సాగుటకు ఏ జీవనము, (ఏ పనిని) చేయునని అడిగితే దానికి సమాధానము గా ఇట్లు చెప్పవచ్చును. ముఖ్యముగా నాల్గవ స్థానమున చంద్రుడుండుట వలన, చంద్రుడు తొమ్మిదవ స్థానాధిపతి అయినందున, చంద్రుడు పదవ స్థానమైన సింహలగ్నమును తాకుట వలన అతను తన తెలివితో జీవించు ననియూ, చంద్రుని కారణముగా తెలివిగా వాదించు లాయర్ పనిని చేయు ననియూ, చంద్రుడు రాజయిన సూర్యుని స్థానమును తాకుచుండుట వలన పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా (ప్రభుత్వ లాయర్‌గా) పని చేయుననియూ, అలా కొంతకాలము దాదాపు 12 సంవత్సరములు పని చేసిన తర్వాత న్యాయవాది నుండి న్యాయాధిపతిగా (జడ్జిగా) పని చేయునని చెప్పవచ్చును. పదవ స్థానమును చంద్రుడు చూచుట వలన ప్రభుత్వము తరపున ముద్రణ అధికారముగల వ్యక్తిగా పని చేయునని చెప్పవచ్చును. ఈ విధముగా స్థానమునుబట్టియు, గ్రహమునుబట్టియు చెప్పవచ్చును. కర్కాటకము, సింహము రెండు రాజు మంత్రికి సంబంధించినవి కావున వాటితో

సంబంధమున్న వాడు ప్రభుత్వ ధనముతో జీవించుటయేగాక శాసించు అధికారమును కల్గియుండును. చంద్రుడు నాల్గవ స్థానమునుండి పదవదైన సింహమును తాకుట వలన ముద్రవేసి శాసించు అధికారమును పొందునట్లు చేసి జడ్జిగాగానీ, జస్టీస్‌గాగానీ నిలబెట్టును. అడిగిన ప్రశ్నను బట్టి దానికి సంబంధించిన స్థానమునూ, అలాగే లగ్నాధిపతిని ఆధారము చేసుకొని జవాబును చెప్పవచ్చును.

అతడు (జాతకుడు) పుట్టినప్పుడు తేదీని పుట్టిన సమయమును అతని తల్లితండ్రులు గుర్తించుకొని, తమ కొడుకు 25 సంవత్సరముల వయస్సు వచ్చిన తర్వాత ఎలా జీవిస్తాడోయని, జ్యోతిష్యున్ని అడుగుట వలన, జ్యోతిష్యుడు జాతకుడు పుట్టిన తేదీని, పుట్టిన సమయమును బట్టి ఆ సంవత్సర పంచాంగమును చూచి, పుట్టిన సమయములో గ్రహములు ఎక్కడున్నాయో తెలుసుకొని, ఆ దిన జన్మ లగ్నమును తెలుసుకోగలిగాడు. జన్మ లగ్నము తెలిసిన తర్వాత జాతకునికి అనుకూలమైన గ్రహములు ఏవో, అనుకూలము కాని గ్రహములు ఏవో తెలుసుకొని, తర్వాత అడిగిన ప్రశ్నకు సంబంధించిన లగ్నమును లగ్నాధిపతిని తెలిసి అప్పటికి జవాబును చెప్పడమైనది. జన్మ లగ్నమునుబట్టి గుర్తించిన ఒకటవ నంబరునుండి పన్నెండు నంబర్ల లగ్నములను పన్నెండు కర్మచక్ర రాశులుగా లెక్కించుకోవలెను. తర్వాతే మేషము మొదలు మీనము వరకు కాలచక్రములో గ్రహములున్నవని తెలియవలెను. పన్నెండు భాగముల స్థలములను (కుండలిని) కర్మ చక్ర రాశులుగా సంఖ్యలతో గ్రహములున్నవి. మేషాది మీనములను పేర్లుగలవి లగ్నములని తెలియవలెను. మొదట ఎవరికైనా కొంత తికమకగాయున్నా బాగా యోచించి అర్థము చేసుకొంటే సులభముగా అర్థము కాగలదు.

కర్మచక్రములోని పన్నెండు రాశులలో కర్మయుండును. అలాగే కాలచక్రములోని మేషము మొదలగు పేర్లుగల లగ్నములలో గ్రహములు ఉండునని ముందే చెప్పాము. అందువలన జ్యోతిష్యమును చెప్పు ఏ జ్యోతిష్యుడైనా కుండలిలోని ప్రశ్నకు సంబంధించిన స్థానమునూ అలాగే ఆ ప్రశ్నకు సంబంధించిన గ్రహమును ముఖ్యముగా చూచుకొని ఆ రెండిటి ఆధారముతోనే జవాబును చెప్పాలి. ఇప్పటి కాలములో పుట్టిన తేదీ, పుట్టిన సమయము ఉంటే 80 సంవత్సరముల తర్వాత అయినా కంప్యూటర్ ద్వారా జాతకలగ్నమును వ్రాసుకోవచ్చును.

## 43 రాశి - గ్రహము

ఇంతకుముందే కర్మచక్రములోని భాగములను రాశులంటామని చెప్పుకొన్నాము. అలాగే కాలచక్రములోని భాగములను లగ్నములంటాము. కాలచక్రములోని లగ్నములలో, గ్రహములు తిరుగుచుండునని చెప్పాము. ఇంతకుముందు ఒక వ్యక్తి ఏమి వ్యాపారము చేయునని ప్రశ్నవచ్చినప్పుడు, జ్యోతిష్యము ప్రకారము అతని భవిష్యత్తులోని జీవన విధానమును గురించి చెప్పుచూ అతడు వ్యాపారము చేయడు, ఉద్యోగమును చేస్తాడని చెప్పాము. అంతేకాక కోర్టులో జడ్జిగాగానీ, జస్టీస్‌గాగానీ ఉద్యోగము చేయవచ్చునని చెప్పడము జరిగినది. అలా చెప్పుటకు కారణము ఏమైనది అను విషయమును వివరముగా చెప్పాము. అంతేగాక ఏ జాతకుని ప్రశ్నకైనా జవాబు చెప్పుటకు ఏ జ్యోతిష్యుడైనా ముఖ్యముగా ప్రశ్నకు సంబంధించిన స్థానమునూ, అలాగే ప్రశ్నకు సంబంధించిన గ్రహమునూ చూడవలెనని చెప్పాము. లగ్న గ్రహమునుబట్టియూ, కర్మస్థానమునుబట్టియూ జ్యోతిష్యము ప్రకారము భవిష్యత్తును చెప్పవచ్చును. వృత్తి లేక ఉద్యోగము, వ్యాపారమును

గురించి చూచుటకు ముందు అడిగిన ప్రశ్నలో ఏ గ్రహమును చూచామో, ఏ స్థానమును చూచామో వ్రాశాము. అందువలన జ్యోతిష్యమునకు ప్రశ్నకు సంబంధించిన **స్థానము, గ్రహము** ముఖ్యమన్నాము.

ఇంతకుముందు ఏ గ్రహము ఆధీనములో ఏ వస్తువులు, ఏ విషయములు ఉన్నాయో వ్రాసుకొన్నాము. పన్నెండు గ్రహముల ఆధీనములోని అన్ని విషయములను తెలుసుకొన్నాము. అయితే ఏ రాశిలో ఏ కర్మ ఉన్నదని గతములో చెప్పుచూ పన్నెండు రాశులను గుర్తించి, వాటిలో అంగీ అర్ధాంగి అని రెండు భాగములను చూపి, అందులో కొన్ని విషయములను మాత్రము పొందుపరచి చూపాము. అయితే ఎన్నో విషయములను అక్కడ చూపలేదు. అందువలన పై ప్రశ్నకు జవాబును చెప్పుచూ పదవ స్థానమును చూడవలెనని చెప్పాము. పదవ స్థానములో జీవన విధానము ఉన్నదని మొదట చెప్పలేదు. అప్పుడు చెప్పని విషయములను పూర్తిగా ఇప్పుడు చెప్పుచున్నాము జాగ్రత్తగా చూడండి.

## ప్రథమ స్థానము (తనువు)

శరీరము, ఆత్మ, రూపము, స్వభావము, అంగ సౌష్టవమును గురించిన మొదలగు విషయములు ప్రథమ రాశిలో ఉండును. కర్మచక్రములోని మొదటి స్థానములో శరీరమునకు సంబంధించిన పుణ్యము ఉండును. ఇది పుణ్య స్థానమే అయినా శత్రు గ్రహము (పాపమును పాలించు గ్రహము) ఆ స్థానములోనికి తన కిరణములను ప్రసరింపజేసితే అక్కడున్న పుణ్యమును ఆ కిరణములు గ్రహించక తమకు పట్టనట్లుండుట వలన ఆ జాతకుడు పుణ్యము ప్రకారము మంచి శరీరము పొందలేక పోవును. అక్కడకు కిరణముల ద్వారా చూచునది పాపగ్రహమైనప్పుడు తన ప్రభావము చేత

బలహీనమైన దేహమూ, అంగలోపమున్న దేహమునూ, అనారోగ్యములకు అనువుగాయున్న దేహమునూ, అంగసౌష్టవము లేని దేహమునూ లభించు నట్లు చేయును. శుభగ్రహముండిన మంచి బలమైన శరీరము, మంచి అందమైన శరీరము, మంచి కొలతలుగల్గిన అంగసౌష్టవమున్న శరీరమును ఆ జాతకుడు కల్గియుండును. మొదటి స్థానమైన శరీర స్థానమున ఏ గ్రహమూ లేకున్నా, ఏ గ్రహమూ తన హస్తములతో తాకకున్నా అటువంటి వానికి మధ్యతరగతి ఆరోగ్యము, అందము, అంగసౌష్టవముగల శరీరముండును. ఈ విధముగా ఒక వ్యక్తికి (జాతకునికి) శరీరము ఎట్లుండునని జ్యోతిష్యము ద్వారా అతని కర్మచక్రములోని ప్రథమ స్థానమును చూచి చెప్పవచ్చును.

## ద్వితీయ స్థానము (ధనము)

రెండవ స్థానము ధనస్థానమని పేరుగాంచియున్నా ఆ స్థానములో ఒక ధన విషయమే కాకుండా, మిగతా విషయముల కర్మలు కూడా ఉండును. మిగతా ఉన్నవాటిలో వాక్కు ముఖ్యమైనది. అంతేకాక కుటుంబము, నేత్రము, కర్ణము (చెవి), ముఖ వర్చస్సు, మరణము మొదలగునవి ఉండును. అవియేకాక వాక్చతురత, సత్యవచనములు పలుకుట, మాటకు అందరు సమ్మతించుట, మాట్లాడబడిన మాటలు అందరినీ ఆకర్షించునట్లు ఉండును. రెండవ స్థానమున శుభగ్రహమున్నా (మిత్ర గ్రహమున్నా) లేక వేరే స్థానములోవుండి తన హస్తము చేత అక్కడినుండి తాకినా, ముఖవర్చస్సులో ప్రత్యేకత కల్గియుండును. కన్నులు సోయగముగా సొంపుగా ఆకర్షణగా ఉండును. ఆయుర్ బలముండును. మంచి కుటుంబముతో ఉండడమేకాక ఆ కుటుంబము దైవభక్తి కలదై

ఉండును. ఒకవేళ రెండవ స్థానములో శత్రు గ్రహము (పాప గ్రహము) ఉండినా లేక తాకినా అక్కడున్న పుణ్యమును అందివ్వక పాపమును అందించును. ద్వితీయ స్థానమున పాపపుణ్యములు రెండూ ఉండును. కావున పాపగ్రహము ముఖములో అందము లేకుండా, మాటలో ఆకర్షణ లేకుండా చేయును. కుటుంబములో అన్యోన్యత లేకుండా చేయును. ధనమును లేకుండా చేసి ఇబ్బంది పెట్టును. ఈ విధముగా మంచి, చెడు గ్రహములు రెండవ స్థానములో ఉన్నప్పుడు చేయును. ఒకవేళ ఏ గ్రహమూ లేని పక్షములో అతని రెండవ స్థానములోని విషయములు అతనికి మధ్యరకముగా అందుచుండును. మంచి చెడు కాకుండా తటస్థముగా ఉండును. కాలక్రమములో అక్కడికి వచ్చిపోవు గ్రహములు తమ ఇష్టమును బట్టి అక్కడి ఫలితములను ఇచ్చుచుండును.

## తృతీయము - సోదర స్థానము

మూడవ స్థానము పాపస్థానము. ఇది పాపకోణములో మూడవది గా ఉండుట వలన ఈ స్థానములో పాపము మాత్రముండును. తృతీయ స్థానములో పుణ్యముండక పోయినా అక్కడున్న గ్రహములను బట్టిగానీ, అక్కడ తాకుచున్న గ్రహమునుబట్టిగానీ ఫలితముండును. పాప గ్రహము మూడవ స్థానమును తాకుట వలన లేక ఉండుట వలన ఆ స్థానమునకు సంబంధించిన విషయములలో పూర్తి వ్యతిరేఖతయుండును. తనకంటే చిన్నవారైన చెల్లెంద్రుకల్గియుండి వారివలన అనేక బాధలు వచ్చునట్లు చేయును. వారి పెళ్ళిళ్ళు అయ్యేవరకు తనకు పెళ్ళి కాకుండా పోవుట వలన పెళ్ళి పూర్తి ఆలస్యమగును. దాయాదులతో ఇబ్బందులు ఉండును. స్వంత అన్నదమ్ములు కూడా వ్యతిరేఖముగా మాట్లాడుచుందురు. మరియు

పోట్లాడుచుందురు. శాంతి లేకుండా పోయి కోపము వచ్చుచుండును. ఒకవేళ శుభ గ్రహమున్నట్లయితే అన్నదమ్ముల వలన సుఖము లేకున్నా వ్యతిరేఖము లేకుండా సాధారణముగా ఉందురు. మంచి గ్రహమున్న ఆ స్థానములో పుణ్యము ఏమాత్రము లేనందున పైన చెప్పిన విషయములలో సుఖము ఉండదు. అట్లని కష్టముండదు. ఈ స్థానములో పాపము మాత్రముండుట వలన ధనము లేకుండా చేయును. జీవన విధానమును చెరచి నీచ జీవనము చేయునట్లు చేయును. తండ్రి ఆస్తి తనకు దక్కకుండా పోవును. ఉత్సాహము లేకుండా పోయి అశాంతితో జీవించునట్లు, సేవకా వృత్తిలో కాలము గడుపునట్లు చేయును.

## చతుర్థము - మాతృస్థానము

నాల్గవ స్థానము అంగీ భాగములో కేంద్రముగాయున్నా ఇది పాప పుణ్యముల రెండిటికీ నిలయము. ఈ స్థానము తల్లికి, వాహనమునకు, భూమికి, గృహమునకు, కోనేరు, బావి, చెరువులకు, వ్యయసాయమునకు, పశువృద్ధికి, పంటలకు, బంధువులకు నిలయముగా ఉన్నది. సకల వస్తువులు ఉన్నచోటు, సమస్త పంటలు పండుచోటు ఈ స్థానములోనే కలదు. ఈ స్థానమున ఒక శుభగ్రహముండినా లేక ఈ స్థానమును తాకినా వస్తు బలముండును. ఈ స్థానములోని పుణ్యమును శుభగ్రహము (పుణ్యగ్రహము) స్వీకరించి జాతకునికి ఇచ్చుట చేత గృహములు, గృహము లోని వస్తువులు, ధన, కనక, వస్తు వాహనములు, భూములు, జలాశయము లు, బావులు, వనములు కల్గును. అంతేకాక బంధు మిత్రుల పరివారము, దాస జనములు, పశువృద్ధి, పాలవృద్ధి, ధాన్యవృద్ధి చాలాకలుగును. నమ్మకస్తులైన బంధువుల బలము కల్గును. మాతృప్రీతి ఎక్కువ ఉండును.

శుభకార్యములకు ప్రయాణము చేయించును. సౌఖ్యములను కలుగజేసి కీర్తి గౌరవములను ఎక్కువజేయును. ప్రతి కార్యము జయముగా సాగును. తల్లివైపు వారిని పెంచును. క్రిమికీటకాది బాధలను లేకుండా చేయును. నిక్షేపములు దొరకవచ్చును. గృహప్రవేశములు జరుగును. వసతి గృహములు కట్టించును. ప్రవాహ సమీప భూములు, సారవంతమైన భూములు కల్గునట్లు చేయును. విద్యావంతుల, గాయకుల, గౌరవనీయుల, ఉద్యోగుల మిత్రత్వమును కల్గించును. గుర్రములు, ఏనుగులు, కుక్కలు మొదలగునవి వృద్ధి చేయును. శుభకార్యములను, దైవకార్యములనూ, ఇంటిలోనే చేయించును. శయన గృహమూ, శయన వస్తువులూ ఎక్కువగా యుండును. వైభవ గృహములనూ, దేవతా మందిరముల నిర్మాణములనూ చేయించును. ధర్మసత్ర నిర్మాణము చేయించును. ధర్మసత్రములను, ధర్మ బావులను కట్టించి కీర్తిని సంపాదించడమేకాక వైభవోపేతముగా జీవింప జేయును. అయితే ఇక్కడ చతుర్థమున ఒక పాపగ్రహముండినగానీ, తాకినా గానీ, పైన చెప్పిన ఫలితములకన్నిటికీ వ్యతిరేఖమున ఫలితములుండును.

## పంచమము - విద్యాస్థానము

ఈ స్థానములో కేవలము పుణ్యము మాత్రముండును. కోణములలో పుణ్యమునకు సంబంధించిన కోణము. ఈ స్థానము విద్యాస్థానమే అయినప్పటికీ ముఖ్యముగా జ్ఞానమునకు నిలయమైన స్థానము. జ్ఞానమనగా ప్రపంచ జ్ఞానమని తెలియవలెను. అందువలన ఈ స్థానము యుక్తాయుక్త వివేకమునకు, సమయస్ఫూర్తికి, గ్రాహితాశక్తికి, జ్ఞాపకశక్తికి నిలయమని చెప్పవచ్చును. విద్యాస్థానమగుట వలన జాతకుడు ఎంతవరకు చదువ గలడు అనియూ, మొదటికే చదువు అబ్బునా అబ్బదా

అనియూ, చదువులో మొద్దుగా ఉండునా, చురుకుగా ఉండునా అనియు ఈ స్థానమునుబట్టియే తెలియవచ్చును. ఐదవ స్థానము పూర్తి పుణ్య స్థానమగుట వలన ఇక్కడ మిత్రవర్గములోని ఏ గ్రహము చూచినా లేక తన హస్తములతో తాకినా అన్నీ మంచి ఫలితములే జాతకునికి లభించును. ఐదవ స్థానమున సంతానమునకు సంబంధించిన కర్మయుండుట వలన పుణ్య గ్రహము వలన మంచి సంతానము కలుగును. ప్రపంచ జ్ఞానమునకు నిలయమైన స్థానమగుట చేత అనుకూలమైన గ్రహము బలము చేత మంత్రి పదవి లభించును. అంతేకాక మంచి నడవడిక కల్గినవారై నిశ్చయ బుద్ధి కలవాడై బంధు, మిత్రులకు సలహాదారుడుగా ఉండును. పుణ్యగ్రహము వలన విద్యా, వినయము, విధేయత, వివేకము కల్గును. ముఖ్యమైన విషయములను తెలుసుకొనుట, మంచి విషయములను మాట్లాడుట దూరము ఆలోచనలు చేయుట ఉండును. ఇంకా ఘనత, గాంభీర్యము, గ్రామాధికారము కల్గును. గ్రంథ రచనలో ప్రావీణ్యత, మంత్రోపాసనలో ప్రసన్నత కల్గును. దానము చేయుట, న్యాయముగా నడుచుట కల్గి యుండును. పాపపుణ్యములలో విమర్శించుట, పాండిత్యములో ప్రతిభ, జ్ఞానశక్తి, జ్ఞాపకశక్తి, గ్రాహిత శక్తి, చేతిపని నైపుణ్యము, యంత్రములను సరిచేయు యుక్తియుండును. మంత్ర, తంత్ర, యంత్ర బలము కలుగును. గురుత్వము, గురు హోదా కల్గి యుండును. కార్యజయము, నిదానము, అధికారము, అన్నదానము, వంశాభివృద్ధి, నీతి, నియమము, శాంతిని కల్గించును. కీర్తి గౌరవములు వ్యాపింపజేయును. ఎవరూ చూడని వాటిని, ఎవరూ వినని వాటిని కనుగొను శక్తినిచ్చును. అధర్మములను ఖండించుట, ప్రజలకు హితునిగా, గురువుగా చూపించును. ఇతరులు అడిగిన ప్రశ్నకు సూటిగా జవాబునిచ్చు స్థోమతను కలుగజేయును. ఒకవేళ ఐదవ స్థానమున పాపగ్రహమున్నా పుణ్యమును అందించదు, పాపము

లేదు కనుక చెడునూ చేయలేదు. పుణ్య గ్రహము లేనిదానివలన గ్రహముల సంచారములో ఏ గ్రహము ఆ స్థానములోని వస్తే దానికి అనుకూలమైన వాటిని కలుగ జేయును.

## ఆరవది - శత్రుస్థానము

ఆరవ స్థానము పాపపుణ్య మిశ్రమ స్థానము. ఇక్కడున్న మిత్ర గ్రహమును (పుణ్యగ్రహమును) బట్టి మంచియూ, శత్రు గ్రహమును (పాప గ్రహమును) బట్టి చెడుయూ జరుగుచుండును. ఇక్కడ శుభగ్రహమున్నా లేక తాకినా పుణ్యఫలము లభ్యమగుట వలన శత్రు, రుణ, రోగ, సమస్యలు ఉండవు. వడ్డీ వ్యాపారముతో, వైద్యవృత్తితో ధనార్జన కల్గించును. శత్రువులు ఉండరు, ఉన్నా వారే నశించిపోవుదురు, ఋణబాధలుండవు. ఋణము లున్నా సులభముగా తీరిపోవును. రోగములు రావు, ఒకవేళ వచ్చినా సులభముగా పోవును. కలహభయము, మనోచింత, ఇతరులు ద్వేషించడము, అపవాదులు, అపనిందలు, అనుమానములు, చెడు వ్యసనముల బాధలు ఉండవు. అంతేకాక డబ్బు వృథాగా ఖర్చుకాదు. అప్పులు ఇచ్చుటలోను, తెచ్చుటలోను, ఇప్పించుటలోను ఎటువంటి చిక్కులూ ఉండవు. ఆరవ స్థానమును చేరు పుణ్యగ్రహములనుబట్టి ఫలితములుండును. ఒకవేళ పాప గ్రహముండినా లేక అక్కడ తాకినా శత్రు, ఋణ, రోగ సమస్యలు జీవితమంతా ఉండును. ఏ గ్రహము లేకుండిన అటు ఇటుగాక మధ్య రకముగా జరుగుచుండును.

## సప్తమము - కళత్రస్థానము

ఇది పూర్తి పాపస్థానము. ఇక్కడ పాపగ్రహముంటే అందులోని పాపమును అందించి మనిషిని చాలా ఇబ్బంది పెట్టును. జీవితములో

భార్య సౌఖ్యము లేకుండా చేయును. యౌవ్వన కాలమంతా వ్యర్థమగును. వివాహము కావడమే కష్టమగును. ఒకవేళ వివాహమైనా అది కొంత కాలమునకే చెడిపోయి భార్య విడిపోవును. ఉన్నంత కాలము భార్య భర్తలకు ఏమాత్రము పొసగదు. జీవితములో ముఖ్యమైనది భార్య అయితే ఆ భార్య వలన సుఖము లేకుండా ఎప్పుడూ కష్టమే ఉండుట వలన, మరికొన్ని కారణముల వలన పూర్తి విసుగుచెంది మనోశాంతి లేకుండా పోవును. దానికి తోడు ఆ స్థానములో ఎనిమిదవ స్థానాధిపతియుండినా, ఎనిమిదవ స్థానములో పాపగ్రహముండినా అటువంటి వాడు భార్యవలన మనోకలత చెంది చివరకు ఆత్మహత్య చేసుకొనును.

కళత్రము అనగా పూర్తి భార్య సంబంధమైన దానివలన సప్తమ స్థానములో శుభగ్రహముండినా లేక శుభగ్రహము తన చేతులతో తాకినా కళత్రము నుండి లభించు అన్ని రకముల కష్టములు లేకుండా పోవును. ఆ స్థానములో పుణ్యము లేకున్నా శుభగ్రహము ఉండుట వలన శుభ గ్రహము ఎదురుగా ఒకటవ స్థానమునన్న పుణ్యములను గ్రహించి, ఆ పుణ్యము ద్వారా శరీర సుఖమును అందివ్వవలసిన కర్తవ్యము తనకున్నది. కావున భార్యనుండి శరీర సుఖము అందించును. అప్పుడు ఒకటవ స్థానములోని శరీర సౌష్టవము, శరీరము అందము ద్వారా భార్యను ఆకర్షితురాలిగా చేసి సుఖమునందించును. అట్లే మిగతా విషయములైన భార్య ద్వారా ధనము కలుగునట్లు చేయును. వివాహము ఉన్నట్లుండి జరుగునట్లు చేయును. స్త్రీసాంగత్యము, సుగంధములు, మధుర పానీ యములు, మధురఫలహారములు, పుష్పములు, తాంబూలము అనుకోకుండా లభ్యమగును. ఇతర స్త్రీలను ఆకర్షించుట వారివలన సుఖము పొందునది ఒక స్థానమున ఉండుట వలన అతనికి భార్యయే ఇతర స్త్రీ క్రింద జమకట్టి

ఆమెవలన సుఖము స్నేహము లభ్యమగునట్లు శుభగ్రహము చేయును. సకాల నిద్ర సకాల మైథునము లభించును. పడకగది కూడా సుఖములకు అనుకూలముగా లభించును. ఇదంతయూ శుభగ్రహము వలన ప్రథమ స్థానమునుబట్టి ఉండును. మొదటి స్థానములో మరియొక శుభగ్రహముండి అక్కడినుండి ఏడవ స్థానమును తాకుట వలన, ఏడవ స్థానములో మరియొక శుభగ్రహముండిన, అటువంటి జాతకునికి గ్రహముల మూలమున ఒకటవ స్థానము పుణ్యమును ఎదురుగాయున్న ఏడవ స్థానమున అమలు జరిగినట్లు భ్రమింపచేసి సుఖములనిత్తురని తెలియవలెను.

## అష్టమము - ఆయుస్థానము

కర్మచక్రములోని ఎనిమిదవ స్థానములో పాపము, పుణ్యము రెండూ ఉన్నాయి. ఈ స్థానములో ఎన్నో విషయములున్నా, ఆయుష్షు విషయమునకే ఎక్కువ ప్రాధాన్యత కలదు. అందువలన ఈ స్థానమును ఆయుస్థానము అంటారు. ఈ స్థానములో ఆయుర్ధాయమున్నప్పుడు మరణమును కూడా చెప్పవచ్చును. అంతేకాక జాతకుని జీవనము, దుఃఖము, నరకము, పాప కృత్యములు చేయుట మున్నగునవి కలవు. ఇవన్నియూ పాప మరియు పుణ్యములబట్టియుండును. ఈ స్థానమున మంచి గ్రహము (శుభ గ్రహము) ఉన్నా లేక తాకినా జాతకుడు ఎక్కువ కాలము జీవించునని చెప్పవచ్చును. పుణ్యగ్రహముండుట వలన ఆ స్థానములోని పుణ్యమును మాత్రము స్వీకరించి మనిషికి అందించుట వలన జాతకుడు దేహపుష్ఠి, వీర్యపుష్ఠి కలిగి కామసౌఖ్యమును అనుభవించును. ఎక్కువ కన్యలతో సంబంధము కల్గునట్లు చేయును. దీర్ఘనాడికల్గియుండుట వలన రతికేళిలో ఎక్కువ కాలము గడుపును. అవమానములు, కలహములు లేకుండా చేయును.

అంగలోపముండదు, స్త్రీల వలన దుఃఖముండదు. శత్రు భయము ఉండదు. కారాగార ప్రాప్తిగానీ, చట్టమును మీరి నడువడముగానీ కలుగదు. జంతు వధలు చేయడు, పాపభీతియుండును. అకాల మృత్యు భయముండదు. చేయు పనిలో ప్రతిభ కల్గియుండును. కళత్ర సుఖముండును, అన్యస్త్రీల సాంగత్యము కలుగును. ఒకవేళ జనన సమయములో ఈ స్థానమున పాపగ్రహముండినట్లయితే అది అక్కడున్న పాపమును స్వీకరించి జాతకునికి అందించును. పుణ్యమును తీసుకోదు. పాపగ్రహము వలన అతనికి పాపకర్మ అనుభవములే కల్గును. అకాల మృత్యువు ఏర్పడును. ఒకవేళ అకాల మృత్యువు లేకున్నా ఆయుష్షు తొందరగా అయిపోవును. అనగా అల్పాయుష్కుడగును. పరాభవములు కల్గును. కారాగార ప్రాప్తి కలుగును. ఇతరులచే ప్రాణహాని భయముండును. స్త్రీ సుఖముండదు. స్పర్శనాడి కలవాడై మగతనమున్నా నిమిషము లేక అరనిమిషములో కామవాంఛ తీరిపోవును. దానివలన నిరాశ ఏర్పడును. స్త్రీలతో అవమానము కల్గును. ఎనిమిదవ స్థానమున శత్రు గ్రహముగ రాహువున్న విషాహారము వలనగానీ, పాముకాటు వలనగానీ చనిపోవునని చెప్పవచ్చును. చంద్రుడు పాపియై అష్టమమున ఉన్న నీటిగండముతో చనిపోవునని చెప్పవచ్చును. అలాగే శుక్రుడు శత్రుగ్రహమై ఎనిమిదవ స్థానమున ఉండినట్లయితే జీవితములో సమయము చూచి అగ్ని వలన కాలి చనిపోవునని చెప్పవచ్చును. ఒకవేళ బుధగ్రహము ఎనిమిదవ స్థానమున ఉన్నట్లయితే జాతకుని శరీరములో దయ్యములు చేరి డాక్టర్లకు అంతుదొరకని రోగమును కల్పించి దయ్యములే చంపివేయును. ఎనిమిదవ స్థానమున కుజగ్రహము అశుభగ్రహముగా యుండినట్లయితే అట్టి జాతకుడు ఆయుధములచేత చంపబడునని చెప్పవచ్చును. కుజగ్రహమునకు భూగ్రహము తోడైయుంటే బాంబుల

వలనగానీ, తుపాకుల వలనగానీ జాతకునికి మరణము సంభవించును. మిగతా స్వపక్ష గ్రహము ఏది తోడైయున్నా రోడ్డు ప్రమాదములో రక్తసిక్తమై చనిపోవునట్లు చేయును. ఒకవేళ జనన కాలములో ఈ స్థానమున ఏ గ్రహము లేకున్నా, తాకకున్నా అతనికి (జాతకునికి) మంచి ఫలితములుగానీ లేక చెడు ఫలితములుగానీ కలుగక జీవితము సాధారణముగా జరిగిపోవును. అటువంటివాడు దీర్ఘ నాడి, స్పర్శనాడి లేకుండా మధ్యనాడి కల్గియుండునని కూడా చెప్పవచ్చును.

## నవమ స్థానము - పితృ స్థానము

కర్మచక్రములో నాలుగు (4) ఐదు (5) స్థానములు ఎంతో ముఖ్యమైనవి. అలాగే తొమ్మిది (9) పది (10) స్థానములు కూడా ముఖ్యమైనవిగాయున్నవి. జాతకచక్రములో నాలుగు, ఐదు స్థానములు ఎంత ప్రశస్తత చెందియున్నాయో అంత ప్రాముఖ్యత కల్గియున్నవి తొమ్మిది (9) పది (10) స్థానములని అందరూ తెలియవలెను. మనిషి జీవితములో ఎంతో ముఖ్యమైన ఆస్తిబలము (సంపద బలము), బుద్ధిబలము ఎంతో ముఖ్యమైనవి. ఆస్తిబలము నాల్గవ స్థానములోనూ, బుద్ధిబలము ఐదవ స్థానములోను ఉన్నవి. అలాగే మనిషి జీవితములో ధనబలము, గౌరవము ఎంతో అవసరమైనవి. ధనబలము తొమ్మిదవ స్థానములోనూ, గౌరవము పదవ స్థానములోనూ ఉండుట వలన కర్మచక్రములో ఈ నాలుగు స్థానములు ముఖ్యమైనవేనని తెలియుచున్నది. నాలుగు, ఐదు స్థానములలో నాలుగవ స్థానములో పాపపుణ్యములు రెండూ ఉండగా అది అంగీ భాగమునకు కేంద్రముగాయున్నది. ఐదవ స్థానము పూర్తి పుణ్య స్థానమైయున్నదని ఈ గ్రంథము చదివిన వారిందరికీ తెలుసు. అలాగే

తొమ్మిది పది స్థానములలో పదవ స్థానము అర్ధాంగి భాగమునకు కేంద్రముగాయుండి పాపపుణ్యములకు నిలయమైయుండగా, తొమ్మిదవ స్థానము మాత్రము పూర్తి పుణ్యస్థానమై యుండి పుణ్య స్థానములకు కోణముగాయున్నది. ఇప్పుడు 1, 5, 9 అను మూడు కోణములలో తొమ్మిదవ స్థానముగాయున్న దానిని గురించి తెలుసుకొందాము. ఇది పూర్తి పుణ్యస్థానమే అయినా ఈ స్థానములో జనన కాల సమయమున మిత్రవర్గమునకు చెంది పుణ్యమును పాలించు శుభగ్రహము ఉండవచ్చు లేక శత్రువర్గమునకు సంబంధించిన పాపమును పాలించు అశుభగ్రహము ఉండవచ్చును.

జనన సమయములో పుణ్యమును పాలించు శుభగ్రహము తొమ్మిదవ స్థానములో ఉన్నా లేక ఆ స్థానమును శుభగ్రహము యొక్క చేతులు తాకినా మంచి ఫలితము కల్గును. తండ్రి సంపాదించిన ఆస్తి జాతకునకు తృప్తిగా లభించును. భక్తి, దాన, తపస్సులను చిత్తశుద్ధితో చేయును. దైవభక్తి మరియు గురుభక్తి ఈ జాతకునికి ఉండును. తొమ్మిదవ స్థానమును భాగ్యస్థానమని కూడా చెప్పవచ్చును. ఎందుకనగా డబ్బు రూపముగానున్న ధనము ఈ స్థానములోనుండే లభించుచున్నది. ఇక్కడున్న శుభగ్రహము ఈ స్థానములోని పుణ్యమును స్వీకరించి డబ్బురూపముగా ఇచ్చును. డబ్బు చలామణి బాగా ఉండడమేకాక డబ్బు నిలువయుండును. డబ్బును ఈ జాతకుడు సులభముగా సంపాదించి నిలువ చేసుకొనును. ఈ స్థానములోనున్న పుణ్యమువలన శుభకార్యములు ఎక్కువ జరుగును. శుభకార్యములను చేయుట, పాల్గొనుట జరుగును. మంచివారి సహవాసము, భక్తుల, జ్ఞానుల స్నేహము కల్గును. సకల ఐశ్వర్యములు కలుగును. వివాహములు వైభవముగా జరిపించును. వివాహములలో పాల్గొని గౌరవమును పుణ్యమును సంపాదించుకొనును. న్యాయసమ్మతమైన

ఆదాయము లభించును. జ్ఞానమార్గమున జీవితము గడుపవలెనను ఆలోచన వచ్చును. ఒకవేళ ఇక్కడొక పాపగ్రహముండిన పైన చెప్పిన విషయము లన్నిటికి వ్యతిరేఖముగా చేయుటకు ప్రయత్నించును. ఉదాహరణకు శుక్రుడు శుభగ్రహమై తొమ్మిదవ స్థానములోయుంటే, శుక్రుడు ఐశ్వర్యమునకు (డబ్బుకు) అధిపతియగుట వలన జాతకునకు డబ్బు సమృద్ధిగా ఉండును. ఒకవేళ శుక్రుడు అశుభగ్రహమై తొమ్మిదవ స్థానములో యుంటే నూరు రూపాయలు కూడా లేని స్థితి ఏర్పడును. బీదవానిగా బ్రతుకవలసివచ్చును. మూడవస్థానము ఎదురుగాయున్నందున అక్కడి పాపముతో ఇక్కడ నిర్భాగ్యుణ్ణి చేయును. అలాగే గురువు ఈ స్థానమునకు శుభుడైయున్న గురువు బంగారుకధిపతి అయినందున బంగారమును ఎక్కువ కలుగ జేయును. అదే గురువు అశుభుడైయుంటే తన (గురువు) ఆధీనములో నున్న బంగారును ఏమాత్రము లేకుండా చేయును. ఈ విధముగా ఒక స్థానములోని శుభాశుభములను స్థానమునుబట్టియు, గ్రహమునుబట్టియు తెలియవచ్చును.

## దశమ స్థానము - జీవన స్థానము

అర్ధాంగి భాగములో కేంద్రమైన దశమ స్థానమున పాపపుణ్యములు రెండూ గలవు. ఈ స్థానమున పుణ్యమును అందించు శుభగ్రహము ఉన్నట్లయితే, జీవనోపాదులైన ఉన్నత వృత్తిగానీ, పెద్ద ఉదోగ్యముగానీ, మంచి వ్యాపారము గానీ కల్గునట్లు శుభగ్రహము చేయును. రాజకీయమే వృత్తిగాయున్న వానికి పాలనాశక్తినీ, దానికి కావలసిన యుక్తినీ జాతకునకు శుభగ్రహము ఇచ్చును. యుక్తితో పనిగానీ, వ్యాపారముగానీ, రాజకీయము గానీ చేయువానికి కీర్తి గౌరవప్రతిష్ఠలు కల్గునట్లు చేయును. చేయు వృత్తిలో

గౌరవము లభించుట వలన ప్రజలు సన్మానింతురు. అలాగే ప్రభుత్వము వారు కూడా సన్మానింతురు. ఓర్పు, నిగ్రహశక్తి కల్గియుండును. సకల సంపదలు దిన దినాభివృద్ధి చెందును. మంచి భవనములు నిర్మించుకొనును. దేవతా మందిరములు, మండపములు కట్టించును. దైవకార్యములను చేయించుట, పాల్గొనుట జరుగును. స్వంత సంపాదన పెరిగి జీవనమునకు ఆటంకము లేకుండా జరుగును. ముద్రణావిషయములో చొరవకల్గి గృహములను నిర్మించినట్లు గ్రంథములను తయారు చేయగలడు, వ్రాయ గలడు. దీనితో ప్రజాధరణ పెరుగును. అష్టభోగములను అనుభవించుచూ, ఎదురులేని జీవితము గడుపును. ఈ స్థానములో సూర్యుడుగానీ, చంద్రుడు గానీ శుభులైయుండిన ఉన్నతమైన ప్రభుత్వ ఉద్యోగియై (కలెక్టరై) ప్రజాపాలన చేయును. ఉద్యోగి కాకుండా, ఉద్యోగమును వదలి రాజకీయములో ఉండి నట్లయితే మంత్రిపదవి కల్గి ప్రజలను పాలన చేయును. దశమ స్థానములో కుజగ్రహము శుభగ్రహమైయుంటే అతడు ప్రభుత్వ డాక్టరుగా మంచి ఆపరేషన్లు చేయు డాక్టరుగా ప్రజలలో మంచి పేరు తెచ్చును. కుజ గ్రహముతో పాటు సూర్యుడో, చంద్రుడో పదవ స్థానమున ఉండుట వలన జాతకుడు మిలిటరీలో పెద్ద డాక్టరుగా ఉండును. ఇదే స్థానములో శుక్ర గ్రహముంటే జీవితము మొత్తము సుఖమయమైపోవును. అన్ని సుఖములతో అష్టఐశ్వర్యములతో జీవితము గడచిపోవును. ఈ విధముగా గ్రహమునుబట్టి జరుగుచుండును. ఒకవేళ దశమస్థానములో పాప గ్రహముండిన పైన చెప్పిన వాటికి భిన్నముగా, వ్యతిరేఖముగా జరుగును. కర్మచక్రములోని పదవ స్థానములోని పాపమునుబట్టి పాపగ్రహములు అక్కడ చేరునట్లు ప్రకృతిద్వారా దేవుడు చేయించాడు. పాపగ్రహములుండుట వలన జీవితమే వృథా అనిపించినట్లుండును. జీవనమునకై నిరంతరము బాధపడుచూ బ్రతుకవలసివచ్చును.

కర్మచక్రములో పదకొండవ స్థానము పాపకోణములో చివరిదగును. ఈ స్థానములో కేవలము పాపము మాత్రముండును. అక్కడ చేరిన శుభ గ్రహముల వలన ఎదురు స్థానములోని పుణ్యము ఉపయోగపడుట వలన కొంతవరకు మంచి జరుగును. పాపగ్రహముండిన ధనార్జనలో కష్టము, లాభములో నష్టము, జయములో అపజయము కల్గును. విద్య లేకుండా పోవును. తండ్రి ఆస్తిని పోగొట్టుకోవలసి వచ్చును. జీవితము దుఃఖమయ మగును. సప్త వ్యసనములలో కొన్నిటికి అలవాటుపడిపోవును. ఈ విధముగా అక్కడ చేరు పాపగ్రహములనుబట్టి దుష్ఫలితములుండును. ఒకవేళ పదకొండవ స్థానములో ఒక శుభగ్రహముండినా లేక తాకినా జాతకునికి గ్రహమునుబట్టి మంచి జరుగును. ఈ స్థానమును లాభస్థానమని పెద్దలు చెప్పారు కనుక ఇక్కడున్న గ్రహమునుబట్టి కట్నరూపములో ఒక్కమారు డబ్బువచ్చునట్లు ఆ గ్రహము చేయును. బుధగ్రహముంటే కట్నకానుకల రూపములో మంచి లాభమును చేకూర్చును. తొమ్మిదవ స్థానాధిపతియుండిన, వానికి లాటరీవలన లాభము వచ్చును. లగ్నాధిపతి యుండిన ఎల్లప్పుడు లంచము రూపములోనో లేక కమీషన్ రూపములోనో డబ్బు వచ్చునట్లు చేయును. పంచమాధిపతియుండిన మెడికల్ కాలేజ్ లాంటిది కల్గించి దానిద్వారా డొనేషన్లరూపములో డబ్బు విపరీతముగా వచ్చునట్లు చేయును. ఈ స్థానములో ఇద్దరు లేక ముగ్గురు శుభ గ్రహములు ఉండిన ఉన్నట్లుండి కోట్లలో డబ్బు వచ్చు లాటరీలు తగులును. వ్యాపారములో విపరీతముగా లాభములు వచ్చును. అన్న, అక్కగారి ఆస్తులు లభించును. ఒక రూపముగా కాకుండా అనేక రూపములలో అనేక లాభములు వచ్చునట్లు అమరిపోవును. ఇది పదకొండవ స్థానమగుట వలన పాపకార్యములు చేయుట చేత జాతకుడు ధనమార్జించును. లేఖన

వృత్తి అయిన విలేఖరిగాయుంటూ ధనమును బాగా సంపాదించగలుగును. ఐదవ స్థానమునకు ఎదురుగా ఉన్నందున అందులోని విద్యనూ, ప్రతిభనూ, గ్రాహితశక్తిని, శిల్పకళ విద్యను నేర్వగలుగును. ఎన్నో ఆదాయములు గల స్థానము కావున దీనిని లాభస్థానమని అన్నారు. అంతేకాక వృత్తిలోకంటే ఎక్కువ లాభము వచ్చుట వలన ప్రవృత్తి స్థానమన్నారు. పైకి కనిపించుటకు ఇది ప్రవృత్తి స్థానముగాయున్నా ముందే ఇది పాపస్థానమైయుండి, దీనిలో చేయునదంతా ఇతరులది లాగుకొని లాభము పొందడము తప్ప ఏమీలేదు. దానివలన పాపము రావడము తప్ప పుణ్యమొచ్చు అవకాశము లేదు. అందువలన కొందరు ఇది ప్రవృత్తి స్థానమనినా మేము మాత్రము దీనిని నీచ వృత్తి స్థానమేగానీ ఇందులో ప్రవృత్తి లేదని చెప్పుచున్నాము.

## ద్వాదశ స్థానము - వ్యయ స్థానము

మొదటి స్థానము జనన స్థానమగుట వలన, జననములో శరీరము లభించుట వలన దానిని తను (శరీర) స్థానమన్నారు. చివరిదైన పన్నెండవ స్థానము వచ్చిన శరీరము నాశనమైపోవునది కావున దానిని వ్యయ (నాశన) స్థానమన్నారు. జీవిత చివరి భాగము ఈ స్థానములోనే ఉండును. ఇది జీవితమునకు చివరి కాలము యొక్క విధి విధానమును తెల్పునది. కావున వయస్సు ముదిరిన తర్వాత వృద్ధాప్యములో జరుగు విషయములు ఇక్కడ తెలియును. ప్రారబ్ధకర్మ ప్రారంభమగునది మొదటి స్థానములోకాగా ప్రారబ్ధ కర్మ అయిపోవునది పన్నెండవ స్థానములో, కనుక ప్రారంభమగు ప్రథమ స్థానమును జనన స్థానమని అన్నారు. అయిపోవు స్థానమును మరణ స్థానము అన్నారు. పన్నెండవ స్థానములో కర్మ అయిపోవుచున్నది. కావున అతని (జాతకుని) ఆయుష్షు ఇంతయని చెప్పవచ్చును. అయితే ఇక్కడ

ఒక చిక్కు సమస్య ఉండడము వలన ఈ విషయములో సత్యము చెప్పుటకు వీలు పడడములేదు. ఆ చిక్కు సమస్యను తర్వాత చెప్పగలను. ఇప్పుడు ద్వాదశ స్థానమును గురించి చెప్పుకొంటే ఇది పాపపుణ్యముల మిశ్రమ స్థానము. మిశ్రమము అంటే కలిసిపోయాయని కాదు, రెండూ ఒకే స్థానములో ఉన్నాయని అర్థము. అందువలన ఇక్కడ ఒక పుణ్య గ్రహమైన శుభగ్రహముంటే ఇక్కడ ఏదైనా దుర్వినియోగముకాదు. డబ్బుగానీ, ధాన్యము గానీ, నీరుగానీ ఖర్చు చేయు ఏదైనా దుర్వినియోగము కాదు. చెడు ఉపయోగములకు కాకుండా మంచిగా ఉపయోగపడును. కేతుగ్రహముంటే (శుభగ్రహముగా) ఆధ్యాత్మిక చింతనకలుగజేసి హిందువును భగవద్గీతను, ముస్లీమ్‌ను ఖుర్‌ఆన్‌ను, క్రైస్తవుడైతే బైబిల్‌ను చదువునట్లు చేయును. గురువు గ్రహమున్న జ్ఞాన విషయములని పేరుపెట్టిన దానిని చదువును. మిగతా నాలుగు గ్రహములలో ఏదొక్కటియున్నా సద్గ్రంథములను చదువునట్లు చేయును. సద్గ్రంథ పఠనముచే దైవభక్తి చేకూరి ముక్తి కొరకు ప్రయత్నించును. ప్రయత్నించకపోయినా ముక్తి ఒకటున్నదని తెలిసిపోవును. తర్వాత శుభ గ్రహము ఏదున్నా పాపభీతిని కల్గించి, నరకలోకమును తప్పించి స్వర్గ లోక ప్రాప్తి కల్గించునని తెలియుచున్నది. అంతేకాక అంతవరకున్న మనిషిలోని పశుత్వమును మాన్పించి మానవత్వమును గల్పించును. అంత వరకు చేయుచున్న జంతువధను మాన్పించి అక్కడ ఖర్చయ్యే డబ్బును ఇతరులకు ఉపయోగపెట్టి, దానిద్వారా తర్వాత మంచి జన్మ పొందుటకు అవకాశము కల్గించును. మరణ సమయములో ఎక్కువ కష్టములు లేకుండా నిశ్చింతగా ఉండునట్లు చేయును. జాతకుడు మరణించినప్పుడు ప్రజలు ఎక్కువ మంది వచ్చి అతనిని గురించి చెప్పుకొనునట్లు చేయును. అతడు చనిపోయిన చోట అన్ని అనుకూలతలు ఉండి శవయాత్ర బాగా జరుగు

నట్లు చేయును. ఒకవేళ ద్వాదశ స్థానమున జనన సమయములో పాప గ్రహమున్న (శత్రువర్గములోని గ్రహమున్న) జాతకుడు ఎంత గొప్పవాడైనా, ఎంత ధనికుడైనా చనిపోవు సమయమునకు బంధుమిత్రులు, భార్యా పిల్లలు లేనిచోట చావు లభించును. అతను ఫలానా వ్యక్తి అని కూడా బయటికి తెలియకపోవడము వలన అనాధశవము క్రింద జమకట్టి ఏ సంబంధమూ లేనివారు ఏమీ బాధపడకుండా అంతిమ సంస్కారములు చేయుదురు. అటువంటి చావులు ఎంతోమందికి కల్గినవి. అప్పుడు వారికి వారి జాతకము లోనే పన్నెండవ స్థానమున పాపగ్రహమున్నదని తెలియవచ్చును. ఎప్పుడో ఎనభై సంవత్సరములప్పుడు పుట్టిన సమయములో ఉన్న గ్రహములను బట్టి ఎనభై సంవత్సరముల వరకు జీవితము సాగడమేకాక మరణ సమయములో కూడా జాతకములోని (జనన సమయములోని) గ్రహముల ప్రాబల్యమునుబట్టియే జరుగును. కావున జీవితమును శాసించి నడుపునది జాఫతకము (జాతకము). జాఫతకము లేని జీవితమును గురించి అంచనా వేయుటకు సాధ్యపడదు. అందువలన జన్మనుండి చావువరకు దిక్సూచిలాగ యున్న జాతకమును అందరూ వ్రాసుకొనియుండడము మంచిది.

## మరణ విషయములో చిక్కు సమస్య

ఇంతకుముందు ద్వాదశ స్థానమును గురించి తెలుసుకొన్నాము. ప్రథమస్థానములో కర్మ ప్రారంభమై ద్వాదశ స్థానములో కర్మ అయిపోవు చున్నది. కావున పన్నెండవ స్థానమును ఆధారము చేసుకొని ఆయుష్షును నిర్ణయించి చెప్పవచ్చుననీ, ఆయుష్షు అయిపోవడము మరణమగుట వలన, ఈ జాతకుడు ఫలాన సంవత్సరము చనిపోవుననీ చెప్పవచ్చును. అయితే జ్యోతిష్యశాస్త్రము ప్రకారము చెప్పినది సత్యమే అయినా మరణము ఏదైనదీ

ప్రజలకు తెలియకున్న దానివలన మనిషి అకాల మరణమును పొందినా, తాత్కాలిక మరణమును పొందినా దానినే మనిషి మరణము అనుకోవడము వలన పెద్ద చిక్కు ఏర్పడుచున్నది. జ్యోతిష్యము ప్రకారము ఒక సంవత్సరము ముందు వెనుకగా చావు సమాచారమును చెప్పవచ్చును. అయితే మనిషికి మూడు రకముల మరణములుండుట వలన, వాటిలో చెప్పబడినది గుర్తింప బడకపోవడము వలన, చెప్పిన కాలముకంటే ముందు వచ్చు అకాల, తాత్కాలిక మరణములను కాలమరణముగా పోల్చుకోవడముతో, చెప్పిన సత్యము అసత్యముగా కనపడుచున్నది. "చెప్పిన కాలముకంటే ముందే అకాల మరణము వలనగానీ, తాత్కాలిక మరణము వలనగానీ చనిపోయినా చెప్పిన సత్యము అసత్యముగా కనిపించవచ్చునుగానీ, చెప్పిన సమయము కంటే ఐదు లేక ఆరు సంవత్సరములు ఆలస్యముగా చనిపోతే అప్పుడు చెప్పిన మాటా అసత్యమే అగును కదా!"యని ఎవరైనా అడుగవచ్చును. ఇది హేతుబద్ధమైన ప్రశ్నయే అయినందున దీనికి జవాబు ఏమనగా!

ప్రారబ్ధకర్మ పుట్టిన సమయములో నిర్ణయింపబడినది. అదియూ సంచితకర్మనుండి తీసి ఇచ్చినదానిని ప్రారబ్ధకర్మ అంటున్నాము. ప్రారబ్ధ కర్మప్రకారము 70 సంవత్సరములకు మరణము నిర్ణయించబడినట్లు తెలిసి ఇతని ఆయుష్షు 70 సంవత్సరములని చెప్పామనుకోండి. జ్యోతిష్యము ప్రకారము ఆ మాట సత్యమే అయినా ఆ జాతకుడు 80 సంవత్సరముల వరకు బ్రతికి చనిపోయాడనుకొనుము. అప్పుడు జ్యోతిష్యుడు చెప్పినది పూర్తిగా అసత్యమగును. ఒకవేళ 70 సంవత్సరములు ఆయుష్షు నిర్ణయించ బడిన వ్యక్తి 50 సంవత్సరములకే చనిపోయాడనుకొనుము అప్పుడు కూడా జ్యోతిష్యము వలన చెప్పినమాట అసత్యముగా కనిపించును. ఈ రెండిటికీ సమాధానము చెప్పవలసిన బాధ్యత మాకు కలదు. ఈ ప్రశ్నలకు

జ్యోతిష్యులు జవాబు చెప్పాలి, అయితే వారు జవాబు చెప్పలేని పరిస్థితిలో ఉన్నారు. కారణము ఏమనగా! జ్యోతిష్యమును జ్యోతితో (జ్ఞానముతో) చెప్పడము లేదు. జ్ఞానము లేనప్పుడు జ్యోతిష్యములో జ్యోతి లేకుండా పోవుచున్నది. అందువలన పూర్తి కర్మ విధానము తెలియకుండా పోయి దానికి సరియైన సమాధానము లేకుండా పోయినది. అయితే మేము చెప్పు జవాబు ఏమనగా!

మనిషికి జీవితమున్నట్లే అకాల మరణము, తాత్కాలిక మరణములు కర్మనుబట్టి కొందరికి వస్తున్నవి. కొందరికి రావడములేదు. ఈ రెండు మరణములున్నట్లు కూడా చాలామందికి తెలియదు. జ్ఞానులైన వారికి కూడా తాత్కాలిక మరణమున్నట్లు తెలియదు. ఈ రెండు మరణములు పూర్తి మరణము కాదు. ఈ రెండు మరణములు పొందినవారు జీవితమును సాగించుచునే ఉన్నారు. ఈ రెండు మరణములతో వారి జీవితము ముగిసి పోలేదు. అందువలన వారు బ్రతికేయున్నారు అని చెప్పవచ్చును. ఈ విషయము మీకు క్రొత్తగాయుంటే, మా రచనలలోని **"మరణ రహస్యము"** చదివితే పూర్తి సమాచారము తెలియగలదు. మనిషి ఈ రెండు మరణముల ద్వారా చనిపోయినట్లు కనిపించినా మనకు తెలియకుండా జీవించియుండి తర్వాత జ్యోతిష్యములో నిర్ణయించినట్లే 70 సంవత్సరముల ఆయుష్షులో చనిపోయినా, ఆ విషయము ఇటు జ్యోతిష్యునికిగానీ, ప్రజలకుగానీ తెలియ కుండా పోవుచున్నది. మరణము ఎప్పుడు జరిగినదీ తెలియనివారు, జ్యోతిష్యములో జాతకము ప్రకారము 70 సంవత్సరములు ఆయుష్షు అని చెప్పడము పూర్తి తప్పుగా లెక్కించుకొనుచున్నారు. ఇక్కడ ఎవరైనా పొరబడుటకు అవకాశమున్నది. కావున వారి పొరపాటేగానీ, జ్యోతిష్యము తప్పుగాదని చెప్పవచ్చును. అకాలమరణము పొందినవాడు తిరిగి కాల

మరణము పూర్తి కర్మ అయిపోయినప్పుడు పొందును. దానిప్రకారము 50 సంవత్సరముల వయస్సులో చనిపోయినవాడు (అకాల మరణము పొందినవాడు) మిగతా 20 సంవత్సరములు సూక్ష్మముగా కనిపించక జీవించుచుండును. తర్వాత వాడు 20 సంవత్సరములు జీవితమును గడిపి చనిపోవును. ఈ విధానములో మనుషులు పొరపాటుపడడము తప్ప జ్యోతిష్యము తప్పుకాదని తెలియుచున్నది.

ఇకపోతే జ్యోతిష్యము ప్రకారము 70 సంవత్సరముల ఆయుష్షు కలదని చెప్పబడినవాడు 80 సంవత్సరములకు చనిపోతే, అప్పుడు ఆయుష్షున్నది 70 సంవత్సరములే కదా! అలాంటప్పుడు పది సంవత్సరములు ఎక్కువ ఎలా బ్రతుకగలిగాడని అడుగవచ్చును. ఎలా బ్రతికినా జ్యోతిష్యము ప్రకారము 70 సంవత్సరములు ఆయుష్షు అనుమాట అసత్యమైనది కదాయని అడుగవచ్చును. దానికి మా జవాబు ఏమనగా! విషయమును వివరించుకొని చూడగల్గితే ఇక్కడ కూడా 70 సం॥ముల ఆయుష్షు తప్పుకాదని తెలియుచున్నది. తప్పని ఎదురుగా కనిపిస్తుంటే తప్పుకాదనడమేమిటని కొందరనుకోవచ్చును. అలా ప్రశ్నరాగలదనే వివరించుకొని చూడాలని ముందే చెప్పాము. అందువలన ఇప్పుడు మనము ఈ విషయమును గురించి వివరించుకొని చూద్దాము. ఎప్పుడో 70 సంవత్సరముల క్రిందట జాతకుని ఆయుష్షును గురించి చెప్పియుండగా, 70 గడచిన తర్వాత, 80 సంవత్సరములు బ్రతికిన తర్వాత ఆయుష్షును గురించి చెప్పినమాట తప్పని తెలియుచున్నది. ఇప్పుడు ఇన్ని సంవత్సరము లకు తప్పని తెలిసినా, తప్పుగా చెప్పబడినది ఎప్పుడు అని చూస్తే ఆ మనిషి పుట్టినప్పుడు కదా! అప్పుడు సత్యమైనది, ఆ రోజు శాస్త్రబద్ధముగా చెప్పబడినది, ఇప్పుడు అసత్యమెలా అయినదని చూస్తే, అప్పుడు చెప్పినది

అప్పటికి సత్యమే, ఇప్పుడు జరిగినది ఇప్పటికి సత్యమేనని చెప్పవచ్చును. మా మాట విన్న కొందరికి మా మాటలోని సత్యము అర్థముకాక మమ్ములను అసత్యవాదులుగా వర్ణించవచ్చును. అయితే అందరికీ తెలియని సత్యమొకటి కలదు. జాతకుడు పుట్టినరోజు జాతకమునుబట్టి అతను 70 సంవత్సరములు బ్రతుకవలెనని ఉండుట సత్యమే. అయితే 70 సంవత్సరముల జీవితములో అతడు కొంతవరకు దైవజ్ఞానము ప్రకారము నడుచుకోవడము వలన కర్మమారుటకు అవకాశముగల దశా సంవత్సరములో తేడావచ్చి అతని ఆయుష్షు పది సంవత్సరములు పెరిగినది. మొదట శాస్త్రబద్ధముగాయున్నది 70 సంవత్సరముల ఆయుష్షూ సత్యమే, జ్ఞానమువలన కర్మమారి పది సంవత్సరములు పెరిగినదీ సత్యమే. అందువలన జనన లగ్నములో ఉన్నట్లు 70 సం॥ ఆయువు సత్యము. తర్వాత 80 సంవత్సరముల బ్రతుకు కూడా సత్యమే. దశాసంవత్సరములు జీవిత మధ్యకాలములో ఉన్నవి. మనిషి దైవజ్ఞానమును అనుసరించితే, ఆయా గ్రహములు పాలించవలసిన కర్మలు, ఆయా గ్రహముల యొక్క దశలలో నశించి పోగలవు. అందువలన మొదట పుట్టినప్పుడు నిర్ణయించబడిన కర్మకూ తర్వాత మధ్యకాలములో మార్పుచెందిన కర్మకూ తేడాయున్నది. జ్ఞానము ప్రకారము కర్మ తగ్గిపోయినదని అర్థము చేసుకోవచ్చును కదా! యని మేము చెప్పుచున్నాము. అయితే మా మాట విన్న తర్వాత కొందరు ఇలా ప్రశ్నించవచ్చును. "జ్ఞానము తెలియగల్గి దాని ప్రకారము ఆచరించితే గీతలో చెప్పినట్లు కర్మతగ్గిపోవు మాట వాస్తవమే అయితే దానిని మేము ఒప్పుకుంటున్నాము. ఆ లెక్క ప్రకారము 70 సంవత్సరములు బ్రతుకవలసిన వాడు 65 సంవత్సరములకో లేక 60 సంవత్సరములకో చనిపోయాడంటే, కర్మ తగ్గిపోయినందుకు అలా ఆయుష్షు కూడా తగ్గిపోయి ముందే

చనిపోయాడని అనుకొందుము. కానీ ఇక్కడ పది సంవత్సరములు ఎక్కువ బ్రతికాడు కదా! దానికి మీరేమంటారు?" అని అడుగవచ్చును. దానికి మా సమాధానము ఇలా గలదు.

ఏ మనిషికైనా ప్రపంచ విషయములలో ప్రవర్తించు ప్రవర్తనను గురించి ప్రారబ్ధకర్మ ఏర్పరచబడియుండును. గ్రహచారము ప్రకారము ఒక్క క్షణము కూడా కర్మ వదలక మనిషిని నడుపుచుండును. కర్మప్రకారము దేవున్ని తెలియుటకుగానీ, దేవుని జ్ఞానము తెలియుటకుగానీ, దేవుని జ్ఞానము మీద శ్రద్ధకల్గుటకుగానీ కర్మ కారణము కాదు. అటువంటపుడు కర్మకు అతీతముగా దేవునివైపు మనిషి పోవుటకు తగినట్లు గ్రహముల దశలను దేవుడు ఏర్పరచాడు. గ్రహముల దశాకాలములో మిత్ర శత్రుగ్రహములు మనిషి దేవునిమీద శ్రద్ధకల్గి దైవమార్గములో ప్రయాణించుటకు ఆయా గ్రహములు తమ తమ కర్మలను లేకుండ చేయవచ్చును. కర్మను పాలించునవి గ్రహములే కావున జ్ఞానమునుబట్టి, జ్ఞానశక్తిని (జ్ఞానాగ్నిని) బట్టి కర్మలను నిర్మూలించవలసిన కార్యమును చేయవలసిన బాధ్యత గ్రహముల మీదనే ఉన్నది. అందువలన అటువంటి కార్యమును ఆచరించుటకు గ్రహముల దశలు ఏర్పరచబడినవి. గ్రహచారములో రవ్వంత కర్మను కూడా వదలక అనుభవింపజేయు గ్రహములు, తమ దశలలో మాత్రము దేవుని శాసనమును అనుసరించి కర్మను దహించు కార్యము కూడా చేయును. ఇంతకుముందు ఇదే గ్రంథములో "దశలు అంటే ఏమిటి" అను విభాగములో దేవుని విషయములో మనిషి ప్రవర్తననుబట్టి గ్రహములు తమ దశలలో కర్మను తీసివేయవచ్చును లేక తగిలించవచ్చును అని చెప్పియున్నాము. అక్కడ కర్మను తీసివేయు విధానమును గ్రహములే చేయుచున్నవని చెప్పుచూ అక్కడ కర్మ లేకుండా పోవుటకు భగవద్గీతలో జ్ఞానయోగమను అధ్యాయమున

చెప్పిన 37వ శ్లోకమును కూడా చెప్పాము. ఆ శ్లోకమునుబట్టి జ్ఞానమను అగ్నిచేత కర్మలను దహించు కార్యమును గ్రహములే చేయుచున్నవి. అంతేకాక దేవుని విషయములో భక్తి శ్రద్ధలకు బదులు దేవున్ని ద్వేషించుట, దూషించుట చేసినవారికి లేని కర్మలను అనుభవించునట్లు చేతునని భగవద్గీతయందు దైవాసుర సంపద్విభాగయోగమున 18, 19 శ్లోకములను చూస్తే తెలియుచున్నది. ప్రపంచ విధానములో కాకుండా దేవుని మార్గములో లేని కర్మలను గ్రహములే తగిలించవలసియున్నది. అందువలన గ్రహచారములో మనిషి దేవునిపట్ల ప్రవర్తించు దానినిబట్టి కర్మను తీసి వేయుటకుగానీ, కర్మను తగిలించుటకుగానీ గ్రహములే కర్తలు. అటువంటి దైవ కార్యములను గ్రహములే తమ దశలయందు చేయుచున్నవి.

ఒక మనిషి కర్మ ప్రకారము ప్రపంచ విషయములలో అస్వతంత్రుడై ప్రవర్తించవలసియుండును. అదే దైవము యొక్క విషయములో స్వతంత్రముగా ప్రవర్తించగలడు. దేవుని విషయములు కర్మ ఆధీనములో ఉండవు. అందువలన జీవుడు దేవునికి స్వయముగా దగ్గరగా పోవచ్చును. లేక దూరముగా కూడా పోవచ్చును. దేవునికి దగ్గరగా పోయినవానికి ఉన్న కర్మలు లేకుండా గ్రహముల చేతనే తీసివేయబడును. అలాగే దేవునికి దూరముగా పోయినవానికి లేని కర్మలను గ్రహముల చేతనే తగిలించ బడును. ఆ రెండు పనులను గ్రహములు తమ దశలలో చేయుటకు అవకాశము కలదు. ఇప్పుడు అసలు విషయానికి వస్తాము. పుట్టిన కాలములో (జాతకములో) ఒక వ్యక్తికి 70 సంవత్సరముల ఆయుష్షున్నదని చెప్పబడినప్పుడు ఆ మాట జ్యోతిష్యశాస్త్రమునుబట్టి సత్యమేనని చెప్పవచ్చును. అయితే ఆ వ్యక్తి తన ఇచ్ఛతో దేవుని జ్ఞానమును తెలిసి యోగియై జ్ఞానశక్తిని సంపాదించుకొన్నట్లయితే, ఆ మనిషి దేవునికి దగ్గర

వాడగును. అప్పుడు అతని 70 సంవత్సరముల కర్మలో 20 సంవత్సరముల కర్మ కాలిపోయినది. అప్పుడు అతడు ఉన్న కర్మనుబట్టి 50 సంవత్సరములే జీవించును. ఇది జ్యోతిష్యమునకు సంబంధములేదు. జ్యోతిష్యము కర్మను బట్టియుండునని జ్ఞప్తికుంచుకోవలెను. 70 సంవత్సరములు ఆయుష్షున్న వ్యక్తి తన ఇష్టానుసారము అజ్ఞానముచేత దేవున్ని దూషించి దేవునికి దూరమైనప్పుడు లేని కర్మను గ్రహములే తమ దశలలో తగిలించుచున్నవి. అప్పుడు వానికి ఆ జన్మలో కర్మ ఎక్కువైపోయి 70 సంవత్సరములు మాత్రము బ్రతుకవలసినవాడు 80 సంవత్సరములు బ్రతుకవలసి వచ్చు చున్నది. జనన కాలములోని కర్మ ప్రకారము మనిషి ఆయుష్షు 70 సం॥ అని చెప్పడము శాస్త్రబద్ధమే అగుట చేత అది శాస్త్రము ప్రకారము సత్యము. అయితే జీవిత మధ్యకాలములో కర్మకు సంబంధములేని దైవ విషయములో కర్మ తీసివేయబడడముగానీ, కలుపబడినప్పుడుగానీ, జరిగిన మార్పుకు జ్యోతిష్యమునకు సంబంధములేదు. జ్యోతిష్యము ప్రపంచ సంబంధమైనది. బ్రహ్మవిద్య దైవసంబంధమైనది. జ్యోతిష్యశాస్త్రము ప్రకారము ఆయుష్షు చెప్పబడినది. బ్రహ్మవిద్యాశాస్త్రము ప్రకారము ఆయుష్షులో హెచ్చుతగ్గులు జరిగినది. అందువలన ఆయుష్షుకు సంబంధము లేకుండా జ్ఞానులైన వారు (జ్ఞానశక్తిగలవారు) తమ ఆయుష్షుకు ముందు చనిపోవుచున్నారు. అజ్ఞానులైనవారు కర్మను పెంచుకొని ఆయుష్షుకంటే ఎక్కువకాలమునకు చనిపోవుచున్నారు. అందువలన అటువంటి జ్ఞానుల విషయములోనూ అజ్ఞానుల విషయములోనూ ఇంతే ఆయుష్షు అని ఖచ్చితముగా చెప్పలేము. ఉదాహరణకు ఒక అనుభవ విషయమును క్రింద వివరిస్తాము చూడండి.

2011 A.D సంవత్సరము మార్చినెల మొదటిలో సత్యసాయిబాబా గారు అనారోగ్యముగా ఉన్నప్పుడు ఆయన ఆయుష్షు విషయమును గురించి

మా భక్తులు కొందరు అడిగారు. సత్యసాయిబాబాగారి విషయము చాలా సంవత్సరముల పూర్వము ఒక సందర్భములో ఆయన దీర్ఘాయుష్షు కలవాడనీ, ఆయన ఆయుష్షు 96 సంవత్సరములున్నా, బహుశా 92వ సంవత్సరము చనిపోవచ్చుననీ చెప్పినట్లు జ్ఞాపకమున్నదని చెప్పాము. అప్పటికి బాబాగారి వయస్సు 86వ సంవత్సరము జరుగుచున్నట్లు వినికిడి. దానినిబట్టి ఆయన ఇప్పుడే చనిపోడు ఇంకా ఐదు సంవత్సరములు బ్రతుకు తాడని చెప్పాము. అయితే బాబాగారు ఏప్రిల్ 24వ తేదీ చనిపోయినట్లు తెలిసినది. ఆయన ఆయుష్షు 96 అయితే మేము చెప్పినది 92 సం॥ములు. ఆయన చనిపోయినది 86 సంవత్సరములలో. దీనినిబట్టి మేము చెప్పిన ఆయుష్షుకంటే ఆరు సంవత్సరములు ముందే చనిపోయాడు. చెప్పిన జ్యోతిష్యము తప్పా అని ఆలోచిస్తే, జ్యోతిష్యములో తప్పులేదని తెలియు చున్నది. ఈ విషయములో ఎందుకలా జరిగినదని చూస్తే రెండు రకముల కారణాలు తెలియుచున్నవి. (ఒకటి) బాబాగారు అకాలమృత్యువు చేతనైనా చనిపోయివుండాలి లేక (రెండు) ఆరు సంవత్సరముల జీవిత కర్మ జ్ఞానముచే కాలిపోయి ఉండాలి. బాబాగారు సాధారణ వ్యక్తికాదు, కాబట్టి ఆయన ఆయుష్షులో ఆరు సంవత్సరముల కర్మ కాలిపోయి ఉండవచ్చును. అనుభవించుటకు కర్మలేని దానివలన బాబాగారు ఆరు సంవత్సరములు ముందే చనిపోయాడని చెప్పవచ్చును. అయితే ఈ విషయము పూర్తిగా తెలియనందువలన జ్యోతిష్యమునే తప్పుగా అనుకోవచ్చును. వాస్తవమునకు జ్యోతిష్యములో శాస్త్రబద్ధముగా ఆయన చనిపోవలసినది 92 సంవత్సరము లకు. జ్యోతిష్యమునకు కర్మలు తప్ప జ్ఞానము వలన జరుగు పనులు తెలియబడవు. కావున ఆయన ఆరు సంవత్సరములు ముందే చనిపోవు విషయము జ్యోతిష్యమునకు తెలియదు. జాతకము బాబాగారు పుట్టినప్పుడు

వ్రాసినది. అప్పుడు కర్మప్రకారము జరుగు విషయములే వ్రాయవచ్చును. జ్ఞానము వలన మధ్యలో మారిపోవు విషయములను ముందే వ్రాయుటకు వీలుపడదు. ఈ విధముగా చాలామంది ఆయుష్షు ముందుకు వెనక్కు పోయిన సందర్భములు కలవు. అందువలన ఆయుష్షు విషయమును చెప్పుటకు ఇటువంటి చిక్కు సమస్యలున్నాయని ముందే చెప్పాము.

## 44 ఇందు (హిందు) వులది జ్యోతిష్యము

ద్వాదశ గ్రహములలో జ్ఞానమునకు అధిపతి చంద్రుడు. చంద్ర గ్రహముతోగానీ, చంద్ర కిరణములతోగానీ సంబంధములేకుండా ఎవరికీ జ్ఞానము లభించదు. త్రిమూర్తులలో ఒకడైన శివుడు భిక్షాటన చేయువాడైనా తన శిఖలో చంద్రవంకను ఉంచుకొన్నాడు. శివుడు చంద్రవంకను శిఖలో పెట్టుకోవడము అలంకారమునకని కొందరనుకొనియుండవచ్చును. అయితే శివుడు చంద్రవంకను అలంకారభూషణమునకు ఆయన చంద్రవంకను తలమీద పెట్టుకోలేదు. జ్ఞానమునకు గుర్తుగా చంద్రున్ని తలమీద పెట్టు కోవడము జరిగినది. తల జ్ఞానమునకు నిలయము. జ్ఞానమునకు చంద్రుడు చిహ్నాము. అందువలన తలమీదనే చంద్రున్ని జ్ఞానగుర్తుగా శివుడు పెట్టుకొని చూపించడము జరిగినది. పూర్వము దైవజ్ఞానము గల్గినవారు అన్ని ప్రపంచ దేశములలోకెల్ల ఒక్క భారతదేశములో మాత్రము ఉండెడివారు. అందువలన కృతయుగములోనే ఈ దేశమును జ్ఞానులదేశము అనెడి వారు. చంద్రున్ని జ్ఞాన చిహ్నాముగా జ్యోతిష్యములో చెప్పడమువలన జ్ఞానుల దేశమైన ఈ దేశమునకు (భారతదేశమునకు) చంద్రుని దేశమని పేరు ఉండెడిది. చంద్రున్ని ఇందువు అని పిలిచెడివారు. ఇందువు అంటే జ్ఞాని అని లేక చంద్రుడని అర్థము. అందువలన పెద్దలందరూ

బాగా యోచించి కృత యుగములోనే భారతదేశమునకు ఇందూదేశమని నామకరణము చేశారు. ఆ పేరు కాలక్రమములో కొంత మార్పుచెంది ఇందు అను శబ్దమును హిందూ అని చెప్పుచూ పలుకుచున్నాము. అలా పలుకుట వలన ఇందూ దేశము కాస్తా హిందూదేశముగా వ్రాయబడుచున్నది మరియు పిలువబడుచున్నది. ఇందూ అంటే జ్ఞాని అని అర్థముకలదుగానీ, హిందూ అంటే ఆ పదమునకు అర్థమేలేదు. మేము జ్యోతిష్యశాస్త్రమును తెలిసి మరియు బ్రహ్మవిద్యాశాస్త్రమును తెలిసి, మన దేశ చరిత్ర యుగపర్యంతము తెలిసి, కృతయుగములోనే జ్ఞానులదేశమని పేరుగాంచిన దేశమని ఆ దినము పెద్దలు నిర్ణయించిన ఇందూదేశము అను పేరును చెప్పుచూ, మనము ఇందువులమని చెప్పితే విషయమును గ్రహించుకొను స్థోమతలేని వారు హిందూధర్మరక్షకులమని పేరు పెట్టుకొన్నవారై ఇందూ మతము పరాయి మతము అంటున్నారు.

కృతయుగమునాడే ఈ దేశములోని వారంతా జ్ఞానులుగాయుండి ఇందువులని పేరుగాంచియున్నారు. ఆనాడు వేరే మతమంటూ లేదు. కావున ఇందూమతమని కూడా పేరులేదు. ఉన్నవారంతా ఇందువులే. అయితే కలియుగములో రెండు వేల సంవత్సరముల పూర్వము బుద్ధుని బౌద్ధమతము వచ్చిన తర్వాత దానిని బౌద్ధమంటున్నాము కాబట్టి గుర్తింపు కొరకు దీనిని కూడా ఇందూ (హిందూ) మతమన్నారు. అప్పటికే ఇందూ హిందూగా మారిపోయినది. బౌద్ధమతము బాగా ప్రచారములోనున్న రోజు లలో, అశోకచక్రవర్తియే హిందూ మతమును వీడి తనను బౌద్ధమతస్థునిగా ప్రకటించుకోగా, అశోకుని కొడుకు కూతురు శ్రీలంక, ఆఫ్ఘనిస్థాన్ మొదలగు దేశములలో ప్రచారము చేయగా, స్వయముగా అశోకుడే బౌద్ధమత వ్యాప్తికి కృషి చేయగా, ఆనాడు ఎందరో జ్ఞానములేని హిందువులు బౌద్ధులుగా

మారిపోవడము జరిగినది. అటువంటి సందర్భములో కేరళ రాష్ట్రములో పుట్టిన శంకరాచార్యుడు అద్వైత సిద్ధాంతమును స్థాపించి హిందూమతములో నుండి బౌద్ధులుగా మారిపోకుండా కొంత అడ్డుకట్ట వేశాడు. తర్వాత కొంత కాలమునకు అద్వైత సిద్ధాంతముకంటే మెరుగైన సిద్ధాంతముగా విశిష్టాద్వైత సిద్ధాంతమును తమిళనాడునుండి రామానుజాచార్యులు ప్రచారము చేశాడు. తర్వాత కొంతకాలమునకు కర్ణాటక రాష్ట్రమునుండి మధ్వాచార్యులు ద్వైత సిద్ధాంతమును ప్రచారము చేశాడు. ఈ మూడు సిద్ధాంతములు హిందూ మతములోనివే. అద్వైతులు అడ్డనామములను, విశిష్టాద్వైతులు నిలువు నామములను ముఖాన గుర్తుగా ఉంచుకోగా, ద్వైతులు కుంకుమ బొట్టును ధరించారు. అద్వైతులు విభూతిరేఖలను, విశిష్టాద్వైతులు సపేదతో తెల్లనామమునూ, గంగ సింధూరముతో ఎర్ర నామమును తమ సిద్ధాంతము లకు గుర్తుగా ఫాల భాగములో ధరించారు. ప్రస్తుత కాలములో **ప్రబోధానంద యోగీశ్వరులుగా త్రైత సిద్ధాంతమును** ఇప్పటికి 35 సంవత్సరముల క్రిందటే ప్రకటించి, భగవద్గీతను ముఖ్యముగా ప్రచారము చేయడమేకాక, అద్వైతము లో ఇంతవరకు ఎవరికీ తెలియని రహస్యములను చెప్పుచూవచ్చాము. వాటినే తొంభై గ్రంథములుగా వ్రాశాము.

హిందూమతములో అద్వైతము, విశిష్టాద్వైతము, ద్వైతమును ప్రకటించిన సిద్ధాంతకర్తలు ముగ్గురూ లేరు. త్రైత సిద్ధాంతమును ప్రకటించిన మేము ప్రత్యక్షముగా బ్రతికేయున్నాము. చరిత్రను తెలిసిన మేము మనము మొదట కలియుగములోనే ఇందువులము. నేడు హిందువులుగా చెప్పు కొంటున్నాము. అయితే పెద్దలు పెట్టిన దానిని తీసివేయకూడదని హిందూ అనుచోట ఇందూ అని వ్రాస్తే, మమ్ములను ఏకంగా పరాయి మతము అనువారు నేడు హిందువులలో తయారైనారంటే, మన మతమును

గుర్తించలేని గ్రుడ్డివారుగా ఎంత అజ్ఞానములో కూరుకుపోయామో! మీరే ఆలోచించండి. త్రైత సిద్ధాంతము అంటూనే ఇది త్రిత్వము అను చెప్పు క్రైస్తవులదనీ, త్రైత సిద్ధాంత భగవద్గీతను చూచి ఇది క్రైస్తవుల భగవద్గీతయని అనేవారిని చాలామందిని చూచాము. భగవద్గీత పేరును అడ్డము పెట్టుకొని పరమతమును ప్రచారము చేయుచున్నారని మమ్ములను అనేవారు నేడు హిందువులలో ఉన్నారంటే, చెప్పే జ్ఞానము ఏది అని గుర్తుపట్టలేని అజ్ఞాన దశలో నేడు హిందువులు ఉండిపోయారని అర్థమగుచున్నది. ఇట్లేయుంటే హిందూ మతము పూర్తి అజ్ఞానములో కూరుకుపోతుందనీ, అట్లు కాకుండు టకు మేము **"దేవాలయ రహస్యములు", "ఇందూ సాంప్రదాయములు"** అను పేర్లుగల్గిన గ్రంథములను, భగవద్గీతను ఇల్లిల్లూ తిరిగి ప్రచారము చేయుచున్నా మీరు మా ఊరిలో ప్రచారము చేయవద్దండి అని వాదమునకు దిగి, చెప్పిన దానిని ఏమాత్రము వినకుండా మమ్ములను అవమానముగా మాట్లాడినవారు కలరు. ఇదంతయూ సాధారణ మనుషులు ఎవరూ చేయలేదు. మమ్ములను ప్రతిఘటించిన వారందరూ, మేము హిందూ ధర్మములను రక్షిస్తామని పేరుపెట్టుకొన్నవారే అంటే ఆశ్చర్యపోనక్కరలేదు. మా కళ్ళ ముందరే ఇంత అజ్ఞాన స్థితిలోనికి పోయిన హిందువులకు పూర్తి జ్ఞానమును కల్పించి, అన్ని మతముల ముందర ఇందూ (హిందూ) జ్ఞానము గొప్పదని అనిపించుటకు కృషి చేయాలనుకొన్నాము. ఆ పద్ధతిలో నేడు మమ్ములను కూడా పరమతమని ద్వేషించినవారు కళ్ళు తెరచి హిందూ (ఇందూ) జ్ఞానము ఎంతో గొప్పదని అర్థము చేసుకొనునట్లు ఇంతవరకు భూమిమీద ఎవరూ చెప్పని గ్రంథములను వ్రాసి ఇచ్చాము. ఇప్పుడు **"జ్యోతిష్య శాస్త్రము"** అను గ్రంథమును కూడా అందిస్తున్నాము. ఈ గ్రంథమును అందివ్వడములో మీరందరూ తెలుసుకోవలసినదేమనగా!

ఇంతవరకు ఒక్క హిందూ (ఇందూ) మతములో జ్యోతిష్యమునకున్న విలువ, గుర్తింపు ఏ మతములోనూ లేదు. జ్యోతిష్యమంటే ఇది హిందువులదని ప్రక్కన పెట్టుచున్నారు. ఎక్కడ చూచినా మతము అనునది ప్రజలలో జీర్ణించి పోయినది. కొన్ని దేశములలో కొన్ని తెగలవారు జ్యోతిష్యమును చెప్పుకొన్నా వారు మనవలె పంచాంగమును గ్రహములను అనుసరించి చెప్పుకోవడము లేదు. మన పంచాంగములు వారికి ఏమాత్రము అర్థము కూడా కావు. పంచాంగములు వ్రాసుకోవడము దాని ప్రకారము గ్రహములను లెక్కించుకోవడము ఒక్క హిందూమతములోనే కలదు. అయినా ఇక్కడ కూడా (హిందువులలో కూడా) నాస్తికులు తయారై జ్యోతిష్యము మూఢనమ్మకమనువారు కలరు. మీరెందుకు అలా అంటున్నారని మేము వారిని అడుగగా జ్యోతిష్యములో మేము అడిగిన ప్రశ్నలకు సరిగ్గా ఎవరూ సమాధానము చెప్పలేదు. శాస్త్రబద్ధముకాని సమాధానము చెప్పారు. అందువలన జ్యోతిష్యము అశాస్త్రీయము, అబద్ధము, మూఢనమ్మకమని అన్నామని చెప్పుచున్నారు. వారికి మేము చెప్పు సమాధానమేమనగా! ఒక విద్యార్థి సరిగా చదువుకోకపోతే, అడిగిన దానికి సరిగా సమాధానము చెప్పకపోతే ఆ విద్యార్థిది తప్పగునుగానీ, చదువుది తప్పుకాదు. అలాగే కొందరు జ్యోతిష్యులు జ్యోతిష్యమును సరిగా తెలియక సరియైన సమాధానము చెప్పనప్పుడు వారిది తప్పగునుగానీ, జ్యోతిష్యముది తప్పెలాగగును? గణితమును తప్పుగా చెప్పితే చెప్పినవానిది తప్పగును గానీ గణితము తప్పుగాదు కదా! గణితము శాస్త్రము అది తన పరిధి ప్రకారమే నడుచును. అట్లే జ్యోతిష్యము కూడా షట్‌శాస్త్రములలో ఒక శాస్త్రము. దాని విలువలు ఎప్పుడూ మారవు. అటువంటి జ్యోతిష్యము నేడు హిందువులది అని పేరు రావడము మన (హిందువుల) అదృష్టమనియే

చెప్పవచ్చును ఎందుకనగా! గణితశాస్త్రముగానీ, ఖగోళశాస్త్రముగానీ, రసాయనశాస్త్రముగానీ, భౌతికశాస్త్రముగానీ జాతీయశాస్త్రములుగా ప్రపంచ మంతా ఒప్పుకొనుచుండగా జ్యోతిష్యము శాస్త్రమేకాదని హిందువులకు దానిని అప్పజెప్పడము అన్ని విధముల మంచిదే. ఇంకొక విషయము ఏమంటే బ్రహ్మవిద్యాశాస్త్రమును కూడా ఇది ఇందూ (హిందూ) మతముది అని చెప్పడము వారికి తెలియకనే మనకు మర్యాద ఇచ్చినట్లయినది. నేడు ఇతర మతములవారందరూ జ్యోతిష్యమునూ, బ్రహ్మవిద్యనూ మూఢ నమ్మకముగా పరిగణిస్తూ ఆ రెండిటిని హిందూ (ఇందూ) మతమునకు వదలివేశారు.

నేడు సూర్యచంద్ర మొదలగు గ్రహములను ఆధారము చేసుకొని చెప్పు జ్యోతిష్యము భారతదేశములో ఇందూమతము (హిందూమతము) లోనే కలదని చెప్పుచున్నాము. అయితే ప్రాచీనులైన మన పెద్దలు ఎంతో తెలివిగా ఎన్నో విషయములను కనుగొని వాటిని మనకు అందించినా, చివరకు విలువైన ఆ సమాచారమును కొంత జారవిడుచుకొన్నామని తెలియు చున్నది. అలా జారవిడుచుకొన్న వాటిలో ద్వాదశ గ్రహములుపోయి నవ గ్రహములైనవి. ఏ విధముగా 'ఇందూ' అను మాటను జారవిడుచుకొని అందులో కొంతయినా హిందూ పదమును పట్టుకొన్నట్లు, ద్వాదశ గ్రహములను జారవిడుచుకొని చివరకు నవగ్రహములను మాత్రము పట్టు కొన్నాము. ఇప్పుడు మేము ఏ విధముగా ఇందూ ఫతమునకు (హిందూ మతమునకు) పూర్వ వైభవము తేవాలనుకొన్నామో, అలాగే పూర్వము **"జ్యోతి శాస్త్రము"** అను పేరుతోయున్న దానికి పూర్వవైభమును తెచ్చుటకు నేడు మార్గము తప్పి జ్యోతి పోయి జ్యోతిష్యము అయినట్లు పన్నెండు పోయి తొమ్మిదిగాయున్న గ్రహములైన వాటిని తిరిగి పన్నెండు చేసి జ్యోతిష్యమును

తిరిగి జ్యోతిని చేయుటకు ప్రయత్నిస్తాను. జ్యోతి వెలుగులో దేనినైనా చూచి చెప్పగలుగుటకు అందరినీ తయారు చేయుటకు ప్రయత్నిస్తాము. హిందూ (ఇందూ) ఫతమునకు వదలివేసిన జ్యోతిష్యశాస్త్రమునూ, బ్రహ్మ విద్యాశాస్త్రమునూ అందరికీ ఉన్నతస్థాయిలో కన్పించునట్లు చేయుటకు ప్రయత్నిద్దాము. అందుకు తగినట్లుగా హిందువులందరూ తమ పిల్లలు పుట్టిన సమయమును వ్రాసుకొని కంప్యూటర్‌లోని సాఫ్ట్‌వేర్ ద్వారా జాతక చక్రమును అప్పటి కాలగ్రహముల అమరికను ప్రింట్ అవుట్ తీయించుకొని పెట్టుకోవలెను. మొదట ప్రతి హిందువు తమ జాతకచక్రమును తమవద్ద యుంచుకొంటే దానిని గురించి తెలుసుకొనుటకైనా కర్మచక్ర జ్ఞానమును తెలుసుకోవచ్చును. దాని అనుబంధముతో బ్రహ్మవిద్యనే తెలియవచ్చును.

## 45 మూడు క్రొత్త గ్రహముల గమనమును ఎలా గుర్తించాలి?

మూడు గ్రహములు ఇప్పుడు మనకు క్రొత్తవే అయినా పూర్వము అందరికీ సుపరిచయమైనవేనని చెప్పవచ్చును. పూర్వము వ్రాసిన గ్రంథములలో మూడు గ్రహములను ఎవరూ వ్రాయలేదే అని ఎవరైనా మమ్ములను అడుగవచ్చును. దానికి మా సమాధానము ఇలా కలదు. పేపరు తయారై అచ్చుయంత్రములు వచ్చిన తర్వాత గ్రంథములు తయారైనాయి. అచ్చుయంత్రములు వచ్చి దాదాపు ఇప్పటికి 120 సంవత్సరములు అయిందనుకొంటాను. అంతకుముందు తాటి ఆకులమీద దబ్బనముతో గుచ్చి వ్రాసెడివారు. అలా వ్రాసిన తాటి ఆకులు వెయ్యి సంవత్సరములకంటే ఎక్కువ నిలువయుండేటివి కావు. వెయ్యి సంవత్సరములలోపలే అవి మార్పుచెంది ముట్టుకుంటే విరిగిపోవడము జరిగెడిది. వేయిసంవత్సరముల కంటే ఎక్కువ ఉండుట కష్టముగా ఉండేది. దానికంటే ముందు గుడ్డల

మీద వ్రాసి చూచారు. అవి కూడ కొన్ని తరములకు శిథిలమై పోయెడివి. ఎంత కష్టపడినా, ఏమివ్రాసినా అది నాలుగు లేక ఐదు సంవత్సరములకంటే ఎక్కువ కాలము ఉండెడిది కాదు. అలాంటప్పుడు నలభై లక్షల సంవత్సరము లప్పుడు వ్రాసిన జ్యోతిష్యము అప్పటికి మాత్రమే తెలిసినది, గురుశిష్య పరంపరగా ఒకరి తర్వాత ఒకరు తెలియుచూ వచ్చినా, తెలిసినవారు ఇతరులకు పూర్తి చెప్పకనే, కొన్ని ఉపద్రవముల వలన అకస్మాత్తుగా చనిపోవుట చేత ఆ విషయములు అంతటితో తెలియకుండా పోయినవి. అందువలన కృతయుగములోనేయున్న ద్వాదశ గ్రహముల విషయము తెలియకుండా మాసిపోయినది. చివరకు నవగ్రహములు మిగిలాయి. బ్రహ్మవిద్య కూడా మొదట సృష్ఠి ఆదిలోనే సూర్యుడు మనువుకు చెప్పినా, మనువు ద్వారా మిగతావారికి తెలిసినా మిగతా యుగములలో తెలియకుండా పోయినది. సూర్యుడు చెప్పినప్పుడు ఒకరికొకరు అందరూ తెలుసుకొన్నా రనీ, తర్వాత అనతికాలమునకే తెలియకుండా పోయినదనీ భగవద్గీతలోని జ్ఞానయోగమున 1, 2 శ్లోకములలో చెప్పియున్నారు. ఎంతో జాగ్రత్తగా తెలుసుకొన్న బ్రహ్మవిద్యయే తెలియకుండా పోయినప్పుడు, 40 లక్షల సంవత్సరములప్పుడు చెప్పిన జ్యోతిష్యము ఇంత కాలముండుటకు అవకాశమేలేదు. అందువలన పేరుకు మాత్రము జ్యోతిష్యము ఉందిగానీ, పూర్వమున్న పన్నెండు గ్రహములు పోయి వాటి బదులు తొమ్మిది గ్రహముల జ్యోతిష్యము మిగిలియున్నది. ఇప్పుడు మనకు కావలసినది పన్నెండు గ్రహముల జ్యోతిష్యశాస్త్రము. కృతయుగములోనే చెప్పబడిన, పన్నెండు గ్రహముల విషయమును మేము తెలిసి మీకు తెలిపినా, దానికి సంబంధించిన పంచాంగములు లేవు. నేడు లభ్యమగు పంచాంగములు నవగ్రహములను గురించి వ్రాసినవేగానీ, పన్నెండు గ్రహములను గురించి

వ్రాసినవి లేవు. అలాంటపుడు మిగతా మూడు గ్రహముల విషయము ఎలా తెలియునని ప్రశ్నవచ్చును. గ్రహముల విషయములు వాటి గమనములు అన్నియు పంచాంగము ద్వారా తెలియకపోతే ఇంతవరకు మేము చెప్పిన జ్యోతిష్యమే తెలియకుండా పోవును. ఇటువంటి చిక్కు సమస్య వస్తుందను ముందు చూపుతో దేవుడు ఒక మంచి పనిచేశాడు. దానితో మూడు గ్రహముల విషయము, గమనము మనమే స్వయముగా తెలియ వచ్చును. అదెలాయనగా! దాని వివరమును ఇప్పుడు జాగ్రత్తగా చూడండి. నవగ్రహముల పంచాంగములో ఛాయా గ్రహములని పేరుగాంచిన రాహువు, కేతువు రెండు గ్రహములున్నవి కదా! అవికాక మిగతా ఏడు గ్రహములు ఎడమనుండి కుడిప్రక్కకు తిరుగుచుండగా, రాహు కేతువులు మాత్రము కుడినుండి ఎడమకు తిరుగుచున్నట్లు తెలుసుకొన్నాము. అంతేకాక రాహుగ్రహము కేతుగ్రహము రెండూ కాలచక్ర లగ్నములలో ఒకే వేగము కల్గియున్నాయి. రెండు గ్రహములుగానీ మూడు గ్రహములుగానీ ఒకే వేగము కల్గియున్నప్పుడు వాటిలో ఒక గ్రహము యొక్క స్థానము ఎక్కడున్నది తెలిసిన దానినిబట్టి మిగతా గ్రహముల స్థానములను సులభముగా తెలియవచ్చును. ఒకే వేగముగల గ్రహముల మధ్యదూరము ఎప్పటికీ ఒకే రకముగా ఉండును. అందువలన ఒక గ్రహము కదలికను బట్టి మిగతా గ్రహము యొక్క కదలికలను తెలియవచ్చును. ఉదాహరణకు కాలచక్రములో రాహు కేతువులు ఒకే వేగమును కల్గి యున్నాయి. కావున వాటి గమనమును కాలచక్రములో ఎట్లున్నది గమనించుము. దీని ఆధారముతో క్రొత్తగా తెలిసిన మూడు గ్రహములను పంచాంగము లేకున్నా సులభముగా ప్రక్కపేజీలో గ్రహించవచ్చును.

| | మీనము | మేషం | వృషభం | మిథునమ్ | |
|---|---|---|---|---|---|
| | పూర్వాభాద్ర - 4<br>ఉత్తరాభాద్ర 1, 2, 3, 4<br>రేవతి 1, 2, 3, 4 | అశ్వని 1, 2, 3, 4<br>భరణి 1, 2, 3, 4<br>కృత్తిక -1 | కృత్తిక 2, 3, 4<br>రోహిణి 1, 2, 3, 4<br>మృగశిర 1, 2 | మృగశిర 3- రవి.జూన్-14, 4 తె.4-19<br>ఆరుద్ర 1, 2, 3, 4<br>పునర్వసు 1, 2, 3 | |
| కుంభము | ధనిష్ఠ 3, 4<br>శతభిషం 1, 2, 3, 4<br>పూర్వాభాద్ర 1, 2, 3 | **కాలచక్రము 12 భాగములు 108 పాదములు**<br>కేతువు (సెప్టంబర్ 20, 5-30)<br>కేతువు (జులై 2, రాత్రి 11-00)<br>మిత్ర (జులై 2, రాత్రి 11-00) | | పునర్వసు -4<br>పుష్యమి 1, 2, 3, 4<br>ఆశ్లేష 1, 2-, 3-, 4- | కర్కాటకము |
| మకరము | ఉత్తరాషాఢ 2, 3, 4<br>శ్రవణం 1, 2, 3, 4<br>ధనిష్ఠ 1, 2 | రాహువు ( సెప్టంబర్ 20, సాం॥5-30ని)<br>రాహువు (జులై 2, రాత్రి 11-00)<br>చిత్ర (జులై 2, రాత్రి 11-00) | | మఖ 1, 2, 3, 4<br>పుబ్బ 1, 2, 3, 4<br>ఉత్తర - 1 | సింహము |
| | మూల 1-భూమి, 2 (జూన్ 14, 3 తె.4-19), 4<br>పూర్వాషాఢ 1, 2, 3, 4<br>ఉత్తరాషాఢ - 1 | విశాఖ - 4<br>అనూరాధ 1, 2, 3, 4<br>జేష్ఠ 1, 2, 3, 4 | చిత్త 3, 4<br>స్వాతి 1, 2, 3, 4<br>విశాఖ 1, 2, 3 | ఉత్తర 2, 3, 4<br>హస్త 1, 2, 3, 4<br>చిత్త 1, 2 | |
| | ధనస్సు | వృశ్చికము | తుల | కన్య | |

**54వ చిత్రపటము**

2008వ సంవత్సరము జూలై 2వ తేదీన ధనిష్ట 1వ పాదము
రాహువు రాత్రి 11.00 గంటలకు

2008వ సంవత్సరము జూలై 2వ తేదీన ఆశ్లేష 3వ పాదము
కేతువు రాత్రి 11.00 గంటలకు

అని పంచాంగములో ఉన్నది. దానిప్రకారము జూలై 2వ తేదీన రాత్రి 11.00 గంటల సమయములో రాహుగ్రహము కాలచక్రములో ధనిష్ట 1వ పాదములోనికి రాత్రి 11 గంటలకు ప్రవేశించాడు. అదే సమయములో ఒకే వేగమున్న కేతుగ్రహము దానికి పూర్తి ఎదురుగానున్న ఆశ్లేష 3వ పాదములోనికి కేతువు ప్రవేశించాడు. అట్లు ఇరువురూ ఒకేమారు పాదములు దాటుట వలన వారి మధ్య దూరము కూడా మారలేదని తెలిసినది.

జూలై 2వ తేదీన ఒకే సమయములో రాహువు కేతువులు తమ స్థానములు మారినట్లు తెలిసినది. తర్వాత 2 నెలల 18 దినములకు అనగా సెప్టెంబర్ 20వ తేదీన సా॥ 5-30 ని రాహువు శ్రవణం 4వ పాదములోనికి పోయాడు. అదే దినము అదే సమయమునకు కేతువు ఆశ్లేష 2వ పాదములోనికి పోయాడు. దానిని కాలచక్రములో గమనించండి.

సూర్యగ్రహము జూన్ 14వ తేదీన తెల్లవారుజామున 4-19 ని మృగశిర 3వ పాదమున మిథునములో ప్రవేశించాడు. సూర్యుడు మృగశిర 3వ పాదములో ప్రవేశించిన తె॥ 4-19 నిమిషములకే భూమి సూర్యునికి సమానముగా తిరుగుచూ మూల 1వ పాదమున ధనుర్‌లగ్నములో ప్రవేశించినది. దీనిని కూడా కాలచక్ర కుండలిలో గుర్తించాము చూడండి.

మిత్ర, చిత్ర, భూమి యొక్క గమనములు కాలచక్రములో ఎలా ఉన్నది మనకు తెలియాలి. పంచాంగము లేకున్నా ఆ మూడు గ్రహముల గమనములు తెలియుట చాలా సులభమైన పనియే. భూమి ఎల్లప్పుడు సూర్యునికి ఎదురుగా ప్రయాణిస్తూ సమానదూరముగ ఉన్నది. కాల చక్రములో సూర్యునిది ఎంత వేగమో భూమిది కూడా అంతే వేగము కలదు. కావున సూర్యుడు ఏ సమయములో లగ్నము మారుచున్నాడో అదే సమయములో భూమికూడా లగ్నము మారుచున్నది. పైన సూర్యుడు మిథున లగ్నమున మృగశిర 3వ పాదములో ప్రవేశించిన 4-19 నిమిషములకే భూమి ధనుర్ లగ్నమున మూల నక్షత్రము 1వ పాదమున ప్రవేశించినది. ఈ పద్ధతి శాశ్వతముగా ఉండునది కాబట్టి సూర్యుని విషయమును పంచాంగము ద్వారా తెలుసుకోగల్గి దానికి వ్యతిరేకముగా భూమి ఉన్నట్లు గుర్తించుకోవచ్చును. మిత్ర, చిత్ర విషయములో కూడా అలాగే చేయవచ్చును. రాహువు, కేతువు సమాన దూరములో సమాన వేగముతో ప్రయాణించుచున్నారు. వారిలాగే (రాహువు, కేతువులాగే) మిత్ర, చిత్ర సమాన దూరముతో, సమాన వేగముతో ప్రయాణించుచున్నారు. కనుక ఆ రెండు గ్రహములను కూడా సులభముగా గుర్తించవచ్చును. రాహువు క్రింది పాదములో చిత్ర, కేతువు క్రింది పాదములో మిత్ర గ్రహములు ఉన్నవి. అందువలన రాహువును ఆధారము చేసుకొని చిత్రను, కేతువును ఆధారము చేసుకొని మిత్ర గ్రహమును గుర్తించుకోవచ్చును. ఈ మూడు గ్రహములకు ప్రత్యేకించి పంచాంగములు ఇంతవరకూ లేవు. భవిష్యత్తులో పంచాంగకర్తలు ఈ గ్రహములను కూడా తమ పంచాంగములలో వ్రాసుకోవచ్చును. పంచాంగములలో సూర్యుడు, రాహువు, కేతువు గుర్తింపబడియుండుట వలన వారిని చూచి భూమి, చిత్ర, మిత్ర గ్రహము లను గుర్తించుకోవచ్చునని తెలుపుచున్నాము.

# 46 జాతకుని జాఫతకము

ఇంతవరకు జ్యోతిష్యము ప్రకారము జాతకమును (జాఫతకమును) తెలుసుకొను నిమిత్తము కావలసిన సూత్రములన్నిటినీ వివరించుకొన్నాము. నేడు ఏ మనిషికైనా పుట్టిన తేదీ, పుట్టిన సమయమును ఇస్తే కంప్యూటర్‌లో ముందే సెట్ చేయబడిన జాతకము బయటపడును. పూర్వకాలము పుట్టిన దినమునకు సంబంధించిన ఆ సంవత్సర పంచాంగమును తీసుకొని చూచి దాని ద్వారా జాతకమును తీసుకోవలసియుండెడిది. జన్మలగ్నము కొరకు, దశా సంవత్సరము కొరకు కొంత గణితమును ఉపయోగించి లెక్కాచారము ప్రకారము వ్రాసుకోవలసియుండెడిది. దానికొరకు జ్యోతిష్యులు 100 సంవత్సరముల వరకు పాత పంచాంగములను తమవద్ద దాచుకొనెడివారు. జాతక లగ్నములను వ్రాయుటకు వారము దినములు పట్టెడిది. నేడు అటువంటి అవసరము లేకుండా ఐదు నిమిషములలో జాతక లగ్నము లభించుచున్నది. ఇదంతయూ సర్వసాధారణముగా నవగ్రహముల జాతకములే కంప్యూటర్‌లో లభించుచున్నవి. మేము ఈ గ్రంథములో పన్నెండు గ్రహములను చెప్పాము. కావున వాటిని అనుసంధానము చేసి మిగతా సూత్రములను చెప్పవలసి వచ్చినది. ఇంతవరకు మేము చెప్పిన సూత్రములను ఉపయోగించి ఒక జాతకునికి జీవితమెట్లుండునో తెలియుటకు ఉదాహరణకు ఏదో ఒకరి జాతకమును తీసుకొని చెప్పాలి. ఎవరికీ తెలియని మనిషి యొక్క జాతకమును గురించి చెప్పితే అది నిజమెంతో అబద్ధమెంతో తెలియదు. కొందరికి తెలిసిన వ్యక్తి జాతకమును గురించి చెప్పితే అందులో సత్యాసత్యములు కొన్ని అయినా తెలియునను ఉద్దేశ్యముతో చాలామందికి తెలిసిన ఒక వ్యక్తి జాతకమును గురించి వివరించదలుచుకొన్నాను.

వాస్తవముగా నేను జ్యోతిష్యుడను కాను. అందువలన నేను ఎవరికీ జ్యోతిష్యమును చెప్పను. అలాగే కొంత వరకు వైద్యమును గురించి తెలిసినా నేను వైద్యుడను కాను వైద్యము చేయనుగానీ, ఆపదలోనున్న వారు వచ్చి అడిగితే వారికి సలహా చెప్పి పంపేవాడిని. రోగమును గురించి వివరించి చెప్పి మందును గురించి సలహా చెప్పేవాడిని మాత్రమే. ఎంతమందికి రోగాలు పోయాయి అనేది నాకు తెలియదుగానీ, నాకు సలహాజెప్పడము మాత్రమే తెలుసు. ఇక్కడ ముఖ్యముగా హిందూ సమాజమునకు సంబంధించిన జ్యోతిష్యము కొంతమంది చేత హేళన చేయబడుచుండడము వలన అటువంటి స్థితినుండి బయటపడుటకు, జ్యోతిష్యము యొక్క విలువ పది మందికి తెలియుటకు మేము ఈ జ్యోతిష్య గ్రంథమును వ్రాయాలను కొన్నాము, వ్రాశాము. జ్యోతిష్యము సత్యమా కాదా అని నేను పరిశోధించి సత్యమేనని తెలుసుకొన్న తర్వాత, అటు అనుభవములను నేను చూచిన తర్వాత ఇంతగొప్పగాయున్న దానిని గురించి కొంతయినా ఇతరులు తెలియుట మంచిదను భావముతో జ్యోతిష్యములోని క్రొత్త విషయములను గురించి చెప్పడము జరిగినది. జ్యోతిష్యము తెలుసుకొనుటకు మాత్రమేగానీ, రాబోవు దానిని తెలుసుకొని తప్పించుకొనుటకు గాదు. తెలుసుకొన్నంత మాత్రమున రాబోవు ఆపదను తప్పించుకొనుటకు వీలుపడదు. ఆపద జరుగకుండా ఉండుటకు శాంతులు చేయవచ్చునని కొందరంటుంటారు. అదంతయు కేవలము భ్రమ మాత్రమే. జాతకరీత్యా ఏమి జరుగవలెనని నిర్ణయించబడియుండునో అది జరిగితీరును. ప్రపంచ కార్యములతో ఏమి చేసినా జరిగేది జరుగక మానదు. కర్మనుండి తప్పించుకోవాలనుకొంటే ఒక జ్ఞానము తప్ప మరేదీ లేదు. జ్ఞానము వలన కర్మ కాలిపోవునని ముందే చెప్పుకొన్నాము. జ్ఞాన సంబంధములేనిది కర్మపోదు అనుటకు నా అనుభవములోని ఒక విషయమును చూస్తాము.

1994వ సంవత్సరము నాకు పరిచయమున్న వ్యక్తి యొక్క జాతకమును చూడడము జరిగినది. ఆ దినము ఆయన తన జాతకమును చూడమని నన్ను అడగలేదు. అయినా నేనే అడిగి ఆయన పుట్టిన దినమునూ, పుట్టిన సమయమునూ తెలుసుకొన్నాను. నేను ఏ విషయము లోనూ బయటపడను. ఆ రోజు నేనే ఎందుకు ఆయన పుట్టిన తేదీ (డేట్ ఆఫ్ బర్త్) అడిగానో నాకు తెలియదు. తర్వాత ఆ డేట్ ప్రకారము జాతకమును చూచి ఆయన జాతకము అంతా బాగుంది అని తెలుసు కొన్నాను. అయితే అతను ప్రమాదములో అకాల మరణము పొందునని తెలుసుకొన్నాను. నాకు పరిచయమున్న ఒక మంచి వ్యక్తి అలా చనిపోవునని తెలియడము బాధాకరమే, అయినా కర్మను ఏ ప్రపంచ శాంతుల చేతగానీ, అనుభవించకుండా తప్పించుకొనుటకు వీలులేదు. భగవంతుడు చెప్పిన దానిప్రకారము ఎంతటి కర్మనైనా జ్ఞానమువలన దానినుండి తప్పించు కోవచ్చును. అయితే కర్మవున్న జాతకునికి జ్ఞానము ఉండాలి కదా! ఒకవేళ నేను ప్రమాదమును గురించి చెప్పినా ఆ వ్యక్తి నామాట వినునను నమ్మకము లేదు. అందువలన ఆ విషయమును అలాగే వదలివేశాము. ఆయన ప్రమాదమును గురించి నాకు పరిచయమున్న వారితో చెప్పడము జరిగినది. ప్రమాద విషయము జ్యోతిష్యశాస్త్రము ద్వారా తెలుసుకోగల్గినా, ఆ ప్రమాదము దేనివలన జరుగుతుందనిగానీ, ఖచ్చితముగా ఎప్పుడు జరుగు తుందనిగానీ, నాకు కూడా తెలియదు. పైగా జ్యోతిష్యము మీద నాకు కొంతవరకు నమ్మకమున్నా, నేను తెలుసుకొన్నది వాస్తవమేనా అని నాకే కొంత అనుమానముండేది. అయినా నాలో ఒకవైపు జ్యోతిష్యము అసత్యము కాదని అనిపించేది.

నేను ఎక్కడా బయట తిరగను, ఎవరితోనూ ఎక్కువగా సంబంధము పెట్టుకోను. ఇప్పుడు కూడా నా గ్రంథములు ఎక్కువగా సమాజములో ప్రచారమైనా నేను ఎవరో కూడా చాలామందికి తెలియదు. అటువంటి నేను తర్వాత 2002వ సంవత్సరము నావెంట జిహ్వానందస్వామి రాగా ఇద్దరము కలిసి ఆ జాతకుని దగ్గరకుపోయి ఆ సంవత్సరము ఆగష్టు నెలలో జరుగు కృష్ణాష్టమి సందర్భముగా జరుగు ఆధ్యాత్మిక సభలో మేము వ్రాసిన ఒక గ్రంథమును ఆవిష్కరించమని అడిగాము. అప్పుడు ఆయన "నేను మత సంబంధమైన సభలకు రాను" అని చెప్పడము జరిగినది. అంతటితో మేము వెను తిరిగి వచ్చాము. అప్పుడు నా ప్రక్కనున్న మనిషితో "ఇది దేవునికి దేవుని జ్ఞానమునకు సంబంధించిన సభ. గ్రంథము కూడా అటువంటిదే. ఈ సభకు వచ్చియుంటే ఆయన కర్మలో కొంత మార్పు వచ్చేది" అని చెప్పాము. అంతటితో ఆ విషయమును మేము మరచి పోయాము. తర్వాత కొన్ని సంవత్సరములకు 2008వ సంవత్సరములో ఆయన ప్రయాణించు హెలిక్యాప్టర్ చేరవలసిన స్థలమునకు చేరలేదు, ఏమి జరిగిందో అని కొందరనుకోవడము ఆళ్లగడ్డలో హోటల్‌లో భోజనము చేస్తూ విన్నాము. అప్పుడు నా వెంట పదిమంది నాకు భక్తులైనవారే ఉన్నారు. అప్పుడు నా తలలో 1994వ సంవత్సరములో చూచిన జాతకము జ్ఞాపకము వచ్చినది. నాకు ఆయన ప్రయాణ వార్త దాదాపు 1-20 నిమిషములప్పుడు తెలిసినది. ఒక నిమిషము ఆలోచించి అది మేము జాతకములో చూచిన ప్రమాదమే అయి ఉంటుందని అనుకొని, ఆ విషయమును నా ప్రక్కనే యున్న మా వారికి చెప్పడము జరిగినది. నేను ఏది అనవసరముగా చెప్పనని తెలిసిన మా భక్తులు నేను చెప్పిన మాటను పూర్తి విశ్వసించారు. ఆయనకు ప్రమాదము జరిగినదని రెండవ రోజు

వరకు తెలియకున్నా మేము మాత్రము ముందే అది ప్రమాదమే అయివుంటుందనీ, జాతకము ప్రకారము జరిగినదనీ అనుకొన్నాము. ఈ సంఘటనతో జ్యోతిష్యము పూర్తి సత్యమని మేము తెలుసుకోగలిగాము. నాకు సత్యమని తెలిసిన తర్వాత అదే విషయమునే బయటికి జ్యోతిష్యము సత్యమని చెప్పుచున్నాము.

నాకు తెలిసిన జ్యోతిష్యము ప్రకారము, ఇంతవరకు ఈ గ్రంథములో వ్రాసిన పన్నెండు గ్రహములను ఉపయోగించి ఇప్పుడొక జాతకమును వివరిస్తాను చూడండి. ఈ జాతకుడు పుట్టిన తేదీ, పుట్టిన కాలమును చూస్తే ఇలా కలదు. 21వ తేదీ, డిశంబరు 1972 గురువారం రాత్రి 1-30 A.M సమయములో జమ్మలమడుగులో జన్మించినట్లు కలదు. ఇతను జన్మించిన సమయములో ప్రారబ్ధకర్మ ఎలా నిర్ణయించబడినదో, అతని జన్మలో మొదటనే నిర్ణయించబడిన జాఫతకము అను జీవిత ఫతకము ఏమిటని చూచుటకు ముందు ఖగోళములో ఆ సమయానికి పన్నెండు గ్రహములు ఏది ఎక్కడున్నదో తెలుసుకోవాలి. అలా తెలుసుకోవడమేకాక సూర్యుని కిరణములు కర్మచక్రము మీద ఏ భాగములో పడుచున్నవో తెలియ గలగాలి. ఇదంతా మనము పంచాంగమునుండి గ్రహించవలసి యున్నది. అయినా ఈ కాలములో అటువంటి శ్రమ ఎవరికీ అవసరములేదు. అన్ని లెక్కలను కంప్యూటర్ చేసి మనకు జాతకుని జన్మ లగ్నము, జాతకునికి గ్రహములు ఏయే లగ్నములందు ఏయే నక్షత్రములలో గలవో, అలాగే నక్షత్రము యొక్క ఎన్నో పాదములో గ్రహముగలదో సులభముగా తెలియు చున్నది. అంతేకాక పుట్టిన సమయములో జాతకుడు ఏ దశలో ఉన్నాడో, జరుగబోవు దశలు ఏవో కూడా తెలియుచున్నది.

ఒక జాతకమును చూడవలసి వచ్చినప్పుడు జ్యోతిష్యుడు అతను పుట్టిన (జాతకుడు పుట్టిన) కాలమును ఆధారము చేసుకొని మొదట లగ్న

కుండలియందున్న పన్నెండు లగ్నములలో ఏ లగ్నము జన్మలగ్నమగు చున్నదో తెలియవలెను. జన్మ లగ్నమును తెలియుటకు జాతకుడు పుట్టిన సమయము 1972-12-21వ తేదీ రాత్రి 1-30 నిమిషములకు అయినప్పుడు ఆ దినము సూర్యోదయము 6-42 నిమిషములకు జరిగినది. పంచాంగము ప్రకారము ఆ దినము సూర్యుడు మూల 2వ పాదములో ఉండుట వలన మూల నక్షత్రముగల ధనుర్ లగ్నము ఉదయమున్నదని తెలిసినది. ధనుర్ లగ్నము తెల్లవారకముందే 27 నిమిషములు గడచిపోయినది. తెల్లవారిన తర్వాత మిగిలిన ధనుర్లగ్నము 1-40 నిమిషములు.

| | | |
|---|---|---|
| 21వ తేదీ సూర్యోదయము జరిగిన సమయము | - | 6-42 నిమి॥ |
| సూర్యుడు మూల నక్షత్రమందు 2వ పాదమున ఉండుట చేత ఆ దినము తెల్లవారక ముందే గడిచిపోయినది | - | 0-27 నిమి॥ |
| ధనుర్ లగ్నము యొక్క పరిమాణ కాలము | - | 2-07 నిమి॥ |
| సూర్యోదయమునకు ముందే అయిపోయిన ధనుర్ లగ్న కాలము | - | 0-27 నిమి॥ |
| మిగిలిన ధనుర్ లగ్న కాలము | - | 1-40 నిమి॥ |
| సూర్యోదయ కాలము | - | 6-42 నిమి॥ |
| ఉదయము | - | 8-22 నిమి॥ |
| తర్వాత జరిగిన మకరలగ్న పరిమాణ కాలము | - | 1-52 నిమి॥ |
| ఉదయము | - | 10-14 నిమి॥ |
| తర్వాత గడచిన కుంభలగ్న పరిమాణ కాలము | - | 1-39 నిమి॥ |
| ఉదయము | - | 11-53 నిమి॥ |
| తర్వాత గడచిన మీనలగ్న పరిమాణ కాలము | - | 1-37 నిమి॥ |

| | | |
|---|---|---|
| మధ్యాహ్నము | - | 1-30 నిమి॥ |
| తర్వాత గడచిన మేషలగ్న పరిమాణ కాలము | - | 1-45 నిమి॥ |
| మధ్యాహ్నము | - | 3-15 నిమి॥ |
| తర్వాత గడచిన వృషభలగ్న పరిమాణ కాలము | - | 2-01 నిమి॥ |
| సాయంకాలము | - | 5-16 నిమి॥ |
| " మిథునలగ్న పరిమాణ కాలము | - | 2-12 నిమి॥ |
| రాత్రి | - | 7-28 నిమి॥ |
| " కర్కాటకలగ్న పరిమాణ కాలము | - | 2-12 నిమి॥ |
| రాత్రి | - | 9-40 నిమి॥ |
| " సింహలగ్న పరిమాణ కాలము | - | 2-07 నిమి॥ |
| | | 11-47 నిమి॥ |
| " కన్యాలగ్న పరిమాణ కాలము | - | 2-05 నిమి॥ |
| రాత్రి | - | 1-52 నిమి॥ |
| జాతకుడు పుట్టిన సమయము రాత్రి | | 1-30 నిమి॥ |
| జరుగవలసిన కన్యాలగ్నమున్నది | - | 0.22 నిమి॥ |

కన్యాలగ్నమున 22 నిమిషములు మిగిలియున్నది. కనుక ఈ జాతకుడు కన్యా లగ్నములో జన్మించాడని చెప్పవచ్చును. క్రింద జన్మ కుండలిలో జనన లగ్నముగా కన్యాలగ్నమును నిర్ణయించడమైనది అలాగే గుర్తించాము. లగ్నమునుండే మిగతా లగ్నములను లెక్కించుకోవాలి.

జాతకుని పేరు జగన్, అతని జన్మనక్షత్రము ఆరుద్ర 2, జగన్ జన్మలగ్నము తర్వాత పేజీలోగల చిత్రపటములో చూడవచ్చును.

| | | | |
|---|---|---|---|
| | | శని () | చంద్ర కేతు |
| | **కన్యా లగ్నము** | | |
| | | | |
| సూర్య గురు రాహు | శుక్ర బుధ | కుజ | లగ్నము |

55వ పటము.

జనన సమయములో పన్నెండు గ్రహములు ఏయే లగ్నములలో ఉన్నది గుర్తించుకొన్నాము. ఏ గ్రహము ఏ నక్షత్రములో ఉన్నదో, ఏ పాదములో ఉన్నదో క్రింద చూస్తాము.

సూర్యుడు – మూలనక్షత్రము – 2వ పాదము – ధనస్సులో
చంద్రుడు – ఆరుద్రనక్షత్రము – 2వ పాదము – మిథునములో
కుజుడు – విశాఖనక్షత్రము – 3వ పాదము – తులలో
బుధుడు – అనూరాధ ” – 4వ పాదము – వృశ్చికములో
గురువు – పూర్వాషాఢ ” – 3వ పాదము – ధనస్సులో
శుక్ర – అనూరాధ – 2వ పాదము – వృశ్చికములో
శని – రోహిణి – 4వ పాదము – వృషభములో
రాహువు – పూర్వాషాఢ – 3వ పాదము – ధనస్సులో

కేతువు - పునర్వసు - 1వ పాదము - మిథునములో
భూమి -
మిత్ర -
చిత్ర -

ఇంకనూ మూడు గ్రహములు ఏ నక్షత్రములో ఏ పాదములో ఉన్నదీ తెలియదు. దానిని ముందు వివరముగా తెలుసుకొందాము.

జాతకుని జన్మకుండలిలోని (కాలచక్రములోని) పన్నెండు లగ్నములలో తొమ్మిది గ్రహములను మాత్రము గుర్తించుకొన్నాము. మిగతా మూడు గ్రహములను గుర్తించుకోవలసియున్నది. వాటిని సులభముగా గుర్తించుకొనుటకు జన్మ లగ్నకుండలిని (కాలచక్ర భాగములను) నక్షత్ర పాదముతో గుర్తించుకొనునట్లు పెద్దగా వ్రాసుకొని తర్వాత పేజీలోగల 56వ చిత్రటములో చూస్తాము.

భూమి సూర్యునికి ఎదురుగా సమాన వేగముతో తిరుగుచున్నది. కావున సూర్యుడు ధనుర్లగ్నమున మూలా నక్షత్ర రెండవ పాదములో యుంటే, భూమి సూర్యునికి ఎదురుగా మిథునలగ్నమున మృగశిర నక్షత్ర 4వ పాదమున ఉన్నట్లు తెలియుచున్నది. అలాగే మిత్ర గ్రహము కేతువు క్రింది పాదములోయుంటూ కేతువునుబట్టి సమానముగా కదలుచుండును. కావున కేతువు ఎక్కడుంటే దానిక్రింది పాదమే మిత్రదని తెలియవలెను. ఈ జాతకము ప్రకారము మిత్ర పునర్వసు 2వ పాదములో ఉన్నట్లు తెలియుచున్నది. ఇకపోతే చిత్ర గ్రహము యొక్క విషయానికి వస్తే చిత్ర ఎల్లప్పుడూ రాహు గ్రహమును అనుసరించి కదలుచూ రాహువున్న నక్షత్రము కంటే క్రింది నక్షత్రములోయున్నది. కావున చిత్ర రాహువుకంటే క్రింద

| మీనము | మేషం | వృషభం | మిథునమ్ |
|---|---|---|---|
| పూర్వాభాద్ర - 4<br>ఉత్తరాభాద్ర 1 2 3 4<br>రేవతి 1 2 3 4 | అశ్వని 1 2 3 4<br>భరణి 1 2 3 4<br>కృత్తిక -1 | కృత్తిక 2 3 4<br>రోహిణి 1 2 3 4-శని<br>మృగశిర 1 2 | మృగశిర 3 4-భూమి<br>ఆరుద్ర 1 2-చంద్ర 3 4<br>పునర్వసు 1-కేతు 2-మిత్ర 3 |
| కుంభము:<br>ధనిష్ట 3 4<br>శతభిషం 1 2 3 4<br>పూర్వాభాద్ర 1 2 3 | **జన్మ లగ్న కుండలి** | | కర్కాటకము:<br>పునర్వసు -4<br>పుష్యమి 1 2 3 4<br>ఆశ్లేష 1 2 3 4 |
| మకరము:<br>ఉత్తరాషాఢ 2 3 4<br>శ్రవణం 1 2 3 4<br>ధనిష్ట 1 2 | | | సింహము:<br>మఖ 1 2 3 4<br>పుబ్బ 1 2 3 4<br>ఉత్తర - 1 |
| మూల 1 2- సూర్యుడు 3 4<br>పూర్వాషాఢ 1 2 గురు 3 రాహు 4- చిత్ర<br>ఉత్తరాషాఢ -1 | విశాఖ - 4<br>అనూరాధ 1 2-శుక్ర 3 4-బుధ<br>జేష్ట 1 2 3 4 | చిత్త 3 4<br>స్వాతి 1 2 3 4<br>విశాఖ 1 2 3-కుజ | ఉత్తర 2 3 4<br>హస్త 1 2 3 4<br>చిత్త 1 2 |
| ధనస్సు | వృశ్చికము | తుల | కన్య |

**56వ చిత్రపటము**

నక్షత్రములో పూర్వాషాఢ 4వ పాదమున ఉన్నట్లు తెలియుచున్నది. ఇప్పుడు వెనుక ఖాళీగాయుంచిన మూడు గ్రహముల నక్షత్రములనూ, వాటి పాదములను గుర్తించుకొందాము.

10) భూమి - మృగశిర నక్షత్రము - 4వ పాదము - మిథునము

11) మిత్ర - పునర్వసు నక్షత్రము - 2వ పాదము - మిథునము

12) చిత్ర - పూర్వాషాడ నక్షత్రము - 4వ పాదము - ధనస్సు

ఇంతవరకు జన్మలగ్నమునూ, జన్మకుండలిలో గ్రహములు ఏయే పాదములలో ఉన్నదీ, క్రొత్త గ్రహములు ఎక్కడున్నదీ, జాతకుని జనన సమయములో ఏ దశయున్నదీ తెలుసుకోగలిగాము. ఇప్పుడు పన్నెండు గ్రహములు ఏ లగ్నములోయున్నవో, ఏ లగ్నములను తమ చేతులతో తాకుచున్నారో క్రింద తెలుసుకొందాము. అలా వ్రాసుకొని చూచుకోవడము వలన గ్రహములు స్వయముగా ఉన్న స్థానములు ఏవో, దూరమునుండి ఏ గ్రహములను తాకుచున్నవో తెలుసుకొందాము. ఏ జాతకునికైనా జనన లగ్నకుండలి ముఖ్యము. పుట్టినరోజు పన్నెండు స్థానములలోనున్న గ్రహములు జీవితాంతము ఆ స్థానములనుబట్టి వ్యవహరించుచుండును. పన్నెండు గ్రహములలో ఎనిమిది గ్రహములు ముందుకు తిరుగుచుండగా, నాలుగు గ్రహములు వెనక్కు అపసవ్యముగా తిరుగుతూ తమ బాధ్యతలను నిర్వర్తించుచున్నవి. జనన సమయములో వేరువేరు జాగాలలోనున్న పన్నెండు గ్రహములు తర్వాత వాటి వేగమునుబట్టి అవి వేరువేరు స్థానములలో తిరుగుచున్ననూ జాతకుడు పుట్టిన సమయములో తమకు అప్పగింపబడిన విధి విధానమును మరువక దానిప్రకారమే నడుచుకొనుచూ, కాలగమనములో (గ్రహ గమనములో) ఏ స్థానములోనికి పోయినా

అక్కడున్న ఫలితమును అందివ్వాలని చూచుచుండును. మంచి గ్రహములు మంచిస్థానములలోనికి పోయినప్పుడు అక్కడున్న మంచి ఫలితములను అందివ్వాలని చూచుచుందురు. మంచి గ్రహములు చెడు స్థానములలోనికి పోయినప్పుడు అక్కడున్న చెడు ఫలితములను ఏమాత్రము జాతకునికి ఇవ్వరు. అలాగే చెడు గ్రహములు చెడు స్థానములలోనికి పోయినప్పుడు అక్కడున్న చెడు ఫలితములను ఇచ్చి కష్టపెట్టుటకు ప్రయత్నించుచుండును. ఒకవేళ చెడు గ్రహములు మంచి స్థానములలోనికి పోయినప్పుడు అక్కడున్న మంచిని ముట్టుకోరు ఎటుతిరిగి జాతకుని కష్టపెట్టుటే వారిపని, కనుక మంచి స్థానములో నున్నప్పుడు కూడా వారు మంచి చేయరు. జాతకుని జన్మ కర్మమునుబట్టి గ్రహములు మంచి గ్రహములుగా, చెడు గ్రహములుగా విభజింపబడి యున్నారు. కావున వారి కర్తవ్యము ప్రకారము వారి పనులను తూచ తప్పక చేయుచున్నారు. ఎంతో బాధ్యతాయుతముగా పనిని చేయుచున్న గ్రహములు, ఎటువంటి కర్మనైనా తమ ద్వారానే వచ్చునట్లు తమ ద్వారానే అనుభవించునట్లు చేయుచున్నారు.

కర్మ విషయములో మొత్తము బాధ్యతంతా పన్నెండు గ్రహముల మీదనే ఉండునట్లు ప్రకృతి నియమించినది. ప్రకృతిని ఆదేశించినవాడు దేవుడుకాగా, ఎక్కడా దేవుని పాత్రలేకుండా, దేవుడు ఏ పనినీ చేయకుండా ప్రపంచము మొత్తమును ప్రకృతి శాసించి నడుపుచున్నది. సృష్ఠి ఆదిలోనే ఆదేశింపబడిన ప్రకృతి, తాను అన్నిటికీ ఆదేశమిచ్చి నడిపించుచున్నది. ఇవన్నియూ ప్రతి నిత్యమూ ఒకరికొకరు చెప్పుకొను విషయములు కావు. సృష్ట్యాదిలో చెప్పబడినట్లే క్రమము తప్పకుండా అన్నీ ఆచరించుచున్నవి. కర్మ విధానమంతా పన్నెండు గ్రహముల ద్వారానే జరగాలి. కర్మను మనిషి కపాలములో చేర్చుటకుగానీ, ఆ కర్మ ప్రారబ్ధముగా బయటకు వచ్చినప్పుడు

దానిని అనుభవింపజేయుటకుగానీ, కర్మవిషయములో అన్ని పనులనూ పన్నెండు గ్రహములు చేయవలసిందేనని తెలియుచున్నది. కర్మవిధానము ప్రకారము కర్మను అనుభవింపచేయు గ్రహచారముగాయున్నవి ద్వాదశ గ్రహములే. జ్ఞానము వలన దహింపబడు కర్మను తొలగించునవిగాగానీ, జ్ఞానదూషణవలన పుట్టుకొచ్చు క్రొత్తకర్మను అనుభవించునట్లు చేయుటకు గానీ దశాచార రూపములో కూడా పన్నెండు గ్రహములే కలవు. ప్రపంచ విధి విధానము ప్రకారము జనన సమయమునుబట్టి ఆ జన్మలో కష్ట సుఖములను అందించు మొత్తము విధానమును గ్రహచారము అని అంటున్నారు. అలాగే దైవ విధానమునుబట్టి ప్రస్తుత జన్మలోనున్న కష్టములను (కర్మలను) లేకుండా చేయడముగానీ, లేని కర్మలను తగిలించ డముగానీ, చేయు మొత్తము కార్య విధానమును దశాచారము అని అంటున్నారు. ప్రపంచ జ్ఞానము ప్రకారము ప్రారబ్ధకర్మలలోగల చిన్న కర్మను తీసివేయుటగానీ, లేని దానిని తగిలించుట గానీ ఏమాత్రము చేయని ద్వాదశ గ్రహములు దైవవిధానములో అదే జన్మలో తీసివేయడము, తగిలించడము కూడా జరుగుచున్నది. ఇటువంటి కార్యముల కొరకు దశలు, దశాచారములని ప్రత్యేక విభాగమున్నదని చెప్పుకొన్నాము. దశాచారములో మంచి చెడు దశలు, జ్ఞాన అజ్ఞానములనుబట్టి కర్మను సవరించుటకు తయారు చేయబడినవి. గ్రహచారము ప్రకారము మంచి ఫలితములు వచ్చునప్పుడు, మంచి కర్మ అమలు జరుగుచున్నప్పుడు, మంచి కర్మను అమలు చేయునవి పన్నెండు గ్రహములలోని ఆరు గ్రహములు. ఆరు గ్రహములు ఒక గుంపుగా మరొక ఆరు గ్రహములు మరొక గుంపుగా ఏర్పడి తాము జీవితాంతము చెడుగా ఎవరు ప్రవర్తించాలి (పాపమును ఎవరు పంచాలి) యనీ, అట్లే మంచిగా పుణ్యమును ఎవరు అందివ్వాలని

మనిషి పుట్టినప్పుడే అతను పుట్టిన కాలమునుబట్టి నిర్ణయించుకొని జీవితాంతము అలాగే ప్రవర్తించుచుందురు. అదంతయూ గ్రహచారము అనుకొన్నాము.

ఒక మనిషికి పుణ్యకర్మ అమలు జరుగునప్పుడు, పుణ్యము ప్రకారము మంచి సుఖములు అందునప్పుడు అతను దేవుని విధానములో ప్రవేశించి జ్ఞానదూషణ చేశాడనుకొనుము. అప్పుడు దశాచారములోని చెడు గ్రహము అతడు చేసిన దూషణకు ప్రతిగా వచ్చిన పాపమును స్వీకరించి తన దశలో వానిని ఆ పాపముచేత హింసించును. జ్ఞానదూషణ చేసిన వ్యక్తికి అమలు జరుగు పాపమును ఏ యోగులూ క్షమించలేరు, ఏ జ్ఞానమూ దానిని దహించదు. దానిని తప్పక అనుభవించు క్షమించబడని పాపము అంటాము. గ్రహచారములో గల కర్మను యోగులైనవారు క్షమించవచ్చును. జ్ఞానము ప్రారబ్ధకర్మను కాల్చగలదు. ప్రతి మనిషికీ గ్రహచారము సర్వసాధారణము. అదంతయూ మనిషి చేసుకొన్న ప్రారబ్ధకర్మనుబట్టియుండును. దానిలో ఒకమారు పుట్టుక సమయములో నిర్ణయింపబడిన కర్మను ప్రపంచ విధానము లో ఏ ప్రక్రియ మార్చలేదు. ఎటువంటి వాడుగానీ, దానినుండి తప్పించు కొనుటకు వీలులేదని చెప్పుకొన్నాము. అయితే దశలు మాత్రము ప్రపంచ విధానములో ఏమీ ఉపయోగపడవు. అవి దైవవిధానములోని సృష్టించబడు పాపములకు, పాప నిర్మూలనమునకు తయారు చేయబడినవని తెలియ వలెను. ఒక విధముగా మానవునికిది ఒకవైపు శాపములాంటిది, మరొకవైపు వరములాంటిది. జ్ఞానదూషణ దైవదూషణ చేసినవానికి శాపములాంటిదని చెప్పవచ్చును. అలాగే దైవజ్ఞానము పొందినవానికి వరములాంటిదని చెప్పవచ్చును. ఈ రెండు విధానములున్న దశలను ఎలా కనుగొవాలి అను విషయమును తర్వాత చెప్పుకొందాము. ఇప్పుడు జన్మ లగ్న కుండలి లోని గ్రహములకు ఇరుగిల్లు పొరుగిల్లు ఏవిగలవో ప్రక్క పటము చూస్తాము.




ఇక్కడ పైన చూపించిన జన్మలగ్నకుండలిలో పన్నెండు గ్రహాలను మొత్తము ముప్ఫై స్థలములలో చూపడము జరిగినది. పదునెనిమిది (18) చోట్లనున్న గ్రహములకు చుట్టూ గుండ్రని గుర్తు పెట్టడము జరిగినది. మిగత పన్నెండు (12) గ్రహములకు గుండ్రని గుర్తులేదు. గుండ్రని గుర్తులేనివి జన్మ సమయములో ఆయా స్థలములోనున్నవని తెలియువలెను. తులలో కుజుడు, వృశ్చికములో శుక్ర బుధులు, ధనస్సులో సూర్య గురు రాహు చిత్రగ్రహములు, వృషభములో శని, మిథునములో భూమి చంద్ర కేతు మిత్రగ్రహములు జనన సమయములో ఉన్నట్లు గుర్తించాము. గుండ్రని గుర్తులోపలనున్న గ్రహములు అక్కడ లేకున్నా తమ చేతుల ద్వారా ఆ లగ్నములను తాకినట్లు లెక్కించుకోవలెను. గ్రహములు చేతులనుంచినా అక్కడున్నట్లే లెక్కించబడుచున్నవి.

ఈ జాతకుని జన్మలగ్న కుండలిలో కన్యాలగ్నము జన్మలగ్నమని తెలిసిపోయినది. ఆత్మల వరుస ప్రకారము 2 ః 1 అను సూత్రము ప్రకారము కన్యాలగ్న జాతకునికి శుభగ్రహము అశుభగ్రహములు తెలిసిపోవుచున్నవి. శుభ అనగా పుణ్యమును పాలించు మిత్రత్వముగల గ్రహములనీ, అశుభ అనగా పాపమును పాలించు శత్రుత్వగ్రహములని చెప్పవచ్చును. కన్యా లగ్నమునకు శుభ, అశుభగ్రహములు ఇలా గలవు చూడండి.

| శుభ గ్రహములు<br>పుణ్య పాలితములు | అశుభ గ్రహములు<br>పాప పాలితములు |
|---|---|
| 1) బుధ గ్రహము | 1) భూ గ్రహము |
| 2) శుక్ర గ్రహము | 2) కేతు గ్రహము |
| 3) శని గ్రహము | 3) గురు గ్రహము |
| 4) రాహు గ్రహము | 4) కుజ గ్రహము |
| 5) మిత్ర గ్రహము | 5) చంద్ర గ్రహము |
| 6) చిత్ర గ్రహము | 6) సూర్య గ్రహము. |

భూమి మీద మనిషి జనన సమయమునుబట్టి, కాలచక్రములో సూర్యుని కదలికనుబట్టి జన్మ లగ్నమైన తమ స్థానము తెలిసిపోవుచున్నది. కుండలిలోని పన్నెండు స్థానములలో జన్మలగ్నము ఏదైతే అది శరీర స్థానమైనపుడు అక్కడినుండి చివరిది పన్నెండవది వ్యయం స్థానమగు చున్నది. పన్నెండు లగ్నములలో మంచి చెడు గ్రహములుండగా, పన్నెండు రాశులలో అనగా కర్మచక్ర స్థానములలో పాపపుణ్యముల కర్మలుండును. పుణ్య కోణములను 1,5,9 స్థానములలో మనిషి పుణ్యముండగా, పాపకోణములనబడు 3,7,11 స్థానములలో పాపముండును. మూడు

స్థానములలో పుణ్యము, మూడు స్థానములలో పాపము ఉండగా, మిగిలిన ఆరు స్థానములలో పాపపుణ్య మిశ్రమము ఉండును. కర్మచక్రములోని పాప పుణ్యరాశుల మీద గ్రహములు కిరణములను ప్రసరింపజేయుచూ కాలచక్రములో తిరుగుచున్నవి. అలా తిరుగుచూ జనన సమయములో వారు ఏ లగ్నములలో ఉన్నారో క్రింది పటములో తెలుసుకొందాము.

| | | | |
|---|---|---|---|
| 7 | (గురు) (కుజ) 8 | (కుజ) శని (శుక్ర) (బుధ) 9 | భూమి చంద్ర కేతు మిత్ర (సూర్య) (గురు) (రాహు) (చిత్ర) 10 |
| (శని) 6 | | | (శని) 11 |
| (కుజ) 5 | | | (గురు) 12 |
| సూర్య గురు రాహు చిత్ర (భూమి) (చంద్ర) (కేతు) (మిత్ర) 4 | (శని) శుక్ర బుధ 3 | కుజ 2 | లగ్నము 1 |

గుండ్రని గుర్తుతో గుర్తించిన గ్రహములు ఆ స్థానములో లేకున్నా మిగత స్థానములలో ఉండి అక్కడినుండి తమ హస్తములను ఉంచి ఈ రాశులలోని కర్మలను గ్రహిస్తాయని తెలియవలెను. గుండ్రని గుర్తులేని గ్రహములు జనన సమయములో మనము గుర్తించిన లగ్నములలో ఉండి అక్కడే పనిని చేయుచున్నవని తెలియుచున్నది.

జాతకము అన్ని విధముల అర్థమగుటకు జాతకలగ్నమును గుర్తించుకొని చూచాము. జన్మలగ్న కుండలిలో గుర్తించుకోవలసినది ఏమీ లేదు. అందువలన గ్రహచారమునకు సంబంధించిన జనన లగ్నము పూర్తి తెలిసిపోయినది. గ్రహచారములో ఫలితములెట్లున్నాయి, భవిష్యత్తు ఎలా ఉంటుంది అను విషయమును దశాచారమును గుర్తించిన తర్వాత చూస్తాము. ఇప్పుడు ఈ జాతకుని దశాచారమును ఎలా వ్రాసుకోవాలో తెలుసుకొందాము. జన్మదిన నక్షత్ర పరిమాణమును తెలుసుకొనుటకు ముందుదిన నక్షత్రమును ఆధారము చేసుకొని చూడవలెను. జాతకుడు పుట్టినది పౌర్ణమి బుధవారము రాత్రి 1-30 గంటలకు అయినందున, ఆ దినము మృగశిర రాత్రి 6-53 నిమిషములకే అయిపోయిన దానివలన, తర్వాత వెంటనే ఆరుద్ర నక్షత్రము ప్రారంభమై జాతకుడు పుట్టిన సమయములో ఆరుద్ర ఉండుట వలన ముందుదిన నక్షత్రము మృగశిర అగుచున్నది. ఆరుద్ర నక్షత్రము యొక్క పూర్తి కాలమును తెలియుటకు మృగశిరను ఎలా ఉపయోగించుకొంటున్నామో క్రింద చూడండి. ప్రతి నక్షత్రము యొక్క పూర్తి పరిమాణము 60.00 గడియలు. అయితే దానిలో కొద్దిగ ఎక్కువగానీ, కొద్దిగా తక్కువ గానీ నక్షత్రములు గడచుచుండును. పంచాంగములో తొమ్మిది గ్రహములలో ఎనిమిది గ్రహముల గమనములను, నక్షత్ర ప్రవేశములను వ్రాసియుందురు అయితే ఒక్క చంద్రున్ని గురించి వ్రాసియుండరు. పంచాంగము ప్రకారము ఏ గ్రహము ఎక్కడున్నది, ఏ లగ్నములో, ఏ నక్షత్రములోయున్నది తెలియవచ్చును. చంద్రుడు ఏ నక్షత్రములో ఉన్నదీ, ఏ లగ్నములో ఉన్నది తెలియాలంటే మనమే స్వయముగా గణితమును ఉపయోగించి తెలియవచ్చును. గణితమును ఎలా చేయాలో ప్రక్కపేజీలో వ్రాసి చూపిస్తాము దాని ప్రకారము ఎవరైనా చేసుకోవచ్చును.

2-30 గడియలకు 1 గంటయగును.

పూర్తి నక్షత్ర ప్రమాణ కాలము : 60-00 గడియలు - 24-00 గంటలు

| | | | |
|---|---|---|---|
| మృగశిర నక్షత్రము ముందు రోజుది | : | 7-12 గడి | 6-53 గ.ని |
| నిన్నటి దినము మిగిలిన ఆరుద్ర | : | 42-48 " | 17-07 గ.ని |
| జనన కాల దినమున ఆరుద్ర | : | 13-35 | 5-26 గ.ని |
| పూర్తి ఆరుద్ర నక్షత్ర పరిమాణము | : | 56-23 గడి | 22-33 గ.ని |
| ఆరుద్ర ప్రారంభము | : | - | 6-53 నిమి॥ |
| జాతకుడు పుట్టిన కాలము రాత్రి | : | - | 1-30 నిమి॥ |
| పుట్టుక వరకు గడిచిన ఆరుద్ర కాలము | : | 16-57 గడి | 6-47 నిమి॥ |
| గడచిన ఆరుద్ర కాలము | : | 16-57 గడి | 6-47 నిమి॥ |
| పూర్తి ఆరుద్ర నక్షత్ర కాల పరిమాణము | : | 56-23 గడి | 22-33 నిమి॥ |
| ఆరుద్ర నక్షత్రము ఒక పాదము | : | 14-06 గడి | 5-38 నిమి॥ |

| | | |
|---|---|---|
| గడచిన ఆరుద్ర కాలము | - | 16-57 |
| ఆరుద్ర పాదము 1 | - | 14-06 |
| ఆరుద్ర రెండవ పాదములో గడచినది | - | 2-51 |

ఆరుద్ర రెండవ పాదమునుబట్టి చంద్రుడు మిథున లగ్నములో ఉన్నట్లు తెలియుచున్నది.

ఆరుద్ర నక్షత్రమును విగడియలలో చూచిన -3383 విగడియలు
గడచిన ఆరుద్ర కాలమును విగడియలలో చూచిన -1017 విగడియలు

ఇంతవరకు జాతకుని యొక్క గ్రహచారములో చంద్రుడు ఎక్కడున్నాడో, ఏ నక్షత్ర పాదములోయున్నాడో గణితము ద్వారా తెలియ గలిగాము. చివరకు చంద్రుడు మిథునలగ్నములో ఆరుద్ర రెండవ

పాదములో ఉన్నట్లు తెలిసినది. జాతకుడు పుట్టిన సమయములో సూర్యుడు ఎక్కడున్నాడని తెలియుటకు గత పేజీలలో చెప్పుకొన్నాము. సూర్యోదయము మొదలు జాతకుడు పుట్టిన సమయము వరకు లెక్కించి సూర్యున్ని తెలియ గలిగి అతడున్న లగ్న కిరణములనుబట్టి జాతకుని జన్మ లగ్నమును తెలియ గల్గుచున్నాము. గ్రహచార విధానములో జన్మ లగ్నము ఎంత ప్రాధాన్యత కల్గియున్నదో, అలాగే గ్రహచార విధానములో చంద్రుని ద్వారా తెలియ బడు ప్రారంభ దశ ఏదో తెలియడము కూడా ముఖ్యమైనదే. ప్రారంభ దశను తెలియగలిగితే దానికి అనుబంధముగాయున్న దశలను వరుసగా తెలియగలము. ప్రస్తుత జన్మలో ఏ దశ, ఎక్కడి నుండి ప్రారంభమగుచున్నదో తెలియగల్గితే గతజన్మలో చనిపోయినది ఫలానా దశలో ఫలాన కాలములో అని చెప్పవచ్చును. ఇక్కడ కొందరికి అనుమానము రావచ్చును. ఈ జన్మలోనిదే సరిగా తెలియలేకున్నాము. అటువంటప్పుడు గతజన్మలోని మరణ విషయమును తెలియవచ్చుననుమాట ఎంతవరకు సత్యమని అడుగ వచ్చును. దానికి మేము చెప్పునదేమనగా! ఒక ప్రయాణికుడు కాలినడకన దూరప్రయాణము చేయుచూ మధ్యలో చిన్న ఊర్లను అక్కడక్కడ పెద్దఊర్లను దాటుచూ పోవుచున్నాడనుకొనుము. అతడు పగలంతా ప్రయాణము చేసి రాత్రిపూట ఒకచోట ఆగి ఉదయము తిరిగి అక్కడినుండి బయలుదేరి పోయెడివాడు. వాని విషయములో వాడు రాత్రి ఎక్కడైతే ఆగాడో, తిరిగి ఉదయము అక్కడినుండే బయలుదేరునని చెప్పడములో సత్యమున్నట్లే, ఒక వ్యక్తి పొడవాటి జీవిత ప్రయాణములో రాత్రివలెనున్న మరణము వచ్చినప్పుడు ఏ సమయములో చనిపోయాడో వాడు తిరిగి అదే సమయము లోనే జన్మించి తన జీవిత ప్రయాణమును సాగించుచున్నాడని చెప్పడము సత్యమేయగును. ఒకడు గతజన్మలో ఒక దశలో ఏ సంవత్సరము,

ఏ నెల, ఏ దినము, ఏ గంటలో చనిపోయాడో అదే దశలో అదే సంవత్సరము, అదే నెల, అదే దినము, అదే గంటలో అదే సమయమున జన్మించుచున్నాడని తెలియుచున్నది. గతజన్మ సత్యమని తెలిసినవానికి గతజన్మ దశాభుక్తి కూడా సత్యమని తెలియును. గతజన్మలో దశాభుక్తిని తెలియుటకు ప్రస్తుత జన్మలో ఏ దశలో ప్రారంభమగుచున్నదో తెలియాలి. అట్లు తెలియుటకు ప్రయత్నిద్దాము.

జగన్ అను వ్యక్తి జనన సమయములో చంద్రున్ని గురించి తెలుసు కొనుటకు వేసిన గణితములో చంద్రుడున్న ఆరుద్ర నక్షత్రము యొక్క పూర్తి పరిమాణమును గడియలలో 56-23గా ఉన్నట్లు తెలుసుకొన్నాము. అట్లే జనన సమయమునకు గడచిన ఆరుద్ర యొక్క పరిమాణము గడియలలో 16-57గా ఉన్నట్లు తెలుసుకొన్నాము. ఆరుద్ర నక్షత్రమునుబట్టి దశ విభజన నక్షత్రములలో ఆరుద్ర నక్షత్రము పూర్తి నాలుగు పాదములు కుజ దశను గుర్తు చేయుచున్నవి. అందువలన ఈ జాతకుడు కుజదశలో పుట్టాడు అని తెలిసిపోయినది. కుజదశలో జాతకుడు పుట్టినప్పుడు ఆ దశ ఎంతవరకు మిగిలియున్నది. ఎంతవరకు గతజన్మలో అయిపోయినది తెలియవలెను. అట్లు తెలియుటకు జనన సమయములో గడచిన ఆరుద్ర కాలమును కుజదశతో గుణించి వచ్చిన సంఖ్యను పూర్తి ఆరుద్ర పరిమాణము తో భాగించగా ఎన్ని సంవత్సరములు గతజన్మలో గడచినది తెలిసిపోవును. అట్లు భాగించినప్పుడు మిగిలిన శేషమును పన్నెండు నెలలతో హెచ్చించి నక్షత్ర పరిమాణముతో భాగించగా ఎన్ని నెలలు గత జన్మలో గడచిపోయినది తెలియును. అప్పుడు కూడా మిగిలిన శేషమును 30 దినముల చేత హెచ్చించి ఆరుద్ర నక్షత్ర పరిమాణముతో భాగించగా గతజన్మలో ఎన్ని దినములు గడచినది తెలియవచ్చును. అలాగే అప్పుడు కూడా మిగిలిన

శేషమును 24 గంటలతో హెచ్చించి వచ్చిన సంఖ్యను నక్షత్ర పరిమాణముతో భాగించగా గతజన్మలో ఎన్ని గంటలు ఈ దశ అయిపోయినది తెలియ గలదు. అదే విధముగా నిమిషముల వరకు, చివరకు సెకండ్ల వరకు గత జన్మ భుక్తిని తెలియవచ్చును. కుజదశ మొత్తము ఏడు (7) సంవత్సరము లుండగా అందులో ఎన్ని సంవత్సరములు, ఎన్ని నెలలు, ఎన్ని దినములు, ఎన్ని నిమిషములు వెనుక జన్మలో కుజదశ అయిపోయినది తెలియగల్గి మిగిలిన కాలమును ప్రస్తుత జన్మలో అనుభవించవలసియున్నదని చెప్ప వచ్చును. ఈ విధముగా జాతకములో ముఖ్యమైన దశా కాలమును తెలియవచ్చును. ఇప్పుడు ఆ గణితమును గురించి కొంత తెలుసు కొందాము.

ఆరుద్ర నక్షత్ర పూర్తి కాలపరిమాణము **= 3383 విగడియలు**

జాతకునికి గడచిపోయిన ఆరుద్రనక్షత్ర కాలము **= 1017 విగడియలు**

గడచిన ఆరుద్ర నక్షత్రము యొక్క విగడియలను,
ఆరుద్ర నక్షత్రమునకు వచ్చు కుజదశ యొక్క
7 సం॥లతో హెచ్చించిగా వచ్చిన విగడియలు **= 7119**

వచ్చిన మొత్తమును ఆరుద్ర నక్షత్ర పరిమాణ విగడియలతో
భాగించగా వచ్చిన భాగముల సంఖ్యను కుజదశలో గడచిన
కాలముగా తెలియవలెను. **= 2 సం॥**

మిగిలిన శేషమును 12 నెలలతో గుణించి ఆరుద్ర నక్షత్ర
పరిమాణ విగడియలతో భాగించగా వచ్చినది నెలలు **= 1 నెల**
తర్వాత మిగిలిన శేషమును 30 దినములతో గుణించి
ఆరుద్ర నక్షత్ర పరిమాణముతో భాగించగా

1017×7
7119
3383)7119(2సం॥
6766
353×12
3383)4236(1నెల
3383
853×30

వచ్చిన దినములు **= 7 దినములు**

వచ్చిన శేషమును 24 గంటలతో గుణించి ఆరుద్ర నక్షత్ర విగడియలలో భాగించగా వచ్చునది గంటలు **= 13 గంటలు**

దీనినిబట్టి గతజన్మలో గడిచిన కుజదశ 2 సం॥ 1 నెల, 7 దినముల, 13 గంటలని తెలియుచున్నది.

3383)25590(7దిన
23681
1909×24
3383)45816(13గం
3383
11986
10149
1837

| | | సం.నెల.దిన.గంట |
|---|---|---|
| ఆరుద్ర నక్షత్రము వలన జన్మలో వచ్చిన దశ కుజదశ | - | 7-00-00-00 |
| గత జన్మ భుక్తిలో అయిపోయిన కుజదశ | - | 2-01-07-13 |
| గత జన్మలో ఖర్చుకాగా మిగిలిన కుజదశ కాలము | - | 4-10-22-11 |
| తర్వాత వచ్చు రాహుదశ కాలము | - | 10-00-00-00 |
| జాతకుని బాల్యములో జరుగు కాలము | - | 14-10-22-11 |
| తర్వాత వచ్చు గురుదశ కాలము | - | 13-00-00-00 |
| జాతకుని వయస్సు | - | 27-10-22-11 |
| తర్వాత వచ్చు భూ దశా కాలము | - | 13-00-00-00 |
| అప్పటికి మనిషి వయస్సు ఇంతవరకు వచ్చును | - | 40-10-22-11 |
| తర్వాత వచ్చు శనిదశాకాలము | - | 13-00-00-00 |
| ఈ వయస్సు వరకు శని దశవుండును | - | 53-10-22-11 |
| శనిదశ అయిపోయినప్పుడు జాతకునికున్న వయస్సు | - | 53-10-22-11 |
| తర్వాత వచ్చు బుధ దశాకాలము | - | 10-00-00-00 |
| అప్పటికి ఉన్న వయస్సు | - | 63-10-22-11 |
| తర్వాత వచ్చు కేతు దశాకాలము | - | 7-00-00-00 |
| కేతుదశ అయిపోయిన తర్వాత వయస్సు | - | 70-10-22-11 |
| తర్వాత వచ్చు శుక్ర దశాకాలము | - | 13-00-00-00 |

| | | |
|---|---|---|
| శుక్రదశతో అయిన వయస్సు | - | 83-10-22-11 |
| తర్వాతవచ్చు మిత్ర దశాకాలము | - | 7-00-00-00 |
| మిత్రదశతో వచ్చిన వయస్సు | - | 90-10-22-11 |
| తర్వా జరుగు చిత్ర దశాకాలము | - | 7-00-00-00 |
| వృద్ధాప్యములో వయస్సు | - | 97-10-22-11 |
| రవి దశాకాలము | - | 10-00-00-00 |
| | | 107-10-22-11 |
| చంద్ర దశాకాలము | - | 10-00-00-00 |
| | | 117-10-22-11 |
| గత జన్మలో గడచిన కుజదశ కాలము (భుక్తి) | - | 2-01-07-13 |
| మొత్తము పన్నెండు దశల కాలము | - | 120-00-00-00 |

ఇంతవరకు పన్నెండు గ్రహముల దశలను చెప్పుకొన్నాము. పన్నెండు గ్రహముల దశలన్నిటిని కలిపితే మొత్తము 120 సంవత్సరములు అగుచున్నవి. ఒక మనిషి యొక్క సంపూర్ణ ఆయుష్షు 120 సంవత్సరములని పూర్వము పెద్దలు దీనినిబట్టే చెప్పెడివారు. ఇక్కడ పూర్తి వివరము కొరకు పన్నెండు దశలను వ్రాసి చూపించాము. కానీ ప్రతి మనిషి 120 సంవత్సరములు బ్రతుకడని అందరికీ తెలుసు. 120 సంవత్సరములు బ్రతుకకూడదను నియమము ఏమీ లేదు. కావున 120 సంవత్సరములు బ్రతికేవారు కూడా యున్నారు. స్థూల శరీరములతో ఎవరూ బ్రతికిలేకున్నా సూక్ష్మముగా, సూక్ష్మ శరీరముతో ఎందరో 120 సంవత్సరములకంటే ఎక్కువ బ్రతుకుచున్నవారు కూడా కలరు. ఇక్కడ పన్నెండు దశలను వ్రాసినంత మాత్రమున ఈ జాతకుడు కూడా 100 సంవత్సరముల పైన బ్రతుకునని కూడా చెప్పలేము.

దశల విషయమును గురించి చెప్పితే ప్రతి దశకు అంతర్దశలని కూడా కలవు. కుజ దశలో అంతర్దశలు తెలియుటకు ఒక సూత్రము కలదు. దానిప్రకారము మొదట కుజదశా సంఖ్యను తెలియవలసిన దశా సంవత్సర సంఖ్యచే గుణించగా వచ్చిన మొత్తమును 3 చే గుణించాలి. తర్వాత వచ్చిన మొత్తమును 30 సంఖ్యచే భాగించాలి. అప్పుడు భాగించగా వచ్చిన సంఖ్యను నెలలుగా, మిగిలిన శేషమును దినములుగా వ్రాసుకోవాలి.

కుజదశ సంఖ్యను కుజదశ సంఖ్యతోనే గుణించాలి - 7×7=49
వచ్చిన మొత్తమును 3 చే గుణించాలి - 49×3=147
వచ్చిన మొత్తమును 30 చే భాగించాలి - 147÷30፧4 నెలల
120
27 దినములు

1) దీని ప్రకారము కుజదశలో కుజ అంతర్దశ 4 నెలలు, 27 రోజులు

కుజదశ సంఖ్యను రాహుదశతో గుణించాలి - 7× 10=70
వచ్చిన మొత్తమును 3 చే గుణించాలి - 70×3፧210
వచ్చిన మొత్తమును 30 చే భాగించాలి - 210÷30(7నెలలు
210

2) దీని ప్రకారము కుజదశలో రాహు అంతర్దశ - 7 నెలలు
కుజదశ సంఖ్యను గురుదశ సంఖ్యచే గుణించాలి - 7×13=91
వచ్చిన మొత్తములను 3 చే గుణించాలి - 91×3=273
వచ్చిన మొత్తమును 30 చే భాగించాలి - 273÷30(9 నెలలు
270
3 దినములు.

3) దీని ప్రకారము కుజదశలో గురు అంతర్దశ - 9 నెలల, 3 దినాలు
కుజదశ సంఖ్యను భూమిదశ సంఖ్యచే గుణించాలి - 7×13=91
వచ్చిన మొత్తమును 3 చే గుణించాలి - 91×3=273
వచ్చిన మొత్తమును 30 చే భాగించాలి - 273÷30(9 నెలలు
270
3 దినములు.

4) దీని ప్రకారము కుజదశలో భూమి అంతర్దశ - 9 నెలల, 3 దినాలు
కుజదశ సంఖ్యను శనిదశ సంఖ్యచే గుణించాలి - 7×13=91
వచ్చిన మొత్తమును 3 చే గుణించాలి - 91×3=273
వచ్చిన మొత్తమును 30 చే భాగించాలి - 273÷30(9 నెలలు
270
3 దినములు.

5) దీని ప్రకారము కుజదశలో శని అంతర్దశ - 9 నెలల, 3 దినాలు
కుజదశ సంఖ్యను బుధదశ సంఖ్యచే గుణించాలి - 7×10=70
వచ్చిన మొత్తమును 3 చే గుణించాలి - 70×3=210
వచ్చిన మొత్తమును 30 చే భాగించాలి - 210÷30(7 నెలలు
210

6) దీని ప్రకారము కుజదశలో బుధ అంతర్దశ - 7 నెలలు
కుజదశ సంఖ్యను కేతుదశ సంఖ్యచే గుణించాలి - 7×7=49
వచ్చిన మొత్తమును 3 చే గుణించాలి - 49×3=147
వచ్చిన మొత్తమును 30 చే భాగించాలి - 147÷30(4 నెలలు
120
27 దినములు

7) దీని ప్రకారము కుజదశలో కేతు అంతర్దశ – 4 నెలల, 27దినాలు
కుజదశ సంఖ్యను శుక్రదశ సంఖ్యచే గుణించాలి – 7×13=91
వచ్చిన మొత్తమును 3 చే గుణించాలి – 91×3=273
వచ్చిన మొత్తమును 30 చే భాగించాలి – 273÷30(9 నెలలు
270
3 దినములు

8) దీని ప్రకారము కుజదశలో శుక్ర అంతర్దశ – 9 నెలల, 3దినాలు
కుజదశ సంఖ్యను మిత్రదశ సంఖ్యచే గుణించాలి– 7×7=49
వచ్చిన మొత్తమును 3 చే గుణించాలి – 49×3=147
వచ్చిన మొత్తమును 30 చే భాగించాలి – 147÷30(4 నెలలు
120
27 దినములు

9) దీని ప్రకారము కుజదశలో మిత్ర అంతర్దశ – 4 నెలల, 27దినాలు
కుజదశ సంఖ్యను చిత్రదశ సంఖ్యచే గుణించాలి – 7×7=49
వచ్చిన మొత్తమును 3 చే గుణించాలి – 49×3=147
వచ్చిన మొత్తమును 30 చే భాగించాలి – 147÷30(4 నెలలు
120
27 దినములు

10) దీని ప్రకారము కుజదశలో చిత్ర అంతర్దశ – 4 నెలల, 27దినాలు
కుజదశ సంఖ్యను సూర్యదశ సంఖ్యచే గుణించాలి–7×10=70
వచ్చిన మొత్తమును 3 చే గుణించాలి – 70×3=210
వచ్చిన మొత్తమును 30 చే భాగించాలి – 210÷30(7 నెలలు
210
00

11) దీని ప్రకారము కుజదశలో సూర్య అంతర్దశ – 7 నెలలు

కుజదశ సంఖ్యను చంద్రదశ సంఖ్యచే గుణించాలి – 7×10=70

వచ్చిన మొత్తమును 3 చే గుణించాలి – 70×3=210

వచ్చిన మొత్తమును 30 చే భాగించాలి – 210÷30(7 నెలలు

210

0

12) దీనిప్రకారము కుజదశలో చంద్ర అంతర్దశ – 7 నెలలు

ఇప్పటికి కుజదశలో పన్నెండు అంతర్దశలు తెలిసిపోయినవి. వాటిని వరుసగా వ్రాసి చూస్తాము.

| | | | | స–నె–ది |
|---|---|---|---|---|
| 01) | కుజదశలో | కుజ అంతర్దశ | = | 0–4–27 |
| 02) | కుజదశలో | రాహు అంతర్దశ | = | 0–7–00 |
| 03) | కుజదశలో | గురు అంతర్దశ | = | 0–9–03 |
| 04) | కుజదశలో | భూమి అంతర్దశ | = | 0–9–03 |
| 05) | కుజదశలో | శని అంతర్దశ | = | 0–9–03 |
| 06) | కుజదశలో | బుధ అంతర్దశ | = | 0–7–00 |
| 07) | కుజదశలో | కేతు అంతర్దశ | = | 0–4–27 |
| 08) | కుజదశలో | శుక్ర అంతర్దశ | = | 0–9–03 |
| 09) | కుజదశలో | మిత్ర అంతర్దశ | = | 0–4–27 |
| 10) | కుజదశలో | చిత్ర అంతర్దశ | = | 0–4–27 |
| 11) | కుజదశలో | సూర్య అంతర్దశ | = | 0–7–00 |
| 12) | కుజదశలో | చంద్ర అంతర్దశ | = | 0–7–00 |
| | అంతర్దశల మొత్తము కాలము | | = | 7–00–00 |

కుజదశ గతజన్మలో అయిపోయినది = 2సం॥, 1నెల, 7ది॥, 13 గం॥
జాతకునికి మిగిలిన కుజదశాకాలము= 4సం॥,10నెల,22 ది॥,11 గం॥

జాతకుడు పుట్టినప్పుడు ఏ అంతర్దశ జరుగుచున్నదో తెలియాలంటే గడచిన కుజదశలో ఒక్కొక్క అంతర్దశ తీసివేస్తూ రాగా చివరిగా మిగిలినది అప్పటి అంతర్దశయని తెలియవలెను.

| | | సం-నెల-దిన |
|---|---|---|
| గతజన్మలో కుజదశ అయిపోయినది | : | 2-1-7 |
| కుజదశలో కుజ అంతర్దశ కాలము | : | 0-4-27 |
| | | 1-8-10 |
| కుజదశలో రాహు అంతర్దశ కాలము | : | 0-7-00 |
| | | 1-1-10 |
| కుజదశలో గురు అంతర్దశ కాలము | : | 0-9-03 |
| మిగిలిన భూమి అంతర్దశ కాలము | : | 0-4-7 |

తర్వాత వచ్చునది భూమి అంతర్దశ : 9 నెలల, 3 దినములు ఉండుట వలన మిగిలినది 4 నెలల, 7 రోజులు కావున అప్పటికి భూమి అంతర్దశ జరుగుచున్నదని తెలియుచున్నది.

| | | |
|---|---|---|
| భూమి అంతర్దశ | : | 0-9-03 |
| మిగిలిన భూమి అంతర్దశ | : | 0-4-7 |
| జరుగవలసిన భూమి అంతర్దశ | : | 0-4-26 |
| కుజదశలో జరుగవలసిన శని అంతర్దశ | - | 0-9-03 |
| | | 1-1-29 |
| కుజదశలో తర్వాత జరుగు బుధ అంతర్దశ | - | 0-7-00 |

| | | |
|---|---|---|
| | | 1-8-29 |
| కుజదశలో తర్వాత జరుగు కేతు అంతర్దశ | - | 0-4-27 |
| | | 2-1-26 |
| కుజదశలో తర్వాత జరుగు శుక్ర అంతర్దశ | - | 0-9-03 |
| | | 2-10-29 |
| కుజదశలో తర్వాత జరుగు మిత్ర అంతర్దశ | - | 0-4-27 |
| | | 3-3-26 |
| కుజదశలో తర్వాత జరుగు చిత్ర అంతర్దశ | - | 0-4-27 |
| | | 3-8-23 |
| కుజదశలో తర్వాత జరుగు సూర్య అంతర్దశ | - | 0-7-00 |
| | | 4-3-23 |
| కుజదశలో తర్వాత జరుగు చంద్ర అంతర్దశ | - | 0-7-00 |
| భుక్తి తర్వాత జాతకునికి మిగిలిన కుజదశ | - | 4-10-23 |

ఈ విధముగ జాతకునికున్న మహా దశలలో అంతర్దశలను గుర్తించు కోవచ్చును. ఏ దశలోనైనా అంతర్దశలు తెలియు సూత్రమును ముందే చెప్పాము. ఉన్నదశను మరొక దశాసంవత్సరములతో గుణించి, వచ్చిన మొత్తమును 3 చే గుణించి, తర్వాత వచ్చిన మొత్తమును 30 చే భాగించగా అంతర్ధశలు తెలియును. ప్రతి జాతకమునకు దశలను మరియు అంతర్దశలను వ్రాసి ఇవ్వడము జరుగుచున్నది. నేడు చాలామంది జ్యోతిష్యులైనవారు గ్రహచార ఫలమున్నట్లే దశల ఫలితము కూడా ఉండునని తలచి వాటిని గురించి చెప్పుచుందురు. అయితే గ్రహచారములో ఉన్నట్లు దశాచారములో ఉండదని అందరికీ తెలియజేయుచున్నాము. గ్రహచారములో గ్రహముల ఆధీనములోని కర్మలు ఆచరణకు వచ్చుచున్నవి.

అందువలన గ్రహముల వలన వచ్చు ఆచరణలను గ్రహచారము అని అంటున్నాము. గ్రహచారము అను పదమును విడదీసి చూచితే గ్రహము+ ఆచరణ=గ్రహాచరణ అనవచ్చును. అట్లే దశ+ఆచారము=దశాచారము అని అనవచ్చును. గ్రహచారములో గ్రహముల ఆచరణ తప్ప ఏమీలేదని తెలియవలెను.

దశాచారము అను పేరు విభజించి చూస్తే దశ+ఆచారము అని తెలియుచున్నది. దశ అంటే పదియని అందరికీ తెలుసు. ఆచారము అనగా చేయునది అని అర్థము. గ్రహచారములో ఉన్నట్లు దశాచారములో కూడా ఆచారము కలదు. అయితే అక్కడ గ్రహము అనగా గ్రహించుకొనునదనీ, కర్మను గ్రహించుకొనుచున్నదనీ చెప్పుకొన్నాము. గ్రహములు చేసే పనినిబట్టి గ్రహచారము అనడములో తప్పులేదు. వారు గ్రహించుకొన్న కర్మను ఆచరింపజేయుచున్న పన్నెండును, పన్నెండు గ్రహములుగా చెప్పుకోవడము సరియైన మాటగానేయున్నది. అయితే ఇక్కడ దశాచారము వద్దనే పూర్తి వివరము కనిపించడము లేదు. దశాచారము అంటే పది పనులనీ లేక పది రకాల పనులనీ అర్థము కదా! అందులో గొప్ప తనమేమున్నదని కొందరు అడుగవచ్చును. దానికి మా సమాధానము ఏమనగా! భగవద్గీతలో శ్రీకృష్ణుడు విశ్వరూపమును చూపినప్పుడు ఆ విశ్వరూపమును చూచిన అర్జునుడు ఆశ్చర్యపడి భగవంతుడైన శ్రీకృష్ణున్ని దేవునిగా గుర్తించి అప్పుడు అర్జునుడు తన మాటలలో ఒకమాట చెప్పాడు. ఆ మాట దేవుడిట్లున్నాడని చెప్పినట్లున్నది. అర్జునుడు ఆ దినము మనకొరకు చెప్పకున్నా ఆయన లోపల భావమును వ్యక్తపరచినప్పుడు మనకు అందులో దేవుని జ్ఞానము అర్థమగుచున్నది. భగవద్గీతలో విశ్వరూప సందర్శన యోగమందు 40వ శ్లోకమున ఇలా కలదు.

***"మ్రొక్కువాడ ముందు, మ్రొక్కువాడ వెన్క,***

***మ్రొక్కువాడ సర్వ దిక్కులందు"*** అని చెప్పడము జరిగినది. ఈ వాక్యములు అందరికీ అర్థమగునవే. ఇందులో రహస్యమేమీ లేదు. అయినా మనము సర్వసాధారణ అర్థముగల మాటగా చెప్పుకొన్నా ప్రత్యేకమైన విశేషత కలదు. ఆ విశేషత ఏమనగా! రెండవ వాక్యములో "మ్రొక్కువాడ సర్వదిక్కులందు" అని అన్నప్పుడు మొత్తము ఎనిమిది దిక్కులయందు మ్రొక్కుచున్నానని అర్థము కదా! ఎనిమిది దిక్కులలోనే ముందు వెనుక రెండు దిక్కులుకలవని మరువకూడదు. అయితే మొదటి వాక్యములో "మ్రొక్కువాడ ముందు, మ్రొక్కువాడ వెన్క" సర్వదిక్కులైన ఎనిమిది దిక్కులు కాక ముందు వెనుక అనునవి ప్రత్యేకముగా ఉన్నాయా? అని అనుమానము వచ్చును. ఈ మాటలు సర్వసాధారణములే అని వదలి వేస్తే విశేషత ఏమీ ఉండదు. ఈ మాటను గురించి ప్రత్యేకముగా యోచించితే యోచింపజేయు ఆత్మ ఒక మాటను చెప్పుచున్నది. తలదించి చూస్తే కనిపించునది క్రింద, తల ఎత్తి చూస్తే కనిపించునది పైన, క్రిందిది ఎల్లవేళల కనిపించుచున్నది కావున దానిని ముందుది అన్నారు. అదే పనిగా తల ఎత్తి చూస్తే గానీ కనిపించని పై భాగమును వెన్క అన్నారు. దేవుడు సర్వదిక్కులైన అష్టదిక్కులయందే కాదు పైన క్రింద కూడా ఉన్నాడు కాబట్టి, సర్వదిక్కులకేకాక ముందు (క్రింద) వెనుక (పైన) మ్రొక్కుచున్నానని అర్జునుడు చెప్పడము జరిగినది. ఆ దినము అర్జునుడు జ్ఞానము కలిగి ఆ మాట చెప్పలేదు. ప్రత్యక్షముగా కనిపించు దానినిబట్టి చెప్పాడు. ప్రత్యక్షముగా కనిపించు దేవుడు అష్టదిక్కులందేకాక, పైన క్రింద కూడా కనిపించాడు. కావున అర్జునుడు అలా చెప్పియుంటాడని అనుకొందాము. ఇప్పుడు చుట్టూయున్నవి ఎనిమిది దిక్కులైతే పైన ఒకటి, క్రింద ఒకటి అని రెండిటినీ

కలుపుకొంటే మొత్తము పది దిశలు అగుచున్నవి. దేవుడు మనకు కనిపించకపోయినా, తెలియకపోయినా పది దిశలయందు సర్వత్రా వ్యాపించి యున్నాడు. అందువలన దేవున్ని గుప్తముగా దశ అన్నారు. దేవుడు చేయు పనినిగానీ, దేవునివలన జరుగు పనినిగానీ అర్థముతో ఉండునట్లు దశ+ఆచారము = దశాచారము అని అన్నారు. దశ అనగా పదివైపులగల దేవుడని ఆచారము అనగా పని అని తెలియుచున్నది.

దశాచారము భగవద్గీతలో జ్ఞానయోగమున 37వ శ్లోకమందు చెప్పిన సారాంశము ప్రకారము కర్మను తీసివేయనూ గలదు. అలాగే దైవాసుర సంపద్విభాగ యోగమున గల 19వ శ్లోకమున చెప్పిన సారాంశము ప్రకారము కర్మను తగిలించనూగలదు. అందువలన దశాచారములో కర్మ తీసివేయబడుతుంది మరియు కర్మ కలుపబడుతుందని చెప్పాము. ఈ విధానము దశాచారములో మాత్రము కలదు. గ్రహచారములో ఏ విధానము చేతగానీ పాతకర్మ తీసివేయబడదు. అట్లే క్రొత్త కర్మ కలుపబడదు. దశాచారములో మాత్రము కర్మను లేకుండా చేసుకొను అవకాశమును దేవుడు కల్పించాడు. ఇక్కడ ఉదాహరణగా ఒక విషయమును చెప్పెదను జాగ్రత్తగా చూడండి. ఇప్పుడు మీకు జగన్ అను ఒక వ్యక్తి జాఫతకమును గురించి వివరిస్తూ వస్తున్నాము. అతని జాతకము కొన్ని విషయములు తప్ప అన్ని విషయములలోనూ గొప్పగాయున్నదని చెప్పుచున్నాము. అయితే ఆయన ఆయుష్షు విషయములో ఒక లోపమున్నదని చెప్పవచ్చును. అదేమనగా! శత్రుగ్రహము లేక అశుభ గ్రహము లేక పాపగ్రహము అని చెప్పబడు కుజ గ్రహము ఈ జాతకములో సరిగ్గా రెండవ స్థానమున కలదు. రెండవ స్థానములో ఉండడమేకాక తనకు ఎదురుగానున్న ఎనిమిదవ స్థానమును తనకున్న నాలుగు చేతులలో ఒక దానిచేత

తాకుచున్నది. తనచేత అక్కడున్న దానిని గ్రహించి మనిషికి అందివ్వగల పనిని కూడా చేయుచున్నది. ఎనిమిదవ స్థానము ఆయుష్షుకు సంబంధించిన స్థానము అంటాము. ఆయుష్షుకు సంబంధించిన ఎనిమిదవ స్థానములో శత్రుగ్రహమైన కుజ గ్రహము ఉండడముగానీ, అక్కడ చేయిపెట్టి చూడడముగానీ ఉంటే ఆయుస్థానము బాగా లేదనియే చెప్పాలి. ఇటువంటి జాతకమునే ఒక దానిని క్రిందగల పటములో చూపుతాను చూడండి.

ఇప్పుడు మీరు చూసిన జాతకములో ఎనిమిదవ స్థానమునకు ఎదురుగానున్న రెండవ స్థానములో కుజగ్రహమున్నట్లు గుర్తించాము.

| | | | |
|---|---|---|---|
| 6 | 7 | 8 | 9 |
| శని 5 | తులా లగ్నము | | కేతు 10 |
| రాహు 4 | | | 11 |
| రవి గురు బుధ శుక్ర చంద్ర 3 | కుజ 2 | లగ్నము 1 | 12 |

ఈ జాతకుని కుండలిలో అదే రెండవ స్థానమందే, అదే కుజగ్రహమే ఉండడమును మీరు చూడవచ్చును.

కుజగ్రహము ఎక్కడున్నా, దానికి ఆ స్థానములలో ఉపయోగపడు చేయికాక మిగతా మూడు చేతులుండును. ఆ మూడు చేతులలోని ఒక చేయిని కుజగ్రహమున్న చోటనుండి నాల్గవ స్థానములోనికి, రెండవ చేయి ఏడవ స్థానములోనికి, మూడవ చేయిని ఎనిమిదవ స్థానములోనికి ఉంచి అక్కడగల వాటిని తీసుకొని జాతకునికి అందివ్వగలదు. ఆయువు స్థానము కుండలిలో ఎనిమిదవ స్థానముకాగా, ఆయువుకు అధిపతి శని గ్రహము. ఇప్పుడు చూసిన జాతక లగ్నములో ఐదవ స్థానములో శని ఉండడము వలన రెండవ స్థానమున కుజుడు ఉండుట వలన కుజుడు తన చేతితో తనకు నాల్గవ స్థానములోనున్న శనిని తాకి శనివద్దయున్న జాతకుని ఆయుష్షును హరించుటకు అవకాశము గలదు. ఆయుష్షు శనిది. ఆయుష్షు స్థానము ఎనిమిదవ స్థానము. ఎనిమిదవ స్థానమును స్వయముగా కుజగ్రహము రెండవ స్థానమునుండి ఆక్రమించుకొన్నది. ఆయుష్షుకారకుడైన శనిని కూడా తన చేతి తాకిడితో దాడిచేసి శనివద్దయున్న ఆయుష్షును లాగుకొనుటకు సిద్ధముగాయున్నది. అంతేకాక తమ గుంపు నాయకుడైన గురువుతోగానీ, మిగత తమ గుంపు గ్రహములతో కలిసినప్పుడు జాతకుని ఆయుష్షును లాగుకొనుట చేయవచ్చును. జాతకుని ఆయువును లాగుకొనునప్పుడు అనగా జాతకున్ని చంపివేయునప్పుడు కుజ గ్రహము ఆధీనములోనున్న ఆయుధములనుగానీ, క్రూర మృగములనుగానీ ఉప యోగించవచ్చును. ఆయుధములలో ఉత్తమ శ్రేణికి సంబంధించినవి బాంబులు, తుపాకులుకాగా, మధ్యమ శ్రేణికి సంబంధించినవి అనేక రకముల పదునైన కత్తులుకాగా, తక్కువ శ్రేణికి సంబంధించిన కోరలుగల మృగములు ఆయుధములుకాగా తన ఆధీనములోనున్న ఏదో ఒక శ్రేణి ఆయుధముల చేత మనిషిని చంపును అని ఆ జాతకము నుండి మనము తెలుసుకోవచ్చును.

జాతకలగ్నములో అన్ని విషయములు బాగున్నా ఒక ఆయుష్షు విషయములో మేము చెప్పిన లోపములున్నవి. జాతక లగ్నములో తులా లగ్నము శరీర స్థానమైన మొదటి స్థానమైనది. తులా లగ్నమును అనుసరించి అన్ని విషయములు అన్ని విధముల బాగున్నాయి. ఒక్క ఆయుస్థానమొకటి బాగాలేదు, ఆ స్థానమును తాకినవాడు బాగాలేడు. ఈ జాతకము పుట్టినది 20వ తేదీ, ఆగష్టు, 1944వ సంవత్సరము. ఈయన దేశానికి ప్రధానిగా యున్న రాజీవ్‌గాంధీ. జాఫతకములో అనుమానములున్నట్లు 21 మే నెల, 1991వ సంవత్సరము తమిళనాడులో బాంబు ప్రేలుడు వలన చనిపోవడము జరిగినది. కుజగ్రహము ఎక్కడ చూచితే అక్కడ రక్తసిక్త మగును. అదే విధముగా ఘోర ప్రమాదమును కుజగ్రహమే చేసినది. ఆ దినము గురువు కుజునితో కలియుట వలన కుజునికి ఎక్కువ బలమైనది. కుజ గురువులు కర్కాటకములో కలియుట వలన, గురుగ్రహము తన ఐదింటి హస్తములను జాతకుని తన భాగమైన తులాలగ్నమును తాకుట వలన ప్రమాదములో శరీరము గుర్తించలేనంతగా ఛిద్రమైపోయినది. ఈ విధముగా కుజగ్రహము యొక్క కౄరత్వమును మేము ముందే ఊహించినా ఊహించినట్లే చివరకు జరిగిపోయినది.

అత్యంత ఉన్నత స్థానమైన సుప్రీమ్‌కోర్టు ఒక జడ్జిమెంట్‌ను విడుదల చేసిన తర్వాత ఆ జడ్జిమెంట్‌ను ఆధారము చేసుకొని అటువంటి కేసులను మిగతా కోర్టులలో వాదించడముగానీ, తీర్పు చెప్పడముగానీ జరుగుచున్నది. అలాగే దేశ ప్రధానిగా యున్న రాజీవ్‌గాంధీ జాతకమును మరణమును చూచిన తర్వాత అది ఒక సుప్రీమ్ జడ్జిమెంట్‌లాగా దానిని ఆధారము చేసుకొని అటువంటి జాతకములను గురించి చెప్పుకోవడము మంచిదే. ఎందుకనగా గ్రహచారములో ఎట్లుంటే అట్లే జరుగును. కావున జగన్

అను వ్యక్తి జాతకము అన్ని విధముల బాగున్నది. అయితే ఒక్క ఆయువు విషయములో మాత్రము రాజీవ్‌గాంధీ గారికున్నట్లే రెండవ స్థానము కుజ గ్రహముండడము విశేషము. రాజీవ్ జాతకములో కుజుడు శనిని తాకి చూచినట్లే, జగన్ జాతకములో కూడా కుజుడు శనిని తన చేతితో తాకుచున్నాడు. అంతేకాక తన గుంపు నాయకుడైన గురువుతో కుజుడు కలిసి ఎనిమిదవ స్థానములో ఉన్నారు. ఇట్లు అనేక ఆయువుకు సంబంధించి జగన్ జాతకములో రాజీవ్ జాతకములోని పోలికలు కలవు. ఇంచుమించు ఒకే స్థాయిని సూచించు కుజగ్రహ దోషములు ఉండుట వలన, ఈ జాతకునికి కూడ రాజీవ్‌గాంధీ పోలికలను, ఆయువు విషయములను చెప్పవచ్చును. ఒక్క ఆయువు విషయములో భయమును కల్గించు కారణములు కన్పించునప్పుడు వాటిని తప్పించుకొనుటకు భగవద్గీతలో జ్ఞానయోగమున 37వ శ్లోకము చెప్పినట్లు ఒక్క జ్ఞానము వలననే సాధ్యమగును. జ్ఞానములేనివాడు కర్మలను అనుభవింపక తప్పదు.

నేడు జ్యోతిష్యము శాస్త్రముకాదు అను వాదనను త్రోసిపుచ్చి జ్యోతిష్యము ఆరు శాస్త్రములలో ఒక శాస్త్రమని నిరూపించి చెప్పుటకు జ్యోతిష్యగ్రంథమును వ్రాశాము. మా జ్యోతిష్యమునకు ఉదాహరణగా జగన్ అను వ్యక్తి జాతకమును వ్రాస్తూ అందులోని ఆయుష్షు లోపమును చూపించడము జరిగినది. అతని (జగన్) జాతకమునకు ఉదాహరణగా ఏకంగా రాజీవ్‌గాంధీగారి జాతకమును చూపవలసివచ్చినది. జ్యోతిష్యము శాస్త్రమని చెప్పుటకు జ్యోతిష్యము ప్రకారము మేము ఐదు సంవత్సరముల ముందే అంచనా వేసుకొన్నట్లు రాజీవ్‌గాంధీ మరణము జరిగిపోయినది. అందువలన అదే స్థాయి ప్రమాదమును చూపుచున్న జాతకుడు జగన్ దైవజ్ఞానమును పొందితే అతని దశాచారములో ఆ కర్మ తప్పిపోవుటకు అవకాశము గలదు. లేకపోతే ఘోర ప్రమాదమును చవిచూడవలసి వస్తుంది.

# 47 పంచాంగ అవసరము

పంచాంగము అను పేరునుబట్టి దానిలోని ఐదు అంగములేమిటో ముందే తెలుసుకొన్నాము. పేరునుబట్టి చెప్పుకొంటే తిథి, వార, నక్షత్ర, యోగ, కరణ అను వాటిని చెప్పునదని అనుకొన్నాము. అయినా పంచాంగములో దాని పేరుకు సంబంధము లేని చాలా విషయములు తెలియబడుచున్నవి. ముఖ్యముగా ద్వాదశ గ్రహములు ప్రతి దినము కాలచక్రములో ఎలా తిరుగుచున్నదీ, ఏ దినము ఏ గ్రహము ఏ నక్షత్రమును దాటుచున్నదీ, పన్నెండు లగ్నములలో ఏ దినము ఏ గ్రహము ఎక్కడున్నదీ మొత్తము గ్రహముల గమన సమాచారమంతయు పంచాంగములో ఉండును. గ్రహముల సమాచారమేకాక ప్రతి దినము ఏ వారమగుచున్నది, అలాగే ప్రతి దినము ఏ తిథియగుచున్నదీ, అమావాస్య ఎప్పుడు, పౌర్ణమి ఎప్పుడు అను విషయములను, నక్షత్రములను, నెలలనూ మొత్తము కాలమునకు సంబంధించిన సమాచారమంతాయుండును. నిత్యము గ్రహములు తమ ప్రయాణములో ఏ లగ్నమునందు ఎంత కాలముండునదీ, ఏ నక్షత్రపాదములో ఎంత కాలముండునదీ తెల్పుచూ, గ్రహములు ఏ లగ్నమును ఎప్పుడు దాటుచున్నదో, ఏ నక్షత్రమునందు ఎప్పుడు ప్రవేశించు చున్నదో వాటి కాలమును గంటలలోనూ మరియు గడియలలోనూ పంచాంగములో ఉండును. అలాగే ఏ తిథి ఎంత కాలముండునదీ, ఏ నక్షత్రము ఎంతకాలముండునదీ పంచాంగములో వ్రాసిపెట్టబడి యుండును. గ్రహములన్నిటికీ రాజు మంత్రిలాగయున్న సూర్య, చంద్ర గ్రహముల సమాచారములో వారికి గ్రహణములు ఎప్పుడు కల్గు చున్నదీ, ఎప్పుడు వదులుచున్నదీ వ్రాసిపెట్టబడియుండును. ఇట్లు ఎన్నో విషయములు, ద్వాదశ గ్రహముల సమాచారము ఉండుట వలన పంచాంగము అందరికీ అవసరమైనదే. పూర్వము వంద సంవత్సరముల

క్రితము భారత దేశములో అన్యమతములు ఎక్కువగా లేవు. అందరూ ఎక్కువగా హిందువులే ఉండెడివారు. ఆ కాలములో చదువు వచ్చిన ప్రతి ఇంటిలోనూ పంచాంగము ఉండెడిది. తమ ఇంటిలో ఎవరికి పేరు పెట్టాలన్నా, ఎవరికి పెళ్ళి చేయాలన్నా, ఎవరు ఎక్కడకు ప్రయాణము చేయాలన్నా, ప్రతి దానికి తమవద్ద యుండే పంచాంగమును తీసుకొని ఆ ఊరిలో ఉండే పురోహితుని వద్దకు పోయి పంచాంగమును చూపించి దేనికేది మంచిరోజో, ఏది చెడు రోజో తెలుసుకొనెడివారు. అంతేకాక విత్తనము వేయుటకు, నాగలి కట్టుటకు, ముఖ్యమైన ప్రతి పనికీ మంచి ముహూర్తము ఏదో తెలుసుకొనెడివారు. ఈ విధముగా హిందువు అయినవాని ప్రతి ఇంటా పంచాంగము ఉండెడిది.

కాలక్రమేపీ పంచాంగములు బ్రాహ్మణులకే పరిమితమైపోయాయి. నేడు చదువుకొంటున్న పిల్లలను పంచాంగమును గురించి అడిగితే అదేమిటో మాకు తెలియదని చెప్పుచున్నారు. పంచాంగము అను పేరు తెలియనివారు చాలామంది ఉన్నారు. వారికి బయటనున్న సూర్య చంద్ర గ్రహములు మాత్రము తెలుసుగానీ శరీరమున తలలోనున్న ద్వాదశ గ్రహములు తెలియవు. ఈ విధముగా నేడు చాలామంది పెద్దలకు కూడా పంచాంగమును గురించి తెలియకుండా పోయినది. పండుగలను గురించి తెలియాలన్నా తేదీలను గురించి తెలియాలన్నా అందరికీ నేడు క్యాలెండర్లు మాత్రము తెలుసు. క్యాలెండర్లలోనే తిథి, నక్షత్రములుండుట వలన అందరికీ క్యాలెండర్లు తెలియునని చెప్పవచ్చును. ఎక్కడైనా ఒకరో ఇద్దరో పంచాంగములు చూచేవారున్నప్పటికీ, నేడు కంప్యూటర్లలో జాతకములు కూడా సులభముగా తెలియుచుండుట వలన చివరకు బ్రాహ్మణులకు కూడా పంచాంగములు అవసరము లేకుండాపోయింది. ఇతర మతముల వారు

పంచాంగము హిందువులది అని అనుకోవడము వలన వారు ఎవరూ పంచాంగమును తాకను కూడా తాకరు. ఇట్లు అనేక విధములుగా పంచాంగము నేడు చాలామందికి తెలియకుండా పోయినది.

నేడు మేము చెప్పునది ఏమనగా! నేడు జ్యోతిష్యులు కూడా కంప్యూటర్ ముందు కూర్చొని భవిష్యత్తునూ, భవిష్యత్తుకు సంబంధించిన ముహూర్తములనూ చెప్పుచున్నారు. అలాకాకుండా ప్రతి జ్యోతిష్యుడూ పంచాంగమును దగ్గరుంచుకొని దానిప్రకారము భవిష్యత్తునిగానీ, ముహూర్తములనుగానీ చెప్పడము మంచిది. అలాకాకుండా కంప్యూటర్లలో చూచి చెప్పడము వలన శ్రమ తగ్గినా పైనగల గ్రహముల అనుగ్రహము మనమీద ఉండదని నేను అనుకొంటున్నాను. అందువలన జ్యోతిష్యమునకు ఎవరైనా పంచాంగమునే ఉపయోగించుకోమని తెల్పుచున్నాము. ఒక వ్యక్తి జ్యోతిష్యునిగా మారుటకు జ్యోతిష్యమునకు అధిపతియైన బుధగ్రహము సహకరించినప్పుడే మంచి జ్యోతిష్యునిగా పేరురాగలదు. గ్రహముల స్థితి గతులు ముద్రించియున్న గ్రంథమైన పంచాంగములో కనిపించని శక్తి నిక్షిప్తమైయుండి పంచాంగముమీద గల జ్యోతిష్యుని మనోభావమును బట్టి అతని బుద్ధికి సత్యమైన మాటలను పలుకునట్లు సూచనలిచ్చును. కంప్యూటర్ ఒక యంత్రము అయినందున గ్రహముల అనుగ్రహము దానినుండి లభించదు. అందువలన చెప్పినమాట సత్యము కాకుండా పోవుటకు అవకాశముగలదు. జ్యోతిష్యునివద్ద కంప్యూటర్ ఉన్నా కొన్ని గణితములను దానియందు సులభముగా తెలియగల్గినా కంప్యూటర్ ముందు పంచాంగము పెట్టుకొని, దానిని గౌరవిస్తూ జ్యోతిష్యము చెప్పుట మంచి కార్యమగును.

ఏ మనిషి ఎప్పుడు పుట్టినా అతని జాతక లగ్నమును పంచాంగము ద్వారాగానీ, కంప్యూటర్ ద్వారాగానీ తీసుకొనియున్నా ప్రస్తుతము జరిగే వర్తమాన కాలములో గ్రహముల స్థితి గతులు ఎలా ఉన్నాయి, గ్రహముల గమనములో మనకు కావలసిన లగ్నములో ఏ గ్రహమున్నది. ఏ గ్రహము రాబోతుంది అని వర్తమాన కాల పరిస్థితులను తెలియుటకు ప్రతి ఒక్కరూ పంచాంగమునే చూడవలెను. ఇంతకుముందు రాజీవ్‌గాంధీగారి జన్మ కుండలిని వ్రాసుకొని చూచాము. ఆ కుండలిని మేము 1983వ సంవత్సరమే పత్రికలో చూచాము. అయినా ఆ దినము ఆ జాతకమును సంపూర్ణముగా చూడలేదు. అప్పుడు నేను జ్యోతిష్యము మీద పరిశోధన చేయుకాలము. కావున కొందరి జాతకములు సేకరించి కొన్ని విషయము లను మాత్రము వాటిలో చూడడము జరిగినది. అప్పుడు చూడని విషయమును 1985వ సంవత్సరము పరిశోధన నిమిత్తము చూచాను. ఆయువు విషయములో కొంతవరకు అంచనా వచ్చినా అప్పుడది నిర్ధారణ లేని విషయము మాత్రమే. అయితే ఆ అంచనా కొంతకాలమునకు నిజమైనది. అప్పుడు ఆ సంఘటనతో జ్యోతిష్యము శాస్త్రమనీ, మూఢ నమ్మకముకాదనీ అనుకొన్నాము. ఆ ఒక్క విషయముతోనే జ్యోతిష్యమును శాస్త్రమనలేదు. మా పరిశోధనలో ఇటువంటి కొన్ని ఇతర విషయములు ప్రత్యక్షముగా జరుగుట వలన పూర్తిగా జ్యోతిష్యమును శాస్త్రమని చెప్పడము జరిగినది. ఏదైనా తప్పు అయితే అది జ్యోతిష్యునిలో ఉంటుందిగానీ, జ్యోతిష్యములో ఉండదు.

1985వ సంవత్సరము రాజీవ్‌గాంధీ జాతకమును మేము చూచినప్పుడు అందులో ఆయుష్షు విషయములో కొంత అనుమానము వచ్చి ఒక అంచనాకు వచ్చి ఇలా జరుగవచ్చునని అనుకొన్నాము. అది

ఒక ఊహ మాత్రమేగానీ నిర్ధారణకాదు. అయితే అప్పుడు అతనికి ఏ సంవత్సరము ప్రమాదము జరుగునని తెలియదు. ఏ ఆయుధముల చేత ప్రమాదము జరుగునని తెలియదు. అంతేకాక నా అంచనాకు వచ్చిన విషయము సత్యమో కాదోనని కూడా తెలియదు. ఆనాడు నావద్ద కొన్ని ప్రశ్నలకు జవాబులులేవు. అంచనాలు మాత్రమున్నాయి. అయితే అవి సత్యమాకాదా అని తెలియుటకు ఆరు సంవత్సరముల వ్యవధి పట్టినది. అయితే ఈనాడు కూడా జ్యోతిష్యములో అన్ని ప్రశ్నలకూ జవాబులు లేకున్నా కొన్ని ప్రశ్నలకు నా పరిశోధనలో తెలిసిన వాటికి నావద్ద నిజమైన జవాబులు ఉన్నాయి. జ్యోతిష్యము నాకు సంబంధించిన శాస్త్రముకాదు. అందువలన దానిని కొద్దిగా పరిశోధించి, నాకు మిక్కిలి ఆసక్తిగాయున్న బ్రహ్మవిద్యా శాస్త్రమును పూర్తిగా పరిశోధించి తెలుసుకోవడము జరిగినది. జ్యోతిష్యము లో నాకు తెలిసినంతవరకు ఒక సంఘటన విషయములో అనుమానము వస్తే అది ఎప్పుడు జరుగుతుందని తెలియుటకు ప్రస్తుత కాల పంచాంగము అవసరము. ఏదో ఒకటి జరుగవలసియుంటే అది ఎప్పుడు జరుగుతుందో ముందే చెప్పుటకంటే ఎప్పటి పంచాంగము అప్పుడు చూచి చెప్పడము మంచిది.

రాజీవ్‌గాంధీగారి జాఫతకములో ఆయుష్షు స్థానము మీద 1985లో వచ్చిన అనుమానము ఆరు సంవత్సరముల తర్వాత 1991లో తీరి పోయినది. ఆ సంవత్సర పంచాంగములో ఆయన చనిపోయిన రోజు జాతకలగ్నములో ఏ గ్రహము ఎక్కడున్నదని చూచాము. ఆ దినముగల జాతక కుండలిని తర్వాత పేజీలో చూడవచ్చును.

పంచాంగము ప్రకారము 1991 మే, 21 తేదీన ఉన్న కుండలిని చూస్తే జనన లగ్నమున రెండవ స్థానములోయుండి ఆయుస్థానమైన

| | | | |
|---|---|---|---|
| 6 | బుధ 7 | సూర్య 8 | కేతు శుక్ర 9 |
| 5 | | | కుజ గురు 10 |
| శని 4 | | | చ 11 |
| రాహు 3 | 2 | లగ్నము 1 | 12 |

1991 సం॥ మే, 21వ తేదీన రాజీవ్‌గాంధీ గారికి ఉన్న గ్రహచారము.

ఎనిమిదవ స్థానము మీద పెత్తనము చెలాయించు కుజగ్రహము గురువుతో కలిసి పదవ స్థానమున ఉన్నది. అక్కడున్న కుజగ్రహము గురువుతో కలిసి ఇద్దరూ శనిమీద వారి హస్తములనుంచి శని ఆధీనములోనున్న ఆయుష్షును కుజగ్రహము లాగుకోవడము జరిగినది. జాతకములో పుట్టినప్పుడే నిర్ణయించబడిన కర్మను పుట్టిన రోజు పంచాంగము ద్వారా తెలిసినా అది ఎప్పుడు జరుగుననుటకు అప్పుడు జవాబులేదు. అప్పటి పంచాంగము ద్వారా తెలియకున్నా ప్రస్తుత వర్తమాన కాలములోనున్న పంచాంగములో మాత్రము తెలియగలదు. ఆయుష్షు విషయములో అనుమానమున్నా అతని ఆయుష్షు ఎప్పుడు హరించివేయబడుతుందను విషయము ఆ సంఘటన జరుగుకాలము ఎప్పుడగునో అప్పటి పంచాంగములో ఆ సంఘటన వివరమునకు సంబంధించిన గ్రహచార ముండును. 1991వ సంవత్సర పంచాంగము మార్చి నెలలోనే లభించుట వలన ప్రమాదము జరిగి చనిపోకముందు రెండు నెలలముందు ఆ విషయము లగ్నకుండలిలో అర్థమగుచున్నది. ఆ సంవత్సరములో జరుగు ఘటన ఆ సంవత్సర పంచాగములోనేయుండును.

1991 మే, 21 తేది సరిగా మంగళవారమే కావడము విశేషము. గ్రహములలో కుజున్ని అంగారకుడనీ, మంగళుడనీ అనుచున్నాము. దినములలో మంగళవారము కుజుని దినమని చెప్పుచున్నాము. కుజుడు తన దినమైన మంగళవారమే రాజీవ్‌గాంధీని చంపడము జరిగినది. మంగళవారమే చని పోవడము వలన ఆ దిన అధిపతి అయిన కుజ గ్రహము వలన ఆ సంఘటన జరిగినదని తెలియుచున్నది. మరియొక విషయమేమనగా తులాలగ్న జాతకుడైన రాజీవ్‌గాంధీగారికి శత్రు గ్రహములుగా ఐదు గ్రహములు కలవు. అవి వరుసగా 1) సూర్యుడు 2) చంద్రుడు 3) కుజుడు 4) గురువు 5) కేతు గ్రహములు. ఈ ఐదుమంది గుంపుకు గురువు నాయకుడుగా ఉన్నాడు. ఈ శత్రు గుంపులోని గురువు, కుజుడు ఇద్దరూ కర్కాటక రాశిలో ఉండి కుజుడు శరీరస్థానమైన మొదటి స్థానమును చూచి శరీరమును నాశనము చేశారు. ఆ సంఘటన రాత్రి 10–21 నిమిషములకు జరిగినది. ఇక్కడ శత్రుగుంపులోని గురు, కుజులే కాక మరొక శత్రు గ్రహము ఆ లగ్నములోనికి వచ్చియున్నది. అప్పుడు ఒకే వర్గమునకు చెందిన మూడు గ్రహములు కటక లగ్నములో ఉండుట వలన వారికి ఎదురుగాయున్న మకర లగ్నములోని శనిని తాకి శనినుండి జాతకుని ఆయుష్షును లాగుకొన్నారు. సూర్యోదయములో ధనుర్‌లగ్నము మీదగల సూర్యుడు రెండు గంటలకు ఒక లగ్నమును దాటుచూ వచ్చి రాత్రి 9–25 నిమిషములనుండి 11–37 నిమిషముల వరకు కటక లగ్నము (కర్కాటక లగ్నము) మీద ఉండుట వలన ప్రమాద సమయమునకు గురు, కుజులతో పాటు సూర్యుడు కూడా ఉన్నాడని తెలియుచున్నది. సూర్యుడు కర్కాటక లగ్నములో దాదాపు 2–12 నిమిషములున్నాడు. అయితే సూర్యుడు కటక లగ్నములోనికి వచ్చి గురు కుజులతో కలిసిన దాదాపు

గంటలు 10-21 నిమిషములకు ప్రమాదము జరిగినది. సూర్యుడు గురువు కుజునికి సహకరించి శనివద్దయున్న ఆయుష్షును లాగుకొన్నారు. అది సూర్యుడు, గురు, కుజులతో కలిసిన దాదాపు గంటకు పైన శనితో పోరాడి శనిని ఓడించి శనివద్దయున్న ఆయువును లాగుకొని జాతకునికి మరణము నిచ్చారు.

ఈ జాతకుడు పుట్టిన సమయములోని జన్మకుండలియందు ఏ లగ్నము ఎన్నో స్థానమైనదీ, ఏ గ్రహములు శత్రుగ్రహములైనదీ తెలియు చున్నది. అతని జాతకము ప్రకారము జీవితముండుననీ, జీవితములో అన్ని విషయములు ఉండునని తెలియుచున్నది. అయితే ఏ సంఘటన ఎప్పుడు జరుగునను వివరము ఉండదు. 1991 మే 21వ నాటి పంచాంగములో గురువు, కుజుడు కర్కాటక లగ్నములో ఉండడము జరిగినది. అయితే 1944 ఆగష్టు 20వ తేదీ రాజీవ్ గాంధీ పుట్టిన దినమున భవిష్యత్తులో గురు కుజులు మరియు సూర్యుడు కర్కాటక లగ్నములో కలిసి మకరములోయున్న శనితో పోరాడుతారని తెలియదు కదా! అందువలన ప్రమాదముండవచ్చునని 1991 సం॥ పంచాంగము ప్రకారము జన్మ లగ్నములో తెలిసినా అది ఎప్పుడు జరుగును ఏయే గ్రహములు ఆ సమయములో పాల్గొందురు అను విషయము ఆ దినము తెలియదు. అది భవిష్యత్తు జరిగే కొద్ది వచ్చే పంచాంగములలో తెలియును. గ్రహములు కాలచక్రములో తిరుగుట వలన వారి ప్రయాణములో ఎవరు ఎవరితో ఎప్పుడు కలియుదురో ఆ సమాచారము ప్రతి సంవత్సరము పంచాంగములో ఉండును. ప్రతి సంవత్సర పంచాంగమునూ చూస్తుంటే ఏదో ఒక పంచాంగములో శత్రు గ్రహములు కలిసి ఏమి కుట్ర చేయుచున్నదీ, ఏ విషయము మీద వారు ఎక్కువ ప్రభావమును చూపునదీ

తెలియును. అందువలన ప్రమాదములను ఒక సంవత్సరములో గుర్తించు కోవచ్చునుగానీ, అంతకంటే ముందు తెలుసుకొనుటకు వీలుపడదు.

నేను బ్రహ్మవిద్యకు సంబంధించినవాడిని, జ్యోతిష్యుడను కాను. అందువలన ప్రతి సంవత్సరము పంచాంగములను చూచే అలవాటు నాకు ఏమాత్రము లేదు. అందువలన 1991 సంవత్సర పంచాంగమును రాజీవ్‌గాంధీ చనిపోయిన తర్వాత చూచాను అందులోని లోపములను గ్రహించాము. ఒకవేళ ఆ సంవత్సరము ముందే తెలియవలసియున్న పంచాంగమును తీసుకొని ప్రతి నెల వెదుకుచువచ్చివుంటే లోపములు మే నెలలో ఉన్నట్లు కనిపించేవి. ఒక జాతకునికి అనేక విషయములలో అనేక కోణములనుండి చూడవలసియుంటుంది. ఇదంతా ఒక సంవత్సరము పాటుయున్న మంచి చెడు కాలమును వెదకడానికి సమయము ఓపిక యుండవలెను. అట్లు ఓపిక, సమయము ఉన్నవారు సంవత్సరము మొదలులోనే పంచాంగమును వెదకి తమతమ మంచి చెడులను గ్రహించుకోవచ్చును. ఒక ప్రమాదమును జాతకములో సూచించినా, ఆ ప్రమాదము ఏ సంవత్సరములో జరుగుననుటకు ప్రతి సంవత్సర పంచాంగమును చూడవలసియుండును. అందువలన జ్యోతిష్యుడు జాతకములోని సమస్యలను ప్రస్తుత వర్తమాన పంచాంగములలో వెదకవలసి వచ్చును. రాజీవ్‌గాంధీ గారికి ప్రమాదము పుట్టిన జాతకములోయుంటే, అది జరుగుటకు కావలసిన గ్రహబలము 1991వ సంవత్సర పంచాంగము లో ఉన్నట్లు పంచాంగమును వెదికియుంటే ముందే తెలిసేది. ఇప్పుడు జగన్ అను వ్యక్తి యొక్క జాతకములో రాజీవ్‌గాంధీకి జరిగిన ప్రమాదమునకు సరియగు ప్రమాదము ఉన్నట్లు సూచనలు కనిపించినా, అది ఎప్పుడు జరుగును అను సమాచారము జాతకములో ఉండదు. అందువలన ప్రతి

సంవత్సరము పంచాంగము విడుదలయైన వెంటనే దానిలోని పన్నెండు నెలలు వెదకి చూడాలి. గ్రహచారములో ఎక్కువ శత్రు గ్రహములు ఒకచోట చేరినా, చేరిన శత్రు గ్రహములు ఆయు స్థానమును తాకినా, ఆయువుకు అధిపతియైన శని గ్రహమును బంధించినా అష్టమాధిపతియైనవాడు శత్రుగ్రహముల చేతిలో చిక్కుకొనినా అది ప్రమాద సమయమని గుర్తించుకోవచ్చును.

ఎంతో తెలివిని ఉపయోగించి ఒక వ్యక్తి జాతకములోనున్న ప్రమాదమును 32వ సంవత్సర పంచాంగములో గుర్తించావనుకొనుము. ఆ సంవత్సరము ఉగాది మొదటిలో వచ్చిన పంచాంగమును చూచి ఈ సంవత్సరము ఏడు నెలలు గడచిన తర్వాత ఎనిమిదవ నెలలో ప్రమాదము జరిగి జాతకుడు మరణించునని తెలిసినదనుకొనుము. అప్పుడు ఆ జాతకుడు గానీ, ఆ జాతకునికి ప్రమాదమును గురించి తెలిపిన జ్యోతిష్యుడుగానీ ఏ ప్రయత్నము చేసినా, ఏ శాంతులు చేసినా, ఎన్ని పూజలు చేసినా ఎంతోమంది దేవతలను ఆరాధించి మ్రొక్కుబడులు చెల్లించినా, శాంతి హోమములు, మృత్యుంజయ యజ్ఞములు చేసినా, జ్యోతిష్యుడు తన విద్యనంతా ఉపయోగించి జాతకున్ని ప్రమాదమునుండి కాపాడవలెననుకొనినా, జాతకుడు తన ధనమును ఉపయోగించి శనీశ్వరు నికి బంగారు కిరీటము చేయించినా, విఘ్నేశ్వరునికి గుడికట్టించినా, ముక్కంటీశ్వరునికి ముడుపులు చెల్లించినా, కపిలేశ్వరునికి తైలాభిషేకము, నీలకంఠేశ్వరునికి రుద్రాభిషేకము చేయించినా రానున్న ముప్పు రాక మానదు. జరుగవలసిన ప్రమాదము జరుగకమానదు. ఎవ్వరుగానీ కర్మను అతిక్రమించి పోలేరు. ఏ క్రియలచేతగానీ జరుగవలసిన కర్మను తప్పించుకోలేరు. గ్రహచారములో ఎవరూ ఏమీ చేయలేరు. అది ఎట్లుంటే అట్లు జరిగితీరును.

జరుగవలసిన ప్రమాదమును తప్పించుకొనుటకు ఒకే ఒక మార్గము కలదని ముందే చెప్పుకొన్నాము. అది ప్రపంచ కార్యము కాదు. పరమాత్మ జ్ఞానమని కూడా చెప్పుకొన్నాము. కర్మను జయించి ప్రమాదమును తప్పించు జ్ఞానమును తెలియవలెనంటే మొదట ఆ మనిషిలో నేను ఫలానా మతము వాడినను భావము పోవాలి. అతని దృష్ఠిలో దేవుడు తప్ప మతము అను భావములేనిది నిజమైన జ్ఞానమగును. అటువంటి స్వచ్ఛమైన జ్ఞానమును తెలిసినవాడే కర్మను జయించి ప్రమాదమును తప్పించుకోగలడు. సృష్ఠికంతటికీ అధిపతియైన దేవున్ని తెలిసినవాడు, మతాల భ్రమను వీడినవాడు, శరీరాంతర్గత జ్ఞానమును తెలిసినవాడు, ఎంతటి కర్మగలవాడైనా, వానికి ఎంతపెద్ద ప్రమాదము ఉండినా దానిని సులభముగా జయించుకోగలడు. అటువంటి జ్ఞానిగా మారిన వానిని చూచిన గ్రహములు సంతోషించి తమ దశలలో అతనికి సంబంధించిన ఎన్నో కర్మలను దహించివేయుచున్నారు. కర్మను మనిషికి అందించి అనుభవింపజేయు గ్రహములు జ్ఞాని అయినవానిని గౌరవభావముతో చూస్తూ అతని కర్మను హరించివేయుచున్నవి. జ్యోతిష్యములో దశల విభాగము ఇలాయున్నదని తెలియనివానిని జ్యోతిష్యము మీద నమ్మకము లేనివానిని ఎవరూ కాపాడలేరు.

జ్యోతిష్యము మీద నమ్మకమున్నవారు గ్రహచారము మనిషిది, దశాచారము దేవునిదని తెలిసినవాడు నిజమైన జ్యోతిష్యుడగును. నిజమైన జ్యోతిష్యుడు పంచాంగములో చెడు మంచి కర్మలను తెలియగలిగి, అవి జాతకములోని పుట్టిన సమయముతో వచ్చినవని తెలిసి, జనన సమయము లో వచ్చిన వాటిని వర్తమాన పంచాంగములో ఎప్పుడు జరుగునదీ తెలియగల్గును. జనన సమయములో కర్మప్రకారము కల్గిన ప్రమాదములు

చెడు కార్యములన్నిటినీ తన జ్ఞానము చేతనే తొలగించుకొనుటకు ప్రయత్నించును. అదే విధానమును ఇతరులకు కూడా బోధించును. జ్యోతిష్యము ఒక జాతకముతోనే ముగియదు. జ్యోతిష్యము వర్తమాన కాల పంచాంగముల మీద ఆధారపడియుండును. అట్లే జ్ఞానము భక్తి భావముతోనే పూర్తికాదు. తెలిసిన జ్ఞానమును జ్ఞానాగ్నిగా మార్చు బ్రహ్మవిద్యాశాస్త్రము మీద ఆధారపడియున్నది.

## 48 జ్యోతిష్యములో ప్రశ్నలు

**1) జాతకములో ఏ సమస్యనైనా తెలియవచ్చునా?**

**జు॥** జాతకము అనునది జాఫతకము అని ముందే చెప్పాము. ఫతకము అనగా ముందే నిర్ణయించుకొన్నదని అర్థము. జీవిత ఫతకము పుట్టిన సమయములోనే నిర్ణయించడము జరిగినది. అందువలన పుట్టుటను "జా" అన్నారు. అప్పుడు నిర్ణయము చేయబడిన ఫతకమును జాఫతకము అంటున్నాము. జీవితములోని అన్ని సమస్యలు జాఫతకములో ప్రారబ్ధకర్మ ద్వారా నిక్షిప్తము చేయబడియుండును. జాఫతకమును మనము పుట్టిన సమయమును బట్టి వ్రాసుకొన్నా జరిగెడు భవిష్యత్తు ఏమీ అర్థముకాక అంధకారముతో నిండియుండును. అందువలన భవిష్యత్తు అంధకారముతో కూడుకొనియున్నది. ఆ చీకటిలో ఏమీ కనిపించదు. అందువలన ముందు దినముగానీ, ముందు నిమిషముగానీ ఏమి జరుగునదీ తెలియదు. చీకటిమయమైన జాతకమును జ్యోతితో తెలియవచ్చును. జ్ఞానమను జ్యోతిని ఉపయోగించి చూచితే జీవితములోని ఏ సమస్యనైనా తెలియ వచ్చును. జ్ఞానజ్యోతికలవాడు జ్యోతిష్యుడు. అజ్ఞానముగలవాడు సమస్యను

గురించి అడుగువాడు. జ్ఞానము తెలియనివాడు ప్రపంచ ప్రశ్నలనే అడుగును. ప్రపంచ ప్రశ్నలకు జవాబునిచ్చు జ్యోతిష్యుడు, తన పరిచయము చేత జ్ఞానము తెలియని వానికి కూడా జ్ఞానము మీద ఆసక్తి కల్గునట్లు ప్రశ్నకు జవాబివ్వవలెను.

**2) జ్యోతిష్యమునకు భవిష్యత్తుకు తేడా ఏమి గలదు?**

**జ॥** చూచునది దృష్టి, చూడబడునది దృశ్యము. అలాగే తెలియబరచు నది జ్యోతిష్యము, తెలియబడునది భవిష్యత్తు. అట్లే జ్ఞానముతో కూడుకొన్నది జ్యోతిష్యము, భయముతో కూడుకొన్నది భవిష్యత్తు. జ్ఞానముతో కూడుకొన్న వాడు జ్యోతిష్యమును చెప్పును. అజ్ఞానముతో కూడుకొన్నవాడు భవిష్యత్తును అడుగును. భావితరము అంటే రాబోవు తరము అని అర్థము. జ్యోతితరము అంటే వెలుగునిచ్చుతరము. ఇప్పుడు జ్యోతిని (జ్ఞానమును) వెలిగించితే అది రాబోవు వారికి (తెలియగోరు వారికి) వెలుగై ఉండును.

**3) జ్యోతిష్యము ఎన్ని రకములు కలదు?**

**జ॥** దేశములో ఎన్ని జ్ఞానములున్నా దేవుని జ్ఞానము ఒక్కటే గలదు. దేవుడూ ఒక్కడేగలడు. అదే విధముగా జ్యోతిష్యము అను పేరును ఎన్నో పద్ధతులుగా చెప్పే విధానములకు పెట్టుకొన్నా అవన్నియూ జ్యోతిష్యములు కావు. వాటి వలన భవిష్యత్తు తెలియదు. ద్వాదశ గ్రహముల ద్వారానే కర్మ పాలింపబడుచున్న విధానమునే జ్యోతిష్యము అంటాము.

**4) ముహూర్తమంటే ఏమిటి?**

**జ॥** ముందే నిర్ణయింపబడినది ముహూర్తము. మధ్యలో మనుషులు నిర్ణయించునది ముహూర్తము కాదు. అన్ని ముహూర్తములు జన్మలోనే

ప్రారబ్ధ కర్మతోపాటు నిర్ణయించబడియుండును. మధ్యలో ఎవరూ నిర్ణయించ లేరు. నిర్ణయించినా దానిని ముహూర్తమనరు.

**5) కొందరు తమ పిల్లలు పుట్టిన సమయములోనున్న నక్షత్రమునుబట్టి పేరు పెట్టుచుందురు. కొందరు ఏమీ చూడకనే పేర్లు పెట్టుచుందురు. అట్లు పెట్టు పేర్లలో బలముండునా? ఎలా పేరు పెట్టడము మంచిది?**

**జ॥** పుట్టిన సమయములో ఉన్న నక్షత్రమునుబట్టి, ఆ నక్షత్రము యొక్క నాలుగు పాదములకు గుర్తుగా నిర్ణయించబడిన నాలుగు అక్షరములలో అప్పటి పాదమునకు సంబంధించిన అక్షరమును మొదటి అక్షరముగా ఉండునట్లు చేసి పేరును పెట్టుకోవడము జరుగుచున్నది. అలా పుట్టిన సమయములోనున్న నక్షత్రమునకు సంబంధిత అక్షరముతో పేరు పెట్టుకొనినా, అలా పెట్టుకొనక వేరే పేరును పెట్టుకొనినా, అందులో లాభముగానీ నష్టముగానీ ఏమీ ఉండదు. కొన్ని పేర్లు పలికే దానికి సులభముగా అందముగా ఉండవచ్చును. కొన్ని పేర్లు కష్టముగా అందహీనముగా మొరటుగాయుండును. అయితే వాటిలో బలముండడము గానీ, ఉండకపోవడముగానీ ఏమీ ఉండదు. ఏ మనిషికీ ఏ పేరువలనా ఎటువంటి బలాబలములుగానీ, లాభనష్టములుగానీ ఉండవు.

**6) ఒకరి జీవితములో ఒకపెళ్ళిమాత్రము జరుగగా, మరొకరి జీవితములో రెండు పెళ్ళిళ్ళు జరుగుచుండుట చూశాము. దానికి కారణము ఏమి?**

**జ॥** ఒక వ్యక్తి జాతకములో ఏడవస్థానము కళత్ర స్థానమనబడును. కళత్ర స్థానమనగా భర్తకు భార్య కళత్రమగును. అట్లే భార్యకు భర్త కళత్రమగును. కళత్రస్థానమైన ఏడవ స్థానమున రాహువుగానీ లేక

కేతువుగానీ ఉండినట్లయితే ఆ జాతకునికి రెండవ పెళ్ళి జరుగుటకు అవకాశమున్నది. కళత్రము అనగా పురుషునికి స్త్రీ కళత్రమగుననీ, స్త్రీకి పురుషుడు కళత్రమగునని మరొక అర్థము కలదు. అందువలన ఒకవేళ పెళ్ళికాకున్నా స్త్రీలకు పురుషులతో, పురుషులకు స్త్రీలతో అక్రమ సంబంధము ఏర్పడునట్లు రాహు కేతు గ్రహములే చేయును. కొందరి కుటుంబములో భర్త చనిపోయిన భార్యవుండినా అమె ముండమోసిన విధవగా మిగిలి పోవుచున్నది. అటువంటి ఒక స్త్రీకి ఎటువంటి ఇతర పురుషునితో సంబంధముండదు. అలా ఉండుటకు కారణము ఏమనగా! కళత్ర స్థానములో రాహువుగానీ, కేతువుగానీ ఉండినప్పుడు అక్కడే ఆ గ్రహములకు వ్యతిరేఖమైన రెండు లేక మూడు గ్రహములున్నట్లయితే అక్కడ రాహువు కేతువుల ప్రభావము అణిగిపోవును. వారు చేయు రెండవ పెళ్ళికిగానీ, రెండవ అక్రమ సంబంధముగానీ జరుగకుండపోవును. కళత్ర స్థానములో రాహువు కేంద్రమున్న చోట ఆ గ్రహముకు వ్యతిరేఖమైన గ్రహములు కాకుండ అనుకూలమైన గ్రహములుంటే అటువంటి జాతకునికి ఒక పెళ్ళికి బదులు రెండు లేక మూడు పెళ్ళిళ్ళు జరుగునట్లు చేయగలరు. అట్లే ఒక అక్రమ సంబంధమునకు బదులు మరికొన్ని అక్రమ సంబంధములు కల్గింతురు. ఇదంతయూ జాతక చక్రములోని గ్రహములు ఆడించు ఆటలేగానీ మనిషి స్వయముగా ఎక్కడా ఆడడము లేదు.

**7) ఒక వ్యక్తికి పెళ్ళి ఆలస్యముగా వయస్సు ముదిరిన తర్వాత అగుటకు కారణమేమి? అట్లే మరికొందరికి పూర్తి చిన్నవయస్సులోనే పెళ్ళి జరుగుటకు కారణమేమి ఉండవచ్చును?**

**జ॥** మనిషి జీవితములో యౌవ్వనమునకు అధిపతి కుజగ్రహము. అలాగే కళత్రమునకు అధిపతి శుక్రగ్రహము. ఈ రెండు గ్రహములు

వేరువేరు వర్గమునకు చెందినవి. ఒక గ్రహము పాపవర్గము లేక శత్రువర్గము నకు చెందినదైతే మరియొక గ్రహము పుణ్యవర్గము లేక మిత్రవర్గమునకు చెందినదైయున్నది. మనిషి జాతకమునుబట్టి, అందులో జన్మలగ్నమునుబట్టి గ్రహములు రెండు వర్గములుగా విభజింపబడుచున్నవి. ఆ విధముగానున్న గ్రహములలో శనివర్గము వారు పుణ్యమును పాలించువారైయున్నారను కొనుము. అప్పుడు గురువర్గములోని గ్రహములన్నియు పాపమును పాలించునవైయుండును. పుణ్యమును పాలించు గ్రహములను శుభగ్రహము లనీ మిత్రగ్రహములనీ, అనుకూలమైన గ్రహములనీ అంటుంటాము. అదే పాపమును పాలించు గ్రహములను అశుభగ్రహములనీ, శత్రుగ్రహములనీ, వ్యతిరేఖమైన గ్రహములనీ అంటుంటాము.

శనివర్గమునకు చెందిన జాతకునికి జన్మకుండలిలో కళత్రస్థానమైన ఏడవ స్థానమున శత్రువర్గమునకు సంబంధించిన అశుభగ్రహమైన కుజ గ్రహము ఉన్నాడు. అందువలన కుజగ్రహము యౌవ్వనముకు అధిపతియై నందున జాతకుని యౌవ్వనమును అడవిగాచిన వెన్నెలవలె చేసి, యౌవ్వనములో కళత్ర సుఖము లేకుండా చేయును. అందువలన అటువంటివానికి జీవితములో పెళ్ళియగుటకు ఆలస్యమగును. ఏదో ఒక కారణముచేత పెళ్ళి కుదరకుండా పోవుచు చివరకు వయస్సు ముదిరి పోవును. వయస్సు ముదిరిన తర్వాత పెళ్ళి కావచ్చును. కొందరికి శనివర్గము శత్రువర్గమైనప్పుడు కళత్రస్థానమున శుక్రుడున్నా లేక శుక్ర హస్తమున్నా కళత్రమునకు అధిపతియైన శుక్రుడు జాతకునికి అశుభమును కల్గించుచూ వానికి యౌవ్వనములో పెళ్ళి అయినా శుక్రగ్రహము వలన యౌవ్వనములో భార్య అనుకూలవతిగా లేకుండును. యౌవ్వనమంతా ఆ జాతకునికి భార్య అనుకూలములేక స్త్రీ సౌఖ్యము లేకుండాపోవును. కుజ

గ్రహముగానీ, శుక్రగ్రహముగానీ శత్రువులుగా ఎవరున్నా వాని యౌవ్వన వయస్సంతయు సుఖము లేకుండా పోవును. కుజ మిత్రవర్గమువాడై శుభగ్రహమై ఏడవ స్థానములోయున్న చిన్నవయస్సులోనే పెళ్ళియగును. శుక్రుడు అశుభ గ్రహమైనా కళత్రమునకు సంబంధము లేకుండా వేరు స్థానములలో ఉండినా అతని కళత్రములో ఆటంకములు లేకుండా సాగి పోవును.

**8) కొన్ని కుటుంబములలో భార్య భర్త ఇరువురూ ప్రతి చిన్న విషయము నకూ పోట్లాడుకొనుచూ, ఒకరిమాటను మరియొకరు వినకుండ కాపురము చేయుచుందురు. వారు అలా ఉండుటకు కారణమేమి?**

**జ॥** యౌవ్వన కారకుడు కుజుడు, కళత్ర కారకుడు శుక్రుడు అయినందున, వీరు ఇరువురూ శత్రువులగుట వలన చాలామంది జీవితములలో యౌవ్వనములో కళత్ర సుఖముండదు. అంతేకాక పూర్తి శత్రువులుగానున్న వీరు ఇద్దరూ ఒకే లగ్నములో కలిసియున్నప్పుడు జన్మించిన వారికి వారి జీవితాంతము భార్యాభర్తల అన్యోన్యత లేకుండా కాపురము చేయుదురు. కుజగ్రహము ఎవరికి అనుకూలముగాయుంటే వారికి కోపము ఎక్కువయుండును. అందువలన ప్రతి విషయములోనూ కోపగించుకొనుచుందురు. అట్లే కుజ గ్రహము అనుకూలముగాయున్న మగవారికి శుక్రగ్రహము ఇతర స్త్రీల సాంగత్యమేర్పరచును. కుజుడు శుక్రుడూ ఇద్దరూ శత్రువులగుట వలన మనుషుల జీవితములో భార్యాభర్తలు ఏమాత్రము పొందిక లేకుండ జీవితము సాగునట్లు చేయును.

**9) కొందరు మనుషులు చూచేదానికి అందముగా లేకున్నా బుద్ధి మాత్రము గొప్పగాయుండి వారి ప్రవర్తన గొప్పదిగాయుండును. వారి**

**మేధాశక్తితో ఏ సమస్యకైనా సులభముగా జవాబు చెప్పుచుందురు. కొందరు అందముగాయున్నా తెలివితక్కువవారుగా యుందురు. వారి ప్రవర్తన కూడా తెలివి తక్కువగానే కనిపించుచుండును. అలా ఉండుటకు కారణమేమి?**

**జ॥** కర్మచక్రములోని కర్మ రాశులున్న భాగములలో ఐదవ భాగము లేక ఐదవ స్థానమునందు మనిషి మేథస్సుకు సంబంధించిన కర్మలుండును. అలాగే కాలచక్రములోని పన్నెండు గ్రహములలో బుద్ధికి అధిపతియైనవాడు చంద్రుడు. జాతకచక్రములో చంద్రుడు ఐదవ స్థానములో ఉన్నా లేక చంద్రుని హస్తము అక్కడున్నా అటువంటి వ్యక్తులు మంచిబుద్ధిగలవారై ఉందురు. ఐదవ స్థానము కాకుండ మిగతా పాపస్థానములైన 3,7,11 స్థానములలో ఉండినట్లయితే ఉన్న స్థానమునుబట్టి పూర్తి తెలివితక్కువగా యుండును. చంద్రునితోపాటు శత్రు గ్రహములు కలిసిన అక్కడ కలిసిన గ్రహములనుబట్టి తెలివితక్కువ తనముండును. చంద్రునితోపాటు బుధుడు శత్రువై కలిసియుండడము వలన వ్యాపారములో తెలివితక్కువగాయుండు నని తెలియవచ్చును. అట్లే ఆయా గ్రహములనుబట్టి చెప్పవచ్చును.

**10) కొందరు కాలము కర్మ అనుచుందురు. మీరు కాలచక్రము, కర్మచక్రము అన్నారు. అవి కనిపిస్తాయా?**

**జ॥** ఏ మనిషికైనా ఏ కర్మయున్నదీ తెలుసుకొనుటకు వీలుపడదు. ఎందుకనగా జాతక చక్రములోనున్న గ్రహములను కాలచక్రములోని లగ్నములందున్నట్లు చెప్పుకొంటున్నాముగానీ, రాశులలోనని చెప్పలేదు. రాశులు కర్మచక్రములో, లగ్నములు కాలచక్రములో ఉంటాయి అని చెప్పుకొన్నాము. రాశియే కనిపించనప్పుడు దానిలోని కర్మ కూడా కనిపించదు కదా! జన్మకుండలిలో వ్రాసుకొను భాగములను జన్మలగ్న

కుండలి అంటున్నాము. అంతేగానీ జన్మరాశికుండలి అని అనడములేదు. పంచాంగమును ఉపయోగించి వ్రాసుకొన్న లగ్న కుండలిలో గ్రహములు తెలియుచుండునుగానీ, కర్మ కనిపించడము లేదు. అయినా ప్రతి పనికీ కర్మే కారణమంటున్నాము, గ్రహమే కారణమనడములేదు. కర్మ ఉన్నది గానీ కనిపించడము లేదు. గ్రహములు మాత్రము కనిపిస్తున్నవి గ్రహములు ఉన్నది కాలచక్రములో, అయితే చక్రములోని గ్రహములు కనిపిస్తున్నవిగానీ, కాలము కనిపించడములేదు. కాలము క్రిందనున్న కర్మచక్రము కనిపించుచున్నదిగానీ అందులోని కర్మ కనిపించడము లేదు. క్రిందికి వస్తే గుణచక్రమూ కనిపించడము లేదు. అందులోని గుణములుగానీ, జీవుడుగానీ ఎవరికీ ఏమాత్రము కనిపించడము లేదు. పైనగల కాల చక్రములో చక్రమూ, చక్రములోని గ్రహములూ కనిపించగా, కాలము కనిపించడములేదు. క్రిందయున్న కర్మచక్రములో చక్రము మాత్రము కనిపించుచున్నదిగానీ, చక్రములోని కర్మ కనిపించడములేదు. ఇక ఇంకా క్రిందికిపోతే గుణచక్రమున్నది. అయితే అక్కడ చక్రమూ కనిపించడము లేదు. అందులోని గుణములూ కనిపించడములేదు. గుణములలోనున్న జీవుడూ కనిపించడము లేదు. మనము బాగా మనోదృష్ఠి పెట్టి ఆలోచించాలి. పైనగల కాలచక్రములో చక్రమూ గ్రహములు రెండూ కనిపించగా, దాని క్రిందగల కర్మచక్రములో చక్రము మాత్రము కనిపించగా, దానికంటే క్రింద గుణచక్రము, గుణములు, జీవుడులో ఏ ఒక్కటీ కనిపించలేదు. దీనినిబట్టి పైకి పోయేకొద్దీ దృష్ఠి పెరుగుతుందనీ, క్రిందికి వచ్చేకొద్దీ దృష్ఠి తరుగుతుందనీ అర్థమగుచున్నది. మీకు అర్థమైనా అర్థముకాకున్నా మేము చెప్పునదే మనగా, కాలమూ కనిపించదు, కర్మమూ కనిపించదు. కాలము కర్మ ఎవరి కోసమున్నాయో ఆ జీవుడూ అక్కడేయున్న గుణములూ ఏమాత్రము

కనిపించవు. **ప్రపంచములో ఏ మనిషీ ఈ మూడునూ చూడలేదు.** అయితే ఇప్పుడు కొందరు తెలివిగా నన్ను ఒక ప్రశ్నను అడుగవచ్చును. అదేమనగా! "మీరు వ్రాసిన గ్రంథములలో ఇది కాలచక్రమని, దానిక్రింద ఇది కర్మ చక్రమనీ, దానిక్రింద గుణచక్రమని బొమ్మవేసి చూపి అందులో జీవుడిట్లున్నా డనీ, గుణములు ఇట్లున్నవనీ బొమ్మతో సహా చూపారు. ఏ మనిషీ చూడలేదని చెప్పిన మీరే ఆ బొమ్మలను చూపారు కదా! గుణచక్రము అందులోని మూడు భాగములు ఎట్లుండునో తెలియని మాకు గుణభాగము లనూ జీవుని ఆకారమునూ చూపారు కదా!" అని అడుగవచ్చును. దానికి మా జవాబు ఇలాయున్నది చూడండి. ప్రపంచములో ఏ మనిషీ చూడలేదు అనేమాట బ్రహ్మవిద్యా శాస్త్రములోని శాసనము. ఆ శాసనము ఎప్పటికీ మారదు, అసత్యమూ కాదు. అయితే మీరెలా చెప్పారు? అని మీరు అడిగినది హేతుబద్ధమే అయినా దానికి నేను కూడా హేతుబద్ధముగానే సమాధానము ఇస్తున్నాను. అక్కడ వాక్యములో ఏ మనిషీ చూడలేదు అన్నమాటను చూచిన తర్వాత మీకు మరొక జ్ఞప్తి కూడా రావలసింది. జనన మరణ సిద్ధాంతమును చెప్పినప్పుడు ఈ విషయము ప్రపంచములో పుట్టినవానికి ఎవనికీ తెలియదని చెప్పినప్పుడు ఇప్పుడు అడిగిన ప్రశ్న అప్పుడే అడుగవలసింది. అయినా ఫరవాలేదు. ఇప్పుడు అడిగారు కాబట్టి సంతోషిద్దాము. **జనన మరణ సిద్ధాంతము**లోని విషయముగానీ, ఇప్పుడు చెప్పిన కాలము, కర్మము చెప్పిన విషయముగానీ ఏ మనిషికీ తెలియదు అని చెప్పినప్పుడు ఇది ఒక మనిషి చెప్పిన విషయమని మీరెలా అనుకుంటు న్నారు? మీకు కనిపించేది మనిషే అయినా నేను చెప్పినట్లు అనుకోవడము మీ పొరపాటు. నేను ఎన్నోమార్లు చెప్పాను. ఇప్పుడు కూడా గుర్తు చేయుచున్నాను. నాకు ఏమీ తెలియదు. అందువలన ఎవరికీ తెలియదని

చెప్పిన దేవునిమాట వాస్తవము. ఏ రహస్యమైనా మన శరీరములోనున్న ఆత్మకే తెలుసు.

ఆత్మ అందరినీ నడిపించుచూ ఇటు జీవునిగా అటు దేవునిగా భ్రమింపజేయుచూ, తాను మాత్రము ఎవరికీ తెలియక నిశ్శబ్ధముగా యున్నది. అన్నిటికీ అధిపతియైన దేవుడు తనకు మనకు మధ్యలో ఆత్మనుంచి సాక్షిగా వినోదమును చూస్తున్నాడు. ఎలాగైతేనేమి, అన్నీ తెలుసుననుకొన్న జీవునికీ ఏమీ తెలియదని నిజంగా ఏ జీవునికీ తెలియదు. అందువలన కాలము ఎవరికీ తెలియదు. అట్లే కర్మ కనిపించడము లేదు. జీవుడు, గుణములను స్వయముగా ఎవరూ చూడలేదు. మేము చూపితే మీరు చూడగలిగారు, మేము చెప్పితే వినగలిగారు. అంతేగాని దేవుని మాట ప్రకారము మేము తప్ప ఎవరూ స్వయముగా చూడలేదని చెప్ప వచ్చును.

**11) మాకు జ్యోతిష్యము తెలియాలంటే ఈ గ్రంథము చదివితే అర్థమవుతుందా?**

**జ॥** సహజముగా ఎవరి గ్రంథమును వారు గొప్పగా చెప్పుకొందురు. అందువలన ఈ గ్రంథము చదివితే బాగా అర్థమవుతుందని నేను చెప్పినా, అది అర్థమగుటకూ, అర్థము కాకుండుటకూ ఒక విధానమును అనుసరించి చూస్తే ద్వాదశ గ్రహములలో ఒక బుధగ్రహము అనుకూలము లేనప్పుడు జ్యోతిష్యము అర్థముకాదు. బుధగ్రహము జన్మ లగ్నమున అనుకూలమైన మిత్ర గ్రహమై ఐదవస్థానములో ఉన్నా, తన చేతితో తాకినా, అటువంటి జాతకునికి జ్యోతిష్యము మీద ఆసక్తికల్గి దానిని తెలియునట్లు చేయును. ఆసక్తి పెరుగుకొద్దీ జ్యోతిష్య శాస్త్రము అర్థమగుచూవచ్చును. ఏదీ ఒక్కమారు రాదు కాలక్రమేపీ రాగలదు.

**12) గతములో చాలామంది జ్యోతిష్యశాస్త్ర రచయితలు వారివారి గ్రంథములైన జ్యోతిష్య ఫలగ్రంథము, యవన జాతకము, జాతక మార్తాండము, జాతక చంద్రిక మొదలగు పుస్తకములందు సూర్యుడు, కుజుడు, శని, రాహువు, కేతువులను క్రూరులనీ, బుధ, గురు, శుక్ర, చంద్రులను సౌమ్యులనీ చెప్పారు. ఇంకనూ చాలా పుస్తకములలో ఈమాటే ఉన్నది. వేరు జ్యోతిష్యులందరూ ఈ విషయమునే చెప్పుచున్నారు. అది ఎంతవరకు వాస్తవము?**

**జ॥** అది ఏమాత్రమూ వాస్తవము కాదని చెప్పుచున్నాము. మంచి పనిని చేయువారిని శుభులనీ, చెడు పనిని చేయువారిని అశుభులనీ అనవచ్చును. కాలచక్రములోని గ్రహములు కొన్ని పుణ్యమును పాలించునవిగ, కొన్ని పాపమును పాలించునవిగ ఉన్నమాట వాస్తవమే.

పాపమును పరిపాలించువారిని క్రూరులు, పాపులు, అశుభులు, శత్రువులు అని పిలువవచ్చును. అలాగే పుణ్యమును పాలించువారిని సౌమ్యులు, పుణ్యులు, శుభులు, మిత్రులు అని పిలువవచ్చును. గ్రహములు రెండు గుంపులుగా ఉండడము వాస్తవమే అయినప్పటికీ, ఒక లగ్న జాతకునకు పాపమును పాలించుచు క్రూరులుగా ఉండినవారే మరొక లగ్న జాతకునకు పుణ్యమును పాలించువారై సౌమ్యులుగా ఉన్నారు. జాఫతక లగ్నములను బట్టి కొందరికి శాశ్వితముగా క్రూరులుగానున్న గ్రహములు, మరొక జాఫతక లగ్నమును బట్టి మరికొందరికి శాశ్వితముగా సౌమ్యులుగా ఉన్నారు. అందువలన అందరికీ శాశ్వితముగా క్రూరగ్రహములు లేవు, అట్లే సౌమ్య గ్రహములు లేవు. అలా అందరికీ శాశ్వితముగా కొన్ని గ్రహములు క్రూరులుగా ఉన్నారని అంటే, అది శాస్త్రబద్ధత లేకుండా ఇష్టమొచ్చినట్లు చెప్పినదగును. జ్యోతిష్యము

షట్‌శాస్త్రములలో ఒక శాస్త్రము కావున సూత్రబద్ధత కల్గియున్నది. 2:1 అను సూత్రము ప్రకారము, మిత్రులు శత్రువులు అను రెండు వర్గములను విభజించాము. దానిప్రకారము ఒకనికి మిత్రులైన గ్రహములు మరొకనికి శత్రువులు కావచ్చును. ఆరు లగ్నములకు శత్రువులై, క్రూరులుగా వర్తించు గ్రహములు, మరొక ఆరు లగ్నములకు మిత్రులై, సౌమ్యులుగా వర్తించుచున్నారు. ఒక శాస్త్రమును అనుసరించి, అందులోనూ ఒక సూత్రమును అనుసరించి ఎవరు ఎవరికి సౌమ్యులో, ఎవరు ఎవరికి క్రూరులో మేము వివరించి చెప్పాము. అట్లుకాక ఏ లగ్నమునూ ఆధారము చేసుకొని చూడక, ఏ సూత్రమునూ అనుసరించకుండ రవి, శని, కుజ, రాహు, కేతువులను క్రూరులనడము, గురు, బుధ, శుక్ర, చంద్రులను సౌమ్యులు అనడము పూర్తి శాస్త్రవిరుద్ధమని చెప్పుచున్నాము. సంస్కృతములో ఇష్టమొచ్చినట్లు శ్లోకములను అల్లి చెప్పినంతమాత్రమున అందులో శాస్త్రీయత లేకపోతే అది వాస్తవము కాదు. ఇక్కడొక ఉదాహరణను చూస్తాము.

*శ్లో॥ దుఃఖావహా ధనవినాశకరాః ప్రదిష్టా విత్తస్థితా రవిశనైశ్చర భూమిపుత్రాః*
*చంద్రోబుద్ధస్సుర గురుర్భృగునందనోవా, సర్వేధనస్య నిచయల కురుదే ధనస్థాః*

**తాత్పర్యము :** ద్వితీయ స్థానములో రవి,శని,కుజులలో ఎవరున్ననూ ధననాశనమును, అధికదుఃఖమును కల్గించి బాధింతురు. చంద్ర,బుధ, శుక్రులలో ఏ ఒక్కరున్ననూ ధనలాభమును కలిగింతురు.

ఈ శ్లోకమూ దాని తాత్పర్యమూ "యవన జాతకము" అను పుస్తకములో వ్రాయబడియున్నది. ఇందులో మేము అడుగునదేమనగా! ద్వితీయమున చెడు గ్రహములుంటే, ధన నాశనము దుఃఖము కల్గుననుట ఒప్పుకుంటాను. కానీ ఏ లగ్నము ద్వితీయమున వీరు చెప్పిన గ్రహములు

ఉన్నారో చెప్పకపోవడము, మరియు రవి, శని, కుజులు, ఏ లగ్నమునకు క్రూరులో, ఎట్లు క్రూరులైనారో చెప్పకపోవడము పూర్తి అశాస్త్రీయత అని చెప్పవచ్చును. మేము 2 :1 అను ఆత్మల సూత్రమును అనుసరించి గ్రహములను రెండు గుంపులుగా చేశాము. వాటినే గురువర్గము, శని వర్గము అని కూడా చెప్పాము. శని, బుధ, శుక్ర, రాహువులను ఒక గుంపులో; సూర్య, చంద్ర, కుజ, గురు, కేతులను ఒక గుంపులో ఉన్నాయని మేము చెప్పితే జ్యోతి తెలియనివారు రెండు గుంపులలోని వారిని కలుపుకొని సూర్య, కుజ, శని, రాహు,కేతులను క్రూరులన్నారు. ఇందులో మా లెక్కప్రకారము సూర్య, కుజ, కేతువులు గురువర్గములోనివారు కాగా, ఈ ముగ్గురిలో ప్రతిపక్ష గుంపులోని రాహువు,శని కలిసిపోవడము పూర్తి తప్పు. అంతేకాక 1×7 అను సూత్రము ప్రకారము సూర్యునకు బద్ధ శత్రువు శని అగును. అలాగే శనికి బద్ధశత్రువు సూర్యుడగును. అటువంటివారు ఒక గుంపులో క్రూరులుగా ఉన్నారని చెప్పడము అసంబద్ధము, అశాస్త్రీయము. అందువలన సంస్కృత శ్లోకములోనున్న తప్పుడు సమాచారమును నమ్మ వద్దండి. ఇటువంటి అశాస్త్రీయత జ్యోతిష్యములో కనిపిస్తున్నది. కావున నేటి హేతువాదులు, నాస్తికవాదులు జ్యోతిష్యము శాస్త్రము కాదంటున్నారు. టీవీ9 వారు జ్యోతిష్యము మూఢనమ్మకము అంటున్నారు. అందువలన **మేము పూర్తి శాస్త్రీయతతో ఈ గ్రంథమును వ్రాసి, జ్యోతిష్యశాస్త్రము షట్‌శాస్త్రములలో ఐదవశాస్త్రమని చెప్పుచున్నాము.**

**13) ఇంతవరకు చెప్పిన అతిరథులు, మహారథులు గ్రహములు తొమ్మిదే అని చెప్పగా, ఎవరూ చెప్పని మూడు గ్రహములను మీరు చెప్పారు. మీరు ఎక్కడా ఎవరికీ జ్యోతిష్యము చెప్పినది కూడా లేదు. భవిష్యత్తు (జ్యోతిష్యము) చెప్పు అనుభవముగానీ, అలవాటుగానీ లేని మీరు ఏకంగా**

**ద్వాదశ గ్రహములను ప్రకటించి, జ్యోతిష్య గ్రంథమును శాస్త్రబద్ధముగా, సూత్ర యుక్తముగా వ్రాస్తున్నామంటున్నారు. ఇది సంభవమగునా?**

**జ॥** ఇంతవరకు చెప్పినవారు రథులో, అతిరథులో, మహారథులో, వీరులో, శూరులో నాకు తెలియదు. జ్యోతిష్యములో నేను మాత్రము కేవలము రథుడను కూడా కాను. అటువంటపుడు నీవు వ్రాయునది సక్రమమేనా? అని నన్ను అడుగుటలో మీ తప్పేమీలేదు. మీ ప్రశ్నకు మేము చెప్పు సమాధాన మేమనగా! నాకు జ్యోతిష్యము తెలియదు కానీ, నా శరీరములో నా ప్రక్కనేయున్న వానికి, షట్‌శాస్త్రములు సంపూర్ణముగా తెలియును. ఇక్కడ ఒక సూత్రమును ఉదహరించితే ఒక ఇనుప ముక్క ప్రక్కలో అయస్కాంతము ఉండినా, ఒకవేళ అయస్కాంతము ప్రక్కలో ఇనుపముక్క ఉండినా ఇనుప ముక్కే అయస్కాంతముగా మారుతుంది, కానీ అయస్కాంతము ఇనుప ముక్కగా మారదు. అలాగే ఒక తెలియని వాని ప్రక్కలో తెలిసినవాడుండినా, ఒకవేళ తెలిసినవాని ప్రక్కలో తెలియని వాడుండినా, తెలియనివాడే తెలిసినవాడుగా మారును. కానీ తెలిసినవాడు తెలియనివానిగా మారడు. ఈ సూత్రము ప్రకారము, నేను జ్యోతిష్యము తెలియనివాడినే, కానీ జ్యోతిష్యము తెలిసినవాని ప్రక్కన ఉన్నాను. కనుక అసలైన జ్యోతిష్యమేమిటో నాకు తెలిసింది. ఇద్దరము కలిసి మీకు చెప్పగలుగుచున్నాము. ఈ సూత్రము ప్రకారమే సైన్సు అభివృద్ధి కాని పురాతన కాలములోనే, పాశ్చాత్యులు గుడ్డలు కూడ కట్టని అనాగరిక కాలములోనే, ఖగోళ పరిశోధనలు లేని కాలములోనే, ఏ వ్యోమనౌకలు ఆకాశములోనికి పోని కాలములోనే, కొందరు మహర్షులు తొమ్మిది గ్రహములనూ, వాటి వేగమునూ, గ్రహణములనూ పసిగట్టి చెప్పగలిగారు. తమ ప్రక్కవానిని గుర్తించినవారు ప్రక్కవాడు చెప్పినట్లే చెప్పారు. ఈనాడు

ఎంతో వ్యయప్రయాసలతో ఆకాశములోనికి ఉపగ్రహమను రాకెట్ పంపి, కుజగ్రహము ఎర్రగ ఉన్నదని, ఇప్పుడిప్పుడు ఖగోళశాస్త్రజ్ఞులు చెప్పు చున్నారు. కుజగ్రహము ఎర్రగ ఉన్నదని కొన్ని లక్షల సంవత్సరముల పూర్వమే మన మహర్షులు చెప్పారు. ఏ శాస్త్రమూ అభివృద్ధికాని ఆ కాలములోనే, వారు చంద్రుడు తెల్లని చౌడు భూమియని కూడా చెప్పారు. వారు ఆ రోజులలో వారి ప్రక్క వానిని గుర్తించి, వాడు చెప్పినట్లు చెప్పారు తప్ప, వారు చంద్రుని మీదికి, కుజుని మీదికి పోయి చూడలేదు. అలాగే వారు చెప్పిన పద్ధతి ఏదో, దాని ప్రకారము నా శరీరములో, నా ప్రక్కనేయున్న వాని సహకారముతోనే, నేడు నేను గ్రహములు తొమ్మిది కాదు మొత్తము పంద్రెండని చెప్పుచున్నాను. అర్థమైందా, ఇంకా ఏమైనా అనుమానముందా? ప్రక్కవాడు మీలో కూడా ఉన్నాడు, కానీ మీలో మీరు తప్ప ఎవరూలేరను గ్రుడ్డితనములో ఉన్నారు. కావున ప్రక్కవానిని విస్మరించిపోయారు. వానిని తెలియాలంటే 'జ్ఞానాంజనము' అను కాటుక కావాలి. కాటుకతోనే గ్రుడ్డితనము పోయి అతడు కనిపిస్తాడు. జ్ఞానాంజనము కావాలంటే ఎటు తిరిగీ షట్శాస్త్రములలో చివరి ఆరవ శాస్త్రమైన బ్రహ్మవిద్యాశాస్త్రమును తెలిసి తీరాలి. అదెక్కడుండేది మాకు తెలియదే అనుకోవద్దండి. అదియే భగవద్గీత. సూటిగా చెప్పాలంటే అదే **"త్రైతసిద్ధాంత భగవద్గీత"**. దానిని చదివితే మీలోనే మీ ప్రక్కనేయున్న వాడు తెలియును. వానిని తెలుసుకొంటే వాని ద్వారా ఏ రహస్యమైనా తెలుసుకోవచ్చును.

**14) ఒక వ్యక్తి వ్యవసాయము కొరకు బావి త్రవ్వితే నీరు రాలేదు. బోరువేస్తే నీళ్ళు పడినాయికానీ బోరు పూడిపోతున్నది దానివలన నీళ్ళు రాలేదు. రెండుచోట్ల బోరువేసినా అట్లే అయినది. అతనికి నీరు అనుకూలము లేదా?**

జ॥ నీరుగానీ, నిప్పుకానీ, ప్రపంచములో ఏ వస్తువుగానీ, అన్నియూ గ్రహముల ఆధీనములో ఉండును. ఎవరికీ నీళ్ళు అనుకూలము అనాను కూలము లేదు అనుట సరియైనది కాదు. ఎందుకనగా నీరు చంద్రగ్రహము యొక్క ఆధీనములో ఉండును. చంద్రగ్రహము అనుకూలము ఉంటే నీళ్ళు అనుకూలమగును. చంద్రుడు అనుకూలము లేకపోతే నీరు అనుకూలము ఉండదు. ఏ వస్తువుకైనా ఆ వస్తువు యొక్క అధిపతి గ్రహము ఎవరో ఆ గ్రహము అనుకూలము అనానుకూలము మీద ఆధారపడి ఆ వస్తువు లభించేది, లభించనిది తెలియును. లభించినా మంచిది లభిస్తుందా లేదా అను విషయము కూడా ఆ గ్రహమునుబట్టి మరియు ఆ గ్రహముతో కలిసిన మిగతా గ్రహములనుబట్టి, ఆ వస్తువున్న రాశి స్థానమునుబట్టి వస్తువు లభ్యమగునా లేదాయని లభ్యమైనా ఎటువంటిది లభ్యమగునని తెలియ గలదు. చంద్రుడు అనుకూలమున్నట్లయితే బావిని త్రవ్వినా, బోర్లు వేసినా నీళ్ళు సులభముగా లభ్యమగును. ఒకవేళ చంద్రుడు శత్రు గ్రహమైతే నీళ్ళు పడవు. చంద్రుడు శత్రుగ్రహమై నాల్గవ స్థానమును తాకినప్పుడు లేక నాల్గవ స్థానములోనేయున్నప్పుడు అతని నివాసగృహములో కూడా నీళ్ళు అనుకూలముగా ఉండవు. వర్షము వస్తే ఏదో ఒక విధముగా నీరు ఇంటిలోనికి వస్తుంది. ఎంతమంచి ఇల్లయినా చంద్రుడు సరిగా లేకపోతే ఆ ఇల్లు నీరుకారే ఇల్లుగా ఉండును. అదంతయు బాగుంది అంటే బాత్‌రూమ్‌లో నీళ్ళు రాకుండాపోవడమో లేక మురికినీరు బయటికి పోకుండా ఉండడమో జరుగును. ఒకదానిని సరిచేస్తే నీటిని గురించిన క్రొత్త సమస్యలు వస్తూనే ఉండును. మంచినీరులో ఉప్పునీరు మిశ్రమమై కూడా వచ్చును. అట్లే బోరు నీళ్ళలోనికి మురికినీరు చేరి అదే నీరు రావచ్చును. ఇట్లు అనేక నీటి సమస్యలు రాగలవు.

**15) కొంతమంది తమ పొలము దగ్గర దారి సరిగా లేక ఇబ్బంది పడుచుందురు. అట్లే కొంతమంది తమ ఇంటివద్ద దారిలేక ఇబ్బంది పడుచుందురు. అదెందుకు జరుగుచుండును?**

**జ॥** ప్రపంచములో ప్రతి దానికీ గ్రహములే అధిపతులు. అట్లని గ్రహములను దేవుళ్ళని అనుకోకూడదు. ప్రభుత్వము నుండి కరువు సహాయము అందినప్పుడు మొదట ఆ డబ్బు జిల్లా కలెక్టర్‌వద్దకు వచ్చి, కలెక్టర్‌నుండి మండల ఆఫీసర్‌వద్దకు వచ్చి చివరకు బ్యాంకు క్యాషియర్ ద్వారా నీకు వచ్చినదనుకొనుము. ప్రతి సహాయము ఎక్కడినుండి డబ్బు వచ్చినా బ్యాంకు క్యాషియర్ నుండే తీసుకోవలసియున్నది. అట్లని క్యాషియర్‌నే ప్రభుత్వము అనుకోకూడదు. అలాగే గ్రహములు ఉన్న కర్మను ఇచ్చు క్యాషియర్‌లాంటివి. మనిషికి సృష్టినుండి ఏది లభించినా గ్రహముల ద్వారానే లభించాలి. గ్రహములన్నియూ ప్రకృతి ఆధీనములో ఉండగా, ప్రకృతి పరమాత్మ ఆధీనములో ఉన్నది. చివరికి అన్నిటికీ పెద్ద దేవుడే. ఇప్పుడు అసలు విషయానికి వస్తే భూమిమీద దారులన్నీ కుజగ్రహము ఆధీనములో ఉండును. జాతకములో కుజగ్రహము వ్యతిరేఖియై నాల్గవ స్థానములోయున్నా, నాల్గవ స్థానమును తన చేతితో త్రాకినా, పొలములు గృహముల దారులలో ఆటంకములు ఏర్పడును. తరచూ త్రోవలకు సంబంధించిన పేచీలు వచ్చుచుండును. కుజుడు దక్షిణ దిశకు అధిపతి యైనందున దక్షిణ దిశకున్న దారులలోనే ఎక్కువ పేచీలు వచ్చును. దారులేకాక ఇళ్ళు కూడా దక్షిణమువైపు కృంగుటయో లేక దక్షిణవైపు గోడలు చీలుటయో జరుగుచుండును. ఇటువంటి కుజ దోషములకు ఏ గృహశాంతులుగానీ, అష్టదిగ్బంధన యంత్రములుగానీ, ఏ విధమైన ఉపశమన మార్గములూ పనికిరావు.

**16) కొందరు ఎంత సంపాదించినా చివరకు డబ్బులతో ఇబ్బంది పడుచుందురు. ఎప్పుడూ అప్పులలో కూరుకుపోయివుందురు. అదెందుకు జరుగుచున్నది?**

జ॥ "ధనమూల మిదమ్ జగత్" అని కొందరనుచుందురు. ప్రతి దానికీ ధనమే మూలమైనదిగా కనిపించుచుండినా, ధనమునకు మూలము శుక్రగ్రహము మరియు గురుగ్రహమని చెప్పవచ్చును. గురుగ్రహము డబ్బును నిలువజేసి ధనికులను చేయును. శుక్రగ్రహమైతే డబ్బును నిలువ చేయక ప్రవాహములాగ కదలించుచూ డబ్బు ద్వారా అన్ని సుఖములను అనుభవింపజేయును. అందువలన కదలే డబ్బుకు శుక్రగ్రహము, కదలని డబ్బుకు గురుగ్రహము అధిపతులుగాయున్నారు. ఈ రెండు గ్రహములు వారి జాతకములో వ్యతిరేఖ స్థానములలో ఉండినా, వ్యతిరేఖ గ్రహములతో కలిసినా డబ్బు వస్తున్నా అది తమవద్ద నిలువక అవసరములకు తక్కువ వస్తూ ఇబ్బంది పడవలసివచ్చుచుండును. గురు, శుక్రులు జాతకునకు అనుకూలముగాయుండిన, అంటువంటివారు డబ్బుతో ఏ ఇబ్బందులూ పడకుండా బ్రతుకుచుందురు.

**17) కొందరు పేదవారైనా వారికి స్వంత ఇల్లు ఉండును. కొందరు ధనికులైనావారికి స్వంత ఇల్లు ఉండదు. దానికి కారణమేమి ఉండవచ్చును.**

**జ॥** స్వంత ఇల్లుగానీ, స్వంత భూములుగానీ అన్నియు స్థిరాస్తులు అనబడును. స్థిరాస్తులకు స్థానము జన్మకుండలిలో నాల్గవ స్థానము. అక్కడ ఒక శుభగ్రహమున్నట్లయితే అతనికి స్వంత ఇల్లు మొదలగు స్థిరాస్తులు కల్గును. అక్కడ అశుభగ్రహముండినట్లయితే స్వంత స్థిరాస్తులు ఏమీ ఉండవు. జాతకములో నాల్గవ స్థానములో ఒక మంచి గ్రహమున్నా లేక

తాకినా అతనికి స్వంత గృహముండును. అట్లు గ్రహచారము మంచిగా లేని వానికి స్వగృహముండదు.

**18) మీరు మూడు కొత్త గ్రహములను గురించి చెప్పారు. వాటి ప్రభావము అందరిమీదా ఉంటుందా? లేక కొందరిమీదనే ఉంటుందా?**

**జ॥** అందరిమీదా సమానముగా వాటి ప్రభావముంటుంది. కొందరి మీద వాటి ప్రభావముండి కొందరి మీద ఉండదనుటకు అవకాశమేలేదు. ఇంతవరకు ఏ గ్రహమూ అట్లు ఉండలేదు. అన్ని గ్రహములు అందరికీ సమానముగా ఉన్నాయి.

**19) క్రొత్త గ్రహములను అందరూ ఒప్పుకుంటారా? మీ మాట సత్యమని నమ్ముతారా?**

**జ॥** ఒప్పుకోవడమూ, ఒప్పుకోక పోవడమూ నాకు సంబంధములేదు. నా మాట సత్యమని కూడా నేను చెప్పను. దేవుడు చెప్పిన జ్ఞానాన్నే కొందరు ఒప్పుకొంటున్నారు. కొందరు ఒప్పుకోవడములేదు. అటు వంటపుడు దేవుని జ్ఞానాన్నే ఒప్పుకోని వారున్నప్పుడు, నా జ్ఞానాన్నిగానీ, నా సూత్రములనుగానీ ఒప్పుకోమని నేను చెప్పడము లేదు. తెలుసుకోండి యని, ఆలోచించండని మాత్రమే చెప్పుచున్నాము.

**20) పదిహేను రోజుల క్రిందట హైదరాబాద్ హైవే మీద బస్సు అంటుకొని కాలిపోయింది. అందులో 44 మంది చనిపోవడము జరిగినది. డ్రైవర్ క్లీనర్ తప్ప వారితోపాటు తప్పించుకోగల్గిన ఇద్దరికీ కూడా కొద్దిగా కాలడము జరిగినది. తెల్లవారుజామున ఐదు గంటలప్పుడు పోతూవున్న బస్సుకు కొద్దిగా ప్రమాదము జరిగి అంతమంది చనిపోవడము జరిగినది**

**కదా! అక్కడ చనిపోయినవారి గ్రహచారములను చూస్తే ఒక్కొక్కరికి ఒక్కొక్క రకముగాయుండును. అటువంటప్పుడు, అందరికీ కర్మ ఒకే విధముగా లేదని తెలియుచున్నది. అందరి కర్మ ఒకే విధముగా వారి జాతకములలో లేకున్నా అందరూ ఒకేచోట బస్సులోనే బయటపడకుండా చనిపోవడమునకు కారణమేమి? మేము ఈ విధముగానే ప్రశిస్తే చాలామంది జ్యోతిష్యులు సరియైన జవాబు చెప్పలేదు. మీరు మా ప్రశ్నకు సరియైన జవాబు చెప్పగలరా?**

**జ॥** చివరిలో మా ప్రశ్నకు మీరు జవాబు చెప్పగలరా? అని అడిగారు. వారు చనిపోయినందుకు జవాబు చెప్పాలా? లేక మీరు చెప్పగలరా. చెప్పలేరా అను ప్రశ్నకు జవాబు చెప్పాలా? దేనికి జవాబు కావాలో ముందు మీరు చెప్పితే తర్వాత నేను చెప్పగలనో లేదో చెప్పగలను.

## 21) మేము చివరిగా అడిగిన మాటకు మీరు చెప్పగలరా అనుమాటకే జవాబు చెప్పండి?

**జ॥** మీరు చేపలు అమ్మే వానివద్దకు పోయి "నీవు నాకు కావలసిన చేపను అమ్మగలవా" అని అడిగినట్లున్నది. చేపల వానిదగ్గర అన్ని రకముల చేపలూ ఉంటాయి. ముందు నీకు కావలసిన చేప ఏదో అడిగితే బహుశా ఉంటే ఇస్తాము, లేకపోతే లేదు అని చెప్పుతారు. అట్లు కాకుండా ముందే నాకు కావలసిన చేప అంటే తిరిగి నేను ఏ చేప అని అడగడము తర్వాత నీవు చెప్పడము దానికి బదులుగా అప్పుడు నేను చెప్పడము జరుగవలెను. అంత రాద్ధాంతము లేకుండా నీకు కావలసిన సిద్ధాంత చేప ఏదో చెప్పితే నావద్ద ఉత్త చేపలున్నాయో, సిద్ధాంత చేపలున్నాయో నాకు కూడా తెలిసి పోతుంది కదా! ఇప్పుడు మీరు అడిగిన ప్రశ్న సూత్రబద్ధమైనది. దానికి

నావద్దయున్నవన్నీ సిద్ధాంతబద్ధమైనవి, సూత్రబద్ధమైనవి కావున మేము సులభముగా చెప్పగలము. అదే ప్రశ్ననే మరియొకమారు చిన్నచిన్న ప్రశ్నలుగా అడుగు.

**22) ఒకే సమయములో, ఒకే విధ కర్మలేనివారికి, వేరువేరు కర్మలున్న వారికి ఒకే ప్రమాదము జరుగగలదా?**

**జ॥** ఇప్పుడు నాది జవాబు కాదు ప్రశ్న. ఒకే కర్మయనిగానీ, వేరువేరు కర్మలనిగానీ అనుటకు కర్మలేమైనా కనిపిస్తాయా? కనిపించని దానిని మీరు ఎలా నిర్ధారణ చేసి చెప్పుచున్నారు? ఇది నా తరపున ప్రశ్న అయినా దీనికి మీరు జవాబు చెప్పలేరు. ఎందుకనగా కర్మలు ఎవరికీ కనిపించవు. కనిపించని కర్మలను గురించి అపోహపడే దానికంటే కర్మలను మించినది, కర్మలను చూడగల్గునది మరొకటి గలదు. అదియే దేవునిజ్ఞానము. దేవుని జ్ఞానము కల్గి చూడగల్గితే వారు అందరూ అలా చనిపోవడానికి కారణము తెలియగలదు. మేము చెప్పినదానినే అందరూ నమ్మాలి అని నేను చెప్పడము లేదు. ఎందుకనగా మేము చెప్పేమాట అందరికీ అర్థము కాకపోవచ్చును. అర్థము కాకపోయినప్పుడు నమ్ముటకు అవకాశము ఉండదు. అందువలన నేను చెప్పునది అందరికీ జవాబు కాదు. అర్థముకాగల కొందరికి మాత్రమే జవాబని తెలియాలి. నాకు తెలిసినంతవరకు దేవునికి తెలియకుండా ఏమీ జరుగదు. దేవుడు అన్నిటికీ సాక్షి అనికూడా మరువకూడదు. బస్సులో చనిపోయినవారందరూ తమ మరణమును ఊహించుకొని ఉండరు. వారి కర్మప్రకారము వివిధ పనుల నిమిత్తము బయలుదేరిన వారికి కర్మలన్నీ ఒకే విధముగా కూడా లేవు. వాస్తవముగా వారి కర్మప్రకారము వారు హైదరాబాద్ పోయి వివిధ పనులలో లగ్నము కావలసియున్నది. వాస్తవముగా మీరు అనుకొన్నట్లే ఆ సమయమునకు చనిపోవునట్లు ఎవరి

కర్మాలేదు. అయినా చనిపోయారు. కర్మ మినహా జరుగదని కర్మ సిద్ధాంతమున్నప్పుడు వారి కర్మప్రకారము వారు హైదరాబాద్ పోకుండా మధ్యలో చనిపోవడమేమిటని మాకు కూడా ప్రశ్న వచ్చినది. శాస్త్రము శాసనముగా జరిగితీరును. కర్మసిద్ధాంతము ప్రకారము కర్మవేరుగా యున్నప్పుడు, జరగరానిది ఎలా జరిగిందను ప్రశ్న ఎవరికైనా రాక తప్పదు. ఒక సంఘటన జరిగిందంటే అది సత్యమే. జరిగినది సత్యమే అయినప్పుడు దానిని శాస్త్రము అంటాము. ఎందుకనగా శాస్త్రము అనగా సత్యము అనియు, సత్యము అనగా శాస్త్రము అనియూ సూత్రము గలదు. శాస్త్రము ప్రకారము వారి పనులు హైదరాబాద్‌లో జరుగవలసియుండగా దానిని కాదని మధ్యలో ప్రమాదము జరిగినది. జరిగినది ప్రత్యక్ష సత్యము కావున అదియూ శాస్త్రము ప్రకారమే జరిగిందంటే ఇక్కడ శాస్త్రము అనునది పరస్పర విరుద్ధమగును. బాగా యోచిస్తే శాస్త్రము ఎప్పటికీ పరస్పర విరుద్ధముగా ఉండదు. ఇక్కడేదో చిక్కుముడి పడినదని అర్థమగుచున్నది. మనకు అర్థముకాని చిక్కుముడిని విప్పుకొని చూస్తే ఒక విషయము అర్థమగు చున్నది. ప్రపంచ కర్మల రికార్డును మార్చివేయునది ఒకే ఒక్కటి గలదు. అదియే దైవజ్ఞానము. దైవజ్ఞానము ప్రపంచ కర్మను అతిక్రమించ గలదు గానీ, ప్రపంచ కర్మ దైవజ్ఞానమును ఏమీ చేయలేదు. ఎవరైతే దైవజ్ఞాన దూషణకు పాల్పడినారో వారందరినీ జ్ఞానము గుర్తించుకొని సమయమును చూచి ఒకచోట చేర్చి అందరినీ వారి కర్మలకు అతీతముగా కాల్చివేసినది. ఈ మాటను మేమంటే ఇదంతా కట్టుకథయని కొందరనవచ్చును. ఎవరు ఎలా అనుకొనినా ఫరవాలేదు. నాకు తెలిసిన సత్యమును నేను చెప్పాను. వారు ఎప్పుడు జ్ఞానమును దూషించారో మీరు చెప్పగలరా అని కొందరు, మా వాడు మంచివాడు దైవభక్తికలవాడు

అటువంటివాడు దైవజ్ఞానమును ఎందుకు దూషిస్తాడు? మీరు చెప్పునదంతా అసత్యము అని కొందరూ అడుగ వచ్చును. వారు ఎప్పుడు దూషించినదీ, ఎలా దూషించినదీ నాకు కూడా తెలియదు. కానీ దూషించినది మాత్రము వాస్తవమే. నా మాట సత్యమనుటకు ఇప్పుడు ప్రస్తుతము అటువంటి పాపము చేసుకొన్న వారిని గురించి చెప్పుతాను వినండి. దేవుని మీద విశ్వాసముగలవారు, ధర్మరక్షకులైన వారు, నిత్యము భక్తితో ఏదో ఒక దేవున్ని పూజించేవారూ నేడు దైవజ్ఞాన దూషణ చేస్తూ అటువంటి పనిని మేము చేస్తామా? మేము చేసినదంతా మంచిదే అని అనుకొంటున్నారు. అయినా అటువంటివారు ఇప్పటికే చాలామంది వారు దైవజ్ఞానమునకు వ్యతిరేఖులైయున్నారు. అటువంటి వారందరికీ ఎప్పుడో ఒకమారు చెప్పకనే జరిగిన బస్సు ప్రమాదములాగ ఏదో ఒక ప్రమాదము జరుగును. అప్పుడు వారందరూ అక్కడ జమకూడుదురని మాకు తెలుసు, దేవునికి తెలుసు ఎవరు ఏమి తప్పు చేసినది. అందువలన ఎవరినీ దేవుడు కాపాడలేదు. తనకే వ్యతిరేఖులైనవారిని ఆయన ఎందుకు కాపాడును? ప్రస్తుత కాలములో దేవుడు భగవంతునిగా వచ్చి చెప్పిన భగవద్గీతను కాలితో తన్ని నడిరోడ్డులో అగ్గిపెట్టి కాల్చినవారు దైవభక్తి కలవారే. మేము సృష్ఠికర్త కోడ్ యని భగవద్గీతలో 15వ అధ్యాయమున 16, 17 శ్లోకముల నంబర్లను కూడా వ్రాసి "9 6 3" అని గోడలమీద వ్రాస్తే ఇది క్రైస్తవులదని దానిమీద మలము చల్లినవారుగలరు. మేము (మా భక్తుల బృందము) భగవద్గీతనూ దానికి అనుబంధమైన గ్రంథములనూ ఇల్లిల్లూ తిరిగి భగవద్గీతా ప్రచారము చేస్తే క్రైస్తవులు తప్ప హిందువులు ఇట్లా తిరుగరు మీరు భగవద్గీత ముసుగులో క్రైస్తవమును ప్రచారము చేస్తున్నారని దూషించి ఆ ఊరినుండి పొమ్మని, పోకపోతే మీ బుక్కులను కాల్చివేస్తాము, మిమ్ములను

తంతామనినవారు కూడా కలరు. త్రైత సిద్ధాంత భగవద్గీతను చదవండియని మేము ఎంతో ఖర్చుపెట్టి గోడలమీద వ్రాయిస్తే దాని కారణముతో కేసుపెట్టి కోర్టుకీడ్చి 20 రోజులు జైలుశిక్ష వేయించిన వారున్నారు. ఆ దినము కోర్టులో ఇది తప్పా ఒప్పాయని చూడకుండా, ఏమాత్రము ఆలోచించకుండా తీర్పు చెప్పి జైలుకుపంపిన జడ్జిని కూడా జ్ఞానము గుర్తుపెట్టుకొనియున్నది. ముందు తరములో జ్ఞానదూషణ చేసిన వారందరూ బస్సులో కాలిపోవడము జరిగినది. ఈ తరములో జ్ఞానదూషణ చేసినవారు మహానంది, గుంతకల్లు, హైదరాబాద్, భువనగిరి, కడపలో దేవుని దృష్టియందు నమోదు చేయబడియున్నారు. నేడు హిందూధర్మ రక్షణ చేయువారమనువారే ఎక్కువ గుర్తింపబడినారు. మేము వ్రాసినది ఏమున్నదని చూడకుండా జ్ఞానమును హేళనగా మాట్లాడినప్పుడు దేవునికి కోపము రాదా! ఎంతోమంది జ్ఞానులైన హిందువులు ఇది గొప్ప జ్ఞానము మా అదృష్టముకొద్దీ ఇంతకాలమునకు దొరికింది అని సంతోషిస్తూవుంటే హిందూధర్మములంటే ఏమిటో తెలియని మూర్ఖులు మేము హిందూ రక్షకులమని చెప్పుచూ, ఏ జ్ఞానమూ తెలియనివారై జ్ఞానమును గురించీ, గ్రంథరూపములలోయున్న జ్ఞానమును గురించీ దూషించి మాట్లాడితే అది ప్రత్యేకమైన కర్మాతీత పాపముకాక ఏమౌతుంది. భగవద్గీతలో క్షరాక్షర పురుషోత్తములుగా దేవుడు తనను గూర్చి వర్ణించి చెప్పితే, త్రైత సిద్ధాంతము ద్వారా ఆ విషయమును మేము చెప్పినప్పుడు ఇది అద్వైతము, ద్వైతములాగ త్రైతము హిందూమతములోనిదే అను పరిజ్ఞానము లేకుండా త్రైత సిద్ధాంత భగవద్గీతను మేము ఒప్పుకోము అని కాల్చినవారిని మేము భక్తిపరులమే అంటే దేవుడు ఒప్పుకుంటాడా! జ్ఞానము అంటే ఏమిటి, అది ఎంత శక్తివంతమైనదని ఏమాత్రము తెలియకుండా మేము మంచివారమే మేము హిందూ రక్షకులమే అంటే దేవుడు ఒప్పుకుంటాడా? అంతటా నిండియున్న దేవుని ముందరే ఆయన

గీతను కాల్చినవారినీ, ఆయన జ్ఞానమును దూషించిన వారినీ వదలకుండా రాబోవు కాలములలో ఎప్పుడో ఒకమారు తప్పుకు తగిన శిక్షవేయకమానడు. మాచేత వ్రాయబడిన గ్రంథములు కొన్ని శక్తివంతమై ప్రత్యక్షముగా కనిపిస్తున్నవి. గ్రంథమును చదివితే ఎంతో జ్ఞానశక్తి కల్గుచున్నది. దగ్గరుంచుకొంటే కొన్ని రోగములు సహితము దూరమగుచున్నవి. 48 పేజీలుగల **"మంత్రము-మహిమ"** అను చిన్న గ్రంథమే దగ్గరుంచితే తేలునొప్పిని నిమిషములో లాగివేయుచున్నది. ఇంత ప్రత్యక్షముగా ఒక గ్రంథమేయుంటే దానికంటే పెద్దగయున్న కొన్ని గ్రంథములలో ఎంతో దైవశక్తియున్నది. భగవద్గీత అన్నిటికంటే మించిన శక్తికలది. అటువంటి వాటిని దూషించితే దాని ఫలితమెట్లుంటుందో తెలివైనవారు ఊహించు కోవచ్చును. **"సృష్ఠికర్త కోడ్ 666"** యని క్రైస్తవులు వ్రాస్తే వారికి వ్యతిరేఖముగా అది మాయ కోడ్‌యని దేవునికోడ్ ఇదియని 9 6 3 ను మేము వ్రాస్తే అది ఏమిటి 64 పేజీలుగల ఆ గ్రంథములో ఏముంది అని చూడక గ్రుడ్డిగా జ్ఞానమును దూషించినవారికి వారికి పడిన శిక్షే పడుతుందని హైదరాబాద్ వస్తున్న బస్సు ప్రమాదము సాక్షిగా నిలచినది. మీరెలా చెప్పగలరని మీ మాట వాస్తవమని మేము నమ్ముటకు ఆధారమేమి యని ఎవరైనా అడిగితే వారికి మేము చెప్పునదేమనగా! దేవునికి అందరూ సమానమే ప్రపంచ సంబంధ కర్మలు ఎలాయున్నా అవి కేవలము కష్ట సుఖములతోనే తీరిపోతాయి. అయితే దేవుని సంబంధమైనవి ఘోరముగా ఉంటాయి. అవి ఒక జన్మకే పరిమితికావు. రెండు యుగముల పర్యంతము జన్మజన్మలకు బాధించును.

ప్రస్తుత జన్మలో అందరి ఎదుట అన్ని మతములకు మించిన జ్ఞానము ఇందూ (హిందూ) మతములోనే కలదు. అంతపెద్ద జ్ఞానము

మనముందర ఉన్నప్పుడు దానిని గుర్తించక అనవసరముగా దైవదూషణ, జ్ఞానదూషణ చేసినవారికి శిక్షలు పడుట ఖాయమని నిరూపించుటకు బస్సు ప్రమాదము జరిగిందని మేము నమ్ముచున్నాము. ఇప్పుడు ప్రమాదములో పోయిన వారందరూ గతములో, గత జన్మలో ఎటువంటివారో తెలియదు కదా! మీకు తెలియకున్నా మాకు తెలిసిన సత్యముతో నేడు కూడా దేవుని జ్ఞానమును దూషించినవారు అనవసరముగా దైవా గ్రహమునకు గురియైనారని తెలియుచున్నది. అటువంటి వారందరికీ ఇటువంటి శిక్షయే పడునని దేవుడే తెల్పునట్లు హైవేలో కాలిపోయిన హైదరాబాద్ బస్సు నంబర్ “963” ఇది మేము దేవుని గుర్తని చెప్పిన నంబరేనని గుర్తుంచుకోండి. బస్సు బెంగుళూరివారిదైనా మొదట మా ఆశ్రమముగల తాడిపత్రిలోనిదేనని తెలియండి. మేము దేవుని గుర్తు 9 6 3 అని వ్రాసిన తర్వాత అదే నంబరుతో మేమున్న ఇదే ప్రాంతములో వచ్చినది. ఈ ప్రాంతమునుండి వచ్చిన బస్సు, మేము ప్రకటించిన 9 6 3 నంబరేగల బస్సులో ప్రమాదము జరిగిందంటే ఇక్కడి జ్ఞానము అగ్ని లాంటిదని దైవదూషణ చేసిన మిమ్ములను కూడా వదలక మరుజన్మలోనైనా ఇలాగే కాల్చగలనని చెప్పినట్లున్నది. అందువలన ఇప్పటినుండియైనా ఇది అసలైన హిందువుల జ్ఞానమనీ, ఇది అగ్నిలాంటి జ్ఞానమని తెలిసి జాగ్రత్తపడండి. ఇప్పటినుంచైనా ఎవరూ దైవాగ్రహమునకు గురికాకుండా ఉండమని తెల్పుచున్నాము. ఇప్పుడు వ్రాయబడిన గ్రంథము జ్యోతిష్య గ్రంథము. జ్యోతిష్యము ఒక్క హిందువులకు తప్ప వేరెవరికీ తెలియదు. కొందరు హిందువులకు జ్యోతిష్యము తెలిసినా, జ్యోతిష్యశాస్త్రము పూర్తి సక్రమముగా తెలియదు. ఇప్పుడు ఇందువులలోనే (హిందువులలోనే) ఎవరికీ తెలియని రహస్యముగాయున్న జ్యోతిష్య సూత్రములను ఈ

గ్రంథములో వ్రాయడము జరిగినది. జ్యోతిష్యములో కొమ్ములు తిరిగినవారికి కూడా తెలియని రహస్యములను చెప్పడము జరిగినది. ఇటు జ్యోతిష్యులకు అటు జ్ఞానులకు ఇరువురకు ఉపయోగపడునట్లు జ్యోతిష్యములోని దశాచారమును గురించి చెప్పడము జరిగినది. దశాచారము అంటే ఏమిటో తెలియగల్గితే వాడు జ్యోతిష్యుడైనా పూర్తి జ్ఞానికాగలడు.

**23) బస్సు ప్రమాదమును గురించి చెప్పుతూవుంటే అంతా మాకు క్రొత్తగాయున్నది. మాకు పూర్తి ఏమీ తెలియకపోయినా మీరు చెప్పేమాట నిజమే అయివుండవచ్చునని కొద్దికొద్దిగా అర్థమగుచున్నది. కొన్ని రోడ్డు ప్రమాదములను నేను నా స్నేహితులు చూచాము. రోడ్డు బాగున్నా ఏ ఆటంకములు ఇబ్బందులు లేకున్నా ఒకే స్థలములో ఎక్కువ ప్రమాదములు జరుగుచుండును. అది స్థల ప్రభావమంటారా? గ్రహ ప్రభావమంటారా?**

**జ॥** ఎక్కడ ఏమి జరిగినా అది అంతయూ ద్వాదశ గ్రహముల ద్వారానే జరిగితీరాలి. గ్రహములు కర్మను పంచువారు మాత్రమే, కార్యములను గ్రహములు చేయరు. కార్యములను చేయువారు కనిపించెడివారు కొందరు కనిపించనివారు కూడా కొందరు కలరు. రోడ్డు ప్రమాదములు జరుగుటలో కనిపించనివారి పాత్ర ఎక్కువ కలదు. రోడ్డు ప్రమాదములలోనేకాక మరెన్నో కార్యములను కనిపించనివారు చేయుచున్నారు. అమెరికా మరికొన్ని దేశములలో అటువంటి పనులను చేయువారందరినీ గ్రహాంతరవాసులని పేరుపెట్టి వారు వారి వాహనములైన ఫ్లయింగ్‌సాసర్స్ అను వాటి ద్వారా (U.F.O ల ద్వారా) భూమిమీదికి వచ్చి కొన్ని కార్యములను చేసిపోయారని అవి ఇంతవరకు అర్థముకాని మిస్టరీలుగా మిగిలిపోయాయని చెప్పు చుందురు. మనదేశము (భారతదేశము) లో ఎవరికీ అర్థముకాని పనులు

జరిగితే ఏవో శక్తులు చేశారని అంటారు. అదే అమెరికాలో అయితే ఏకంగా గ్రహాంతరవాసులని ఏలియన్స్ అని పేరుపెట్టి చెప్పుచుందురు. ఎవరు ఏమి చెప్పినా ఒక పని జరిగింది అంటే అది పన్నెండు గ్రహముల ద్వారానే జరగాలి. పైనున్న గ్రహములు నడిపితే కనిపించేవారు, కనిపించనివారు అందరూ నడుస్తున్నారు. అంతేతప్ప స్థల ప్రభావములంటూ ఎక్కడా ఉండవు. స్థల ప్రభావము అంటే అది మూఢనమ్మకమౌతుంది.

రోడ్డు ప్రమాదములకు కారణము కనిపించని కర్మకాగా అమలు జరుగునది ఎన్నో రకములుండును. ఒకే స్థలములో ఎక్కువ ప్రమాదములు జరుగడము అక్కడ ప్రమాదములు జరుగుటకు అవకాశము లేకున్నా, రోడ్డు అన్ని విధముల బాగున్నా, ఊహించని రీతిలో ప్రమాదములు జరగడమును చూస్తే మనకు తెలియనిదేదో అక్కడ జరుగుచున్నదని అర్థము కాగలదు. ప్రారబ్ధము ప్రకారము కొన్ని కర్మలను అనుభవింపజేసినా వాటిని చూసి ఇతరులు కొంత జ్ఞానులుగా మారగలరనీ, జ్ఞానము మీద ఆసక్తి పెరుగునని తలచి ప్రమాదములను కలుగజేయుచుందురు. భూమిమీద దైవజ్ఞానము కల్గినవారు కనిపించని సూక్ష్మరూపమున ఎందరోయున్నారు. వారు జ్ఞానము మీద శ్రద్ధగలవారైయుండి, జ్ఞానమును తెలిసినవారైయుండి అజ్ఞానులను చూచి వారిని జ్ఞానులుగా మార్చేదానికి ప్రయత్నము చేయుచుందురు. ఎంత ప్రయత్నము చేసినా జ్ఞానమును తెలియక అజ్ఞానమార్గమున పోవు వారిమీద కోపముకల్గి ప్రమాదములను కలుగజేతురు. ఎక్కువ ఒకే స్థలములో ప్రమాదములు జరుగుటకు కారణము ఆ స్థలములో కనిపించని శక్తి ఒకటి రోడ్డుమీద కాపలాకాస్తూ వచ్చిపోయే వాహనములను గమనిస్తూ యుండును. బ్రేక్ ఇన్‌స్పెక్టర్లు తమకు అనుకూలమైనచోట రోడ్డు ప్రక్కన ఉంటూ వస్తూ పోయే వాహనములను

గమనిస్తూ అనుమానముగల కొందరిని ఆపి తనిఖీ చేసి పంపునట్లు కనిపించని శక్తులు కొన్ని రోడ్డు ప్రక్కనయుండి, దూరమునుండి వచ్చు వాహనములో వ్యక్తులు ఎవరైనదీ, ఎక్కడికి పోవునదీ, ఏ కార్యము మీద పోవునదీ గ్రహించగలుగుదురు. వాహనము దగ్గరకు రాకముందే అన్ని విషయములను గ్రహించగల్గును. వాహనములో వచ్చేవారు పెళ్ళి కార్యమునకు పోవువారుగానీ లేక దేవతల వద్దకు పోవువారుగానీ ఉండినట్లయితే, అటువంటివారిని ఎంచుకొని ప్రమాదములను కల్గింతురు. రోడ్డు ప్రక్కనయున్న భూతములు దేవుని జ్ఞానమును కల్గియుందురు. దేవుని జ్ఞానములేనివారు రోడ్డు మీద వస్తునప్పుడే గ్రహించిన భూతములు వారిని ఏమీ చేయక వదలివేయు చుండును. అట్లు భూతములు రోడ్డుమీద కాపలా కాస్తున్నప్పుడు దేవాలయములకు పోవువారుగానీ, ఏ దేవత నిమిత్తము పోవువారుగానీ లేక పెళ్ళికార్యమునకు పోవువారుగానీ ఆ రోడ్డుమీద దూరముగా వస్తున్నప్పుడే అక్కడున్న భూతములు వారిని గ్రహించగలిగి దేవాలయములకు పోవు దేవతాభక్తుల మీదనూ, పెళ్ళి కార్యముల నిమిత్తము పోవు వారిమీదనూ కోపము కల్గినవై వారు ప్రయాణించు వాహనమును ప్రమాదమునకు గురిచేయుదురు. అట్లని పెళ్ళికి పోవు అన్ని వాహనములకూ ప్రమాదములు జరుగవు. అలాగే దేవతలకు పోవు వారి వాహనములు అన్నీ ప్రమాదమునకు గురికావు. కొన్ని వాహనములు పెళ్ళివారివిగానీ, దేవతలకు పోవువారివిగానీ ప్రమాదమునకు గురికావడము కొన్ని కాకుండ పోవడము జరుగుటకు కారణము గలదు. అదేమనగా! వాహనములకు అధిపతి శుక్రుడు. రహదారులకు అధిపతి కుజగ్రహము. దేవతలకు పోవు వారిమీద, పెళ్ళిళ్ళ విషయముమీద కోపముకల్గిన భూతములు రోడ్డు ప్రక్కనయుండినప్పటికీ,

అందరినీ గ్రహించుచున్నప్పటికీ శుక్రగ్రహము యొక్క చూపులేక వాహన బలములేని వారినీ కుజగ్రహము వ్యతిరేఖముగాయున్న వారినీ తప్పక ప్రమాదమునకు గురి చేయును. కుజ,శుక్రులు ఒకరికొకరు పూర్తి శత్రువులు. కుజగ్రహము ఎరుపురంగుగలది. శుక్ర గ్రహము తెలుపు రంగుగలది. ఎరుపురంగు కల్గిన వాహనము కుజునకు పూర్తి వ్యతిరేఖ మగుట వలన అటువంటి రంగు వాహనములు ప్రమాదమునకు గురి కాగలవు. శుక్రుడు తన వాహనమును కాపాడుకోవాలని ప్రయత్నించినా రోడ్డంతా కుజునిదే కాబట్టి రోడ్డు సరిగాలేకపోవడము వలన కూడా ప్రమాదము జరుగవచ్చును. రోడ్డుకు వాహనములకు అధిపతులైన కుజ శుక్రులను అనుసరించి భూతములు ప్రమాదమును కల్గించును. భూతములు రోడ్డు ప్రక్కన ఒకేచోట వుండుట వలన ఒకే స్థలములోనే ప్రమాదములు ఎక్కువ జరుగుచుండును. బ్రేక్ ఇన్‌స్పెక్టర్ ఎప్పుడూ ఒకేచోట ఉండడన్నట్లు కొన్ని భూతములు కూడా స్థలములు మార్చి ప్రమాదములు చేయును. శుక్రుడు అగ్నికి కూడా అధిపతి అయినందున కుజగ్రహము అనుకూలము కల్గినవారు ప్రయాణించు వాహనము తనదేయైనందున శుక్రుడు తన వాహనమును తన అగ్నితో కాల్చివేయును. అప్పుడు ఆ ప్రమాదములో నల్లగమారిపోయి చనిపోవుదురు. కుజుడు ఎరుపురంగుకూ, ఎరుపురంగు కల్గిన రక్తమునకూ అధిపతియైనందున ప్రమాదములో రక్తము బయటికి రాకుండ ఎరుపుతనము ఎక్కడా కనిపించకుండా మనుషుల దేహాలను నల్లగ చేయును. అటువంటి ప్రమాదములను చూచిన వెంటనే ఇది శుక్ర గ్రహము చేసిన ప్రమాదమని చెప్పవచ్చును. అట్లు కాకుండ రక్తసిక్తముగా కనిపించు ప్రమాదములను కుజుడు చేసినవని చెప్పవచ్చును. పెళ్ళి అంటే కుజునకు సరిపోదు.

దేవతా భక్తియంటే శుక్రగ్రహమునకు సరిపోదు. శుక్రుడు రాక్షస గురువు కావున దేవతలంటే ద్వేషము. ఇట్లు ప్రమాదములు జరుగుటకు గ్రహములు కారణముకాగా, వాటిని అమలు చేయు భూతములు కొన్ని భూమిమీద ఉన్నవని చెప్పవచ్చును. ఒక రోడ్డుమీదనే కాకుండా ఎక్కడైనా పెళ్ళి విషయములో కుజుడు, దేవతల విషయములో శుక్రుడు వ్యతిరేఖముగానే యుందురు. అందువలన ఈ రెండు విషయములలో ప్రమాదములు ఎప్పుడైనా ఎక్కడైనా జరుగవచ్చును.

**24) శుక్రుడు వాహనములకు అధిపతియైనందున శనివర్గములోని వారందరికీ వాహన యోగముండవచ్చును. గురువర్గములోని వారందరికీ వాహన యోగముండదని వారికి వాహనములుండవని చెప్పవచ్చునా?**

**జ॥** అలాగైతే ప్రపంచములో కొన్ని వస్తువులు కొందరికే పరిమితమై ఇతర వర్గమునకు లేకుండపోవచ్చును. వస్తువులు ఎవరి అధీనములోయున్నా వారివారి కర్మనుబట్టి లభించవలెనను సూత్రము ప్రకారము లభించవలసి యున్నవి. అట్లుకాకపోతే అంతా గందరగోళమైపోవును. భూమిమీదున్న మనుషులందరూ గురువర్గమువారుగానూ, శనివర్గమువారుగానూ ఉన్నారు. మీరనుకొన్నట్లయితే గురువు ఆధీనములోనున్న బంగారు శనివర్గీయుల వద్ద లేకుండా పోవాలి, అలాగే శనివర్గములోని వాహనములు గురువర్గము వారివద్ద లేకుండా పోవాలి. అట్లుకాకుండా వారి కర్మానుసారము అన్నీ అందరికీ లభించునట్లు దేవుడు చేశాడు. ఒక వర్గములోని వస్తువు మరొక వర్గములోని వారికి ఎట్లు లభించుచున్నదీ ఒక ఉదాహరణ ద్వారా తెలుసు కొందాము. రాజీవ్‌గాంధీ జాతకమును చూచినప్పుడు ఆయనకు శత్రు గ్రహములు గురువర్గము వారనీ, శనివర్గము వారు మిత్రుగ్రహములనీ

తెలిసినది. రాజీవ్ చనిపోయిన రోజు ఆయుష్షుకు అధిపతి శనియైనందున శనికి శత్రువులైన గురు, కుజులు మరియు సూర్యుడు ముగ్గురూ కలిసి శనిమీద దాడిచేసి శనివద్దయున్న రాజీవ్‌గాంధీ ఆయుష్షును లాగుకొన్నారు. దీనినిబట్టి ఒకే పక్షమువారైన ఇద్దరు ముగ్గురు గ్రహములు ఒకటై ఇతర గ్రహములవద్దయున్న ఫలితములను కూడా లాగుకొందురు. గురు వర్గీయుల మధ్యలో చిక్కి శుక్రుడు తన వస్తువులను శత్రువర్గమునకు ఇవ్వవలసి వస్తున్నది. అందువలన శనివర్గీయుల దగ్గర గురువు బంగారున్నది. అట్లే గురువర్గీయులవద్ద శుక్రుని వాహనములు, శని ఇనుము, బుధుని రంగు రాళ్ళు, వజ్రములు కలవు. ఇట్లు కర్మనుబట్టి ఏ వస్తువు ఎవరివద్దయినా ఉండవచ్చును.

**25) ఒక వ్యక్తి ఎంతో ఎత్తునుండి క్రిందపడినా అతనికి ఒక ఎముక కూడా విరుగలేదు. మరియొకడు రెండు అడుగుల మంచము మీదనుండి క్రిందపడితే కాలు, చేయి రెండూ విరిగాయి. మీ మాట ప్రకారము ప్రతీదీ గ్రహముల వలననే జరుగుతుందనుచున్నట్లయితే చివరికి ఎముకలు విరిగేది కూడా గ్రహముల వలననే జరిగియుండవలెను కదా! అలాంటప్పుడు ఎంతో పైనుండి పడిన ఒకనికి ఏమాత్రము ఎముకలు విరగకపోవడము, మరొకనికి మంచము మీదనుండి దొర్లితే ఎముకలు విరగడము ఎందుకు జరిగినది?**

**జ॥** ప్రపంచములో రాయికీ, శరీరములో ఎముకకూ అధిపతి కుజ గ్రహమే. గ్రహచారములో కుజగ్రహము వ్యతిరేఖమైనప్పుడు ఎవనికైనా క్రిందినుంచి పడినా ఎముకలు విరుగునట్లు చేయును. అదే కుజగ్రహము అనుకూలమైనదిగా ఉన్నప్పుడు వాడు ఎంత ఎత్తునుండి క్రిందపడినా

ఎముకలు విరగక పోవచ్చును. కుజగ్రహము శత్రుగ్రహమై ఆరవ స్థానమును తాకినా అక్కడ ఉండినా ఆ జాతకునికి కీళ్ళ నొప్పులు, మోకాళ్ళ నొప్పులు వచ్చును. కళ్ళనుండి రక్తముకారును. రక్తలేమి రోగము వచ్చును. ఎముకల విషయమంతా కుజుడు అధిపతిగాయుండి చూచు కొనును.

**26) కొందరు సంగీతమును నేర్చి దానిలో ఎంతో ప్రావీణ్యత చెంది యుందురు. దానికి ఏ గ్రహము అనుకూలముగాయుండవలెను.**

**జ॥** సంగీతమునకు శుక్రుడు అధిపతి. ఆ గ్రహము చూపులేకున్న ఎవరికీ సంగీతము పట్టుబడదు.

**27) మాకు తెలిసినంతవరకు రాజీవ్‌గాంధీ రక్తసిక్తమై చనిపోయాడు. మహాత్మాగాంధీ కూడా రక్తము కారి చనిపోయారు. మంచి వ్యక్తులైన వారు ఇద్దరూ అలాగే చనిపోవడము వలన మనకు అంటే ప్రజలకు ఏమైనా మంచి జరుగుతుందా?**

**జ॥** వాళ్ళు చనిపోవడానికీ మీకు మంచి జరుగడానికీ సంబంధమేమి ఉన్నది. అలా అనుకొనుటకు వీలులేదు. వారి కర్మప్రకారము వారు చనిపోవడము జరిగినది. వారిని చంపినది ప్రజలే తిరిగి వారి చావు ప్రజలకు మేలు చేస్తుందా అని అడగడమేమిటి? నీవు మాకువద్దు అని గాంధీని, రాజీవ్‌గాంధీనీ చంపిన మనుషులకు వారి చావు ఏమైనా మంచి చేస్తుందా అని అడగడము చాలా తెలివి తక్కువ ప్రశ్న అని అంటున్నాను.

**28) ఎప్పుడో చనిపోయిన ఏసు కూడా రక్తముకారే చనిపోయాడు**

**కదా! ఇప్పుడు ఈ నాయకులను ప్రజలు చంపినట్లు అప్పుడు ఆయనను కూడా ప్రజలే చంపడము జరిగినది కదా! ఆయన తన రక్తము కార్చి చనిపోయాడు కదా! అట్లే వీరు కూడా వీరి రక్తమే కార్చి చనిపోయారు కదా! అటువంటప్పుడు వీరివలన ఏమీ ప్రయోజనముండదా? ఎప్పుడో రెండు వేల సంవత్సరముల పూర్వము చనిపోయిన ఏసువలన ఇప్పుడు కూడా పాపాలు పోతాయి పాపక్షమాపణకే రక్తము కార్చినదని అంటున్నారు కదా! అలాంటప్పుడు లేటెస్టుగా ఇప్పుడే చనిపోయిన వారి రక్తము వలన మన పాపము పోదా?**

**జ॥** ఏసు తన రక్తము ద్వారా మీ పాపములు పోతాయి అని ఎక్కడా చెప్పలేదు. ఒకచోట **"నా నిబంధన రక్తము"** అని ఉచ్ఛరించాడు. ఆ మాట జ్ఞానమును గురించి అనినమాటగానీ వేరుకాదు. ఏసు విషయములో క్రైస్తవులందరూ పొరపాటుపడినారు. ఇకపోతే మహాత్మాగాంధీగారు గానీ, రాజీవ్‌గాంధీగారుగానీ వారి కర్మవలన గ్రహచారము బాగాలేక పోయారు. వారిని చంపిన పాపము చంపినవారికి వచ్చియుంటుంది. అంతేగానీ పాపము పోయివుండదు. ఇద్దరూ కర్మవలనే చనిపోయారు అనుటకు పూర్తి ఆధారములున్నవి. ఇంకా ముఖ్యముగా గమనించవలసిన విషయమేమనగా! ఇద్దరూ కుజగ్రహము యొక్క ప్రథమశ్రేణి ఆయుధము చేతనే చనిపోవడము జరిగినది. రాజీవ్‌గాంధీగారి జాతకచక్రమును చూచారు. మహాత్మాగాంధీగారి జాతకము బహుశా ఎవరికీ తెలియదను కొంటాను. ఇప్పుడు మరణమును గురించిన కర్మసమస్య వచ్చినది కాబట్టి, ఒకమారు రెండు జాతకములను పరిశీలించి చూద్దాము.

| | | | |
|---|---|---|---|
| భూమి 6 | 7 | గురు 8 | 9 |
| 5 | తులా లగ్నము | | రాహు చిత్ర 10 |
| కేతు మిత్ర 4 | | | చ 11 |
| 3 | శని 2 | బుధ,శుక్ర కుజ 1 లగ్నము | రవి 12 |

మహాత్మాగాంధీగారి
జాతక కుండలి
02-10-1869
జననము

1) ఆయు స్థానమైన ఎనిమిదవ స్థానమును కుజుడు తాకినాడు.

2) ఆయుస్సుకు అధిపతియైన శనిని గురువు తాకుచున్నాడు.

ముఖ్యముగా ఈ రెండు విషయములను మహాత్మాగాంధీ గారి జాతకమునుండి చూచాము. కుజుడు ఎనిమిదవ స్థానమును చూచుట వలన అకాలమరణమునే కల్గించునని చెప్పవచ్చును. గురువు తనకు తోడుగా ఇంకా ఒకటి రెండు గ్రహములు వచ్చినప్పుడు ఆయుష్షును బలవంతముగా లాగుకొనుటకు ప్రయత్నించును.

| | | | |
|---|---|---|---|
| 6 | 7 | 8 | భూమి 9 |
| శని 5 | తులా లగ్నము | | కేతు మిత్ర 10 |
| రాహు చిత్ర 4 | | | 11 |
| రవి,బుధ చంద్ర,గురు శుక్ర 3 | కుజ 2 | లగ్నము 1 | 12 |

జననము 20-08-1944
రాజీవ్‌గాంధీ గారి
జన్మ లగ్నకుండలి

1) ఆయుస్థానమైన ఎనిమిదవ స్థానమును కుజుడు తాకినాడు

2) ఆయుష్షుకు అధిపతియైన శనిని కుజుడు తాకుచున్నాడు.

రాజీవ్‌గాంధీగారి జననములో కూడా మహాత్మాగాంధీగారి జననము లో ఉన్నట్లే గలదు. ఆయుస్థానమును కుజుడు ముట్టుకోవడమూ, ఆయువుకు అధిపతియైన శనిని శత్రువైన కుజుడు చూడడమూ కలదు.

ఈ మూడు జాతకములలోనూ ఆయుస్థానమును రక్తపిపాసియైన కుజగ్రహమే తన చేయినుంచి చూడడము విశేషము. రెండవ సూత్రములో మూడు జాతకములలోనూ ఆయుష్షునిచ్చు శనిని గాంధీగారి జాతకములో గురువుచూడగా, మిగతా రాజీవ్, జగన్ జాతకములలో కుజుడే తాకినాడు.

| | | | |
|---|---|---|---|
| 7 | 8 | శని 9 | భూమి చంద్ర 10 కేతు మిత్ర |
| 6 | కన్యా లగ్నము | | 11 |
| 5 | | | 12 |
| రాహు గురు రవి చిత్ర 4 | శుక్ర బుధ 3 | కుజ 2 | లగ్నము 1 |

గాంధీ, రాజీవ్‌గాంధీ, ఇద్దరి జాతకములలో ఉన్నట్లే మరియొక జాతకము కూడా ఉన్నట్లు గమనించవచ్చును. ఇది ఉదాహరణకు చూపు జాతకమని తెలియవలెను.

1) ఆయుస్థానమైన ఎనిమిదవ స్థానమును కుజగ్రహము తాకినది

2) ఆయుష్షుకు అధిపతియైన శనిని కుజుడు తాకుచున్నాడు.

గాంధీ, రాజీవ్‌గాంధీగారి ఇద్దరి జాతకములు ఆయుష్షు విషయము లో ఒకే విధముగాయున్నవి. అందువలన ఈ ముగ్గురి మరణములు ఒకే విధముగా జరిగాయి.

**29) ఒక వ్యక్తికి నాగుపాము కరచినప్పుడు ఒక వైద్యునివద్దకు తీసుకుపోయి వైద్యము చేయించాము. అతడు విషమునుండి బయటపడి బ్రతకగలిగాడు. తర్వాత పది దినములకు మరియొక వ్యక్తి నాగుపాము కాటుకే గురియైనాడు. అప్పుడు అతనిని వైద్యునివద్దకు తీసుకుపోవడము జరిగినది. వైద్యుడు అందరికీ చేసినట్లే శ్రద్ధగా వైద్యము చేశాడు. అయినా పాము కాటుకు గురియైన మనిషి బ్రతుకలేదు. ఒకే వైద్యుడు, అదే వైద్యము ఒకరికి బాగుకావడము మరియొకరికి బాగుకాకుండా పోవడమునకు కారణమేమి ఉండును. దీనికి కూడా గ్రహచారముండునా?**

**జ॥** ప్రపంచములో ప్రతిదానికీ గ్రహచారమే కారణము. గ్రహచారము లేకుండా ఏమీ జరుగదు. ప్రపంచములో పాములకు, వాటి విషమునకు అధిపతి రాహుగ్రహము. రాహుగ్రహము వ్యతిరేఖమున్నవానికి ఉన్న స్థానమునుబట్టి గ్రహబలమునుబట్టి పాము కరుచుట సంభవించును. రాహువున్న చోట శుభగ్రహములు రెండుయున్నా ఒకటియున్నా అతడు వైద్యముతో బ్రతుకగలడు. రాహుగ్రహము ఆయుస్థానమైన ఎనిమిదవ స్థానమున ఉన్నా, రాహుగ్రహముతోపాటు ఆయు కారకుడైన శని కూడా ఉంటే అటువంటివాడు కాటు తర్వాత బ్రతుకుట కష్టము. రాహుగ్రహము కొందరికి అనుకూలగ్రహమైయుండుట వలన పాములు వారిని ఏమీ అనవు, కాటువేయను పూనుకోవు. రాహువు అనుకూలముగాయున్నవాని ఇంటిచుట్టూ పాముల సంచారమున్నా వాటివలన ఎటువంటి ఇబ్బందులు ఉండవు. దోమలు, చీమలు, క్రిమికీటకాదులు, సర్పములు అన్నియూ రాహువు యొక్క ఆధీనములో ఉండును. రాహువు అనుకూలము లేకపోతే ఇంటిలో చీమలతో కూడా ఇబ్బంది పడవలసి వస్తుంది. ఇదంతయూ గ్రహచారమునుబట్టియే జరుగుచుండును.

**30) ప్రపంచములో ప్రతిదీ గ్రహముల ఆధీనములో ఉండునని చెప్పు చున్నారు కదా! అయితే జ్ఞానమనునది ఎవరి ఆధీనములో ఉండును?**

**జ॥** జ్ఞానము అంటే, రెండు రకముల జ్ఞానములున్నవి. ఒకటి ప్రపంచ జ్ఞానమున్నది. రెండవది పరమాత్మ జ్ఞానమున్నది. వాటిలో ఏ జ్ఞానమును ఉద్దేశించి అడుగుచున్నారో చెప్పండి.

**31) మేము అడుగునది రెండు జ్ఞానముల గురించి?**

**జ॥** ఒక కత్తి పిడిభాగము, కొనభాగము అని రెండు భాగములుగా ఉండును. కొన భాగము మాత్రము ఇతరులను పొడవగలదు. పిడి భాగము ఎవరినీ పొడిచి చంపలేదు. కత్తి అనునది ఒకటే అయినా పిడి భాగము కొనభాగము ఒకే కత్తిలోయున్నట్లు జ్ఞానము అను పేరు ఒకటే అయినా అందులో కర్మయున్నదీ, కర్మలేనిదీ అని రెండు రకముల జ్ఞానములు గలవు. ఒకటి ప్రపంచజ్ఞానము, అది కర్మ ఆధీనములో ఉండును. రెండవది పరమాత్మ జ్ఞానము. ఇది కర్మ ఆధీనములో ఉండదు. పరమాత్మ జ్ఞానమంతా దేవుని ఆధీనములో ఉండును. ప్రపంచ జ్ఞానము కర్మ ఆధీనములోయుండి గ్రహచారము ద్వారా లభించును. దేవుని జ్ఞానము దేవుని ఆధీనములో ఉండి దేవుని వలననే లభించగలదు.

**32) పిల్లలులేని స్త్రీలు నాకు సంతతి లేదు. భవిష్యత్తులో పిల్లలు పుట్టుతారా అని అడిగితే జ్యోతిష్యము ప్రకారము ఎలా చెప్పాలి?**

**జ॥** ఎవరు సంతతిని గురించి అడిగారో వారి జాతక కుండలి చూచి అందులోనుండి జవాబు చెప్పవలసియుండును. జాతక లగ్నములో ఒక విషయమును గురించి చూచునప్పుడు ఆ విషయమునకు సంబంధించిన స్థానమునూ, ఆ విషయమునకు సంబంధించిన గ్రహము గురించి చూడ

వలసియుండును. స్థానబలమును గ్రహబలమును రెండిటిని సమన్వయ పరచుకొని చూచినప్పుడు సరియైన ఫలితమును తీసి చెప్పగలము. ఇప్పుడు అడిగిన విషయము సంతతికి సంబంధించినది, కావున సంతతి యొక్క విషయము కర్మచక్రములో ఏ స్థానములో ఉండునని చూచిన అది ఐదవ స్థానమని తెలియుచున్నది. ఐదవ స్థానములో పుణ్యము ఉంటుంది. ఆ పుణ్యములో ప్రపంచజ్ఞానము, విషయగ్రాహితశక్తి, సంతతి మొదలగు విషయములన్ని రాశులుగా (కుప్పలుగా) యుండును. అందువలన ఐదవ స్థానములో సంతతికి సంబంధించిన విషయమును చూడవలసియుండును. ఒకటి స్థానమునుబట్టి, రెండు గ్రహమునుబట్టి చూడవలెను. సంతానము నకు సంబంధించిన గ్రహములు రెండు గలవు. అందులో ఒకటి చంద్రుడు, రెండవది గురువు. కొడుకులను గురించి చూడవలసివచ్చినప్పుడు గురువును చూచి చెప్పాలి. కేవలము సంతతిని గురించి అడుగునప్పుడు చంద్రున్ని చూచి చెప్పాలి. ఐదవ స్థానములో అశుభగ్రహములున్నా, సంతాన కారకులైన చంద్రుడు అశుభస్థానములోయున్నా అశుభగ్రహములచే కలిసి యున్నా వారి సంతానమును అశుభగ్రహములు లాగుకొని సంతానము లేకుండ చేయుదురు. గురువుకానీ, చంద్రుడుగానీ మంచిస్థానములోయున్నా ఐదవస్థానములో శత్రుగ్రహములు లేకుండా శుభగ్రహముండిన, వారికి తప్పక సంతానము తొందరలో కల్గునని తెలియుచున్నది.

**33) ఇప్పుడు ప్రపంచములోనే ఇస్లామ్ సమాజమునకు పూజ్య భావము, గౌరవ భావము కల్గియున్న ముహమ్మద్ ప్రవక్తగారి జాతకమును ఇస్తాము. ఆ జాతకములో విశేషత ఏమి ఉన్నదో తెలుపగలరా?**

| | | | |
|---|---|---|---|
| 2 | బుధ సూర్య 3 | రాహు,చిత్ర శుక్ర 4 | 5 |
| లగ్నము 1 | కుంభ లగ్నము | | కుజ 6 |
| 12 | | | చంద్ర 7 |
| 11 | శని మిత్ర కేతు 10 | గురు భూమి 9 | 8 |

జననము 20-04-571
పగలు. 1-10 ని॥
శుక్రదశా శేషము
0-3 నెలల,
15 దినములు

**జ॥** ఈయన యొక్క విశిష్ఠత పూర్తి ప్రపంచమునకే తెలియును. ఈయన ప్రపంచములో ఒక క్రొత్త సమాజమునే తయారుచేసి అది శాశ్వతముగా ఉండునట్లు చేశాడు. అందువలన ముహమ్మద్‌ప్రవక్తగారి పేరు తెలియనివారు ఎవరూ ఉండరు. మీరు ఎందుకు ప్రవక్తగారి జాతకమును చూపి అడుగుచున్నారో మీరు చెప్పకున్నా నాకు అర్థమైనది. మీ ఉద్దేశ్యములో జ్యోతిష్యము హిందూమతస్థులకు తప్ప ఇతర మతముల వారికి వర్తించదను భావము కలదు. అందువలన మేము ఏమి చెప్పుదుమో నని అడుగుచున్నారు. సరే మీలాంటి భావమే ఇతరులకు కూడా ఎంతో మందికి ఉండవచ్చును. మీ అనుమానము ఎవరికీ లేకుండుటకు మీమాట కు ఏమి చెప్పుచున్నామనగా! ప్రపంచములో మతము అనునది మనుషులు పెట్టుకొన్నదేగానీ, దేవుడు పెట్టినదికాదు. దేవుని దృష్ఠిలో మనుషులంతా సమానమే! అందువలన జ్ఞానముతో చూస్తే, జ్ఞానము వలన పుట్టుకొచ్చిన జ్యోతిశాస్త్రమైన జ్యోతిష్య శాస్త్రము ప్రపంచములో అన్ని మతముల వారికీ, అన్ని సమాజముల వారికీ సమానముగా వర్తించును. ప్రపంచములో పుట్టిన ప్రతి జీవరాశీ, ప్రతి మనిషీ గ్రహచారము ప్రకారమే కదలించబడు

చున్నారు. ఆడించబడుచున్నారు. అందువలన జ్యోతిష్యము ఒక్క హిందువులకే అనుకోవడము పొరపాటు.

ఇప్పుడు మీరు అడిగిన ప్రశ్న దగ్గరకు వస్తాము. మీరు ఈ జాతకములోని విశిష్ఠతను గురించి అడిగారు. ప్రపంచములో ఎవరికి ఏది విశేషముగాయున్నా, జ్ఞానుల దృష్ఠిలో దేవుని జ్ఞానమే విశేషముగా యుండును. అందువలన ప్రవక్తగారి జాతకములోనున్న ముఖ్య సారాంశమైన దానిని గురించి చెప్పుకొందాము. మనిషి కొన్నాళ్ళు బ్రతికి భౌతికముగా చనిపోయినా, అతనిని చాలాకాలము మనుషుల మధ్య బ్రతికింపజేయునది అతని కీర్తి ప్రతిష్ఠలని చెప్పవచ్చును. ఒక్క దైవజ్ఞానము తప్ప ప్రతీదీ జాతకములో ఉండును. కీర్తి ప్రతిష్ఠలు ఎవరి జాతకములోనైనా పదవ స్థానమున ఉండును. 14 వందల సంవత్సరముల పూర్వము చనిపోయిన ముహమ్మద్ ప్రవక్తగారు నేటికినీ మనుషుల మధ్య జ్ఞాపకముగా ఉన్నాడనుటకు కారణము అతని జీవితములో అతడు సాధించుకొన్న కీర్తియేనని చెప్పవచ్చును. అతని కీర్తి ఎటువంటిదని చూచిన అది పదవ స్థానమున ఉండుననుకొన్నాము కదా!

ప్రవక్తగారి జాతకమున పదవస్థానములో ఏమి కలదో ఇప్పుడు గమనిద్దాము. ప్రవక్తగారి జాతకములో పదవస్థానము వృశ్చికలగ్నము అగుచున్నది. పదవ స్థానమున ప్రవక్తగారి జనన సమయమునకు శని, కేతు గ్రహములు రెండు గలవు. ఈ రెండు గ్రహములు చాలామందికి తెలిసినవే. జ్యోతిష్యులైనవారందరికీ సుపరిచయ గ్రహములే. అయితే అదే దశమ స్థానమున మిత్ర గ్రహము మరొకటి కలదు. మిత్రగ్రహము ఎవరికీ తెలియదు. ఎవరికీ తెలియని మిత్రగ్రహము పూర్తి చీకటి గ్రహము.

ఎవరూ దానిని గుర్తించలేరు. ఏ పరికరముల ద్వారానైనా, ఏ రేడియేషన్ కిరణముల ద్వారా అయినా గుర్తింపబడని గ్రహము మిత్రగ్రహము. నేడు ముహమ్మద్‌ప్రవక్తగారి పేరు శాశ్వతముగా మనుషుల మధ్యలో ఉండుటకు కారణము మిత్రగ్రహమేనని చెప్పవచ్చును. రాహువు విగ్రహారాధన భక్తిని కల్గించువాడైయుండగా, కేతువు నిరాకార భక్తిని కల్గించునదై ఉన్నది. బాగా జ్ఞాపకముంచుకోండి మేము చెప్పునది నిరాకారభక్తినిగానీ, నిరాకార జ్ఞానమును కాదు. జ్ఞానము ఎప్పటికీ గ్రహముల ఆధీనములో ఉండదు. రాహువుది భక్తియే రాహువుకి వ్యతిరేఖమైన కేతువుదీ భక్తియే. రాహువుది సాకారభక్తియైతే, కేతువుది నిరాకార భక్తియని గుర్తుంచుకోవలెను. కేతువు పదవస్థానమున ఉండుట వలన, అతని జీవిత వృత్తి, ప్రవృత్తి రెండూ నిరాకార భక్తిమీద సాగునట్లు చేసినది. నిరాకార భక్తిలోనున్న ప్రార్థన వారి జీవితములో ఉండేది. నిరాకార ప్రార్థన అయిన నమాజ్ నేడు ముస్లీమ్ సమాజములో పూర్తిగాయున్నది. ప్రవక్తగారు స్థాపించిన ప్రార్థన నేటికీ చెక్కుచెదరకుండా ముస్లీమ్‌లలో పాతుకొని పోవునట్లు చేసినది మిత్రగ్రహము. నిరాకార భక్తిని కల్గించినది కేతు గ్రహముకాగా, దానినే ప్రవక్తగారి కీర్తికి ఆధారముగా అందరిలో నిలిపినది మిత్రగ్రహము. సాకార భక్తిలో హిందువులు మరికొందరు మునిగిపోయి సాకారభక్తికి కేంద్రములుగా దేవాలయములను నిర్మించుకోగా, ప్రవక్తగారు దానికి భిన్నముగా ముస్లీమ్ సమాజమును తయారు చేసి నిరాకారభక్తిని వారియందుంచి, నిరాకార భక్తికి కేంద్రములుగా ప్రార్థనామందిరములైన మసీద్‌లను నిర్మించాడు. ఆనాడు ప్రవక్తగారు ప్రత్యేక సమాజమును (నిరాకారభక్తి సమాజమును) స్థాపించుటకు కారణము కేతు గ్రహముకాగా, ఆయన కీర్తిని ఎల్లకాలము ఉండునట్లు మిత్రగ్రహము ముస్లీమ్ సమాజము మొత్తము ప్రవక్తగారినీ,

ఆయన ఏర్పరిచిన విధానమును మరచిపోకుండునట్లు ఆచరించునట్లు చేసినది. ప్రవక్తగారి జీవితములో ముఖ్యమైన విశిష్టత అదేనని మేము చెప్పుచున్నాము.

**34) జ్యోతిష్యము గ్రహచారము, దశాచారము అని రెండు రకములుగా ఉన్నది కదా! జ్యోతిష్యము రెండు రకములుగాయున్నప్పుడు, దానిని చెప్పు జ్యోతిష్యులు ఒకే రకముగాయున్నారు కదా! దీనికి మీరేమంటారు.**

**జ॥** జ్యోతిష్యము రెండు రకములుగాయున్నది వాస్తవమే. అయితే జ్యోతిష్యులు కూడా రెండు రకములుగా ఉండాలి. కానీ అందరికీ ఒకే రకము జ్యోతిష్యులు కనిపిస్తున్నారు. పంచాంగమును తీసుకొని, తిథి, వార, నక్షత్రముల ఆధారముతో చెప్పు జ్యోతిష్యులందరూ ఒకే రకము జ్యోతిష్యులగుదురు. అటువంటి మొదటిరకము జ్యోతిష్యులే ఎక్కడైనా కనిపించుచుందురు. రెండవ రకమునకు చెందిన జ్యోతిష్యులు ఉండాలి కానీ వారు ఎవరైనా ఉన్నారో లేదో తెలియదు. ఎక్కడైనా ఉండవచ్చును, ఉండకపోవచ్చును. మొదటి రకమునకు సంబంధించిన జ్యోతిష్యమునే మనము కూడా ఇంతవరకు వ్రాసుకొన్నాము, చెప్పుకొన్నాము. రెండవ రకము జ్యోతిష్యున్ని గురించి చెప్పుకుంటే అతను నేను జ్యోతిష్యుడనని ప్రత్యేకముగా ఉండడు. అటువంటి రెండవరక జ్యోతిష్యుడు ఉన్నట్లుండి భవిష్యత్తును చెప్పును. అతను పంచాంగముతో పనిలేకుండా, ఏమాత్రము జాతకమును చూడకుండా చెప్పిన దానిని జ్యోతిష్యము అనకుండా జరుగ బోవు దానిని చెప్పగలడు. మొదటి రకము జ్యోతిష్యుడెవరైనా గ్రహచారమును బట్టి చెప్పును. రెండవ రకము జ్యోతిష్యుడైనవాడు దేనినీ ఆధారము చేసుకొని చెప్పడు. అటువంటివాడు ఏది చెప్పితే అదే జరుగును. ఉన్నదానిని అనుసరించి చెప్పువాడు జ్యోతిష్యుడు. చెప్పినదానిని అనుసరించి జరుగునది కాలజ్ఞానము. భవిష్యత్తు అనినా కాలజ్ఞానమనినా రెండు ఒకటే అయినా

చూచి చెప్పునది జ్యోతిష్యము. చూడక చెప్పునది కాలజ్ఞానము. దేనినీ చూడకుండా చెప్పిన వారిలో మనకు తెలిసినంతవరకు శ్రీ పోతులూరి వీరబ్రహ్మముగారు కలడు. తాము జ్యోతిష్యులమని ప్రకటించుకోని వారిలో రెండవ రకమునకు చెందిన జ్యోతిష్యులుండవచ్చును.

పూర్వకాలములో రెండవరకము జ్యోతిష్యులు అప్పుడప్పుడు కొందరున్నట్లు వినికిడి. అటువంటి వారిలో ముఖ్యుడు త్రేతాయుగమున గల రావణబ్రహ్మ. గత కొంతకాలము క్రింద ఉదాహరణగా చెప్పుకొనుటకు వీరబ్రహ్మముగారు కనిపిస్తున్నారు. రావణబ్రహ్మ కాలజ్ఞానమును పూర్తిగా తెలిసిన త్రికాల జ్ఞాని. రావణబ్రహ్మ త్రికాలజ్ఞాని అని పేరుగాంచితే, వీరబ్రహ్మము కాలజ్ఞాని అని పేరుగాంచియున్నారు. రావణబ్రహ్మ మూడు కాలములకు జ్ఞానియై నేటికినీ త్రికాలజ్ఞానిగా పేరుగాంచియున్నాడు. వీరబ్రహ్మము భవిష్యత్ కాలమునకు జ్ఞానియై కాలజ్ఞానియని పేరుగాంచి యున్నాడు. వీరు ఇద్దరూ మనకు నమూనాకు చెప్పబడే రెండవరక జ్యోతిష్యులని తెలియుచున్నది. పూర్వము పెద్దలైనవారు రెండవ రక కనిపించని జ్యోతిష్యులుగా ఉంటే, నేడు మొదటి రక జ్యోతిష్యమును కూడా సరిగా తెలిసినవారు లేకుండా పోవడము మనకే అవమానము. అందువలన మొదటి రక జ్యోతిష్యులు ఒకరిద్దరుండినా ఫరవాలేదు. వారు సక్రమమైన జ్యోతిష్యము తెలిసియుండాలి అను ఉద్దేశ్యముతో ఇప్పుడు పన్నెండు గ్రహములతో కూడుకొన్న జ్యోతిష్యశాస్త్రమును వ్రాయడము జరిగినది.

# సమాప్తము

**అసత్యమును వేయిమంది చెప్పినా అది సత్యము కాదు,**
**సత్యమును వేయిమంది కాదనినా అది అసత్యము కాదు.**

# హిందూ రక్షణా! హిందూ భక్షణా!!

## భగవద్గీతయే చదవనివాడు హిందూ రక్షకుడా?

## హిందూ ధర్మమే తెలియనివారు హిందూ రక్షకులా?

హిందువులు నేడు కులాలుగా చీల్చబడి, అందులో హెచ్చుతగ్గు కులములుగా వర్ణించబడియున్నారు అనుట అందరికీ తెలిసిన సత్యమే. దేవుడు మనుషులందరినీ సమానముగా పుట్టించితే కొందరు మనుషులు తమ స్వార్థ బుద్ధితో హిందూ (ఇందూ) సమాజమును ముక్కలు ముక్కలుగా చీల్చి, బలహీనపరచి హిందూసమాజమునకంతటికీ తామే గొప్పవారమనీ, తాము చెప్పినట్లే అందరూ విని, అన్ని కార్యములు చేసుకోవాలనీ ప్రచారము చేసుకొన్నారు. ఎన్నో కులములుగా యున్న హిందూ సమాజములో తమ కులమే అగ్రకులమని చెప్పుకోవడమే కాకుండా, ఇతర కులముల వారందరికీ తామే మార్గదర్శకులమనీ, గురువులమనీ ప్రకటించుకొన్నారు. భవిష్యత్తులో తమకు ఎవరూ అడ్డురాకుండునట్లు, అన్ని కులములను అంటరాని కులములను చేసి, హిందూ సమాజమునకు తీరని అన్యాయము చేశారు. అంతటితో ఆగక నేటికినీ హిందూ సమాజ రక్షకులుగా చెప్పుకొనుచూ, హిందూ సమాజమును సర్వనాశనము చేయుచూ, హిందూ సమాజము ఇతర మతములుగా మారిపోవుటకు మొదటి కారకులగుచున్నారు. అటువంటివారు హిందూ సమాజమునకు చీడ పురుగులుగాయున్నా, మిగతా కులముల వారందరూ వారి నిజ స్వరూపమును తెలియక వారు చెప్పినట్లే వినుట వలన, హిందూ సమాజమును పూర్తిగా అజ్ఞాన దిశవైపుకు, అధర్మ మార్గమువైపుకు మళ్ళించి, ప్రజలకు ఏమాత్రము దైవజ్ఞానమును తెలియకుండా చేసి, తాము చెప్పునదే దైవబోధయని నమ్మించారు.

అటువంటి స్థితిలో నేడు **త్రైత సిద్ధాంతకర్తగా ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులవారు** అజ్ఞాన దిశవైపు నిలిచి పోయిన హిందూసమాజమును సరియైన దారిలో పెట్టుటకు, భగవద్గీతలో పురుషోత్తమప్రాప్తి యోగమను అధ్యాయమున బోధింపబడిన **క్షర, అక్షర, పురుషోత్తమ** అను ముగ్గురు పురుషుల విషయమును **త్రైత సిద్ధాంతము** అను పేరుతో ప్రతిపాదించి దైవజ్ఞానమును అందరికీ అర్థమగులాగున గ్రంథరూపములో వ్రాయడము, బోధించడము జరుగుచున్నది. దానివలన నేడు ప్రజలు అసలైన జ్ఞానము తెలియుచున్నదని సంతోషపడుచున్నారు. అగ్రకులముగానున్న వారిలో కూడా ఎందరో తమ అజ్ఞాన చీకటులను వదలి, ఇంతవరకూ తమకు తెలియని జ్ఞానము యోగీశ్వరుల ద్వారా ఇప్పుడు తెలియుచున్నదని సంతోషపడి శిష్యులుగా చేరిపోవుచున్నారు. అయితే అగ్రకులములో కొందరు మాత్రము యోగీశ్వరులు తెలియజేయు జ్ఞాన విషయములను చూచి ఈ జ్ఞానము వలన ప్రజలు జ్ఞానములో చైతన్యులై, జ్ఞానము తెలియని తమను గౌరవించరని భావించి, దానివలన సమాజము మీద తమ ఆధిపత్యము లేకుండా పోవునని తలచి, యోగీశ్వరులు తెలుపుచున్న త్రైత సిద్ధాంతము గానీ, త్రైత సిద్ధాంత భగవద్గీతగానీ హిందువుల జ్ఞానమే కాదనీ, అది క్రైస్థవ మతమునకు సంబంధించినదనీ, దానిని ఎవరూ చదవకూడదని ప్రచారము చేయను మొదలుపెట్టారు. అంతేకాక తాము హిందూధర్మరక్షకులమని, కొంత రాజకీయరంగు పూసుకొని, మా జ్ఞాన ప్రచారమునకు అక్కడక్కడ అడ్డుపడడము జరుగుచున్నది. తమ మాట విను ఇతర కులముల వారికి కూడా ప్రబోధానంద యోగీశ్వరులు చెప్పు జ్ఞానము హిందూ జ్ఞానము కాదు, క్రైస్థవుల జ్ఞానమని హిందువుల ముసుగులో క్రైస్థవ మత ప్రచారము చేయుచున్నారని చెప్పడమేకాక,

అటువంటివారిని ప్రేరేపించి మా ప్రచారమునకు అడ్డు తగులునట్లు చేయుచున్నారు.

యోగీశ్వరులు నెలకొల్పిన హిందూ (ఇందూ) జ్ఞాన వేదిక ఇటువంటి ఆగడాలను కొంతకాలముగా ఓర్పుతో చూడడము జరిగినది. మాలో ఓర్పు నశించి, మమ్ములను అన్యమత ప్రచారకులుగా వర్ణించి చెప్పు అగ్రకులము వారిని, వారి అనుచరులను మేము ఎదురుదిరిగి ప్రశ్నించడము జరిగినది. మేము ప్రశ్నించిన ఒక్క ప్రశ్నకు కూడా వారు సరియైన సమాధానము ఇవ్వలేదు. ఆ జవాబులు ఎలా ఉన్నాయో పాఠకులుగా మీరు చూడండి.

**మా ప్రశ్న :-** ఇంతవరకు ఏ హిందువూ చేయని విధముగా ఊరూరు తిరిగి, ఊరులో ఇల్లిల్లూ తిరిగి హిందూ ధర్మములను ప్రచారము చేయుచున్నాము కదా! అటువంటి మమ్ములను మీరు అన్యమత ప్రచారకులుగా ఎందుకు చెప్పుచున్నారు?

**వారి జవాబు :-** హిందూమతములో ఎందరో స్వామీజీలు ఉన్నారు. వారు ఎవరూ ఇల్లిల్లు తిరిగి ప్రచారము చేయలేదు. హిందువులు అట్లు ఎవరూ ప్రచారము చేయరు. క్రైస్తవులయితేనే బజారు బజారు, ఇల్లిల్లూ తిరిగి ప్రచారము చేస్తారు. మీరు హిందువుల ముసుగులో ఇల్లిల్లూ తిరిగి క్రైస్తవమును ప్రచారము చేయుచున్నారు.

**మా ప్రశ్న :-** మేము క్రైస్తవులమయితే భగవద్గీతను ఎందుకు ప్రచారము చేస్తాము?

**వారి జవాబు :-** మీరు ప్రచారము చేయునది త్రైత సిద్ధాంత భగవద్గీత. అది క్రైస్తవులది. బైబిలుకే మీరు అలా పేరు పెట్టారు.

**మా ప్రశ్న :-** క్రైస్తవులు తమను క్రైస్తవులుగానే చెప్పుకుంటారు. అలాగే బైబిలును బైబిలుగానే చెప్పుకొంటారు. వారి ప్రచారము క్రైస్తవము, బైబిలు అయినప్పుడు అదే పేరుమీద ప్రచారము చేస్తారు తప్ప హిందువులుగా భగవద్గీత పేరుతో ఎందుకు ప్రచారము చేస్తారు? ఇంతవరకు అట్లు ఎక్కడా జరుగలేదు. ఏ మతమువారు ఆ మతము పేరు చెప్పుకొంటారు గానీ ఇతర మతముపేరు చెప్పరు. అంతెందుకు మీరు మా భగవద్గీతను తెరచి చూచారా? అందులో భగవద్గీత శ్లోకములున్నాయా? బైబిలు వాక్యము లున్నాయా?

**వారి జవాబు :-** త్రైతసిద్ధాంతమని యున్నది కదా! త్రైతము అంటే త్రిత్వము అని త్రినిటి అని మాకు బాగా తెలుసు.

**మా ప్రశ్న :-** హిందూ ధర్మములలో అద్వైత సిద్ధాంతమును ఆదిశంకరా చార్యుడు ప్రతిపాదించాడు. విశిష్టాద్వైతమును రామానుజాచార్యులు ప్రతిపాదించాడు, ద్వైతమును మధ్వాచార్యులు ప్రకటించాడు. ఇప్పుడు ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు త్రైతసిద్ధాంతమును ప్రతిపాదించాడు. సిద్ధాంతకర్తలు, సిద్ధాంతములు వేరయినా అందరూ హిందువులని మీరు ఎందుకు అనుకోలేదు?

**వారి జవాబు :-** మీ త్రైతసిద్ధాంత భగవద్గీతలో యజ్ఞములను చేయకూడదని వ్రాశారు కదా! నిజముగా భగవద్గీతలో అలా లేదు కదా!

**మా ప్రశ్న :-** మీరు హిందువులలో ముఖ్యులుగా వుండి అంత మూర్ఖముగా మాట్లాడితే ఎలా? ప్రపంచమునకంతటికీ ఒకే భగవద్గీతయుంటుంది గానీ, మీ భగవద్గీత, మా భగవద్గీతయని వేరుగా ఉండదు. భగవద్గీతకు వివరము ఒక్కొక్కరు ఒక్కొక్క విధముగా వారికి అర్థమయినట్లు చెప్పియుండవచ్చును

గానీ, అందరికీ భగవద్గీత మూల గ్రంథమొక్కటేనని గుర్తుంచుకోండి. త్రైత సిద్ధాంత భగవద్గీత అన్నిటికంటే సరియైన భావముతో యున్నదని చదివిన జ్ఞానులందరూ పొగడుచూయుంటే, మీ కులములో ఎందరో ప్రశంసించు చూయుంటే, మీకు కొందరికి మాత్రము వ్యతిరేఖముగా కనిపించిందనడము అసూయతోనే అని మాకు అర్థమగుచున్నది. యజ్ఞములు చేయవద్దని మేము ఎక్కడా చెప్పలేదు. యజ్ఞముల వలన పుణ్యము వస్తుంది, స్వర్గము వస్తుంది అని చెప్పాము. యజ్ఞముల వలన మోక్షము రాదు, దేవుడు తెలియడని చెప్పాము. అంతెందుకు మీరు మేము అన్ని కులములకంటే స్వచ్ఛమయిన హిందువులమని చెప్పుకొంటున్నారు కదా! భగవద్గీతలో చెప్పిన ఒక్క హిందూ ధర్మమును చెప్పండి.

**వారి జవాబు :-** అవన్నీ మాటలు వద్దు... మీరు హిందువులు కాదు.

**మా ప్రశ్న :-** మొండిగా మాట్లాడవద్దండి మీరు అగ్రకులమువారమని ఇష్టమొచ్చినట్లు మాట్లాడకండి. మేము హిందువులము కాము అనుటకు ఆధారము ఏమైనా చూపగలరా? మా కథ అట్లుంచి మీరు సరియైన హిందువులే అయితే భగవద్గీతలో విశ్వరూప సందర్శనయోగమను అధ్యాయములో 48వ శ్లోకములోనూ, 53వ శ్లోకములోనూ భగవంతుడు ఏమి చెప్పాడో మీరే చెప్పండి.

**వారి జవాబు :-** మేము ఇంతవరకు భగవద్గీత చదువలేదు. మీకు కావలసి వస్తే సంపూర్ణానందస్వామితో చెప్పిస్తాము.

**మా ప్రశ్న :-** కనీసము భగవద్గీతను కూడా చదువని మీరు యోగీశ్వరులయిన ప్రబోధానందస్వామిని దూషించడము మంచిదా? ఒక్క హిందూ ధర్మమును

కూడా తెలియని మీరు హిందూ ధర్మ రక్షకులమని చెప్పడము మంచిదా? యోగీశ్వరుల వారు వ్రాసిన ఒక్క గ్రంథము కూడా చదువకుండ మేము తప్ప పూజ్యులుగా, గురువులుగా ఎవరూ ఉండకూడదను అసూయతో ఇలాగ మాట్లాడితే దేవుడు ఓర్చుకోడని చెప్పుచున్నాము.

**వారి జవాబు :–** హిందూ మతములో ఎందరో దేవుళ్ళున్నారు. శివుడు దేవుడే, శివుని కొడుకు గణపతి దేవుడే, రాముడు దేవుడే, రాముని సేవకుడు ఆంజనేయుడు దేవుడే. అలాంటి హిందూ మతములో దేవుడు ఒక్కడే అని చెప్పడము మీది తప్పు కాదా?

**మా మాట :–** మేము మతమును గురించి చెప్పలేదు. హిందూ మతములో ఎందరో దేవుళ్ళుండడము నిజమే, అయితే హిందూ జ్ఞానములో, హిందూ ధర్మము ప్రకారము విశ్వమునకంతటికి ఒకే దేవుడని చెప్పాము. భగవద్గీతలో దేవుడు చెప్పినదే చెప్పాము తప్ప మేము దేవతలను గురించి లేరని చెప్పలేదే! దేవతలకందరికీ అధిపతియైన దేవుడు ఒక్కడున్నాడని, ఆయనే దేవదేవుడనీ, అతనిని ఆరాధించమని చెప్పాము.

**వారి జవాబు :–** మీరు రాముని పేరు చెప్పరు, శివుని పేరు చెప్పరు, వినాయకుని పేరు చెప్పరు. ఎవరి పేరూ చెప్పకుండా దేవుడు అనీ, సృష్టికర్తయనీ అనేకమార్లు పేర్కొన్నారు. దేవుడు అను పదమునుగానీ, సృష్టికర్తయను పదమునుగానీ క్రైస్తవులే వాడుతారు. హిందువులు వాడరు. అందువలన మిమ్ములను హిందువులు కాదు క్రైస్తవులు అంటున్నాము.

**మా ప్రశ్న :–** క్రైస్తవ మతము పుట్టి రెండువేల సంవత్సరములయినది. సృష్టి పుట్టి ఎన్ని కోట్ల సంవత్సరములయినదో ఎవరూ చెప్పలేరు. సృష్ట్యాది

నుండి 'సృష్ఠికర్త' అను పదమును 'దేవుడు' అను పదమును హిందూ సమాజము వాడుతూనే యున్నది. మొదటినుండి హిందూసమాజములో యున్న దేవుడు, సృష్ఠికర్త అను పేర్లను హిందువులు క్రైస్తవులకేమయినా లీజుకిచ్చారా? లేక పూర్తిగా వారికే అమ్మేశారా? అని అడుగుచున్నాము. సృష్ఠికర్త అనిగానీ, దేవుడు అనిగానీ హిందువులయినవారు అనకూడదని ఎక్కడయినా ఉన్నదా అని అడుగుచున్నాము?

**వారి జవాబు :-** మీరు హిందూమతమును కాకుండా అన్యమతమును బోధించుచున్నారనుటకు, మిమ్ములను మీరు హిందువులుగా చెప్పుకో లేదు. హిందువులుగా కాకుండా ఇందువులుగా చెప్పుకొంటున్నారు. అటువంటప్పుడు మీరు హిందూమతమును చీల్చినట్లు కాదా! ప్రత్యేకించి ఇందూ మతము అను దానిని ప్రచారము చేసినట్లు కాదా! మీరు హిందువులే అయినప్పుడు మీ గ్రంథములలోగానీ, మీ బోధలలో గానీ ప్రత్యేకించి ఇందువులు అని ఎందుకు చెప్పుచున్నారు?

**మా మాట :-** మేము సూటిగా ఒక ప్రశ్నను అడుగుతాము జవాబు చెప్పండి. హిందువు, ఇందువు అను పదములో కొద్దిపాటి శబ్దము తప్ప ఏమి తేడాయుందో మీరే చెప్పండి. తెలుగు భాషను వ్రాసే వారందరూ హిరణ్యకశ్యపున్ని చంపినది నరశింహస్వామి అని చెప్పుచుందురు అలాగే వ్రాయుచుందురు. ప్రస్తుతకాలములో నరశింహులు అని పేరున్నవాడు కూడా వాని పేరును నరశింహులు అని వ్రాయడము అందరికీ తెలుసు. అయితే ఆ మాట తప్పు అలా వ్రాయకూడదు దానిని **నరసింహ** అని వ్రాయవలెను అని చెప్పుచున్నాము. అడవిలో మృగరాజును **సింహము** అని అంటాము తప్ప **శింహము** అని అనము అనికూడ చెప్పుచున్నాము.

'సింహము' అంటే అర్థమున్నది గానీ, 'శింహము' అంటే అర్థము లేదు అని కూడా చెప్పాము. అలా ఉన్నది ఉన్నట్లు చెప్పితే 'ఇందువు' అనే దానికి అర్థమున్నదిగానీ 'హిందువు' అనే దానికి అర్థములేదు అని చెప్పాము. సృష్ట్యాదిలో పుట్టినది ఇందూ సమాజమనీ, అది మధ్యలో పేరుమారి 'దృష్ఠి, జిష్ఠి' అయినట్లు 'ఇందూ' అను శబ్దము 'హిందూ' అని పలుకబడుచున్నదని చెప్పాము. ఇందూ పదము ఎందుకు వాడాలి, హిందూ పదమును ఎందుకు వాడకూడదని కూడా వివరముగా మా గ్రంథములలో గలదు. ఉన్న సత్యము మీకు తెలిసినా, మీరు మాకంటే పెద్ద ఎవరూ ఉండకూడదను అసూయతో మాట్లాడుచున్నారు.

అగ్రకులములో ఎందరో పెద్దలు మా జ్ఞానమును తెలిసి సంతోషించుచుండగా, కొందరు మాత్రము వీధి రౌడీలలాగా తంతాము, పొడుస్తాము, కాలుస్తాము మీరు ప్రచారము చేయవద్దండని చెప్పడము మంచిది కాదు. మా గ్రంథములు ఏదీ చదువకుండా మాట్లాడడమూ, మేము చెప్పిన మాటలను వినకుండా ఇవన్నీ డ్రామాలు, నాటకాలు అనడము మంచిది కాదు. మీరు ఎవరైనా మా గ్రంథములలో ఇతర మతములను ప్రచారము చేసినట్లుగానీ, ఫలానా మతములోనికి చేరమని చెప్పినట్లుగానీ ఉంటే నిరూపణ చేయండి, అలా నిరూపించిన వారికి ఇందూ జ్ఞానవేదిక తరపున పది లక్షల రూపాయలను ఇవ్వగలము. నిరూపించ లేకపోతే మీరు లక్ష రూపాయలు ఏ ఊరిలో శ్రీకృష్ణుని గుడికయినా ఇవ్వవలెను. ఈ షరతుకు ఎవరైనా ముందుకు వస్తారా? అని అడుగుచున్నాము.

ఇట్లు

**ఇందూ జ్ఞానవేదిక**

1) నాలుగు అధర్మములు పది శాతము మనుషులలో ఉండగా,

ఒక్క మతమను అధర్మము 99 శాతము గలదు.

2) యజ్ఞ, దాన, వేద,తపస్సులు నాల్గుకాగా, ఐదవ అధర్మము మతము.

3) దైవ మార్గమునకు పెద్ద ఆటంకము మతము.

4) అన్ని అధర్మములను మించినది మతమను అధర్మము.

5) ప్రపంచ మార్గములో మతము ఉంటే

దైవ మార్గములో హతమై పోతావు.

6) కలియుగములో క్రొత్తగా పుట్టుకొచ్చిన ఐదవ అధర్మమే మతము.

మతాలు నిషేధము, నిషిద్ధము. కులాలు అహేతుకము, అశాస్త్రీయము.

**భగవద్గీత, బైబిలు, ఖురాన్** మూడు ఒకే దైవగ్రంథములోని భాగములే.

మీ మనోభావము కులమతాలకు అతీతమైతే వెంటనే "ప్రబోధ సేవాసమితి" లో

సభ్యులుగా చేరండి. దేవుడు మిమ్ములను జ్ఞానులుగా చేయాలని కోరుతున్న...



--- శ్రీశ్రీశ్రీ ఆచార్య ప్రబోధానంద యోగీశ్వరులు

**ఫోన్ : 09948947630, 09491040963, 09440556968**

# జ్యోతిష్య శాస్త్రము

కాల, కర్మ చక్రములు



Author : The Only Guru of Three Religions
The Spiritual Emperor, Thraitha Theorem Originator
Sri Acharya Prabodhananda Yogeeshwarulu